# మహాభారత మీమాంస

( రావుబహదూర్ చింతామణివైద్య ఎం. ఏ. ఎల్. ఎల్. బి. గారు
వ్రాసిన ఉపసంహార మను మరాఠీ గ్రంథమునకు . హిందీలో పండిత
మాధవరావు సప్రేగారి అనువాదమగు మహాభారతమీమాంసకు అనువాదము)

రెండవ భాగము





చర్ల నారాయణశాస్త్రి

# విషయసూచిక

## ఎనిమిదవ ప్రకరణము

### సామాజిక పరిస్థితి

# మహాభారత మీమాంస

## ( రెండవ భాగము )

## అయిదవ ప్రకరణము

### ఈ యితిహాసమెవరిది

మనమిప్పటివఱకు, మహాభారత రచన యేయుగాలభారత—యుద్ధము యొక్క యితిహాసముమీఁద నున్నదో ఆ మహాభారతయుద్ధము ఎప్పుడు జరిగియుండునో చూచియుంటిమి. ఇపుడు మనము, ఈ యుద్ధము ఏయే లోకులమధ్య జరిగెనో మఱియు నీ యితిహాసము ఏ లోకులదో విచారింప వలసి యున్నది. భారతీయ—యుద్ధము కౌరవులకును పాండవులకును మధ్య జరిగెనన్నమాట స్పష్టమే. ఇపుడు మనమీప్రకరణమందు, ఈ కౌరవ పాండవులెవ్వరో, ఈ లోకులిచ్చటికి ఎచ్చటినుండి వచ్చిరో; మరియు వీరికి ఇతర—లోకులతోగూడ నెట్టివంటి సంబంధముండెనో; ఈ సంగతుల యొక్క జాడ తీయవలసియున్నది. అట్టిచో. మనము అది విచారించు నెడల నే ప్రకారము మహాభారతముయొక్క ప్రమాణము నీయవలయునో అదేప్రకారము వైదిక సాహిత్యము యొక్క యాధారము గైకొన వలయుననుట స్పష్టమైయున్నది. ఎందుచేత? భారతీయయుద్ధము బ్రాహ్మణ కాలమున జరిగియుండెనని యిదివఱలో మనము చూచియుంటిమి.

పూర్వకాలమున కౌరవులను పాండవులనుగూడ భరతులు, అని చెప్పుచుండిరనియు నా కారణముచే వారి యుద్ధమునకు పేరు భారతీయ యుద్ధము అని వచ్చెననియు మునుపు వ్రాయబడియేయున్నది దుష్యంతునినుండి శకుంతలకుఁ బుట్టిన పిల్లవాని పేరు భరతుఁడు. ఇతఁడు వారికిఁ బూర్వపురుషుఁడు. ఇంకను సార్వభౌముఁడనికూడ నామాఁకి

తుఁడై యుండెను. ఇందుచేత వానియొక్క సంతతులకు సంజ్ఞ 'భారతాః' అనియైనది. మహాభారతములో ఈ నామము యొక్క ప్రమాణము రెండు పక్షముల వారికిని జేయఁబడి యున్నది. భరత నామమునలనఁ గొందఱు పాశ్చాత్య పండితులు భ్రమఁజెందుచున్నారు. వారు, ఋగ్వేదములో "భరతాః, అని పేరు మాటి మాటికిని వచ్చుచున్నది, ఆ భరతులకును గౌరవులకును నీ విధముగా నీ యుద్ధము రాలేదుగదా? అని చెప్పుచున్నారు. కాని ఋగ్వేదములోని భ ర తు లు సుతీయొరరేయై యున్నారని మనము జ్ఞప్తి యుంచుకొనవలసి యున్నది. మన యీ ప్రదేశమునకు నే భరతఖండనామము ప్రచలితమై యున్నదో, అం ద లి భరతశబ్దము విషయమైకూడ నిట్టిదే భ్రమ కలుగుచున్నది. పిమ్మటి వివేచన వలన నీ రెండువిధములైన భ్రమలును దూరముకాఁగలవు. హిందుస్థానమునకు భరతఖండనామము దుష్యంత పుత్రుఁడైన భరతుని కారణమున నేమియు వచ్చినదికాదు. భాగవతములోనే—

## ఇ తి హా స మె వ రి ది

క్రిందివచనములున్నవి:—

ప్రియవ్రతో నామసుతో మనోః స్వాయంభువస్య హ।
తస్యాగ్నీ ధ్రస్తతో నాభి రృషభస్య సుతస్తతః।
అవతీర్ణం పుత్రశతం తస్యాసీద్బ్రహ్మపారగ॥
తేషాం వై భరతో జ్యేష్ఠో నారాయణపరాయణః॥
విఖ్యాతం వర్ష మేతద్యన్నామ్నా భారతముత్తమం।

ఇందువల్ల స్పష్టమగునది యేమనగా;— స్వాయంభువు మనువుయొక్క వంశమున ఋషభుని కొడుకు భరతుడు అను రాజుండెను. ఆ భరతుని నామమువలన నీ దేశముయొక్క నామము "భారతవర్షము" అయ్యెను అని. మత్స్యపురాణములో ":మనుర్భరత ఉచ్యతే. అను వచనమున్నది:

మఱియు ఆ మనువునకే భరతసంజ్ఞ యీయఁబడినది; ఇదే కారణముచేత చెప్పఁబడి యున్నది– వర్షంతద్భారతం స్మృతం, అని (అధ్యాయము 114) అనఁగా మనువువల్లనే భారతవర్షనామము బయలుదేరినది. హిందుస్థానమునకు బయటనుండి వచ్చిన ఆర్యజనులలో ముందు సూర్య వంశీయులు వచ్చిరి, వారిలోని భరతనామకుఁడైన రాజువలన నీ దేశమునకు భారత వర్షము, అని పేరు కలిగెను. దీనిఁబట్టి, ఋగ్వేదములో ఏ భరతాః, అనునామము వచ్చియున్నదో, అది సూర్యవంశ్యక్షత్రియులైన యార్యులది; ఏ లోకుల నడుమ భారతీయ యుద్ధము జరిగినదో వారిది మాత్రము కానేరదు అని స్పష్టమగుచున్నది.

## ఋగ్వేదములోని భరతులు అనఁగా సూర్యవంశ క్షత్రియులు

ఋగ్వేదములోని యుల్లేఖములఁబట్టి, ఆ భరతులు సూర్య వంశ క్షత్రియులగుదురని నిష్కర్షముగా సిద్ధించుచున్నది. మేక్డోనాల్డుగారు చెప్పుచున్నారు. "ఒకానొక మహత్త్వముగల లోకులయొక్క నామము ఋగ్వేదములో భరతులు అని యున్నది. ఆ నామము విశేషించి మూడవ ఏడవ మండలములందు త్రిత్సు, సుదాసుల నామములతోడి పాటుగా మాటిమాటికి వచ్చుచున్నది. తరువాత నీభరతులకు నేమి జరిగెనో మాత్రము తెలియకున్నది. ప్రాయశః వీరు కురువులలోఁగలసిపోయి యుందురు. భరత శబ్దము చేత దుష్యంత పుత్రుఁడగు భరతుని కల్పనముబట్టి యీ గడబిడ కలుగుచున్నది ఏడవ మండలమున వసిష్ఠఋషి చెప్పిన సూక్తములలోని యుల్లేఖములఁబట్టి భరతులకుఁ బురోహితుఁడు వసిష్ఠఋషి యనియు వాని కులమునఁబుట్టినవాడు త్రిత్సువనియుఁదెలియుచున్నది. భరతులలోని సుదాసరాజునకు యుద్ధములో వసిష్ఠుఁడు సహాయము చేసియుండెనని వర్ణింపఁబడినది. మూడవ మండలమున విశ్వామిత్రునియొక్క సూక్తములున్నవి. సూర్యవంశ క్షత్రియులతో విశ్వామిత్రునికి సంబంధము వసిష్ఠునితోఁబాటుగనే యున్నది. విశ్వామిత్ర సూక్తములలో భరతులయొక్క యుల్లేఖము విశేషముగనున్నది. ఒక సూక్తములో, శతద్రువు మరియు విపాశ నదులయొక్క సంగమము వద్దకు ఒకప్పుడు భరతులు వచ్చిరి. కాని వఱదచేత వారికి దారి దొరకదయ్యెను. అపుడు విశ్వామిత్రుఁడు భరతుల నిమిత్తము ఈ నదులను స్తుతించెను.అంతట

నెచ్చటికో నీరు తీసిపోయినది. మరియు భరతులు దాని దాటి వెళ్లిరి అని వర్ణనమున్నది మూఁడవ సూక్తములో, సుదాస రాజునకు విశ్వామిత్రుఁడు కూడ సాహాయ్యము చేసెనని చెప్పఁబడినది. ఈసూక్తమందమను విశ్వామిత్రస్య రక్షతి బ్రహ్మేదం భారతం జనమ్, అనుఋక్కు చాల ముఖ్యమైనది. విశ్వామిత్రుని యొక్క యీ స్తోత్రము భారతజనులను రక్షించుచున్నది. ఈ వాక్యమందు భారత జన, శబ్దము మహత్త్వము కలిగియున్నది సూర్యవంశముతో విశ్వామిత్రునికి నెటువంటిసంబంధమున్నదో అటువంటిదే భరద్వాజునికిని గలదు. ఆరవమండలమున భరద్వాజునిసూక్తము లున్నవి వాటియందుఁగూడ భరతునియొక్క, భారత జనులయొక్క, భరతుల లోని యగ్నియొక్క, మరియు దివోదాసునియొక్క యుల్లేఖము గలదు. దివోదాసుఁడు సుదాసునియొక్క తండ్రియని ఋగ్వేదములో వర్ణింపఁబడి యెను. భరతులకు వసిష్ఠ విశ్వామిత్రులతోడనైతే సంబంధమున్నది దాని భరద్వాజునికేమి సంబంధమున్నది? అని పాశ్చాత్య పండితులు ప్రశ్నించుచున్నారు. కాని మనము భరద్వాజునికి సూర్యవంశీయులతో సంబంధమున్న దని రామాయణముయొక్క యాధారముమీద తెలిసికొనుచున్నాము పై విష యములన్నిటిని రామాయణమందు వర్ణితమైన కథతో సరిపోల్చిన మీద ఋగ్వేదములోని భరతులే సూర్యవంశ క్షత్రియులని స్పష్టముగా జూడఁబడు చున్నది వారియొక్క పురోహితుఁడు వసిష్ఠుడు మరియు తమ ఋషులు విశ్వా మిత్ర భరద్వాజులు వారియొక్క వంశావళియందును మనువునకుఁ బిమ్మట భరతుఁడును సుదాసరాజును గలరు ఈ యన్ని సంగతులచేతను పై నిర్ణయింపఁ బడిన యనుమానము నిశ్చితమైనదని చెప్పవలసియున్నది.

ఋగ్వేదమందు ఏ భరతులయొక్క యులేఖమున్నదో, ఆ భరతులు మహాభారతములోని భరతులు కారనియు; వారు హిందుస్థానమునకు మొట్ట మొదట వచ్చిన యార్యులై యున్నారనియు సిద్ధమైనది. వారు సూర్య వంశీయులై యుండిరి. వారిచేత హిందుస్థానము భారతవర్షమనిపించు కొన్నది. మరియు నెంతదేశము ఆ సమయమువలనఁ దెలియఁబడియుండెనో అంత దేశమునను వారు నివసించిరి. హిందుస్థానమందున్న లోకులకు సామాన్య రూపమున భారతజనులని సంజ్ఞ ప్రాప్తించినది. బ్రాహ్మణగ్రంథము

లయందు భరత శబ్దమునకు సాధారణముగా క్షత్రియ వీరులు లేక సాధారణ ఋత్విగ్ బ్రాహ్మణులు అర్థమగుచుండిరి. నిరుక్తకారుఁడు భారతీ శబ్దమునకు అర్థము చేసియున్నాడు. భరతః ఆదిత్యః తస్య ఇయం భారతీ: వీనిఁబట్టికూడ భారతులకు సూర్యవంశముతో సంబంధము కనఁబడుచున్నది. ఈ భారతుల యొక్క రాజ్యము పంజాబునుండి మొదలుకొని తేట్టునకుఁదూర్పునను యోధ్య· మిథిల వఱకు వ్యాపించియుండెను.

మహాభారతములోని భారతులును ఋగ్వేదములోని భారతులును బొత్తిగా వేఱువేఱై యున్నారు. ఈ సంగతి మనకు మహాభారతములోని యీ శ్లోకము వలనఁ దెలియుచున్నది.

“భారతా ద్భారతీ కీర్తి ర్యేనేదం భారతం కులం!
అత ఏవచ పూర్వేవై భారతా ఇతి విశ్రుతాః (131 ఆ।అ 74)

టీకాకారుఁడు ఈ శ్లోకముయొక్క యుత్తరార్థమున కర్థము చేసియుండలేదు ఈ యుత్తరార్థమునందు పురాణ భరతులు ప్రసిద్ధులు, వారు వేఱై యున్నారు అనియే చెప్పఁబడియున్నది. మనమతమునందు నిచ్చట వైదిక భరతుల యొక్క యుల్లేఖమున్నది యుండను వారియొక్క ప్రత్యేకత చూపఁబడినది.

ఋగ్వేదమునందైతే సూర్యవంశముయొక్క నామమును చంద్రవంశము యొక్క నామమును లేదు, కాని చంద్రవంశమునందలి ముఖ్య పురుషుల యొక్క నామములు ఋగ్వేదమునందుఁ గనఁబడుచున్నవి. పురూరవుఁడు ఆయువు నహుషుఁడు మరి యయాతి యీ నామములు ఋగ్వేదములో నున్నవి. విశేషమేమనఁగా ఋగ్వేదమునందొకచోట యయాతియొక్క యైదుగురు కొడుకులయొక్క యుల్లేఖము కలదు. ఇంకను వారైదుగురియొక్క పేరులుకూడ నీయఁబడియున్నవి; అట్లు వారినుండి బొడమిన యైదుగురి యొక్కయుఁ బేరులున్నవి. ఈ యుల్లేఖములనుబట్టి వారైదుగురు సోదరులై యుండిరని స్పష్టముగా తెలియుచున్నది, పురాణములయందు మరియు మహాభారతమునందు వర్ణితమైన చంద్రవంశముయొక్క వాడఁగనుఁగొనుటకై ఋగ్వేదమునందు మంచి యాధారము దొరకుచున్నది. చంద్రవంశ క్షత్రియులైన యార్యులు అగ్న్యుపాసకులై యుండిరి. సూర్య, చంద్రవంశక్షత్రియుల వలెనే వీరు గంగానదియొక్క కొండలోయలనుండి సరస్వతీ తీరమునకు వచ్చి యుచ్చటనే స్థిరపడిరి. ఇటువంటి సంగతులు ఋగ్వేదములోని ఋక్కులచేత

సిద్ధించుచున్నవి. ఋగ్వేద (1.108) మందుఁజెప్పబడినది –"యదింద్రాగ్నీ యదుషు తుర్వశేషు యద్ద్రుహ్యుష్వనుషు పూరుషు స్థః। అతః పరివృషణావాహి యాతమథా సోమస్యపిబతం సుతస్య॥" అనఁగా ఓయింద్రా! ఓయగ్నీ! విచారింపఁగా మీరు యదులయందును తుర్వసులయందును, ఇదే విధముగా ద్రుహ్యువులయందును అనువులయందును పురువులయందును ఉన్నారు. అయినను ఇచ్చటికి వచ్చి తీయఁబడిన యీ సోమరసము ద్రాగుఁడు దీనిఁబట్టి యనేకములైన యనుమానములు బయలుదేఱుచున్నవి. అందొకటి యిది. వీరు ప్రాచీనార్యులవిధముగానింద్రాగ్నులనుపాసించుచుండిరి. రెండవది, వీరైదుగురు నొక వంశములోనివారే యగుదురు; అందును యదువులు మరియు తుర్వసులు సహోదరులై యుండిరి. చంద్రవంశమువాడైన యయాతికి ఇరువురు స్త్రీలనుండి యుత్పన్నులైన యైదుగురు పుత్రులయొక్క కథ యిందు వ్యక్తమవుచున్నది.

ఋగ్వేదముఁబట్టి, తరువాత వచ్చిన యీ చంద్రవంశీయులైన యార్యులకు ముందటి భారతులతో జగడమై వారిమధ్య ననేకయుద్ధములు జరిగినట్లు తెలియుచున్నది; చాలచోటుల వారి విషయమై ఋషులకు క్రోధమగపడుచున్నది. దీనిఁబట్టి వారు తరువాత వచ్చిరని తెలియఁబడును. ఒక చోట దివోదాసునికై యింద్రుడు యదుతుర్వసులను జంపెనని వర్ణనమున్నది సరయూనది వద్దఁగూడ భరత రాజులతో యదుతుర్వసులకు యుద్ధములు జరిగినవిఋగ్వేదములోఁగొన్ని సూక్తములయందునొక పెద్దయుద్ధము వర్ణితమైనది. ఇచ్చట దానియొక్క సారాంశమునిచ్చుట యావశ్యకము. ఈ యుద్ధమును 'దాశరాజ్ఞ'మని చెప్పియున్నది ఈ యుద్ధము పరుష్ణీ– ఇప్పటిలో రావీ నదియొడ్డున జరిగియుండెను. ఒక పక్షమందు భరతులు వారిలోని సుదాసరాజు అట్లు పురోహితుఁడు వసిష్ఠుఁడు మరియు ద్రిత్సువు కలరు. రెండవ పక్షమందు అయిదుగురు ఆర్యులైన రాజులు యదువు, తుర్వసుడు. ద్రుహ్యువు, అనువు మరియు పురువు అట్లు వారి మిత్రులు అయిదుగురు అనార్యులైన రాజులును గలరు.

# ఇతిహాసమెవరిది

ఈ యుద్ధమందు భరతులయొక్క వినాశము చేయఁబడునదియై యుండెను. ఇంకను వారియొక్క ధనమును శత్రుజనులు దోఁచుకొనువారై యుండిరి. కాని యెపుడు వసిష్ఠుఁడు ఇంద్రుని స్తుతించెనో అపుడు నది నుండి కాలువ వెడలి జల ప్రవాహమును వెలువరించెను. అది ప్రవహించు నపుడు, శత్రుసేన కొట్టుకొనిపోయి వారి సామానులు భరతుల చేతిలోఁ జిక్కినవి. 600 ద్రుహ్యువులును అనువులును, గోవృషభములఁ దోలుకొని తీసికొని వచ్చునపుడు, రణాంగమునఁ జంపబడిరి. అని వర్ణనమున్నది. ఆ యుద్ధముయొక్క యుదాహరణములింకను అనేక సూక్తములయందుఁ గలవు. దీనిఁబట్టి, పంజాబునందు ముందుగావచ్చి నివసించిన భారతీయులను జయించుటకై తరువాత వచ్చిన యదు ప్రభృతులైన క్షత్రియులు అనార్యరాజులకు సాహాయ్యముచేయ యత్నించిరని తెలియుచున్నది. కాని ఋగ్వేదకాలమున నిట్టి ప్రయత్నము సిద్ధింపలేదు. కొందఱు లోకులు ఈ యుద్ధములో భారతీయ యుద్ధమునకు మూలకారణముండవచ్చునని కల్పింతురు. కాని యీ యుద్ధము బహు ప్రాచీన కాలమున జరిగియుండెనని జ్ఞప్తి యుంచుకొనవలెను. ఇందు మఱియొక భరతులు సూర్యవంశ క్షత్రియులు, మఱియు వారి గురువు వసిష్ఠుఁడు నుండిరి. రెండవ వైపునఁ జంద్రవంశరాజులందఱు నుండిరి; ఈ యుద్ధమునకు భారతీయ యుద్ధముతో సంబంధములేదు. ఋగ్వేదయుద్ధము భరత పూరువులనడుమ జరిగియుండెను. ఇఁక భారతీయ యుద్ధమో? కురుపాంచాలురనడుమ, వీరిద్దఱును ఒక పూరువుయొక్క యే వంశజులై యుండిరి. ఋగ్వేదమందుఁ బూరువుయొక్క యుల్లేఖము మాత్రము కలదు, కాని కురువులయొక్క జాడ యెచ్చటనులేదు. భారతీయ యుద్ధము ఋగ్వేదమున కిటీవలిదియని మనము మున్ను వ్రాసియుంటిమి. కురుపాంచాలురు ఇరువురి విషయమై మఱియు వారి పూర్వజుల విషయమై యేమి యగుపడుచున్నదో యిది యిప్పుడు చూడవలసియున్నది.

# చంద్రవంశీయులైన యార్యులు

చంద్ర వంశమునకు మూలపురుషుఁడు మహాభారతమువలనఁ బురూరవుఁడని సిద్ధమగుచున్నది. ఇందుచేత మొదటి చంద్రవంశపురుషులను మనము విడిచిపెట్టుచున్నారము. పురూరావునికిఁ దల్లి యిళయై యుండెను. హిమాలయమునకు నుత్తరము వైపుననున్న వర్షమును ఇలా వర్షమనుచున్నారు. దీనిఁబట్టి మొట్టమొదటి వీరలు హిమాలయమున నుత్తరమునందుండి వచ్చినవారని తెలియుచున్నది. ఋగ్వేదమందుఁ బురూరవుని యొక్కయు నప్సరసయగు యూర్వశియొక్కయు వర్ణనము హెచ్చుగానున్నది. ఇతఁడు హిమాచలమునందే యుండెనని తెలియుచున్నది. పురూరవునికిఁ బిమ్మట నాయువుయొక్కయు నహుషుని యొక్కయు నామములున్నవి. ఋగ్వేదమునందు వీరు రాజుఁ బేర్కొనబడిరి. వీరికిఁబిదప యయాతియున్నాఁడు. ఇతఁడు గొప్ప రాజు ఋగ్వేదమందు వీనియొక్క వర్ణనమున్నది. ఇతఁడు తన వంశమునకు ముఖ్యుఁడై యుండెను. ఋగ్వేదమందు వీనిపేరు తనపుత్రులతోఁగూడ వచ్చియున్నది. ఇతఁడు శుక్రుని కుమార్తెను దేవయానిని అసురకన్యయగు శర్మిష్ఠను వివాహమాడెను. వృషపర్వుఁడను నసురునికి సమీపమందే యయాతియొక్క రాజ్యముండియుండును. ఈ యిద్దఱు స్త్రీలు హిమాలయమునకుపశ్చిమవైపుననున్న అనఁగా వర్షావారియొక్క — అసురులయొక్క బాలికలై యుండిరి. ఈ కథ ఋగ్వేదమున లేదు. మహాభారతమున. గలదు.వీరికి అయిదుగురు పుత్రులుండిరనియు వారు ఋగ్వేదమునఁ బ్రసిద్ధులై యున్నారనియు మనకు చెప్పఁబడియే యున్నది. వీరైదుగురు పుత్రులే మొదట హిందుస్థానమునకు వచ్చిరి. వారు కొండ లోయలనుండి వచ్చి సరస్వతీ నదియొడ్డున మొదటి నుండి నివసించిన సూర్యవంశీయులైన యార్యులయొక్క రాజ్యములను బ్రవేశించి.రి ఋగ్వేదమున వారు పంజాబుమీఁదఁబడమరవైపునను అఫగానిస్థాన వైపు తూర్పునను దండెత్తిరి. కాని వారి యత్నములు కొనసాగకపోయెను. ఈ కారణముచేత నాలోకులుసరస్వతీ తటమునుండి గంగా యమున తటములకు దక్షిణ దిక్కుగా వ్యాపించిరి. సంహితయొక్కయు బ్రాహ్మణముయొక్కయు వర్ణనముఁబట్టి వారియొక్క యితిహాసమునకు నిదే క్రమముగా పడుచున్నది;

నేఁటి హిందుస్థాన వాసుల పరిస్థితిఁబట్టికూడ నిదే సిద్ధమగుచున్నది. ప్రాచీ నేతిహాసమును మరియు వంశమును సిద్ధము చేయుటకై యీ దినములలో భాషాశాస్త్రము మరియు శీర్షమాపనశాస్త్రము, ఈ రెండు శాస్త్రములనుండి సాహాయ్యము గైకొనఁబడుచున్నది. ఈ రెండు శాస్త్రముల సిద్ధాంతములను ఈ చంద్రవంశీయులయొక్క పేర్కొనఁబడిన యితిహాసముయొక్క ప్రమాణ మున కనుకూలములై కనిపించుచున్నవి. డాక్టర్ గ్రియర్సను ఇప్పటి హిందీభాషల నభ్యసించియున్నాఁడు. వారి సిద్ధాంతము నాధారము చేసికొని సం 1911 వత్సరములోని జనాభాయొక్క రిపోర్టునందు, ఈ విధముగా వ్రాయబడి యున్నది;— "హిందుస్థానముయొక్క యార్య భాషయగు హిందీ (సంస్కృతోత్పన్నము) భాషను ఆర్యులయొక్క రెండు సమూహములు తీసికొని ఇచ్చిరి. మొదటి సంఘము ఎపుడు ఉత్తర హిందూస్థానముయొక్క బహిరంగభూమియందు వ్యాపించెనో, అపుడు రెండవ సంఘము నడుమనే ప్రవేశించి, అంబాలా మొదలు దక్షిణమున జబల్పురము కాఠియావాడు వఱకు వ్యాపించెను. నేఁటి పంజాబు రాజపు తానాల అయోధ్యల హిందీ భాషకు సంబంధించిన మార్గము వేఱు ఇంకను బశ్చిమ హిందీ అనఁగా అంబాలా ఢిల్లీలు మొదలు మధుర మొదలై నవి మఱియు జబల్పురము వఱకునున్న వర్గము వేఱు; దీనియొక్క శాఖ కాఠియావాడులో గుజరాతియైయున్నది. ఈ రెండవప్రాంతము హిందుస్థానముయొక్క మధ్యదేశముగాఁ జెప్పఁబడఁగలదు. ఈ మధ్యదేశ మందే చంద్రవంశక్షత్రియులయొక్క నివాసమును వృద్ధియునయ్యెను. ఋగ్వేదము మొదలుకొని మహాభారతము దాఁకనున్న గ్రంథములయొక్క యితిహాసముఁబట్టి యిదే విషయము కనఁబడుచున్నది. ఇపుడు ఈ చంద్ర వంశ శాఖల గుఱించి కొంచెము విస్తరించి విచారింతము.

## పురువు

వచ్చిన రెండవ చంద్రవంశార్యులయందుఁ బురువుయొక్క కులము చాల వృద్ధినొందినది ప్రసిద్ధమైనదికూడను. యయాతియొక్క యైదుగురు కొడుకులందును ముఖ్య రాజు పురువేయైయుండెను. అతనికిఁదండ్రి యీ

యాశీర్వాదమునిచ్చెను—"అఘోరవాతు మహీ స కదాచిద్భవిష్యతి" ఈ పురువులు మొదట సరస్వతీ తీరమునకు వచ్చి తరువాత దక్షిణమువైపునకు వ్యాపించిరి. ఋగ్వేదమందు సరస్వతీ సూక్తమున వసిష్ఠుడు, సరస్వతి యొక్క యుభయ తీరములను ఋరువులున్నారని వర్ణించియున్నాడు. పురువునకు దస్యువులతో అనఁగా భారతవర్షముయొక్క మూల నివాసులతోఁ జాల యుద్ధములు చేయవలసివచ్చెనని నయితము ఋగ్వేదమునుండి తెలియుచున్నది. పురుశబ్దమునకు సాధారణముగా మనుష్యుఁడర్థము చేయవలయునని యాస్కుఁడు సూచించియున్నాఁడు. దీనిఁబట్టి పురువులు ప్రబలులై సర్వత్ర వ్యాపించియుండిరని యగపడుచున్నది. పురువుయొక్క వంశమున అజామీఁఢుడునున్నాడు; అతనియొక్క యుల్లేఖమునూడ ఋగ్వేదములోనున్నది. ఈ పురువులయొక్కయు చంద్రవంశీయుల యొక్కయు ఋషులు కాణ్వుఁడు నంగిరసుఁడునై యుండిరి. పురువు యొక్క కులమున వీని తరువాత దుష్యంతుడును భరతుఁడునై యున్నారు. ఋగ్వేదమునందు వారి నామములులేవు. కాని దుష్యంతపుత్రుఁడు భరతుని యొక్క నామము బ్రాహ్మణమందున్నది. బ్రాహ్మణమందునశ్వమేధ కర్తలలో భరతునియొక్క వర్ణనము కలదు.

అశ్వమేధ శతేనేష్ట్వాయమునామను వావ యః ।
త్రింశతాశ్వాన్సరస్వత్యాం గంగామను చతుశ్శతాన్ ॥

శతపథానుసారముగా నీ వర్ణము మహాభారతమునందుఁగలదు. దీనిఁబట్టియును పురువులయొక్క రాజ్యము యమున, సరస్వతి మఱియు గంగ వీటి యొక్క తటములయందు నుండెననియె తెలియుచున్నది. ఈ భరతుఁడు మహాపరాక్రమశాలి; కాని యతడు ఋగ్వేదములోని భరతుడుకాఁడు. ఈ సంగతిని జూపుటకై బ్రాహ్మణ గ్రంథమునందు వానికి

---

మహాభారతమందు శ్రీకృష్ణుఁడు—"జరాసంధుని భయము వలన మనకు మన ప్రియమైన మధ్యదేశము విడువవలసివచ్చెను." "స్మరన్తోమధ్యమం దేశం వృష్ణిమధ్యే వ్యవస్థితః" (సభా. 14,1( )

దౌష్యంతి భరత, నామము పెట్టబడియున్నది. ఈ భరతుని కాలమంతు కురువుండెను. సరస్వతికిని యమునకును మధ్య విశాలమైన బహిరంగ ప్రదేశమును (మైదానమును) "కురుక్షేత్ర, మనుచున్నారు. ఇచ్చటకురు పరివారమునకు నెక్కువ యౌన్నత్యమయ్యెను. ఆర్యులయొక్క సంస్కరణ మిచ్చట అత్యంతము యున్నతికెక్కినది. ప్రజలిచ్చటి భాషను అత్యంతము సంస్కృతమును మన్నింపసాగిరి. ఇచ్చటి వ్యవహారము రీతి యాచారము అన్నిటికంటె నుత్తమములుగా నెంచబడినవి. బ్రాహ్మణ గ్రంధములయందు నీ విషయములయొక్క వర్ణనమున్నది. మహాభారతమువలన, పురుష్ల రాజధాని, గంగకుంబడమటి యొడ్డునయున్న హస్తినాపురమని సిద్ధించుచున్నది. ఈ వంశమందే కౌరవులైరి. పాండవులకుంగూడ నిదే వంశముతో సంబంధమున్నది. భరతునియొక్క కురువుయొక్కయు నుల్లేఖము విచారింపంగా ఋగ్వేదమందు లేదు, అయినను, ఋగ్వేదసూక్తములు మునియుకమునుపు వారుండిరనుటకుం బ్రమాణమున్నది, ఎందుచేత? చివరియొక సూక్తము నకుంగర్త దేవాపి, శంతనువుయొక్క సోదరుండు కౌరవవంశమందునుండెను. ఈ సంగతి ముందే వ్రాయబడియున్నది.

## యదువు

భారతీయ యుద్ధమునందలి చంద్రవంశ రాజులందఱును గలిసి యుండిరి. ఇందుకై మనము ఇతరేతర శాఖలయొక్క యితిహాసము మీందను విచారముంగావింతము. ఋగ్వేదమందు యదువుల యుల్లేఖమెప్పుడును తుర్వసులతోంగనబడుచున్నది. అందుం గవ్యఋషి యొక్కయు నుల్లేఖము కలదు. మొదట యదుతుర్వసులు ఒకేచోట నుండియుందురు. వీరి విషయమై మొట్టమొదట వసిష్ఠాది ఋషులిట్లు ప్రార్థించుచున్నారు — "ఓయి యింద్రుడా! నీవు యదుతుర్వసులను జంపుము"అని తరువాతవారు ఎపుడు ఇచటి స్థిరనివాసులైరో, అప్పుడు వారియొక్క వర్ణనము చక్కని రీతిగా నారంభమాయెను. ఇచ్చట, ఋగ్వేదముయొక్క యెనిమిదవ మండలము

కణ్వఋషిదియను సంగతి చెప్పదగియున్నది. కణ్వునియొక్క భిన్నభిన్న వంశీయులైన ఋషులు ఏ సూక్తములను జేసిరో, అవి ఋగ్వేదమందు మిలితములై యున్నవి. ఈ యనేక సూక్తములయందు "మనము యదుతుర్వసులనుండి గోవులను దీసికొని వచ్చితిమి." అని మొదలుగా వర్ణముకలదు. దీనిఁబట్టి కాణ్వఋషులు చంద్రవంశీయులకు హితమును జింతించువారై కనబడుచున్నారు. దీనినిబట్టి దుష్యంతునికిని గణ్వునికిని గల సంబంధమేమియో యిదికూడఁదెలిసికొనవచ్చును. బ్రాహ్మణమునందును భరతునికిఁ బురోహితుఁడు కణ్వుఁడని చెప్పఁబడియున్నది. యదుతుర్వసులయొక్క మంచియుల్లేఖమును జేయువాఁడు అంగిరస ఋషిహస్తమై, యున్నాఁడు. మొదటి మండలములోని యాంగిరసునియొక్క నాలసూక్తములందు నీ సంగతి దొరకును. ఛాందోగ్యోపనిషత్తులో దేవాపి పుత్రుడైన కృష్ణునికి ఘోరుఁడైన యాంగిరసుఁడుపదేశించి యున్నాడు. దీనికి, జేర్కొనబడిన వర్ణనముతోఁ జక్కగా సంబంధము కలియుచున్నది. అభిప్రాయ మేమనగా ఋగ్వేదకాలమున యదువంశమునకు నధికమైన జయము కలిగి యుండెను. యదువంశజులైన యాదవులు యమునానది యొడ్డుననుండిరి. వారి వంశమున తరువాత శ్రీ కృష్ణుడుదయించెను. యదుతుర్వసులు గోవుల యొక్క యుద్యమమును జేయుచున్నట్లు తెలియుచున్నది. వారి యొక్క యిదే పరంపర తరువాత మహాభారతమందును గనఁబడుచున్నది. యాదవులకు రాజ్యము చేయునధికారము లేకుండుటయొక్క దృఢ నిశ్చయము ఇదే కారణముగా వ్యాపించియుండును. వారికి యయాతియొక్క శాపదానమును గూర్చిన వర్ణనమిది—

తస్మాదరాజభాక్ తాత ప్రజాతవ భవిష్యతి। ( ఆది. 84.9 )

శ్రీ కృష్ణుఁడు వసుదేవునికిఁ బుత్రుడై యుండెను. వసుదేవుడు గోకులవాసియై నుండెను. ఇత్యాది విషయములును బ్రసిద్ధములై యున్నవి. కాని యాదవులు ఆరంభమునుండియే గోవులయొక్క యుద్యమమును జేయుచుండిరి. ఈ సంగతికి సంపూర్ణప్రమాణము భారతములోని యొక చిన్న వాక్యమునుండి దొరుకుచున్నది. ఏ సమయమున సుభద్ర అర్జునితో నింద్రప్రస్థమునకు వెళ్ళెనో, ఆ సమయమున సుభద్ర సు

# పాంచాలురు

పురువుయొక్క రెండవశాఖలోని వంశజులు పాంచాలురని హరివంశమునుబట్టి జూడ తెలియుచున్నది. వీరియొక్క ముఖ్యపురుషుండైన సృంజయుండు ఋగ్వేదమునఁ బ్రసిద్ధుఁడై యున్నాడు. అతనియొక్క వంశమందు సహదేవుఁడు సోమకుఁడునునయిరి. ఈ యిద్దరు కూడ ఋగ్వేదమునఁ బ్రసిద్ధులై యున్నారు. సృంజయునియొక్క యగ్నికి, ఋగ్వేదములోనొకచోట బ్రశంస కలదు. దీనింబట్టి, అతఁడు చాల యజ్ఞకర్తయై యుండెనని తెలియుచున్నది. బ్రాహ్మణములో, సోమకుఁడు రాజసూయ యజ్ఞమును జేసి, పర్వత నారదులిరువురి యొక్క మాటవలన, మరియొకటియేయగు రీతిని సోమపానము గావించెను. అందుచేసతనికి యశస్సు వచ్చెనని వర్ణనము కలదు. కనుకనే యతని వంశజులకు సోమకనామము కూడఁ బ్రాప్తించినది. మహాభారతములో పాంచాలురు సృంజయులనియు సోమకులనియు జెప్పఁబడియున్నారు. బ్రాహ్మణములో నొకచోటఁ బాంచాల పదమునకర్థము క్రివులని చేయఁబడిన వీరెవరో తెలియదు; కాని వీరియొక్క యుల్లేఖము ఋగ్వేదమునను న్నది. పాంచాలురలో నైదుజాతులు కలిసియుండుననుట సంభవమై యున్నది.

స సృంజయాయ తుర్వశం పరాదాద్వృచీవతో
దైవవాతాయ శిక్షన్॥ (ఋ.6.27)

ఈ ఋక్కునుబట్టి, తుర్వశులు సైతము పాంచాలురయందు మిశితమైన యుందురని తెలియునున్నది. దీనింబట్టి, పాంచాల ప్రజలు అనార్యులలో మిశ్రితులై యుందురని శంక చేయఁబడఁగలదు, కాని, క్రివులను తుర్వశులను ననార్యులై యుండిరని యెక్కడ సిద్ధమగుచున్నది? బ్రాహ్మణ గ్రంథములయందుఁగురు పాంచాలురకు నెడతెగని గొప్పతనము గనబడుచున్నది. కొన్నిచోటులఁ బాంచాలురయొక్క స్వతంత్ర నామము వచ్చుచున్నది. బ్రాహ్మణ గ్రంథములలోని వర్ణనముఁబట్టి కురువులవలె వీరును యజ్ఞకర్తలును, విద్వాంసులును మరియుఁ దత్త్వజ్ఞానాభిమానులునై యుండిరని ప్రకటమగుచున్నది. తాత్పర్యమేది, పాంచాలురయొక్క సత్కీర్తి కొంచమైనఁ దక్కువ తరగతిగ కాకయుండెను. ఈ పాంచాలురు గంగా యమునలకు

నడుమ హస్తినాపురమునకు దక్షిణభాగమునందు నుండిరి. మహాభారతమునుండి గంగకు నుత్తరమునఁగూడ వీరికి సగము రాజ్యముండెనని తెలియుచున్నది.

## అనువులు మఱియు ద్రుహ్యులు

ఇపుడు అనువులును ద్రుహ్యులుననెడి యీ రెండు శాఖలు నిలిచి యున్నవి; కనుక వీరినిగూడ మనము విచారించుచున్నాము. ఋ. మం.8 సూక్త 46 మందు ద్రుహ్యువుయొక్కయుఁ బురువుయొక్కయు యుద్ధము మున్నది. ఒకవేళ పురువుయొక్క చిన్న శాఖయందు ద్రుహ్యువులు కలిసి పోయి యుందురు. కానీ హరివంశముయొక్క వంశధరుఁడై శకుని గాంధారుఁడై యుండును. శకుని యతని వంశమువాఁడై యుండెను. అతఁడు భారతీయ యుద్ధమందు వచ్చియుండెను. ఋగ్వేదములో అనువుయొక్క ప్రశంస చాలఁజేయబడియున్నది. అతనియొక్క యగ్నికి సంబంధించిన గొప్ప తనమున్నది. అతఁడు మిక్కిలి పెద్ద యుద్ధకర్తయై యుండెనని తెలియు చున్నది. పంజాబులోని ఔశీనరుడైన శిబి యీ వంశమువాఁడైయున్నాఁడు ఈ వంశమందే భారతయుద్ధ కాలికుఁడైన జయద్రథుఁడు ఉండియుండెనని పురాణకారులు చెప్పుచున్నారు. హరి వంశమున [illegible]మందు నే వర్ణన ఉన్నదో యది కొంచెము వేరుగానున్నది. తుర్వసునియొక్క వంశము నష్టమై పురువుయొక్క వంశములోఁ గలసిపోయెను. అతనికి సమ్మత యను పేరుగల చిన్నది యుండెను. ఆమెనుండి దుష్యంతుఁడు పుట్టెను. ఈ ప్రకారము తుర్వశునియొక్క వంశము పౌరవులలోఁ గలసిపోయెను. ద్రుహ్యులయొక్క వంశము గాంధారమని చెప్పఁబడియున్నది కాని యనువునకుఁ బ్రచేతుఁడు, మరియు సుచేతుఁడు మొదలైన పుత్రులును పౌత్రులు గలిగిరి తరువాత మరల నతనియొక్క వంశ వర్ణనము లేకయున్నది ఈ కథనమునకు విపరీతముగా నాదిపర్వమునందు ఒక వచనమున్నది ఇక్కడ దానిని చేర్కొనుట మంచిది కావచ్చును.

యదోస్తు యాదవా జాతాస్తుర్వసోర్యవనాః స్మృతాః॥
ద్రుహ్యోస్సుతాస్తు వై భోజా అనోస్తు మ్లేచ్ఛ జాతయః॥

యదువునుండి యాదవులు, తుర్వసునుండి యవనులు, ద్రుహ్యువు నుండి భోజులు మఱియు అనువునుండి మ్లేచ్ఛులు పొడమిరి ఈ శ్లోకమందు వర్ణింపఁబడిన తుర్వసుఁడు, ద్రుహ్యువు, అనువు వీరి సంతతి బొత్తిగా వేఱై యున్నది. దీనిఁబట్టి, మహాభారత కాలమందు వీరి సంతానము విషయమై బొత్తిగనే భిన్నమైన యూహలుండెడివని సిద్ధించుచున్నది. ఇంకను దీనిఁ బట్టి, సౌతి హరివంశమును వ్రాయలేదనియు దానిని పరిక్షించలేదనియుఁ గూడఁ దెలియుచున్నది. అతనికి సంతతికి సంబంధించిన తెలివి బొత్తిగా మహాభారత కాలమున లోపించిపోయి యుండెనని తోఁచుచున్నది. ప్రాచీన గ్రంథముల యైతిహాసిక ప్రమాణమును జూచునప్పుడు పూర్వపూర్వము నధిక ప్రమాణముగా గౌరవింపవలయును. అనఁగా, హరివంశముకంటె మహాభారత మెక్కువ ప్రామాణికమై యున్నది. మహాభారతమునకన్న వేదాంగములకును వేదాంగములకన్న బ్రాహ్మణములకును బాల ప్రామాణ్యమున్నది. బ్రాహ్మణ గ్రంథములకంటెఁగూడ నెక్కువగునో సంహితయుండును ఋగ్వేద సంహితను నీ కార్యమునట్ల శ్రేష్ఠముగా మన్నింపవలయును. ద్రుహ్యువునుండి భోజులయొక్క యుత్పత్తియై యుండుననెడియా మహాభారత వచనము విశ్వసించుటకుఁదగియున్నది. ఎందుచేతననఁగా దీనికి విరుద్ధమైన 'అతని నుండి గాంధారప్రజ లుత్పన్నులైరను హరివంశములోని కథనము వెనుక టిదిగా యున్నది? ఇదివరక గాంధారదేశము పంజాబుపై నున్నది. కాఁబట్టి యచ్చటికిఁ ద్రుహ్యువంశ్యులు వెళ్ళియుండరు. శ్రీకృష్ణుఁడు సభా పర్వములో, యయాతి కులమున భోజరాజు పుట్టెనని యేది చెప్పియున్నాఁడో. దానితోఁ గూడ నిమ్మది మేళవించుచున్నది. గాంధారమందు బహుశః ముందు వచ్చి యున్న యార్యుల వంశజుఁడు లేక సూర్యవంశుఁడు కావచ్చును. మన కల్పనకు రామాయణముయొక్క వర్ణనముతో నానుకూల్యము కలదు. రామాయణమందు, భరత పుత్త్రుఁడు సింధు ప్రాంతమునఁ బుష్కరావతిని నిర్మించెనని వ్రాసియున్నది. అప్పుడె తిరిగి ద్రుహ్యువునుండి భోజులుత్పన్నులైరి. లోకులు మధ్యదేశమందు భారతీయుద్ధ సమయమువలన మగధ, శూరసేనాది దేశములలోఁ బ్రబలులై యుండిరి; మఱియు వీరి కులమున జరాసంధుఁడు, కంసుఁడు లోనగువారు అయియుండిరి. మంచిది, తుర్వసువు నుండి యవనులుత్పన్నులైరి. యీ సౌతి వచనము సరియైనది కాదు. ఒక

వేళ, అనువు మఱియును అయోను ఒకఁడే కావచ్చును: [illegible] నతనినుండి యవనులు కలిగియుందురు; తుర్వసునుండి తుర్వ[illegible] ఈరానుకు శత్రువు తూరాను మొదలగు మ్లేచ్ఛ జాతులు కలిగియుం[illegible]. కాని యీ సంగతియసత్యమై యున్నది. 'యవనులు మొదలగు మ్లేచ్ఛ జాతులు మన పూర్వులనుండియే పుట్టియున్నారు. ఈ కల్పనవల్లనే [illegible] నిశ్చయమయియున్నది. కాని యయాతియొక్క సంతానమూ[illegible] యును. మరియు నాతఁడు హిందుస్థానముననే యుండవలయును. [illegible], ఋగ్వేద ప్రమాణము దీనికి విపరీతమై యున్నది. ఋగ్వేద పద్ధతినిబట్టి తుర్వసులు సృంజయులతోఁగలసిపోయి యుండుట కనఁబడుచున్నదని పూర్వము వ్రాయఁబడియే యున్నది. అనువు గొప్ప యజ్ఞములను చేయు చుండెడివాఁడు మరియు నతని యగ్నికూడఁబ్రసిద్ధమై యుండెను. అతని యొద్దకు నింద్రుఁడునునగ్ని దేవుఁడును నిత్యము వచ్చుచుండెడివారు. ఋగ్వేద ములో నిటువంటి యేయుల్లేఖములు కలవో వాటియొక్క వర్ణనము ముందే చేయఁబడియున్నది. దీనిఁబట్టి, అనువు వైదిక ధర్మాభిమాని, అగ్న్యుపాస కుఁడు మరియు నింద్రభక్తుఁడునై యుండెనని సిద్ధించుచున్నది, మ్లేచ్ఛుఁడు అగ్న్యుపాసకుఁడు నింద్రభక్తుఁడునై యుండెననుటకు దృష్టాంతమెందును దొరకక యున్నది. అనఁగా, అనువునుండి మ్లేచ్ఛులుత్పన్నులగుట సంభవము కానేరదు. అనువుయొక్క వంశమేదియై యున్నదో! ఈ సంగతి నాతి సమ యమునఁదెలిసియే యుండదని తాత్పర్యము. హరివంశమందుఁగూడ దీని యొక్క ప్రసంగము లేదు. యదువుయొక్క వంశమున శ్రీకృష్ణుడు పురువు యొక్క వంశమునఁగౌరవ పాండవులునగుటఁబట్టి వారి కులములు ప్రసిద్ధము లైనవి. యయాతి తన కుమారులకు శాపమిచ్చియుండెను, అది యిచ్చుటఁ జేర్కొనఁదగియున్నది. యదువుయొక్క సంతతికి రాజ్యము లేకుండుటకై ఏ శాపమును యయాతి యిచ్చెనో. యయ్యది పూర్తియయ్యెను. నీ యొక్క సంతతికి నుచ్ఛేదము కాగలదని తుర్వసునికి శాపమిచ్చియుండెను. కనుక నదియు నైతిహాసిక రీతని సరిగా నచ్చుబాటగుచున్నది. ద్రుహ్యువు నకు ఏనుగులు, గుఱ్ఱములు, ఎద్దులు. పల్లకీలు మొదలగునవి యెచటఁబాత్రిగా నుండవో, మరియు నెగటఃబదవలమీదఁ గూర్చుండి రాకపోకలు చేయవలసి

యున్నవో యచటనే నీవుండుఁగాక యని శాపమిచ్చియుండెను.

అరాజా భోజశబ్దస్త్వం తత్ర ప్రాప్స్యసి సాన్వయః

ఇటువంటి దేశమేదియో తెలియకున్నది. హిందుస్థానములో నిట్టి ప్రదేశ మేదియో యూహకు రాకున్నది. భోజ సంజ్ఞకుఁడైన రాజు దక్షిణమునఁ గలఁడు. కాని యచ్చట నీ సంగతులు లేకయున్నవి. ఇదియొక ముఖ్య మైన యద్భుతము. మేలు; ద్రుహ్యువుయొక్క వంశజులు భోజులని యిందుఁ జెప్పబడి యున్నది. అనువునకు, నీ సంతానము మ్లేచ్ఛులగుదురని యు నీవు అగ్నియొక్క పరిచర్యను విడనాడి నాస్తికుఁడవగుదువనియు శాపముండెను. దీనిని ఋగ్వేద వర్ణనముతోఁ జూడఁగా, అనువునకుఁ బూర్వమే యనవులు అయిరని కల్పన సేయఁగలదు. హిందుస్థానములోని యనువుయొక్క వంశస్మృతి మహాభారతకాలమున లేకయుండును.

## చం ద్ర వం శీ యు లు వే రు

ఆలోచింపఁగా వైదిక సాహిత్యమున, హిందుస్థానమునందుఁ జంద్ర వంశము మఱియు సూర్యవంశము ననెడి రెండు వేర్వేఱు వంశములుం డెనను విషయమై యుల్లేఖము లేకున్నది. అయినను మహాభారతములో దీనియొక్క వర్ణనము స్పష్టముగా దొరకుచున్నది. శ్రీకృష్ణుఁడు సభా పర్వమునఁ జెప్పియున్నాఁడు — 'ఈ సమయమున హిందుస్థానమందు ఐలునియొక్కయు ఐక్ష్వాకునియొక్కయు వంశముల 100 కులము లున్నవి. వారిలో యయాతికులమునఁ బుట్టిన భోజవంశపురాజులు గుణవంతు లును నలుదెసల వ్యాపించినవారునై యున్నారు. ఐల, ఐక్ష్వాక శబ్దముల నుండి చంద్రవంశము మఱియు సూర్యవంశము యొక్క బోధయగు చుండుట స్పష్టమైయున్నది. చంద్రునియొక్క సూర్యునియొక్కయుఁ బేరు మాత్రములేకున్నది. ఈ కారణముచేత, మహాభారతకాలమునఁగూడ నీనామముల యొక్క ప్రచారముండెనో లేదోయని కొంచెము సందియము మిగిలియే

యున్నది. తరువాతఁ బురాణకాలమున నీ నామములు ప్రసిద్ధములై పోయెను. ఋగ్వేదకాలము మొదలుకొని మహాభారతకాలము వఱకు మాత్రము, హిందుస్థానమందు రెండు వంశముల యార్యులు వచ్చియుండిరనియే సంగతి కనఁబడుచున్నది. మొదట భరతులు లేక సూర్యవంశ క్షత్రియులు వచ్చిరి. మఱి వెనుకనుండి యదువు, పూరువులోనగు వారి వంశముల క్షత్రియులు వచ్చిరి. బ్రాహ్మణకాలములోని రెండు వంశముల క్షత్రియులకు నుత్కర్ష యగపడుచున్నది. అదే భారతీయ యుద్ధ సమయమైయుండును. శ్రీ కృష్ణునియొక్క కథసముఁబట్టి భారతమందు యయాతి వంశజమగు భోజకులముయొక్క ప్రాబల్యమధికమై యుండెనని తెలియుచున్నది, ఈ చంద్రవంశీయులందఱి కులములు గంగా, యమునా, సరస్వతీ నదులయొక్క తీరములయందు స్థిరపడియుండెను. మొదట వచ్చిన యార్యులు పంజాబు మఱియు నయోధ్యామిథిల ప్రాంతమున నివసించియుండిరి; చంద్రవంశీయులైన యార్యులు వారియొక్క మధ్యను దూరియుండిరి. ఈ చంద్రవంశీయార్యులయందు నెక్కువ ముఖ్యములైన కులములివియై యుండెను ;- (1 కురుక్షేత్ర మందలి కౌరవులు, (2 గంగాతీరమున యాదువులు మఱియు దానికి దక్షిణమునఁ బాంచాలురు, (3 మధురయందును యమునా తీరమందును యదువులు వెండియు శౌరసేనిభోజులు (4 దక్షిణమున యమునా తీరమందుఁ బ్రయాగవఱకుఁజేది వంశస్థులు వెండియు (5 గంగకు దక్షిణమున మగధులు. వీరుగాక (6 అవంతియందును విదర్భయందును భోజకులము లుండెను. వీరందఱును చంద్రవంశ క్షత్రియులై యుండిరి. భోజుల యొక్క ప్రతాపముచేత యాదవులు శ్రీ కృష్ణునితోడ మధ్యదేశమును విడనాడి వెళ్ళిపోయిరి; వెండియు (7 సౌరాష్ట్రము అనఁగా కాఠియావాడునకు వెడలి ద్వారకయందు నివసించిరి. వీరందఱు చంద్రవంశీయ క్షత్రియార్యులై యుండిరి. వీరియొక్క ధర్మము వైదికమే యైయుండెను. అనఁగా వీరు ఇంద్రుని మఱియు నగ్నిని నుపాసించుచుండిరి. మరల వీరియందును, మొదటి యార్యులయందును మిక్కిలి స్వల్పభేదముండెను. ఈ క్షత్రియులయొక్క వర్ణనము శ్యామవర్ణమై యుండును. శ్రీకృష్ణుఁడు, అర్జునుడు. వేదవ్యాసుఁడు మఱియు ద్రౌపది మొదలైనవారి

యొక్క వర్ణముఁ బట్టి యిట్లే తెలియుచున్నది. మల్లవిద్యయందు వారి కభిమానముండెను. శ్రీకృష్ణుఁడు, బలరాముఁడు, దుర్యోధనుఁడు, భీముఁడు మఱియు జరాసంధుఁడు మొదలైన వారియొక్క వర్ణనముఁబట్టి వీరికి మల్లవిద్యయందు విశేషమైన ప్రేమ యుండెనని తెలియుచున్నది. వీరి యొక్క భాషయందును గొంచెము భేదముండెను; మనము ఈ భేదము నేఁటి సంస్కృతోత్పన్నమై మధ్యదేశీయమగు హిందీ భాషయందును వచ్చియున్నదని ముందు చూపియే యుంటిమి. వారి శిరస్సుయొక్క ప్రమాణమందును గొంచెము వ్యత్యాసముండి యుండును. దీనియొక్క నిర్ణయము తరువాతఁజేయఁ బడును, అనుమానముఁబట్టి, వీరిలోఁ జాంద్రవత్సరముచేత వ్యవహరించు లోకులు కొందఱుండిరని తెలియుచున్నది. పరస్పర కలహముపలన నీ ప్రజలయందు భారతీయ యుద్ధము సంభవించినది. రెండు వైపులను ముఖ్యముగాఁ జంద్రవంశ క్షత్రియులుండిరి.

## పాండవులు

ఇపుడు, పాండవులెవరై యుండిరో, ఈ సంగతిని విచారింపవలయును. ప్రతీపుడుఁ; కౌరవరాజై యుండెను. అతనికిఁ బుత్త్రుండయ్యెను శంతనువు, శంతనుని కిరువురు పుత్త్రులు భీష్ముఁడు విచిత్ర వీర్యుఁడు నైరి. భీష్ముఁడు తనకు రాజ్య విషయమునఁగల యధికారమును వదలుకొనెను; ఇందుచేత విచిత్ర వీర్యుఁడు సింహాసనము నెక్కెను. విచిత్ర వీర్యునికి ధృతరాష్ట్రుఁడును పాండురాజును గలిగిరి. ధృతరాష్ట్రుఁడంధుఁడై యుండెను, ఈ కారణముచేఁ బాండుఁడు రాజయ్యెను. రోగము వచ్చి పాండుఁడు వనమునకు వెళ్ళిపోయెను. ఇందుచేత ధృతరాష్ట్రునియొక్క పుత్త్రుఁడు దుర్యోధనునికి రాజ్యము లభించెను. ఎపుడు పాండుఁడు వనమునకు వెడలెనో, అప్పటికతనికి సంతానము లేకుండెను. ఈ కారణముచేతఁ గుంతియును మాద్రియును దేవతలను బ్రసన్నులను గావించికొని వారిచేత నైదుగురి బిడ్డలఁ గనిరి. వీరే పాండవులనిపించుకొనిరి. ఈ పాండవులు హిమాలయమందే వయసువచ్చిన వారైరి. మఱియుఁ బాండురాజు మరణించిన పిదప హిమాలయమందలి బ్రాహ్మణులు వారిని హస్తినాపుర

మందు ధృతరాష్ట్రునియొక్క రక్షణములో నుంచిరి. ఇచ్చట వారితో దుర్యోధనాదులకు వివాదమారంభమయ్యెను. ఆ సమయమునఁగూడ, వీరు పాండు సంబంధులు కారను కల్పన యుండి యుండును. ఇంకను నీ కారణముచేతనే యీ జగడము క్రమ క్రమముగాఁ బెరిగి తుదికిఁ జాల భయంకరమై పోయెను. మహాభారతమందు పాండవులయొక్కయు భారతీయ యుద్ధము యొక్కయుఁ బూర్వపీఠిక యిట్లె యీఁబడియున్నది. ఇపుడిచ్చట, ఈ కథకు నైతిహాసిక స్వరూపమేదియో, యిది విచారింప వలసియున్నది. కొందఱు లోకులు, ఈ సమస్తకథయుఁ గల్పితమైయున్న దని చెప్పుచున్నారు; కాని యీ యూహ యసత్యమైయున్నది. మనయభిప్రాయమందుఁ జంద్రవంశ సంబంధియగు సంతిమ శాఖలోని యే యార్యులు హిందుస్థానమునకు వెలుపటినుండి వచ్చియుండిరో, వారిలోన పాండవులున్నారు. మనము మునుపు, చంద్రవంశీయులు హిమాలయముయొక్క యావలిపై పునుండి, గంగానదియొక్క కొండలోయలలోనుండి వచ్చుచు హిందూస్థానమునకు బేరిరని వ్రాసియుంటిమి. చంద్రవంశముయొక్క మూలపురుషుఁడు ఐలుఁడైన పురూరవుఁడు అనఁగా ఇళయొక్క పుత్రుడయి యుండెను; ఇంకను హిమాలయమునకు నుత్తరమున నేభాగమున్నదో, దానియొక్క నామము ఇలా వర్షమై యున్నది అనఁగా, చంద్రవంశముయొక్క యసలు ప్రదేశము ఇలా వర్షమై యుండెలు; ఇంకను కురువులయొక్క యే మూలస్థానము హిమాలయమున కుత్తరమున నుండెనో, దానిపేరు ఉత్తరకురుదేశమై యుండెను. కోంకణమందున్న బ్రాహ్మణులు కొండలోయలకు వచ్చి, వ్యాపించి నివసించిరి, కాని వారియొక్క మూలభూమి వర్తమానమునసే ప్రకారము దక్షిణ కోంకణమే యైయున్నదో, అదే ప్రకారము కురువులయొక్క మూల దేశము హిమాలయమున కుత్తరభాగమున నుండెనని తాత్పర్యము. రోగము రాఁబట్టి పాండుఁడు రాజ్యమును వదలిపోయెనన్న మహాభారత వర్ణనము సరిగా నగపడుచున్నది. పాండుఁడు తన కురువులయొక్క మూలప్రదేశమునకుఁ బోయి యచ్చటఁ జాలవత్సరములదాఁక నివసించెను. అచ్చట నతడు

అందలి మతాచారము లతనియొక్కయు లతని పరివారము యొక్కయు శరీర మంతటను నిండియుండు సంతతి విశేషకాలను వఱకు నుండి యుండుము. అదేశమందలి చంద్రవంశ క్షత్రియులయందు నేపద్ధతులు ప్రచలితములై యుండెనో, అవి ప్రాచీన పద్ధతిపై యుండెను, హిందుస్థానమందు నివసించియున్న క్షత్రియుల యొక్క పద్ధతులతోఁ గలసిమెలసియుండవయ్యెను. మనము ముందుముందు విస్తరించి, బ్రాహ్మణులు, క్షత్రియులు నిద్దఱునొకే వంశమున నుత్పన్నులైరని చెప్పుదుము. పాండురాజు యొక్క దేహాంతమైన పిమ్మటఁ కుంతిదేవి తన యైదుగురు కొడుకులను వెంటఁ బెట్టుకొని, బ్రాహ్మణ క్షత్రియ పరివారముతో, హిమాలయము యొక్క యున్యప్రదేశమును విడిచి వైచి తన కుఁజిర పరిచితమైన స్థానమందు హిందుస్థానము నకుఁ జేరుకొనెను. ఇంక, పాండవుల యొక్క యుత్పత్తి యే ప్రకారముగా నయ్యెనని ప్రశ్నము కలుగుచున్నది. కాని యాసమయమునఁ బ్రాచీనార్యుల యందు అనఁగా హిమాలయవాసుల యందు నియోగరీతి ప్రచలితమై యుండెను. ఇంతియే కాదు, మహాభారత మందు విచిత్రవీర్యుని సంతతి విషయమై యేవర్ణన మున్నదో దానిఁ బట్టి, నియోగ ప్రచారము హిందుస్థానములోని కురువంశ మందును నుండెనని సిద్ధించుచున్నది. ఈ నియోగ విషయికమైనయుల్లేఖము మనుస్మృతి యందును గలదు. మనుస్మృతి యందీ పద్ధతి నింద్యముగా విశ్వసింపఁబడియున్నది. ఈ కారణముచేత సమాజమునుండి దాని యొక్క ప్రచారము తొలఁగిపోయెను. పాండవులైతిహాసికులనియు వారు హిమాలయమునుండి వచ్చిన చిట్టచివరి చంద్రవంశ క్షత్రియులనియుఁ జెప్పుటకు సందియము లేదు. బహుపతికత్వరీతిని బట్టి యీ సంగతి నిర్వివాదమని సిద్ధమగుచున్నది ఆదిపర్వము యొక్క 198 వ యధ్యాయమందు, ఒక ద్రౌపదితోడ నైదుగురు పాండవులకు వివాహ మెట్లగునని యీ వివాదము యొక్క వర్ణనము కలదు. ఇక్కడ నద్యుది యొత్తి వ్రాయఁదగియున్నది. "ఒక స్త్రీకి ననేక పతులెందును వినఁబడరు. లోకాచారమునకును వేదాజ్ఞకును విపరీతముగా నిట్టి పెడత్రోవను నీవెందువలనఁ బట్టెదవు?" అపుడు యుధిష్ఠిరుఁడు పలికెను—"పూర్వులు పోయిన త్రోవనే నేనును బోవుచున్నాను." అతడు స్పష్టముగా "ఇది మా కులక్రమాగతమైన యాచారమని చెప్పెను. దీనిఁ బట్టి పాండవుల యొక్క యుత్పత్తి హిమాలయమున నయ్యెననియు నచ్చట

నిటువంటి రీతి యుండెడిదనియుఁ బ్రకటమగుచున్నది. చాల పూర్వకాలమున నిటువంటిరీతి యార్యుల యందుండెను. కాని వేదములు దీనిని మన్నింపవు. ఏదియో యగుగాక దీనిఁ బట్టి, పాండవులు హిందుస్థానమునకు బొత్తిగా వెనుక వచ్చి యుండిన యత్యంత ప్రాచీనశాఖలోని హిమాలయవాసులై యున్నారనియు, హస్తినాపుర మందు ననేక కారణములచేతఁ గౌరవులతోడ వారికి జగడమయ్యెననియు సిద్ధించినది. క్రొత్తక్రొత్తగా వచ్చిన వారి యొక్క శాఖ యెల్లపుడు నధికోత్సాహవంతమును నెక్కువ తేజస్వియునై యున్నదని యైతిహాసికానుభవము తేటపడుచున్నది. ఏతదనుసారముగాఁ బాండవులును బాగుగా చుఱుకైన వారుగా నుండిరి. ధృతరాష్ట్రుని వలనవారు రాజ్యములో సగము వంతుఁ దీసికొనిరి. అనఁగా రాజ్యములోని బీటినేల– (యమునకుఁ బడమటి వైపు ప్రదేశము) వారికిఁ దటస్థించెను. అందు వారు ఇంద్రప్రస్థ నామకమైన రాజధానిని స్థాపించిరి. ఈ ప్రకార మైతిహాసికరీతిని బట్టి కౌరవులయుఁ బాండవులయుఁ గథకు మైత్రి కుదురుచున్నది. మఱియు నయ్యది బహు ప్రాచీనకాలికమని యూహ కలుగుచున్నది.

## నాగులు

భారతీయ యుద్ధమునకు సంబంధము నాగులతోఁ గూడనున్నది. వీరు కూడ నైతిహాసికులనుటలో నేహానియులేదు. ఋగ్వేదములో నెవరిని దస్యులు లేక దాసులని చెప్పుచున్నారో వారు వీరేయై యుందురు. వీరు హిందుస్థానముయొక్క మూలనివాసులై యున్నారు. వీరి యొక్క యాకారము పద్ధతియుఁ బుక్కిటి పురాణముఁ బట్టియే మాఱిపోయినది; అనఁగా ఈ ప్రజలు నాగులుఅనఁగా బ్రత్యక్షసర్పములై యున్నవను నీకల్పన వెనుకనుండి చేయఁ బడియుండును. ఎక్కడెక్కడ నార్యులు వచ్చి నివసించిరో, నక్కడక్కడ నాగులు మొదటి నుండియేస్థిరపడియుండిరి. పాండవులకుయమున యొక్క పడమటి యొడ్డున రాజ్యముయొక్క యేభాగము లభించెనో యచ్చట

పశ్చిదేశమందు, నాగులు నివసించు చుండిరి. వీరు విశేషించి యరణ్యముల యందు నివసించుచుండిరి. మఱియు నాగులయొక్క అనఁగా సర్పముల యొక్క పూజ చేయుచుండిరి. రాజ్యమును బాగుచేయుటకై పాండవులీ యరణ్యములను సాపుచేయవలసివచ్చెను. మఱియు నచ్చటినుండి నాగులను దొలఁగింపవలసి వచ్చెను. మహాభారతమందు ఖాండవదహనముయొక్క యే కథయున్నదో, యది యిట్లున్నది. ఖాండవవనమును దహించి యచ్చటి బీడు నేలను కృషికుపయుక్తముగా సరిచేయుటకై యీ యుపాయము పన్నబడిఁ యుండును. ఖాండవ వనదాహముయొక్క ఘటనకుఁ జారిత్రిక స్వరూపమిట్లె యీయఁబడఁగలదు. మిక్కిలి ఘనమైన ఖాండవ వ న ము యొక్క విస్తారము యమున యొడ్డునంనుగెడెను. అక్కడఁ జాల దట్టమైన యరణ్యములయందు నాగులు నివసించుచుండిరి. వారు ఆర్యుల యొక్క గ్రామములను బీడించువారు కూడ నై యుండిరి. ఈ కారణముచేత వారిని దండించి సమస్తమైన యరణ్యమును దహించి వేయుటయు నచ్చటి సార వంతమైన భూమిని గ్రామములోఁ గలిపివేయుటయు నా వ శ్య క మై యుండెను. ఈకారణమున వారు నాగులతో యుద్ధముకూడఁ జేయవలసి వచ్చెను. ఆ వనములోని నా గు ల కు నాయకుఁడు తక్షకుఁడై యుండెను; ఆదిపర్వము న ం ద లి 228 వ యధ్యాయముఁబట్టి, ఈ తక్షకుఁడర్జునుని చేతికిఁ జిక్కలేదు. ఇంద్రుఁడతనికి సాహాయ్యముఁ జేయుచుండెను. ఇందు చేత నాకాశవాణి ద్వారమునఁ జెప్పబడినదేమనఁగా-- 'ఓ యింద్రుడా! నీవెవని రక్షించుటకై ఇంతటి ప్రయత్నముఁ జేయుచున్నావో, ఆనీ మిత్రము నాగరాజు తక్షకుఁడైతే నిచ్చట లేనేలేఁడు. అతఁడిప్పుడు కురుక్షే త్రమునకు వెళ్ళిపోయెను. "దీనిఁబట్టి. నాగనాయకుఁడైన తక్షకుని దండించు కొఱకు నర్జునునికి సంకల్పముండెనని ప్ర క ట న మయ్యెను, కాని యా సమయమున వాఁడు దొరకనేలేదు. వాఁడు తన దేశమును విడిచి కురు క్షేత్రమునకుఁ బోయియుండెను. త రు వా త నతఁడు పంజాబునఁ దక్షశిల

యొద్ద నివసించెనని తెలియుచున్నది. ఈ నాగులతోఁ బాండవులకు ఏవైర మారంభమయ్యెనో, యది తరువాత రెండు మూఁడు తరములవఱకు నుండెను. నాగులు భారతీయ యుద్ధములోఁ బాండవులకుఁ బ్రతికూలముగాఁ గౌరవులకు సహాయులై యుండిరనియూహించుటకై యవకాశమున్నది, ఎందుచేతననఁగా గర్ణునియొక్క యంబుల పొదియందు, ఖాండవ వనదాహమునుండి తప్పించుకొని పాఱిపోయిన యశ్వసేన నామకమైన నాగము బాణమయి కూర్చుండి యుండెను. అర్జునుని మీఁదనీశరము గర్ణుడు ప్రయోగించికూడ నుండెను. కాని గుఱి తప్పిపోయి యది వృథా యయ్యెను. అందుచేత నయ్యది మరల వచ్చి కర్ణుని చెవిలో, నన్ను దిరిగి ప్రయోగింపుమని వచించెను; కాని కర్ణుఁడిందులకు సమ్మతింపలేదు. మహాభారతములోని యీ కథకుఁ జారిత్రక రూపము, నాగులర్జునునికి విరుద్ధముగాఁ గర్ణునికి సహాయతఁ జేసియుండిరను విధమున నీయఁబడ గలదు; కాని దానికిఁ బ్రయోజనమెంతమాత్రమును లేదు. ఖాండవవనమును దహించి యర్జునుఁడు మన దేశమును విడిచి వేసెను. తక్షకుఁ డర్జునుని యొక్క మనుమనినుండి యిందులకుఁ బగఁ దీర్చుకొనెను. తక్షకుఁడు కఱచుటఁబట్టి పరీక్షిత్తునకు దేహాంతమయ్యెనని యే కథయున్నదో దానియొక్క రహస్యమిదియే. మూల భారతీయ యుద్ధము క్రీస్తుకంటె 3000 ఏండ్లకుఁ బూర్వమని విశ్వసింపబడునేని మహాభారతము దానికి 2500–2700 ఏండ్ల పిమ్మటఁ దయారయ్యెను. ఇంతటి తడవు లోపల లోకుల యొక్క కల్పన యందును బుక్కిటిపురాణమందును నాగజాతి ప్రత్యక్షమయిన నాగులు లేక సర్పములై పోయెను. ఇందుకింతయు నాశ్చర్యము లేదు. మహాభారత సమయమందు, నాగులు సర్పములేయై యుండెననియే కల్పన యుండెడిది. అవి యెప్పటి సర్పములవలెఁ బశువులు మాత్రము కాకుండెనని వాటియందొక విశేషత విశ్వసింపఁ బడుచుండెను. వాటియందు దేవాంశముండెను. అవి మనుష్యులవలెనే సంభాషించుచుండెను మఱియు వాటియందు వివిధములైన దైవశక్తులు కూడ నుండెను. ఒకవేళ తక్షకుఁడు గుప్తరూపమునఁ బరీక్షితునియొక్క సభయందుఁ జొచ్చి యతని

యొక్క హత్య చేసి యుండుట నిజమైన సంగతి కావచ్చును. కాని యందు లకు రూపాంతరము, వైరమున బొత్తిగాఁ జిన్నపామై ప్రవేశించి తరువాత నొక్కమాఱుగా జాల పెద్దదియై పరీక్షిత్తుని గఱచెననుట యయ్యెను. దీనితరు వాతి భాగమింత కంటెను జమత్కారములతో నిండియున్నది,జనమేజయుఁడు తన తండ్రి యొక్క మృత్యువునకుగాఁ బగదీర్చుకొనుటకై తక్షకునికి నితర నాగములకును బ్రాయశ్చిత్తము చేయింపఁ దలఁచెను. సమస్తప్రపంచమును జయించిన యోధుల ననుకరించి యతఁడు నాగనాయకుడైన తక్షకునియొక్క దేశమగు తక్షశిలను గెలిచి నాగులను బూర్తిగా నశింపఁజేయుటకు బ్రహ్మాండ మైన పని గావించెను. కాని తరువాత దయాళువును విద్వాంసుడునైన యొకా నొక బ్రహ్మణుల యొక్క యాగ్రహముచేత, జనమేజయుఁడు వాని జోలికి పోక పైగా దక్షకుని సైతము క్షమించెను. నిజమైన కథా భాగమిట్లున్నది. దీనికి మహాభారత కాలము నాటికి సర్పసత్రము యొక్క రూపక మీయఁబడెను ఆదిపర్వమునందు జనమేజయుని విస్తృతమైన సర్పవర్ణన మిదే విధమున నున్నది. కాని సర్పసత్రమనఁగా నేమి? సర్పసత్రము వంటి యే సత్రము యొక్క వర్ణనమును బ్రాహ్మణ గ్రంథమునఁ గాని మఱి యే వైదిక గ్రంథ మునఁగాని కనఁబడకయున్నది; వేయేల మహాభారత వచనముఁ బట్టి, ఈ సర్పసత్రము కేవలము జనమేజయునికొఱకే యుత్పన్నము చేయఁబడి యుండెననియు ఈ సత్రమందు వివిధ జాతులైన సర్పములయాహుతులీయఁ బడియుండెననియుఁ బ్రకటమగుచున్నది, ఋషులు సత్రము నారంభించిరి; ఎంతవేగముతో సర్పములఁ బేర్కొని యగ్నియందు నాహుతులు వ్రేల్పవడి నవో యంత పెద్దపెద్ద సర్పము లగ్నిలోఁబడి భస్మమైపోవ నారంభించెను. చివరఁ దక్షకుని యొక్క పిలుపు అయ్యెను. తక్షకుఁ డింద్రుని యాశ్రమమున నుండెను. పైగా నాసను సుమంను ఆస్తికుఁడు నాగముల పక్షముఁ గైకొని జనమేజయుని బ్రార్థించెను. మఱియు సర్పసత్రము నాపి తక్షకుని కభయ వచనము నిప్పించెను. ఈ కథను బట్టి, నాగులు సయితము మనుష్యులేయై యుండిరనియు నింద్రుని యాశ్రమమందు నివసించుచుండిరనియు దెలియు చున్నది; అనఁగా ఎచ్చట విపులములైన వర్షములు కురియుచుండెడియిటు వంటి యరణ్యములలోనివసించుచుండిరి. వీనిలోననేక భేదములుండెను క్షత్రి యుల యిండ్లలోజాలమంది నాగస్త్రీలుండెడివారు, అర్జునుఁడును ఉలూపి

యను నొక నాగకన్యను వివాహమై యుండెను. నాగులయొక్క ముఖ్య పట్టణము పాతాళమందున్నదనియుఁ బాతాలమును జేరుటకు మార్గము నీటిలోపల నున్నదనియుఁ గల్పనకలదు. కాఁబట్టి, నదియందు స్నానము చేయుచుండఁగా నర్జునుని పాదముఁ బట్టుకొని యులూపి యతనిని బాతాళమునకుఁ దీసికొని పోయెనని వర్ణనమున్నది. ఇదిగాక, ఋషులకనేకులకు నాగకన్యనుండి సంతానము కలిగెనని మహాభారతమందు వర్ణింపఁబడియున్నది. నాగులయొక్క పక్షమును గైకొన్న అస్తికుఁడు, జరత్కారు ఋషికి నాగకన్యనుండియే యుత్పన్నుఁడైన పుత్రుడై యుండెను. ఈయన్ని విషయములమీఁదను నైతిహాసికమే చెప్పవలసి యుండును. ఈదృష్టిచేత విచారింపఁగా, నాగులు అరణ్యములయందు నివసించుచున్న మనుష్యజాతియై యుండుననియు; వారియొక్క రాజైన తక్షకుఁడు ఖాండవవనమందు నివాసియై యుండెను. అక్కడినుండి వెడలగొట్టబడిన కారణముచేత నతఁడు పాండవులకు బద్ధవిరోధియయ్యెను. మఱియును భారతీయ యుద్ధమందుఁ బాండవులఁ దుడిచివేయుటకై యతఁడు కర్ణునికి సహాయకుఁడై యుండెను.

ఇచ్చటఁ గొంచెము వివరించుట యావశ్యకమైయున్నది. అప్పుడు మొదటనే నాగములు సర్పములు ననురెండు భేదములుండి యుండునని తెలియుచున్నది. భగవద్గీతయం దీభేదము లిట్లు చెప్పఁబడి యున్నవి. "సర్పాణా మస్మివాసుకిః, మఱియు "అనంతశ్చాస్మి నాగానాం" అనగా భగవద్గీతా సమయమున లేక భారతకాలమున సర్పములు నాగములనను, రెండు విధముల ప్రజలు హిందుస్థానముననుండిరి సర్పములు సవిషములై యుండెను. అనఁగా ఆర్యులను బీడించుచుండెను. ఇంక నాగములు నిర్విషములై యుండెను, అవి యార్యులతో విరోధింపకుండెను. వారి కనుకూలములై యుండెను. ఇందుచేత, నాగమైన వ్రుటికిని ననంతుఁడు, విష్ణువునకుఁ బరుండుటకై వచ్చెను. కాని, సౌతి సమయమున ఈ భేదము లేదని తెలియుచున్నది. మహాభారతములోని యాస్తీకాఖ్యానమందుఁ బౌషాఖ్యానమందును నీ భేదము కొత్తిగా నగపడదు. ప్రతిస్థానమునను, సర్పము నాగముకూడ నొక్కటియే యైయు

న్నట్లు కనఁబడుచున్నది. మరల, శేషుఁడు లేక యనంతుఁడు మొదలగు నాగములు సర్పాలకంటె భిన్నములై యున్నవని నమ్ముటకవకాశ మున్నది. జనమేజయకృతమైన సత్రమునకుఁ బేరు సర్పసత్రమై యున్నది. యా సర్ప సత్రమందు విషోల్బణములైన సర్పములు దహింప బడి యున్నవి. (అ. అ. 5-7) ఇందు, దహించి భస్మము చేయబడిన సర్పముల నామములు కూడ నీయఁబడి యున్నవి. అవి వాసుకి,తక్ష కుఁడు, ఐరావతుఁడు, ధృతరాష్ట్రుఁడు. వీరికులములవారై యుండిరి. అనంతుఁడు లేక శేషుఁడు వీరి యొక్క కాలములవికావు. ఇదే విధముగా ఈ సర్పములు రెండును వేర్వేఱు చోటుల నివసించుచుండెనని కూడ సూహకలుగుచున్నది. ఆది పర్వములోన మూడవ యధ్యాయమునందు ఉత్తంకుఁడు నాగలోకమునకుఁ జనుదెంచి నాగములయొక్క యేస్తుతిని జేసియున్నాఁడో, దానిఁ బట్టి మహత్త్వముగల సంగతులు తెలియుచున్నవి.

బహూని నాగవేశ్మాని గంగాయాస్తీర ఉత్తరే।
తత్రస్థానపి సంస్తౌమి మహతః పన్నగానిమాన్॥

దీనిఁబట్టి, నాగములు గంగ కుత్తరమునగూఁడ నివసించుచుండెనని తెలియుచున్నది. కురుక్షేత్రమందును మఱియు ఖాండవవనము దహింపఁ బడకముసుపు ఆ వనమందును తక్షకుఁడును అశ్వసేనుఁడును నివసించు చుండిరని కూడఁ తెలియుచున్నది. ఆలోచింపగా సౌతి వీటిని నాగములని చెప్పియున్నాడు. అయినప్పటికిని పైవర్ణనముఁ బట్టి యివి సర్పములని తెలియుచున్నవి. వీనికి సంబంధించిన యీ స్తుతియందు నీ శ్లోకము లున్నవి--

అహమైరావతజ్యేష్ఠం భ్రాతృభ్యోఽకరవం నమః।
యస్యవాసః కురుక్షేత్ర ఖాండవేచాభవత్పురా।
తక్షకశ్చాశ్వసేనశ్చ నిత్యం సహచరా వృభౌ।
కురుక్షేత్రంచ వసతాం నదీమిక్షుమతీమను।

ఇందుఁ దక్షకునికి మఱియు నశ్వమేధమునకు సంబంధము వ్యక్త పడుచున్నది. తక్షకుఁడు నాగరాజని చెప్పఁబడి యున్నాఁడు. అతని యొక్క వర్ణనమిట్లు కనబడుచునున్నది—

అవసద్యో నాగద్యుమ్నిం ప్రార్ధయన్నాగ ముఖ్యతాం ।

ఈయన్ని సంగతులఁబట్టి, తక్షకుడు సర్పము అనఁగా ప్రతికూల జాతిదియై యుండెనని విశ్వసింపవలసియున్నది. అతఁడు మొదట ఖాండవ వనమందు నివసించుచుండెను. అతనికి నాగలోకముయొక్క రాజ్యము మీఁది యిచ్ఛయు గొప్ప మహత్త్వముపై నపేక్షయునుండెను. పాండవులతని ప్రదేశమును జిచ్చుబెట్టి కాళీచేసి వైచిరి. ఈ కారణముచేత వారితోడఁ దక్షకునికి నశ్వసేనునికి శత్రుత్వమయ్యెను. ఆరంభమున నాగులయు సర్పములయు వంశములైతేని యొక్కటియే యైయుండెను కాని జాతులు ప్రత్యేకముగా నుండెనను సంగతిమీఁద ధ్యానముంచవల యును; ఈ సంగతి భగవద్గీతనుండి ప్రకట మగుచున్నది. (ఈ కార ణముచేత నయితము భగవద్గీతా సమయము సౌతియొక్క మహాభార తము కంటే ముందటిదిగా నగపడుచున్నది.)

యుద్ధమందలి శత్రుసేనలయొక్క జనము.

ఇప్పుడు మనము, ఉభయసేనలలోని యార్యు లెవ్వరెవ్వరై యుండిరో యిది చూడవలయును. మఱియు దానిఁబట్టి యేయూహ కలుగుచున్నదో అందుమీఁద విచారింతము. దుర్యోధనునిపై పున ॥ అక్షౌహిణులుండెను. అందునే రాజులుండిరో, ముందుగా వారిని జూడవలయును. దుర్యోధనుని యొక్క దళమందు మొదటివాఁడు శల్యుఁడై యుండెను. ఇతఁడు మద్రదేశాధి పతియై యుండెను. ఇతని రాజ్యము పంజాబులోనిది. రెండవవాడు భగదత్తుఁడు. తూర్పు దిక్కున చీనకిరాతులకు నితఁడొక రాజుగానుండెను మూడవవాడైన భూరిశ్రవుఁడును పంజాబునకే రాజై యుండెను. నాల్గవ వాఁడగు కృతవర్మ భోజభూపాలుఁడై యుండెను, ఈతని రాజ్యము

కాఠియావాడు దగ్గరిది. ఎనఁడు సింధుదేశమునకు రాజో, యాజయద్ర థుఁడై దవవాఁడు. ఆఱవవాఁడైన సుదక్షిణుఁడు, కాంభోజములోని యాఫ్ గనిస్థానమున కధిపతియై యుండెను. ఏడవవాఁడు మాహిష్మతికి సంబం ధించిన నీలుఁడై యుండెను; ఇతఁడు నర్మదా మహేశ్వరమునకు రాజు. ఎనిమిదవవాఁడు తొమ్మిదవవాఁడును అవంతి నరపతులు; పదియవవాఁడు పంజాబుసంబలి కేకయుఁడు; మఱియు 11 వ అక్షౌహిణియందు గాంధారపతియగు శకుని, శిబి మఱియుఁ గోసలేశ్వరుఁడగు బృహద్ర థుఁడు లోనగు వారుండిరి. పాండవులవైపున సాత్యకి యుయుధానుఁడు ద్వారకలోని యాదవుఁడుండెను. రెండవ యతఁడు చేది దేశముయొక్క ధృతకేతుఁడు. యమున యొడ్డునఁ గాన్పూరునకు సమీపమునఁ జేది జనులు నివసించుచుండిరి. మూడవయతఁడు, మగధముయొక్క జయత్సేనుఁడై యుండెను. నాలవయతఁడు, సముద్రతీరముసంబలి పాండ్యుఁడు. అయిదవద్రుప దుఁడు పాంచాలమువాఁడు. గంగాయమునల నడిమి భాగమున అలీగఢు యొక్క చుట్టుప్రక్కల ప్రదేశము పాంచాలములదియై యుండెను. ఆరవ యతఁడు మత్స్యదేశముయొక్క విరటుఁడై యుండెను. జయపురము, ధౌలపురము మొదలగు భాగముల నుండు మత్స్యదేశముండెను ఏడవవారు, పరస్పరము రాజులు—కాశియొక్క ధృష్టకేతుఁడు, చేకితానుఁడు, యుధా మన్యుఁడు ఉత్తమౌజుఁడు మొదలగు రాజలోకము (ఉద్యోగ. అ. 19); ఇట్లు పాండవులవైపున నేడక్షౌహిణులును దుర్యోధనుని వైపునఁ బదునొ కండక్షౌహిణులును నుండెను. ఈ పేరస్తును (నామ పరంపర) బట్టి, మందు వచ్చిన మఱియు వెనుకవచ్చిన యార్యులకు మధ్య భారతీయ యుద్ధము జరిగెను; లేక యుత్తర దక్షిణముల నుండలి యార్యులకుజగడము జరఁగెను; లేక చుట్టుప్రక్కల యార్యులకును మధ్యదేశములోని యార్యు లకును మధ్యదేశములోని యార్యులకునునీ యుద్ధము జరిగెనని యొక గొప్ప యనుమితి బయలుదేరగలదు. దుర్యోధనువైపునఁ గురుక్షేత్రమునుండి పుచ్చుకొని పంజాబులోని గాంధారము, కాంభోజము పర్యంతము అనగా అఫ్గనిస్థానము పర్యంతముగల రాజులందఱును, ఇదే ప్రకారము సింధువు యొక్క రాజలోకము, కాఠియావాడు మఱియవంతి (ఉజ్జయిని) పర్యం తమున్న రాజులును దూర్పుననయోధ్య(కోసలము)అంగము ప్రాగ్జ్యోతిషము

పర్యంతము (కర్ణుడును భగదత్తుఁడును) రాజులు — నుండిరి. ఈ వైపున రెండవదళమందుఁ బాండవుల పక్షమున ఢిల్లీ, మధుర, (శౌరసేని) పాంచాలము, చేదిదేశము, మగధము వెండియుఁ గాశి మొదలైన యమునాతీరము యొక్క గంగాతీరము యొక్కయు మధ్యదేశములలోని రాజులుండిరి. దీనిఁబట్టి, వీరందఱును క్రొత్తగా వచ్చిన చంద్రవంశమువారై యుండిరని చెప్పుటలో నేహానియును లేదు, ఉత్తరపు వైపువారిలో, నందఱి కంటె ముందుగా వచ్చిన చంద్రవంశీయులైన కురువులుండిరి. ఈ రెండు దళముల యందును జాల మతభేదముండి యుండును. ఆ యిరువురియొక్క యాచార విచారముల యందును భేదముండి యుండును, మఱియును వీరి యొక్క భాషాభేదము వర్తమాన భాషలయందుఁగూడ వచ్చియున్నదని ముందే వ్రాయఁబడి యున్నది. ఇదిగాక, మధ్యదేశీయులు చాంద్రపక్షమును మన్నించి యుందురని నమ్ముటకు నాటంకమేమియులేదు. ఆ ప్రజ లీకారణము చేతనే పాండవులలో వచ్చి కలిసియుందురు.

ఆ ప్రజల యందు క్రొత్తజీవన శక్తియు నుత్సాహముకూడఁ జాలి యుండెను. వారి యందు హిందుస్థానము యొక్కమూలనివాసులతోఁ గలిసిపోయి నివసించు ప్రవృత్తి యెక్కువగా నుండెను, ఈ లోకుల యొక్క వర్ణముతో నేచామనచాయ వచ్చెనో, యనిరుద మూలనివాసులతోఁ గలియుటకే కారణమయ్యెను. వారు వైదిక ధర్మాభిమానులుగను నిశ్చితముగనే యార్యజాతి వారుగను నుండుటలో సందేహ మెంతమాత్రమునులేదు.

### హిందుస్థానములో నార్యులున్నారు

కొందఱు లోకులు, హిందుస్థానములోపల నార్యులు బొత్తిగా లేనేరని మిక్కిలియైన యాగ్రహముతోఁ జెప్పుచున్నారు. కాఁబట్టి యిప్పుడిచ్చట హిందుస్థానమునందు నార్యులున్నారో లేరో; మఱియు నీ చంద్రవంశీయు లార్యులై యుండిరోకారో కొంచెము విస్తరముగా విచారింపవలయును. హిందుస్థానమందు నార్యులు మొదటి నుండియుఁ గలరో యిపుడు మాత్రమున్నారేమో యీ విషయమై యిపుడు మనము వేదములనుండియు మహాభారతమును

నుండియుఁ బ్రమాణములఁ జూడవలయును. హిందుస్థానమందార్యజాతివారుండిరని ఋగ్వేదములోని యనేకోల్లేఖములవల్ల స్పష్టమగుచున్నది. వేయునేల యార్య శబ్దము మొదట జాతి వాచకమే యైయుండెను. మరలఁ బిమ్మట నయ్యది స్వభావవాచకమైపోయెను. ఋగ్వేద మందియ్యది జాతివాచకముగనే కనఁబడుచున్నది. మూలనివాసియైన దాసశబ్దమునకు విరుద్ధముగా నీశబ్దము వ్యవహరింపఁబడియున్నది. ఋగ్వేదములోని 10వ మండలము యొక్క 38వ సూక్తమందు 3వ ఋక్కియ్యదియై యున్నది.

"యో నోదాస ఆర్యో వా పురుష్టుతా।
దేవ ఇన్ద్ర యుధయే చికేతతి॥"

అర్థము—"ఓయి యింద్రా! ఎవఁడు మనతో యుద్ధముఁ జేయనభిలషించుచున్నాఁడో, వాఁడు దాసుఁడు కానిమ్ము. ఆర్యుఁడు కానిమ్ము, అదేవుడు కానిమ్ము, ఈ వాక్యమందు మూఁడు జాతుల యుల్లేఖమున్నది. దాసుఁడు ఆర్యుఁడు, అదేవుఁడు ఆర్యులనఁగా హిందుస్థానమునకు వచ్చిన యార్యులు వాసులిచ్చటి (మూల) నివాసులు; అదేవులనఁగా నసురులు; అనఁగా జెండావేస్త అనెడు పారసీకుల ధర్మగ్రంథమునందు వర్ణింపఁబడ్డ పారసీకులు (ఎవరితో వేఱుపడి హిందూస్థానార్యులిచ్చటికి వచ్చి యుండిరో వారు). సాయనాచార్యుని కాలమున ఆర్యశబ్దమునకు వంశవాచిత్వకల్పన నష్టమై పోయియుండెను. మరిఅతఁడు ఆర్యశబ్దమున కర్థము త్రైవర్ణికులు అనఁగా బ్రాహ్మణులు, క్షత్రియులుమరియు వైశ్యులనియే చేసియున్నాఁడు. దీనియొక్క తాత్పర్యము కూడ నిట్లె సిద్ధించుచున్నది. వైదికకాలమందు ఆర్యులకును దాసులకును పరస్పర విరోధ ముండెను. బ్రాహ్మణకాలమందును విరోధ ముండియుండెను. పదపడి మెల్ల మెల్లగా శూద్రులలోపల దాసులకు సంతర్భావ మేర్పడెను; ఈకారణముచేత ఇతఁడార్యుఁడు వీఁడు దాసుఁడు అను నిట్టి విరోధము లేకుండెను. తిరిగి యిప్పు డార్య మ్లేచ్ఛ భేద ముత్పన్నమయ్యెను. వీరు వేర్వేరు జాతులయియున్నారని లోకు లూహింపనారంభించిరి, అయినను మహాభారతమందుమాత్రము ఆర్యశబ్దము విశేష జాతివాచకమై విశ్వసింపబడుచుండెను. హిందుస్థానమందలి వేర్వేరు జనులను గణించునపుడు ఆర్య, మ్లేచ్ఛ, మిశ్ర భేదములు మూటియొక్క వర్ణనము మహాభారతమందు గలదు.

ఆర్యా మ్లేచ్ఛాశ్చ కౌరవ్య సౌర్మిత్రాః
పురుషా విభో॥ (భీష్మ 9-113)

ఇదేప్రకారమే సమయమున నర్జునుఁడు అశ్వమేధావసరమున దిగ్విజయముఁ గావించెనో, యా సమయమున ననేక రాజులు విరోధించియుండిరి. ఆ విరోధులలో మ్లేచ్ఛులు నార్యులని రెండు శ్రేణుల రాజులుసుండిరి. (అశ్వ అ. 73).

మ్లేచ్ఛాశ్చాన్యే బహువిధాః పూర్వంయే నికృతా రణే
ఆర్యాశ్చ పృథివీపాలాః ప్రహృష్టా నరవాహనాః
సమీయుః పాండుపుత్రేణ బహవో యుద్ధదుర్మదాః॥

దీనినిబట్టి సికందరునకుఁ బిమ్మటిపటికు మహాభారతకాల పర్యంతము హిందుస్థానములోని కొందఱురాజులు తమ్ము ఆర్యులమని చెప్పుకొనుచున్నారు మరికొందరు మ్లేచ్ఛులని విశ్వసింపబడుచుండిరి. హిందుస్థాన మండలి లోకుల యొక్క పేరస్తు భీష్మపర్వములో నున్నది. అందును గొందఱు మ్లేచ్ఛ రాజుల యొక్క స్పష్టమైన యుల్లేఖము కలదు. దీనిబట్టి ఆర్యనామ మిప్పటిదాఁక జాతివాచకమై యుండెనని ప్రకటమగుచున్నది. ఆర్యావర్త శబ్దముయొక్క యుపయోగము హిమాలయ వింధ్య పర్వతములనడుమ ప్రదేశమునకై చేయఁబడుచున్నది. ఆర్యశబ్దముచేతఁ గేవలము జాతియొక్కయే భేదము చూపఁబడియుండదు. ఇఁకనేమనగా భాషాభేదముకూడఁ జూపఁబడుచుండెను. మహాభారతములో నొకచోటఁ "నార్యా మ్లేచ్ఛన్తి భాషాభిః". అని చెప్పబడియున్నది. ఈ వాక్యమునకు, భాష మాటాడుటలో మ్లేచ్ఛువలె నార్యులు పొరవడరని తాత్పర్యము మహాభారత కాలమందు నార్యశబ్దము జాతివాచకమై యుండెను. మఱియును మ్లేచ్ఛవిరుద్ధమైన యర్థమున వ్యవహరింపఁబడు చుండెను. మను స్మృతిలో నీభేదమిప్పటికిఁగూడ నున్నది. ఈ స్మృతియందును నార్య శబ్దము జాతివాచకమైయున్నది. మఱియు నాసమయమున లోకులు, హిందుస్థానముననే చాతుర్వర్ణ్యేతరులు కలరో, వారార్యులుకాఁని చెప్పుచుం

డిరి, భీష్మపర్వములోని దేశగణనయందు హిందుస్థానములోని యార్యదేశము లేవేవియో చెప్పఁబడపయ్యెను. అయినను నుత్తరమునఁ బంజాబు మొదలు కొని యంగవంగ దేశముల వఱకును దక్షిణమున అపరాంతదేశము వఱకును నార్యులు వ్యాపించియుందురు; ఆ సీమకు బయట మ్లేచ్ఛులయొక్క నివాసస్థానములుండునని తెలియుచున్నది. మ్లేచ్ఛులును మఱియు వేద బాహ్యులును నగు లోకులయందు అంగము, వంగము, కాలింగము మఱియు అంధ్రము ఈ దేశముల యొక్కయు గణన చేయఁబడి యున్నది. యవనులు, చీనులు, కాంభోజులు, హూణులు, పారసీకులు మొదలైనవారు దరదులు, కాశ్మీరులు, ఖసీరులు. పహ్లవులు మొదలైన యితర మ్లేచ్ఛులు నుత్తరపు వైపున జెప్పబడియున్నారు. ఈ వర్ణనముఁ బట్టి, మహాభారత కాలమున ఎవరెవరు మ్లేచ్ఛులని చెప్పబడుచున్నారో చక్కఁగా దెలియుచున్నది మఱియు నీ కారణముచేతనే హిమాలయమునకును వింధ్యమునకును మధ్య దేశములోఆర్యావర్తము చెప్పఁబడుచుండెను. దీనికి వెలుపలఁగూడ నార్యులుండిరి. వారు సంస్కృతభాషకూడ మాటాడుచుండిరి. మరల వేదాక్షర బాహ్యులగుటచేత వారు మ్లేచ్ఛులని చెప్పబడుచుండిరి. మనుస్మృతిలో వారిగణన దస్యులయందుఁ జేయబడియున్నది. ఈయనుమానము ఈ శ్లోకముఁబట్టి యుదయించుచున్నది--

> ముఖబాహోరుపజ్జానాం యాః లోకే
> జాతయో బహిః। మ్లేచ్ఛవాచ ఆర్యవాచః
> సర్వేతే దస్యవః స్మృతాః ॥

భారతీయ యుద్ధ సమయమున హిందుస్థానార్యుల నివాసస్థానమిట్లే యుండెనని విశ్వసించుటలో క్షతియేమియును లేదు. బ్రాహ్మణ గ్రంథములయందుఁ గురుపులయుఁ బాంచాలురయందు కోసలులయు, వైదేహులయు విషయమున నెడతెగని వర్ణనములు లభించుచున్నవి, అనఁగా దూర్పుదిక్కునను గంగకు నుత్తరమునను అంగదేశము వఱకు నార్యులయొక్క నివాసస్థానముండెను. శౌరసేనము, చేది, మగధము ఈ మూటియొక్క నామములు బ్రాహ్మణములయందు లేకున్నవి. శౌరసేనచేది మగధ

ప్రజలు ఆ సమయమున ఒడ్డున వ్యాపించి యుండిరను సంగతి మరల విశ్వసింపఁబడఁగలదు. మత్స్యములపేరు ఋగ్వేదమందును గలదు. శ్రీ కృష్ణునియొక్క కథ యుద్ధకాలికమని నిశ్చయింపఁబడు నెడల కాఠియావాడు ద్వారక వఱకు నార్యులయొక్క గ్రామముల వరుస యుండవలయును వేదమునందు సముద్ర వర్ణనము చాలఁగలదు. అనఁగా వైదిక ఋషులకు సింధు, కాఠియావాడు మొదలైన వాటియొక్క స్థితి తెలిసియుండును. పంజాబు నందైతేని యార్యులయొక్క ముఖ్య నివాసస్థానముండెను. మొట్ట మొదట వారచ్చటనే నివసించిరి. అందుచేత, పంజాబు మొదలుకొని కాఠియావాడు దాఁక తూర్పున విదేహము వఱక నార్యులు వ్యాపించియుండిరి; మఱియు నీ దేశములయందున్న వారియొక్క నామమార్యులై యున్నది. దీనిఁబట్టి హింసు స్థానమున నార్యులయొక్క నివాసము ప్రకట మగుచున్నది.

## శీర్షమాపన శాస్త్రముయొక్క ప్రమాణము

దీనిబట్టి, పీరిజాతివారు కారను సంగతులు పరీక్షింపఁబడుచున్నవో, ఇటువంటి శీర్షమాపన శాస్త్రమొకటి నవీనముగా నుత్పన్నమయ్యెను. ఈ శాస్త్రమును బట్టి విశేషించి, వీరార్యజాతివారు వీరు కారను సంగతులు నిశ్చయింపఁబడఁగలవు ప్రపంచమునిండ నెంత మందిమనుష్యులున్నారో వారు విశేషించి నాలుగు జాతులుగా మన్నింపబడుచున్నారు. ఆర్యులు, మంగోలియనులు, ద్రవిడులు. నీగ్రోలు, వీరిలో సాధారణ విధమున నార్యులు తెలుపురంగు గలవారు పైవారుగను నున్నారు. మంగోలియనులయొక్క యెత్తు నడిమిదిగను రంగు పసుపుపచ్చనిదిగను నున్నది. ద్రావిడులు శ్యామవర్ణము గలవారుగను ఎత్తున మధ్యములుగను నున్నారు. నీగ్రోలు ఎత్తుగా నల్లనివారుగ నున్నారు. రంగుయొక్కయు నెత్తుయొక్కయు వేఱు పరిమాణములకంటెఁ దలయొక్కయు ముక్కుయొక్కయుఁ గొలఁతకు శీర్షమాపనశాస్త్రము మహత్త్వమిచ్చి యున్నది. మఱియు, ఈ కొలఁత యొక్క యాధారముమీఁద వేర్వేఱు జాతులకుఁ డఱచు నిశ్చితమైన లక్షణ మగుచున్నది. ఆర్యులయొక్క నాసిక విశేషముగానున్నతమును దీర్ఘము

నగుచున్నదనియు వైశాల్యముకంటె వారి శిరస్సుకూడ దైర్ఘ్యము కలద దనియు ననేకార్యజాతులను బోల్చి నిశ్చయము చేయఁబడియున్నది. సం 1901 యొక్క మనుష్య గణనా (జనాభాలెక్క) సమయమున సర్ హర్బర్టు రిస్లేయొక్క సూచనఁబట్టి హిందుస్థానములోఁ దఱచుగా నన్ని ప్రాంతముల యందును గొందఱ పరిమాణములు శీర్షమాపన శాస్త్రము ననుసరించి తీసి కొనఁబడి యుండెను. ఆ పరిమాణములబట్టి రిస్లే మహాశయుఁడు, హిందు స్థానముయొక్క భిన్నభిన్న ప్రాంతము లందున్న యార్య జాతివారికి నేభేద ములు కానిపించుచున్నవో, వాటి యొక్క కల్పన యేడు విభాగములయందు జేయఁబడఁ గలదని యీ సిద్ధాంతమును ప్రకటించెను. (1) పంజాబు. కాశ్మీ రము, రాజపుతానా ఈ మూడింటి యందును విశేషించి యుండఱును ఆర్య జాతి వారై యున్నారు. (2) సంయుక్త ప్రదేశము, బీహారు ఈ రెండు చోట్లను నెవరున్నారో, వారు ఆర్యులయు ద్రవిడులయు మిశ్రసంతాతివారై యున్నారు. (3) బంగాళము యొక్కయు ఒరిస్సా యొక్కయు ప్రజలు మంగోలియను జాతివారును ద్రవిడియను జాతి వారునై యున్నారు. కాని పైవర్ణమునందుఁ గొంత యార్య జాతియుఁ గనఁబడుచున్నది. (4) సిలోను మొదలుకొని సమస్తమైన మద్రమండలముయొక్క. మఱియు హైదరాబాదు, మధ్యప్రదేశము అట్లు దిన్న నాగపురము యొక్క నివాసులు ద్రవిడ జాతి వారై యున్నారు. (5) పడమటి వైపున హిందుస్థానము యొక్క కొనను గుజరాతు, మహారాష్ట్రము, కోంకణము మఱియు కూర్గ వఱకు ద్రవిడశక జాతులు రెండింటి యొక్క మిశ్రణము అయియున్నది. మిగిలిన రెండు భాగములు పడమటివైపున బెలూచిస్థానము తూర్పునఅస్సాం, బ్రహ్మదేశము అయియున్నవి. వీటి యందు క్రమముగా ఈరానులు మఱియు మంగోలి యను జాతివారు గలరు. కాని వీరు హిందుస్థానమునకు వెలుపలనున్నారు; కాఁబట్టి వారితోడ మనకేమాత్రము ప్రయోజనములేదు. పైఅయిదు భాగముల ప్రజల యొక్క యేవర్ణనను చేయఁబడి యున్నదో, దానికి మైత్రియనే కాంశముల యందు, (ఒక భాగమును విడిచి) ఏవి వైదిక సాహిత్యమునుండి యును మహాభారతము నుండియు సిద్ధించి యున్నవో, ఆ యనుమానములతో బక్కఁగా గలసిమెలసి యున్నవి. ఇపుడిచ్చటినిదే విషయము విచారింపఁ బడును.

వేదము యొక్క యనేక భాషాంతరీకరణములఁ బట్టి, పంజాబు నందును రాజపుతానా యందును ఆర్యులు మొట్టమొదట నివసించి యుండిరనియు ముందు చెప్పఁబడి యున్నది. ఋగ్వేదమందు భరతుల నామము కనఁబడు చున్నది. వీరు మొట్టమొదట వచ్చిన యార్యులై యున్నారు. మఱియు ప్రస్తుత సమయమున సూర్యవంశ్యులుగా విశ్వసింపఁబడుచున్నారు. వీరికి ముఖ్య ఋషులు వసిష్ఠుఁడు, విశ్వామిత్రుఁడు, భరద్వాజుఁడు మొదలుగా నుండిరి. వీరిలో భారత కాలికులైన ముఖ్యులు మద్రులు, కేకయులు, గాంధారులునై యుండిరి. వీరు తెల్లని వారుగను మంచి యాకారము కలవారుగను నుండెడివారు. మధ్యదేశ క్షత్రియులు విశేషించి వీరి పిల్లలను వివాహమాడు చుండెడివారని తెలియుచున్నది. ఈ కారణముచేతనే పాండురాజునకొక భార్య మాద్రి కూడనై యుండెను. పంజాబు నందలి యార్యులు మొదట వచ్చిన యార్యులై యుండిరని సారాంశము. వారు తెల్లనివారును మంచియాకృతి గలవారై యుండిరి. లోకమాన్యుఁడయిన తిలకు తన గ్రంథము ఆర్టిక్ హూమ్ ఇన్ ది వేదాస్, నందుఁ బెక్కు ప్రమాణముల నిచ్చి, భారతీయార్యులు ఉత్తర ధ్రువప్రదేశము విడిచి దక్షిణమునకు వచ్చునపుడు, ఈరానులతో లేక యసురులతో జగడమాడిరనియు, తరువాత వారు హిందుస్థానములోని పంజాబునకు వచ్చిరనియు మఱియు నిచ్చట వారు క్రీస్తు కంటె దాదాపు 4000 సంవత్సరాల పూర్వము నివసించిరనియు సిద్ధము చేసియున్నాఁడు ఈ విషయము యొక్క వర్ణనము ఈరానుల యొక్క వేందిదాద్, నామకమగు ధర్మగ్రంథమున నున్నదని లోకమాన్య తిలకు ప్రపంచమునకుఁ బ్రకటించియున్నాడు. ఆ గ్రంథమునఁ జెప్పఁబడియున్నది. "ఆర్యులు సప్తసింధువున అనఁగా పంజాబు నందు గ్రామముల నిర్మించిరి. కాని వీరిని బీడించుటకై సైతాను పిశాచము, కడుఁ బ్రచండమైనధూపములను మఱియు సర్పములను బుట్టించెను, సప్తసింధువులనఁగా పంజాబులోని యైదు నదులు మరియు సింధువు అట్లు ఉభయునై యున్నది. ఋగ్వేదములో నీయేడు నదుల నామములు పెదతెగక వచుచున్నవి. ఈ సింధువుల వర్ణనముఁ బట్టియు మహాభారత జనులవర్ణనలఁ బట్టియు, పంజాబు నందును సమీపముననే యున్న కాశ్మీరమందును అట్లు రాజపుతానాయందును తెల్లనివారు మంచి యాకృతి గలవారునగునార్యుల యొక్క యెక్కువ జనసంఖ్య యుండెనని సిద్ధించుచున్నది. ఇందు మూల

నివాసులైన దస్యువులు కొలదిగ నుండియుందురు. ఆర్యులు వచ్చుటచేత వారు మెల్ల మెల్లగా దక్షిణమునకుఁ దొలఁగియుందురు. ఈ ద్రవిడజాతీయులయొక్క నివాసస్థానము దక్షిణమందే యుండెను. ఉత్తరపుపైపు నుండి యార్యులెంతెంత మందివచ్చుచుండిరో, అంతంతమంది యీ మూలనివాసులును దక్షిణపుపైపునకుఁ దొలఁగుచుండిరి. మీఁదఁజేయఁబడిన విభాగముఁబట్టి, ఆ లోకులయొక్క విశేషసంఖ్య యిప్పుడును దక్షిణభాగమునందే యున్నదను సంగతి తెలియుచున్నది, శీర్షమాపన శాస్త్రము ననుసరించి యీద్రవిడులయందు ముఖ్యమైన విశేషత, వారియొక్క ఘ్రాణము వెడల్పుగా నుండుట యగుచున్నది. వారియొక్క శిరస్సు మాత్రము ఆర్యజాతి వారికి వలెనే పొడవుగనే యుండును, కాని వెడల్పుగల ముక్కు వారికి విశేషలక్షణమై యున్నది. దానియందు మనము ధ్యానముంచవలయును. ఆశ్చర్యవిషయమేమనఁగా ద్రావిడులయొక్క యీ విశేషత్వము మీఁద నార్యఋషులయొక్క దృష్టి పడియుండెను. వారు వేదమునందుఁ జాలచోటులను దస్యువులు నిర్నాసికులు, అని వర్ణనము చేసియున్నారు. పంజాబులోని దస్యువులు మెల్ల మెల్లగా వెనుకకు దొలగిరి. మఱియును ఋగ్వేద కాలమునుండి నేఁటి వఱకు పంజాబులో నెక్కువ మంది యార్యజాతివారై యున్నారు; రంగు వారిది యిప్పుడును తెల్లగాను ముక్కు ఎత్తుగను నున్నది. పంజాబుయొక్క నేల మిక్కిలి ఫలవంతమై యుండెను, ఇందుచేత బ్రాహ్మణులు, క్షత్రియులు మఱియు వైశ్యులు లేక కృషి చేయుచున్న రయితులు మొదలైన వారియొక్క సంఖ్య యెంతయు వృద్ధి నొందెను. ఈ కారణమునఁ బ్రస్తుతకాలమున శూద్రులని విశ్వసింపఁబడుచున్న, సంజాబులోని జాటు (ఒక హిందూజాతి) మొదలగు జాతులు నిజమైన యార్యులై యున్నారు. ఇపుడు మనము రెండవ భాగము విషయమై విచారించుచున్నారము.

రిస్లేమహాశయుఁడు రెండవభాగమందు సంయుక్త ప్రదేశమును బీహారును విశ్వసించియున్నాఁడు. ఈ రెండు ప్రాంతములయందును మిశ్రజాతి వారైన యార్యులున్నారని యతఁడు చెప్పుచున్నాఁడు. బీహారు ప్రాంతము వైదిక కాలికమైన విదేహమై యున్నది. కోసలమై యున్నది యయోధ్య.

బ్రాహ్మణగ్రంథములలో కోసలము. విదేహము ప్రసిద్ధములై యున్నవి. కోసలవిదేహములు రామాయణ కథా భాగమునకు ముఖ్యప్రదేశములై యున్నవి. ఈ ప్రదేశములయందలి నివాసులు సూర్యవంశ క్షత్రియులై యున్నారు. పంజాబుతో వారికి సంబంధము కలదు. అచ్చటి సంస్కృతోత్పన్నములైన వర్తమాన దేశభాషలం బట్టియు నీ విషయము ప్రకటమగుచున్నది. ఈ రెండు రాజధానులలోని మనుష్యులును మిశ్రితజాతివారగుటేని యాశ్చర్యమేమియులేదు. అయోధ్య మొదటి నుండియే స్వతంత్రమై యున్నది. ఇపుడు మిగిలిన సంయుక్త ప్రదేశముయొక్క విచారము చేయంబడుచున్నది. ఈ ప్రదేశమందు విశేషించి చంద్రవంశీయ క్షత్రియులయొక్కయు మఱియు బ్రాహ్మణులయొక్కయు నివాసస్థానమున్నది. ఋగ్వేద వర్ణనముం బట్టికూడ. చంద్రవంశీయులు మొదట సరస్వతీ తీరమునను గంగాతీరముననను నివసించియుండిరి. కురు పాంచాలములు బ్రాహ్మణగ్రంథములకు ముఖ్యదేశములై యుండెను, బ్రాహ్మణ గ్రంథములంబట్టి ఈ లోకులయొక్క యాచార విచారములు కొంచెము భిన్నములై యుండెననియు వైదిక ధర్మముయొక్క పూర్ణమైన యుత్కర్షము సరస్వతీ తీరమునం గురుక్షేత్రమందు నయ్యెననియుం దెలియుచున్నది. సరస్వతీ దృషద్వతీ నదుల మధ్యనున్న యల్పప్రదేశమే ముఖ్యమగు నార్యావర్తమై యున్నది. దీనిని లోకులు వైదిక ధర్మమునకు ముఖ్య స్థానమని విశ్వసించు చుండిరి. ఈ భాగము నందలి లోకులు పంజాబు నివాసులైన యార్యులకంటె మిగులంజక్కని వారుగను విశుద్ధాచరణముగల వారుగను సూహింపఁబడు చున్నారు. ఏ విధముగా వర్తమాన సమయమున మహారాష్ట్రము (దక్కను) నందు పూనాప్రాంతము భాష, నాగరకత ఆచారము మఱియు ధర్మశాస్త్రము మొదలైనవాటి విషయమున ముఖ్యమైనదిగా మన్నింపఁబడుచున్నవో, అదే విధముగాం బ్రాచీన సమయమందు వైదిక సభ్యతకును కేంద్రస్థానము కురుక్షేత్రమని మన్నింపఁబడు చుండెను. బ్రాహ్మణ కాలము మొదలుకొని మహాభారత కాలము పర్యంతము సౌతి యొక్క సమయము వఱకు, కురుక్షేత్ర ప్రాంతము నందలి యార్యులకంటెం బంజాబులోని యార్యులు తక్కువ నాగరకులై యుండిరనియు వారియొక్క యాచరణము కూడంగొంచెము పరిశుద్ధమై యుండెదనియుం గల్పన

యుండెను. ఇందులకుఁ బ్రశస్తమైన యుదాహరణము శల్యునియుఁ గర్ణు నియు సంభాషణమందు దొరకుచున్నది. ఇది మహాభారతములోఁ గర్ణ పర్వ మున నున్నది. కర్ణుఁడు చెప్పుచున్నాడు "మద్రదేశమువారు అధములై యున్నారు. మరియుఁ గుత్సిత భాషణములను జేయుచున్నారు. మద్ర దేశములోని పితృపుత్ర ప్రభృతులు, అందఱు సహచరులును, అతిథులును, దాసదాసీవర్గము మొదలగు వారొక చోటఁ గలిసి భోజనము చేయుచున్నారు. అచ్చటి స్త్రీలు పురుషులతోఁ దమయిచ్ఛ వచ్చినట్లు సహవాసముఁ జేయు చున్నారు. ఆ దేశము నందు ధర్మబుద్ధి బొత్తిగా లేకున్నది. మద్రదేశములో నాచారమునకు విధి నిషేధములు లేకున్నవి; అచ్చట, ఏ కార్యము చేయఁ దగునో యేది చేయఁదగదో యీ విషయమై, విచారములేదు. స్త్రీలుమద్యము యొక్క మత్తులో మునిఁగి యుందురు," ఈ ప్రకారముగాఁ గర్ణుఁడు శల్యుని మిక్కిలి నిందించియున్నాఁడు. ఆలోచించిచూడఁగా నిందులో నతిశయోక్తి లేదు, పంజాబు నివాసుల యొక్క యాచార విచారములు కురుక్షేత్ర నివా సుల కంటెఁ దక్కువ తరగతివై యుండెనని కూడ స్పష్టపడుచున్నది. క్రీస్తు కన్నఁ గొంచె మించుమించుగా మూడువేలన్నర (౩౫౦౦) ఏడునకు బూర్వము చంద్రవంశీయులు కురుక్షేత్రమందు ఉత్తర దక్షిణముల విశేషించి యున్నటు వంటి యయోధ్యను వదలి సమస్త సంయుక్త ప్రదేశమందును వ్యాపించిరి; అనఁగా బుందేల్ఖండము, అగ్రా, మధుర, కాన్పూరు, ప్రయోగ మొదలైనని వాటి యందు వారి యొక్క గ్రామము లయ్యెను. భారతీయ యుద్ధసమయ మున వీరు మిగుల నౌన్నత్యమును జూపుచుండిరి. మరియు వీరు వైదిక ధర్మమునకుఁ బూర్ణమైన యౌన్నత్యమును గావించిరి. వీరు పూర్వముగా నార్యజాతి వారై యుందురు. ఇచ్చటఁ బ్రస్తుతమున నార్యజాతి వారే వీరు న్నారో వారెట్లు త్వన్నులై రని యిపుడు ప్రశ్నము కలుగుచున్నది। కాఁబట్టి యిపుడు దీనిని విచారించుచున్నారము. కాని, ఈ చంద్రవంశీయులు సూర్య వంశ క్షత్రియుల కంటెఁ గొంచెము. వేఱైయుందురని జ్ఞప్తియుంచు కొనవల యును. వీరియొక్క వర్ణము కొంచెము కొంచెము శ్యామమై యుండెను. అయితే, ఇచ్చటి యధికోష్ణమైన వాయువు కారణముగా వీరియొక్క వర్ణ రూపము మారియుండును. అపుడు పంజాబు యొక్క గాలి కూడనుషమేయై యున్నదని చెప్పఁబడును. మల్లవిద్య మీఁద వీరికిఁ జాలప్రేమ యుండెడిదని

ముందు వ్రాయఁబడియున్నది! ఆ యీ విశేషత్వము వీరి వంశజుల యందుఁ బ్రస్తుతము సైతము చూడఁబడుచున్నది. వీరిలో ద్రావిడజాతియొక్క మిశ్రణమెట్లయ్యెను? హిమాలయమునుండి గంగయొక్క యిరుకైన కొండ లోయలవెంటఁ బడి బాత్రితోవను వచ్చియుండిరి. ఈ కారణముచేత వీరియందు స్త్రీలు బొత్తిగాఁ దక్కువ యుండిరని యీ సందర్భమునఁ జెప్పబడి యున్నది. కాని హిందుస్థానమునకు వచ్చిన పిమ్మట వీరు ద్రవిడజాతిలోని పిల్లలను పెండ్లి యాడుటకుఁ గొంచెమేని సంకోచపడరైరి. ఈ కారణముచేతనే గంగా యమునా ప్రాంతములలోఁ బ్రస్తుత సమయముననే నివాసస్థానమున్నదో, అందు ద్రవిడ జాతియొక్క మిశ్రణము అయియున్నది. ఈ కల్పనయొక్క యంకురము మహాభారత ములో ననేక కథలయందు దొరుకుచున్నది.

యుక్త ప్రదేశములోని మిశ్రితులైన నేఁటి యాద్యులు.

ఏ ప్రదేశమందు గంగా యమునలు ప్రవహించుచున్నవో, అందు మొదట ద్రవిడ జాతియొక్క గ్రామముండెను. ఆ ద్రవిడులు నాగవంశీయులై యుందురు. యమున యొడ్డునఁ దక్షకనాగము నివసించుచుండెననియు దాని నర్జునుఁడు వరంపెత్తించి యుండెననియు వ్రాయఁబడియున్నది. ఇటువంటిదే యొకనాగము యమున యొడ్డున యమునదగ్గర నివసించుచుండెను. దానిని శ్రీ కృష్ణుఁడు జయించి వెడలగొట్టెను. కాళియుని ప్రసిద్ధ కథయొక్క యైతిహాసిక స్వరూపము ఐతిహాసిక రీతినిబట్టి ఇట్లే విశ్వసింపవలసి యున్నది. ఇంతకంటెను దక్షిణమున వసురాజైన యుపచరుఁడు చేది రాజ్యమును స్థాపించియుండెను. అతని కథయు నిట్లే తెలియుచున్నది. అగుఁగాక; దీనిఁబట్టి గంగా యమునా ప్రదేశమందు నాగజాతివారు చాలమంది యుండిరని ప్రకటమగుచున్నది, నాకకన్యయైన యులూపి గంగా తీరపుదియై యుండెను; అది యర్జునుని వివాహమాడి యుండెను. శ్రీ కృష్ణునికిఁ జాలమంది రాణులుండిరి. వారిలోఁ గొందఱు నాగకన్యలు కూడఁ గలరు. శంతనురాజు నిషాదకన్యయగు మత్స్యగంధిని వివాహము చేసికొని యుండెను. ఈ మత్స్యగంధముయొక్క గర్భమునుండి పరాశర

ముని వలన వ్యాసమహర్షి యుత్పన్నుఁడై యుండెను. ఒక నాగకన్య గర్భమునుండి జరత్కారు ఋషివల్ల ఆస్తీకుఁడు అయియుండెను. నాగ కన్యకలను వివాహమైనందులకు మహాభారతములో నుదాహరణము లనేక మున్నవని సారాంశము. దీనిబట్టి భారతీయ యుద్ధకాలమందుఁ జంద్ర వంశార్యులయు నాగలోకులయుఁ గలయిక యయిపోయెనని (కలగా పులగామయ్యెనని) కల్పన యుత్పన్నమైనది. ఈ మిశ్రణముచేత వర్ణము నందు భేదము తటస్థించెను మఱియు నార్యులకు శ్యామవర్ణమయిపోయి యుండును. కృష్ణద్వైపాయనుఁడు, శ్రీ కృష్ణార్జునులు మఱియు ద్రౌపది వీరి కృష్ణ వర్ణము యొక్కయుల్లేఖమున్నది. కొందఱి శిరస్సుల గొలిచియీ యనుమితి చేయఁబడియున్నది. శీర్షమునకు మధ్య పరిమాణముండుట చేత నిచ్చటి ద్రవిడ జాతి యొక్క యేజనులు మద్రరాష్ట్ర మందున్నారో, వారి శిరః పరిమాణము పెద్దదైయున్నది. పొడవు కాదని సిద్ధించుననియే రిస్లేమహా శయుని వాదము. శీర్షమాపనశాస్త్రము నెఱింగిన వారు మొత్తము ద్రవిడుల యొక్క శిరస్సు పొడపై యున్నదని స్థిరపఱిచిరి. ఈ సంగతి రిస్లే మహా శయుఁడును మన్నించి యున్నాఁడు. తరువాత రెండవసమూహములోని యే యార్యులు హిందుస్థానమునకు వచ్చిరో, వారి యొక్క శిరస్సు పొడవై యుండెను మఱియు నెవరితో వారియొక్క మిశ్రణమగుట సమ్మఁబడి యున్నదో, అ ద్రవిడ జాతి వారి శిరము సైతము పొడవై యుండెను. ఇట్టి స్థితియందు ద్రవిడ జాతీయుల మిశ్రణము చేత నుత్పన్నులైనలోకులశిరస్సు యొక్క పరిమాణము మధ్యస్థమెట్లు కాఁగలదు? రిస్లే మహాశయునిపై సిద్ధాంతము మీఁద నీ గొప్ప యాక్షేపము ఒకటి యున్నది. ఇపుడీ యాక్షేప మును నిరాకరింపవలయును.

భారతీయ యుద్ధ కాలమందుఁ జంద్రవంశీ యార్యుల యొక్క యెన్ని రాజ్యములు స్థాపితములై యుండెనో, వాటి యందు కాఠియావాడుకు సంబంధించిన ద్వారకయున్న శ్రీకృష్ణ స్థానముముఖ్యమై యున్నది. ఇద్యది యాదవుల యొక్క నివాసమయి యుండెను, మరియు నీస్థానమందే దాశార్హ నామకులైన లోకులు నివసించి యుండుటయు నుల్లేఖింపఁబడియున్నది.

అవంతి దేశమందును జంద్రవంశీ యార్యుల నివాసస్థానముండెను. అచ్చట ఉజ్జయినీ నగరము యొక్క స్థాపనయు నైయుండెను. ఈ నగరము పురాతనమై యున్నది. మరియు సప్తనగరములలో ద్వారకతోడిపాటుగనే పవిత్రముగా నెంచఁబడియున్నది. ఉజ్జయినికి శ్రీకృష్ణుడు విద్యాభ్యాసమునకై వెళ్లి యుండెనని యాఖ్యాయిక యున్నది. విదర్భ యందు భోజులయొక్క రాజ్యము స్థిరమై యుండెను. రుక్మిణి విదర్భభోజుని కూతురు విదర్భ, మాల్వా మఱియు కాఠియావాడు అట్లు గుజరాతు ప్రదేశమునఁ జంద్రవంశీ యార్యుల నివాసస్థానమై యుండెననియు భారతీయ యుద్ధ సమయమున నీ ప్రదేశములు ప్రసిద్ధములై యుండెననియు సారాంశమై యున్నది. ఈ దేశమందున్న వారి యొక్క శిరస్సుల పరిమాణము మధ్యమముకాదు, వెడల్పై యున్నది. ఇది యెందుకనఁగా రిస్లే మహాశయుని పై సిద్ధాంతము మీఁద నియ్యది మఱియొక గొప్పయాక్షేపమై యున్నది. ఇపుడీ రెండు అక్షేపములను బూర్వపక్షము చేయుపలయును. దక్షిణమున మహారాష్ట్రాది దేశముల యందును నార్యులు వ్యాపించియున్నారు. సహ్యపర్వతము యొక్క సమభూమియందు నార్యుల యొక్క రాజ్యములు అనేకముండెననియు నీ రాజ్యముల యొక్క స్థాపనను నలుగురు నాగకన్యల గర్భము నుండి యుత్పన్నులైన యదువు యొక్క నలుగురు కుమారులు చేసి యుండిరనియు హరివంశములోఁ జెప్పఁబడియున్నది. మహారాష్ట్రమును వేఱుగానుంచినప్పటికిగుజరాతువిదర్భఅనఁగాబరాఁమొదలై నప్రదేశములయందుఁ జంద్రవంశయార్యుల యొక్క యే నివాసస్థానముండెనోయది యా ప్రదేశములయందు నిప్పటికిని నున్నది. ఇందున్న వారియొక్క మస్తకములకొలఁతపరిమాణముమధ్యముకాదు వెడల్పై యున్నది. ఇట్లెందులకయి యున్నదో యీ విషయము నిర్ణయింపఁబడవలయును.

శీర్షమాపన శాస్త్రజ్ఞులు ఏరీతిని మస్తకముయొక్క పరిమాణమును దీసికొనుచున్నారో, దానియొక్కయుఁ గొలఁదియైన సంక్షేపము చేయఁబడుచున్నది. వారిలలాటము మొదలుకొని శిఖవఱకు శిరస్సుయొక్క పొడవును దీసికొనుచున్నారు. మఱియుఁ జెవియొక్క పై భాగము (కణత) నుండి రెండవ భాగమువఱకు వెడల్పును దీసికొనుచున్నారు.

పొడవుకంటె వెడల్పుయొక్క పరిమాణము చాలఁదక్కువ కనఁబడినయెడల శిరస్సు దీర్ఘమని చెప్పఁబడుచున్నది. ఇంక ఈ రెండు పరిమాణములును దగ్గఱగానున్న యెడ నడిమి తరగతిదియని చెప్పఁబడును ఇంకఁ బొడవునకు వెడల్పు మిగుల సమీపముగనో లేక సమానముగనో యున్నచో శిరస్సు వెడల్పని చెప్పఁబడును. ఈ రీతిని నేయొకజాతిలోని కొందఱు జనులయొక్క శిరస్సులను గొలిచిన మీఁదట సరాసరిని బట్టి యేయను మానము కలుగుచున్నదో. దానిచేత నీ పరిమాణ మాజాతిదియని విశ్వసింపఁబడుచున్నది. పై సంగతులను బట్టియే హిందుస్థానమునకు ఏ రెండవజాతిలోని చంద్రవంశీయార్యులు వచ్చిరో, వారియొక్క మస్తకములు వెడల్పులై యుండెనని సిద్ధించుచున్నది. ద్రవిడ జాతివారి మస్తకములయొక్క పరిమాణము పొడపై యున్నది. దీనిఁబట్టి యీ పొడవైన కపాలము గల వారియొక్క సంమిశ్రణమెపుడు వెడల్పైన కపాలము గలవారితో నై యుండునో యప్పుడే యుత్తర ప్రదేశమునందలి మధ్యమ పరిమాణముతోడి కపాలము గలవారు పొడమి యుందురని ప్రకటమగుచున్నది. ఇదే విధముగా గుజరాతు, కాఠియావాడు, విదర్భ మొదలగు దేశములయందు నేజనమున్నారో, వారి శిరస్సులు వెడల్పై యున్నవి; ఈ ప్రాంతములయందుఁ జంద్రవంశీయ క్షత్రియులు నివసించి యుండిరను సంగతి మహాభారతము నుండియుఁ బ్రకటమగుచున్నది. అప్పుడు, ఈ ప్రాంతముల వారి యొక్క అనఁగాఁ జంద్రవంశీయ క్షత్రియులయొక్క మస్తకముల పరిమాణము వెడల్పై యుండునని విశ్వసింపవలయును. ఇంకను, ఈయనుమానము మీఁదియుత్తర ప్రదేశ నివాసులకు సంబంధించిన యనుమానముతోఁ గలియుచున్నది,

శీర్షమాపన శాస్త్ర పండితులందఱుఁ గపాలముయొక్క పరిమాణమేదియు వంశమునకు నిశ్చితమైన లక్షణము కాదని యెంచుచున్నారు. నాసికా పరిమాణమే వంశముయొక్క విశేషలక్షణమై యున్నది. పశ్చిమార్యుల యందును వెడల్పైన కపాలముగల వారున్నారు. ఫ్రెంచి, కెల్టు, బరిషు మొదలగు జాతులు వెడల్పు కపాలము గలవియే యగుచున్నవి. అనఁగా ఆర్యులయందుఁ గపాలము వెడల్పుగానున్న జాతులనేకమున్నవి. ఇదే

ప్రకారము శిరస్సు పొడవుగా నుండుటయు నార్యవంశమునకు ముఖ్య లక్షణము కాకున్నది. ఎందుచేతననఁగా ద్రవిడ జాతియొక్కయు శిరము పొడవుగా నుండును. కనుక నాసాపరిమాణమునే ముఖ్యముగా గణింపవ లయును. ఆర్యజాతియొక్క నాసిక యెత్తుగా నుండును. ద్రవిడజాతిది చదునైనదిగా నుండును. మంగోలియా జాతియొక్క నాసిక, కన్ను లకు నిదానముగా విశేషమైన యెత్తులేని యుంత అనఁగా ముఖమున మిగులసాగి యుండునంత వెడల్పుగా నుండును. చీనా మొదలగు ప్రజలయొక్క వెడల్పైన ముఖము నెల్లరును జూచియుందురు, నాసికా పరిమాణమును విచారించునప్పుడు, చంద్రవంశ క్షత్రియులయొక్క కపాలము వెడల్పైనప్పటికి నెత్తైన నాసిక యున్న కారణము చేత వారు ఆర్య వంశీయులే యగుచున్నారు; మఱియు వారియొక్క జ్ఞానసంపత్తియు శ్రేష్ఠమైనప్పటికిని వారార్యవంశమువారే యగుచున్నారని నిశ్చయమగుచున్నది ఇంకను వారియుక్క సభ్యతయును ఆ వంశమునదిగానే యున్నది. తవరులు రాజపుత్రులు మఱియు గూర్జరులు నిచే ప్రకారము వ్రాయుచున్నారు. వీరి నివాసస్థానము గంగా యమునా ప్రదేశమున నున్నది. వీరే పాండవులయు నార్యులయు వర్తమాన వంశజులని యనుమానింపఁబడుదురేని మనయభిప్రాయమందును నిదే సంగతి యగుచున్నది. వీరు మంచి శరీరదార్ఢ్యము కలవారుగను జాల యెత్తరుగను నున్నారు. వీరి నాసికయు నెత్తై యున్నది. ఈ కారణముచేత వీరార్య వంశీయులగుటలో నెవరికి సందేహముండదు. విశేషించి చంద్రవంశీయార్యుల నడుమ భారతీయ యుద్ధము జరిగియుండెనని మనయభిప్రాయము; ఆర్యులని సిద్ధింపఁ జేయుటకై మనము మిగులఁ ఖూనితో నిచ్చట విచారణఁ గావించితిమి. ఎందుకనఁగా కొందఱు లోకుల యూహయందు హిందుస్థానమునకుఁ బశ్చిమమున నార్యులు లేనేలేరు; అచ్చటి వారియందు శకజాతియొక్క మఱియు ద్రవిడజాతియొక్కయే సమ్మిశ్రణము కలదు. ఈ యభిప్రాయము విశేషించి మహారాష్ట్రవాసుల విషయమునను్నది. మహారాష్ట్రవాసుల విషయమునను్నది. మహారాష్ట్ర బ్రాహ్మణులు మరాఠా క్షత్రియులును నార్యులుకారు. దీనిని సిద్ధింపఁజేయుటకై యీ దయాభిక్షమున్నది; అనఁగా రిస్లే మహాశయుఁడు ఈ లోకులలో శకద్రవిడ జాతుల

దీనిఁబట్టి యార్యజాతి యందు ద్రవిడ జాతి యొక్క కొంచెముమిశ్రణ ముండు ననుట సంభవమగుచున్నది. కాని శీర్షమాపన శాస్త్రముఁ బట్టియు నితిహాసము బట్టియుఁ బశ్చిమదిక్కు యొక్క మరియు మహారాష్ట్రముయొక్క యార్యులు విశేషించి చంద్రవంశీ యార్యులై యున్నారనియే నిర్ణయమగుచున్నది. విదర్భము యొక్క మరియు గుజరాతు యొక్క భోజుఁడై తేని నిస్సందేహముగా నార్యుఁడై యున్నాఁడు. సంయుక్త ప్రదేశాంతర్గతమైనమధ్యదేశము లోని వారు మిశ్రార్యులై యున్నారు. అనఁగా వారియొక్క నాసికా పరిమాణము ఉన్నతముకాదు, మధ్యమమై యున్నదను విషయమై యిపుడు విచారింపవలయును. ఇచ్చటి లోకుల యందు మొట్టమొదటి విశేషముగా భారతీయ యుద్ధ కాలమున నాగజాతి వారియొక్క యెక్కువమైనమిశ్రణము తటస్థించియుండు నని మునుపు వ్రాయఁబడియున్నది. మరియు, ఇదే కారణముచేత యుక్తప్రదేశస్థుల యందు ద్రవిడ జాతి యొక్క విశేషమిశ్రణము బహుప్రారంభములోనై యుండును. కాని యీ మిశ్రణమగుట తరువాత నాగిపోయె ననుట సందేహములేదు. ఎందుచేతననఁగా జాతికి మహత్త్వమును హిందుస్థానములోని వారందఱును విశేషముగా నమ్మియున్నారు. ఇందుచేత నెంత మిశ్రణము మొదట నయిపోయెనో, అంతయే నిలిచెను. మరలఁ దరువాతఁగాలేదు. మంచిది. పై వివరణముఁ బట్టి భారతీయ యుద్ధము అర్యజాతి యొక్క చంద్రవంశీయ క్షత్రియులలో జరఁగి యుండెనని నిశ్చయముఁ జేయఁబడియున్నది. వీరు దక్క నెవ్వరెవ్వరు ఈ సమరమునఁ గలిసియుండిరో యిది యిప్పుడు చూడవలయును.

## రా క్ష సు లు

పాండవుల పక్షమున హిడింబాపుత్త్రుఁడైన ఘటోత్కచుండును దుర్యోధను పక్షమున అలంబుషుఁడును, వీరిరువురు రాక్షసులై యుండిరి. మంచిది ఇపుడు వీరెవరు ? అను ప్రశ్నమున కుత్తరమిచ్చుట యావశ్యకమై యున్నది మహాభారతము, రామాయణము మొదలైన వానియందు రాక్షసులకు ముఖ్య లక్షణము వీరు నరమాంస భోజులై యుండిరని చెప్పఁబడి యున్నది. హిందుస్థానమునవే కొన్ని జాతులు ప్రాచీన సమయమందు నరమాంస భక్షణము

చేయునదియై యుండెనో వారు రాక్షసులై యుండిరని తెలియుచున్నది. ఈ రాక్షసుల యొక్క అనఁగా యాతుధానుల యొక్క యుల్లేఖము ఋగ్వేద పర్యంతము కలదు. వారికై ఋషుల యొక్కవచనమున్నది "అత్రిణః సత్త్వ పుత్రిణః". * మనుష్యులను విశేషించి పరకీయ (విదేశీయ) మనుష్యులను భక్షించు నట్టి యీ మూల నివాసుల యొక్క జాతులు రాక్షస నామముతోఁ ప్రసిద్ధములై యున్నది. అప్సరలు, నాగులు మొదలగు ననార్యజాతులే విధముగా శ్రేష్ఠములయి * యగుచుండెనో ఆ విధముగనే యీయనార్యజాతులు భయంకరములగు చుండెను కాని మరల తరువాతి కల్పనఁ బట్టి అప్సరలు, నాగులు, గంధర్వులు మొదలైన వానికి వలె నీ దుష్ట జాతులకుఁ గూడ దైవ శక్తి ప్రాప్తమై యుండెనని విశ్వసింపఁబడ నారంభమయ్యెను. వారు నాను రూపమును ధరింపఁగలరు, అదృశ్యులు కాఁగలరు మఱియు వారి యందు విలక్షణ శక్తులున్నవి. ఇట్టి కల్పనలు తరువాతఁ జేయఁబడి యుండును. రాక్షసులు నభోమార్గము నుండియును రాకపోకలఁ జేయఁగలరనికూడ విశ్వసింపఁబడియున్నది. భారతీయ యుద్ధ సమయమున విశేషించి యీ జాతుల బొత్తిగాఁ దక్కువగనే యుండియుండును. ఇపుడు వారి దేహములు అండమాను ద్వీపమునందే యున్నారు. రెండు పక్షములను సాహాయ్యకర రాక్షసుఁడుండెనన్నమాట కాల్పనికమై యుండును. మరల భారతీయ యుద్ధము ఋగ్వేదకాలానంతరమే యారంభమయ్యెనని విశ్వసింపఁబడునని, అప్పుడు ఆ సమయమున హిందుస్థానమందు రాక్షసజాతులు చాల స్వల్పముగనుండుటను విశ్వసించుటకు హానియేమియునులేదు. మహాభారత మందు అనఁగా సౌతి సమయముననే జాతులు కాల్పనికములై యుండెనో వాని యందు విలక్షణ శక్తులు నమ్మఁబడుట సహజమైయున్నది.

---

* ఈ మాంస భోజనులు పుత్రహీనులగుదురుగాక.

* కర్ణార్జున యుద్ధ సమయమున నేయే జాతులేయే పక్షమున నుండెనో యీ విషయమైన వర్ణనము చేయఁబడియున్నది. "అసురులు, యాతుధానులు రాక్షసులు మఱియు గుహ్యకులు కర్ణుని పక్షమునకైరి. సిద్ధచారణులు వైనతేయ ప్రభృతులర్జున పక్షమునకైరి." (కర్ణ. అ. 87)

## పాండ్యులు

పాండవుల పక్షమున బాండ్యరాజు యుద్ధము చేయుట యొక్క వర్ణనమున్నది. కాని పాండ్యుడు బొత్తిగా దక్షిణమునను న్నాడు. మఱియు భారతీయ యుద్ధ సమయమున నాతడున్నాడా లేడా యీ విషయమున సంశయమే యగుచున్నది, దక్షిణమున విదర్భ పర్యంతము ఆర్యుల యొక్క నివాసస్థానము భారతీయ యుద్ధసమయమునకై యుండెను. కాని దీనిబట్టియు దక్షిణమున నతని యొక్క నివాసస్థానము లేకుండెనని లేక యార్యులయొక్క యుద్ధమందు జేరగలవా రచ్చట లేకుండిరనియే సిద్ధించుచున్నది. రాముడు లంకమీద గూడ దండెత్తియుండిన మొదల భారతీయ యుద్ధ సమయమున హిందుస్థానములో దక్షిణపుకొనవఱకు సంపూర్ణ మార్గము దొరకుటలో నాశ్చర్యవిషయమేమియును లేదు. అయినను నీవైపుననున్న యార్యులయొక్క రాజ్యము లిప్పటికిని దక్షిణమున లేకుండెను. యుద్ధములో నాంధ్రులు మఱియు ద్రవిడులు మొదలగువారు సమ్మిలితులై యుండుట యొక్క యే వర్ణనమున్నదో. యది సౌతినాటిదియై యున్నది. ఎందుచేతననగా రాముని యొక్క యుద్ధ సమయమున ఆంధ్రద్రవిడ పాండ్యాది నామధారులైన జనులు లేకుండిరి. వారలవుడున్నచో రామునికి సాహాయ్యముచేసి యుందురు. ఆ సమయమున వానర భల్లూక ప్రభృతులే మదరాసు వైపున నుండిరని తెలియుచున్నది. కొందఱదైతేని పాణిని కాలము వఱకు దాక్షిణాత్యులయొక్క నామములు విశేషరీతిని తెలియకుండెనని యనుమానమున్నది. కాని మహాభారతకాలమందు అనగా క్రీస్తునకంటె బూర్వము 300 సంవత్సర ప్రాంతమున హిందుస్థానములో బాగుగా దక్షిణ కోణము వఱకునైన మార్గము ఆర్యులకు దొఱికియుండెననుటకు సంశయములేదు. బౌద్ధులకంటెను జైనులకంటెను ముందుగా సనాతన ధర్మలైన యార్యులు దక్షిణ వైపున వ్యాపించి యుండిరనుటయు నిర్వివాదమై యున్నది. దక్షిణమున శివవిష్ణువుల పూజ బుద్ధునకు బూర్వమే స్థాపింపబడి యుండెననుటలో వర్ణనెంతయును యొత్తుగాడు సంశయములేదు; ఎందుచేత ననగా ఈ దేశములోని బుద్ధునినాటి వర్ణనములబట్టి యీ సంగతియే నిష్పన్నమగు

చున్నది. ఇదిగాక పంజాబుసందు అలగ్జాండరు చక్రవర్తికి దక్షిణ ప్రాంత సంగతులేయేవి ప్రకటింపఁబడియెనో, వాటిని అలగ్జాండరుతో వచ్చిన భూగోళ వేత్త ఇరాటాస్థేనిస్సు వ్రాసిపెట్టి యున్నాఁడు. అందు సింధు ముఖమునుండి కన్యాకుమారి వఱకుఁగల భాగమెన్ని క్రోసుల పొడవున్నదో యీ విషయముకూడ వ్రాయఁబడి యున్నది. కన్నింగహామ్ మహాశయుఁడు తనహిందు"స్థానప్రాచీనభూగోళ,నామకమైనపుస్తకమునందు, ఇరాటాస్థేనిస్సు మద్రాసు ప్రాంతముదియైన యే నిజమైన వృత్తాంతమును వ్రాసియున్నాడో, అది నిజమైన పొడవులో దానికంటె పదియైదు క్రోసులు మాత్రము భేదముగలదియగుచున్నదను మాట సరియైనదని వ్రాసియున్నాడు. అనఁగా సౌతికిఁ దన సమయమందలి సంపూర్ణ హిందుస్థానము యొక్క స్థితి లేశలేశమునుండియుఁ దెలిసియుండెను; మఱియు దీని యాధారము మీఁద నతఁడు దేశవర్ణనమును దిగ్విజయ వర్ణనమును గూడఁ జేసియున్నాఁడు ఇట్లే దేశములయు నదులయు నామముల వ్రాసియున్నాఁడు. సౌతికాలమున దక్షిణ కోణము నొద్ద పాండ్యప్రజలు మిక్కి ప్రబల రాజులై యుండిరి. మేగాస్థినీజు సైతము వీరి వర్ణనమును జేసియున్నాఁడు అతఁడు పాండ్యులకుఁ బాండవులతోఁ గొంత సంబంధమున్నదనియుఁ జూపియున్నాడు. హరివంశమందును పాండ్యునికి సంబధము యదువంశముతోఁ గలుపఁబడి యున్నది. కనుకనే, ఎపుడు పాండ్యరాజులు మహాభారత కాలమునఁ బ్రసిద్ధులై యుండిరో, అపుడు భారతీయ యుద్ధమందున్న వారియొక్క నామావళితోఁ బాండవుల యొక్క నామములుకూడ వచ్చియుండునని మనకుఁ దోఁచుచున్నది. విశేషించి ప్రత్యక్ష భారతీయ యుద్ధము ఋగ్వేద కాలానంతరమై యున్నది; ఆ సమయమందు వీరు లేనేలేరని యనుమానము కూడ గలుగుచున్నది.

## సంశప్తకులు

భారతీయ యుద్ధమందు యవనులు అనఁగా యూనానులు లేక యుండిరి. అప్పటికి వారు పుట్టి యుండనేలేదు. అచ్చటచ్చట భారతీయ యుద్ధమందు వారున్నట్లుకూడ వర్ణనమున్నది. ఎప్పుడైనను వీరియొక్క

వర్ణనము రాఁబట్టి, మహాభారత కాలమున వీరి నామము ప్రసిద్ధమగుట చేతఁ బాండ్యులువలె వెనుకనుండి వీరుకూడఁ గూర్చబడి యుందురని ప్రకటమగుచున్నది. మంచిది సంశప్తకులెవరు? ఈ ప్రశ్నము మిగుల సంతోషకరమైయున్నది. వీరలీదేశము వారై యుండిరను విషయమై మహాభారతమందెచ్చటను వర్ణనము లేకున్నది. వీరు కడు శూరత్వముల వీరులై యుండిరి. యుద్ధమునఁ జనిపోవుటయైనను మంచిదేకాని వెనుకకుఁ దొలగరాదని తలంచుట వీరి స్వభావమై యుండెను. కనుక నిట్లే శపథము చేసి యుద్ధము చేయుటకై పోవుచుండెడివారు. ఈ కారణముచేత వీరు "సంశప్తకులని, చెప్పఁబడుచుండిరి. ఈ సంగతి ద్రోణపర్వములయొక్క 27 వ యధ్యాయమున నున్నది. అయినను దీనికి 'సంశప్తక, రూపముకూడ లభించుచున్నది. వీరు ఏడు జాతులనొకచోటనే నివసించినవారై యుందురు. మఱియు సైన్యములో సంఘటితులై యుండిరి, ఈ కారణముబట్టి సంశప్తక నామము కలిగియుండును. ఎవరిని ప్రస్తుత సమయమున 'ఫ్రాంటియర్ ట్రాయిబ్స్, అని చెప్పుచున్నారో, వారియందలి అనఁగా హిందుస్థానము యొక్క పడమటి సరిహద్దుననున్న పర్వతముల నివసించు అఫ్రిదీ (పఠానుజాతి భేదము) శూరజాతులలోని వారై యుందురు. పంజాబు మొదలుకొని అష్టనిష్ఠానము దాఁక సెల్లరును దుర్యోధను పక్షమున నుండిరని పూర్వము చెప్పఁబడి యున్నది. సంశప్తకులు సైతము దుర్యోధనుని సైన్యమందే యుండిరి. అప్పటి ముఖ్యమైన యార్యదేశము పంచనదమే యై యుండెను, ఈ కారణముచేతనే కౌరవ పాండవులకు జగడము అప్పటి హిందుస్థాన సామ్రాజ్యముఁ గూర్చియై యుండెను. ఏదియే నగుగాక, సంశప్తకులు మఱియొకరు కారు— అదే పొలిమేర (సరిహద్దు) లో నున్న పర్వతీయులై యుందురని యనుమానించుటకై యవకాశమున్నది. త్రిగర్తాధిపతి ప్రభృతులు పంజాబువారనియే చెప్పఁబడి యున్నారు. ఈ సంశప్తులకును సంశప్తక గణమని చెప్పఁబడి యున్నారు. వీరితోడి పాటుగా నారాయణుఁడును గోపాలగణముకూడఁ జెప్పఁబడి యున్నారు. (భా. ద్రో.) దీనిఁ బట్టియు, వీరు గణములై యుండిరి. అనగా రాజులేని పర్వత నివాసులై యుండిరని యనుమాన ముదయింపఁ గలదు. మహాభారతమందలి గణశబ్దముచేత, ఎవరు స్వతంత్ర ప్రజాసత్తాత్మ

కులు లేక యల్పసత్త్వాత్మకులై యుండిరో, యిటువంటి విశేష జనులయొక్క భోధమగుచుండెడిది. సంశప్తక గణములేక ఉత్సవ సంకేత గణమని మన యొక్క యనుమానము.

గణానుత్సవ సంకేతా నజయత్పురుషర్షభః ॥
శూద్రాభీరగణాంశ్చైవ యేచాశ్రిత్య సరస్వతీం ॥
వర్త్తయన్తి చయే మత్స్యైర్యేచ పర్వతవాసినః ॥
(సభా. అ. 32. 10)

ప్రభృతి పదముయొక్క యే యుల్లేఖము కనంబడుచున్నదో య య్యది యిటువంటివారి నిమిత్తమే యై యున్నది. శిలాలేఖములో “మాలవ గణస్థిత్యా” శబ్దమందు వచ్చిన మాలవగణముకూడ నిటువంటి జనులదే యై యుండెను. వీరు ప్రాయికముగ నేకవంశములోని వారును శూరులును నగుచుండిరి. ఇందుచేతనే మనము సంశప్తకులను సరిహద్దు లోని అప్సరది మొదలైన వారితో నీ భేదమును జేసియున్నారము. వీరు బహుధా స్వతంత్రులై నివసించు చుండిరి. మఱియు నామమాత్రము నకై యెవరో యొక సమ్రాట్టునధిసత్త్వమును విశ్వసించుచున్నారు. ఇదే కారణమున యుధిష్ఠిరుండీవిషయమై శాంతిపర్వము యొక్క 107 వ యధ్యాయమునందు స్వతంత్రప్రశ్నమును జేసియున్నాడు. అతండడిగి యున్నాడు. “ఈ గణములకు నుత్కర్ష మెందువలన నగుచున్నది. మఱి యును వీటియందుం బరస్పర ద్వేష మేవిధముగా నగుచున్నది?” వీరి యొక్క యే వర్ణనములు కనబడుచున్నవో, వాని బట్టి వీరియందుం గొంతమంది నాయకులున్నారని తెలియుచున్నది. వారియొక్క యుత్కర్ష మునకుం గారణమైక్యమే యై యున్నది.

నగణాః కృత్స్నశో మన్త్రం శ్రోతుమర్హన్తి భారత ॥
గణముఖ్యైస్తుసంభూయ కార్యం గణహితం మిథః ॥

ఈ శ్లోకమును బట్టి యీ గణములకు సాధారణముగా సర్వసాధారణమైన సభ జరుగుచుండెడిదాని యెఱుకపడుచున్నది: కాని గుప్తపరామర్శము గణముల నాయకుల చేతనే చేయుట యొక్క యుపదేశమీయఁబడియున్నది. చెప్పఁబడినదేమనఁగా :

జాత్యా చ సదృశాస్సర్వే కులేన సదృశాస్తథా ।
న చోద్యోగేన బుద్ధ్యా రూపద్రవ్యేణ వా పునః ॥
భేదాచ్చైవ ప్రదానాచ్చ భిద్యన్తే రిపుభిర్గణాః ।

దీనిఁ బట్టి యీ గణములోనివారే జాతివారును నేకకులమువారునయియుండెననియుఁ గేవలము భేదముఁజేసియే జీవించుచుండెనని యనుకొనుచున్నది. టీకాకారుఁడైన నీలకంఠునికి వారిని గుఱించి సరియైన కల్పన లేకుండెను, కాఁబట్టి యాతఁడు వారిని వీర సముదాయములని మాత్రము నమ్మియున్నాఁడు. కాని వారు సదా యేక జాతి వారగుచుండిరను సంగతి ధ్యానింపఁదగియున్నది,

## భారతీయార్యుల యొక్క శారీరిక స్వరూపము

బాగు, భారతీయ యుద్ధము ముఖ్యముగాఁ జంద్రవంశీ యార్యుల యందయ్యెను. హిందుస్థానములో నార్యు లిప్పటికిఁ గూడనున్నారు. మహాభారత సమయమందైతేని నిస్సందేహముగా నుండిరి. ఇందులకుఁ బ్రమాణము శారీర వర్ణనముఁ బట్టియు దొరకుచున్నది. సామాన్యతః ఆర్యుల యొక్క యెత్తు ఉన్నతము, శరీరము కణుపులు గలది, వర్ణము తెల్లనిదియు నగుచున్నది. నాసికయు నేత్రములును మంచి యాకారము కలదియు వారి యాకృతి సుందరమును నగుచున్నవి. మహాభారత మందు లోకుల యొక్క శారీరాకృతులకు నెట్టివంటి స్వరూపముఁ జూడఁబడుచున్నదో మనమీ ప్రకరణములోఁ గనుగొందుము.

మహాభారత కాలమందు హిందుస్థానములోని మనుష్యులు ఎత్తైన వారును మిక్కిలి బలము గలవారును నగుచుండిరని తెలిసికొనుటకై యనేకో దాహరణములు లభించుచున్నవి. మేగాస్థినీజు కూడ లిఖించియున్నాఁడు ఏషియాఖండ వాసులందఱిలోను హిందుస్థాన నివాసులు ఉన్నతులు బల శాలులు నగుచున్నారని అతఁడు దీనికి కారణమును జెప్పియున్నాఁడు. ఏమ నగా ఇక్కడ నన్న పానములకు సౌకర్యమున్న కారణము చేత నిక్కడి వారు సాధారణౌన్నత్యము కంటెఁ గొంచె మధికముగానెత్తైన వారగుచున్నారు. మఱియు వీరి యొక్క ముఖమునందుఁ దేజస్విత్వము ప్రకటమగుచున్నది. మన యూహయందు ఈ కారణ మొక్కటి చాలదు. వీరు ఆర్య వంశీయులై యుండుటయేకాక వీరి యొక్క వైవాహిక స్థితియుఁ గడునుత్తమమై యుండుటయుఁ గారణమైయున్నది. వివాహమగు నప్పటికిఁ బతిపత్నులకు బూర్ణావస్థ యుండెది. మఱియు వివాహము గాక పూర్వమిరువురికిని బ్రహ్మ చర్యా రక్షణము మీఁద పూర్ణమైన దృష్టియుండుట యనెడు నాశ్రమవ్యవస్థ యున్న హేతువు చేత సంతానము చాల శక్తి మంతమును దేజస్వియునై యగుచుండెడిది. మూఁడవ కారణమిది, భారతీ యార్యులకు, విశేషించి క్షత్రి యులకు, శారీరిక బలమును వృద్ధి మొందించుటకు నధికమైన యుల్లాసముగు చుండెను. ఈ విషయమైన కళ యా దినములలో మితిమీఱి యుండెను; చంద్రవంశీయ క్షత్రియులకు మల్లవిద్య యందెక్కువ యభిమాన ముండెను. భీమజరా సంధుల యొక్క ప్రాణాంతకమైన బాహు యుద్ధము సభాపర్వ ములో వర్ణింపఁబడియున్నది. దానిఁ బట్టి భారత కాలమందు మల్ల విద్య యెంత వఱకుఁ బూర్ణమై యుండెనో యీ సంగతి ధ్యానమునకు రాఁగలదు. (సభా. అ. 23) ఇదిగాక యింకను ననేక మల్లుల యొక్క వర్ణనము మహా భారత మందున్నదిఁ కృష్ణ బలరాము లిద్దఱును గొప్పమల్లులై యుండిరి. ఈ బలరామకృష్ణులు కంసాశ్రయమందు నివసించియున్న చాణూరాద్యనేక మల్లుల బడవైచిరి. జరాసంధుని యొద్ద హంస డిభకనామకులైన యుద్ధఱు మల్లులుండిరి. వీ రుభయులును జరాసంధుఁడునువీరు మువ్వురును ముఖ్యముగ ముల్లోకములను జయించుటకు సమర్థులై యున్నారు. ఈ సంగ తిని శ్రీ కృష్ణుఁడు జెప్పియున్నాడు. ( స. అ. 19 ) విరాటరాజునొద్దఁ గూడ గీచకుఁడును వాని యనుయాయులును మహా మల్లులుగ నుండిరి.

ఆ సమయమున వీరులందఱకును శారీరకశక్తి యత్యంత మావశ్యకమగు చుండెనని యభిప్రాయము. యుద్ధముల యన్నింటను శారీరక శక్తికే విశేషోపయోగము సంభవించుచుండెను. గదా యుద్ధమును గజ యుద్ధమును మల్లులే చక్కగాఁ జేయగలుగు చుండిరి. గజముతోఁ గేవలము బాహు యుద్ధమును జేయునట్టి శ్రీ కృష్ణుఁడు భీముఁడు పంటి మల్లులా సమయముననుండిరి. ఈ కాలమంతైతే నీ విషయములయొక్క యసంభవతకానవచ్చుచున్నది; కాని మనుష్యుడు తన శారీరిక బలమునెంతదాఁక వృద్ధి నొందింపఁగలడో మఱియు యుద్ధమందెంత ప్రవీణుఁడు కాఁగలడో దీనికి నిజముగా మేరయేమియులేదు. గదా యుద్ధము చేయుటయును మల్లుని పనియే యై యుండెను; దుర్యోధనునిపంటి సార్వభౌముఁడును దానియందుఁ గుశలుఁడై యుండెను. ధనుర్విద్యకుఁగూడ శారీరిక శక్తియొక్క యీ యవశ్యకత యుండెను. దృఢమైన ధనుస్సు నాకర్షించుటయందు నెక్కువ సామర్థ్యము కావలసియుండెను. ప్రాచీన కాలికములైన యన్ని యుద్ధముల యందును శరీరశక్తి యావశ్యకమగు చుండెనని సారాంశము. ఇందులకై క్షత్రియులును బ్రాహ్మణులును ఒకే శక్తిని పెరిగించుకళను నభ్యసించుచుండిరి. దేశములో నన్నియుకూడ సంపూర్ణముగా నుండెను. కాఁబట్టి వారియొక్క సాహసములు మిక్కిలి సఫలములగు చుండెడివి ఇంకను మూలముయొక్క బీజశక్తిని బట్టియు వారికి సాహాయ్యము చేకూరుచుండెడిది.

సమస్తమైన యాశ్రమవ్యవస్థయు సమాజస్థితియు నీ ప్రకారముగా ననుకూలమై యున్న కారణముచేత శారీరిక శక్తియొక్క యనేకోద్యమములయందు భారతీయార్యులు స్పార్టను ప్రజలవలె నగ్రగణ్యులై యుండిరి. ఇందాశ్చర్యమేమియును లేదు. ప్రాచీన కాలము మొదలు మహాభారత కాలము దాక వారి యీ ప్రసిద్ధి స్థిరమై యుండెను. పోరస్సురాజుయొక్క మిక్కిలి యున్నతమైన యెత్తును అధిక బల సంపన్నమైన శరీరమును జూచి మఱియు నతని కొరతను విచారించి యలగ్జాండరు కౌతుకమునకుఁ సైతముగారణ మిదే యైయున్నది. పంజాబులోనిమఱియుగంగా

యమునా ప్రదేశములోని యార్యులు నేఁటికి నున్నతులును శక్తిమంతులును నగుచున్నారు. వీరికి నేఁటి పర్యంతము మల్లవిద్యమీఁద మితిమీఱిన యుల్లాసమున్నది. ప్రాచీనకాల ప్రజల స్వభావముయొక్క యీ పరిణామము నేఁటి వఱకును సాగివచ్చుచున్నదని చెప్పఁబడగలదు.

హిందుస్థారమునందలి భారతీయార్యులెంతటి శక్తిమంతులై యుండిరో యంతటి యుత్తమాకృతులుగూడ నుండిరి. మన గ్రంథముల యందును యూనానుల లేఖములయందును భారతీయార్యుల యొక్క నాసిక యున్నతమనియు నేత్రములు విశాలములనియు వర్ణనమున్నది. చీనా పరిపాలకుఁడైన హుయేన్ సాంగుకూడ నిట్లే వర్ణించి యున్నాఁడు. యూనానీ యితిహాసకారులు పోరసుయొక్క స్వరూపము బాగుండెనని వర్ణించియున్నారు. కాని వీరు సోపిటీసునకు శోభను నిచ్చునంతటి సౌందర్యమని చాలఁ బ్రశంసించియున్నారు. సోపిటీసు శబ్దమునకు తాత్పర్యమశ్వపతియని ప్రకటమగుచున్నది. రామాయణమందును మహాభారతమందును కేకయుఁడైన యశ్వపతియొక్క వర్ణనము హెచ్చుగానున్నది. మద్రప్రజలు కూడ నిదే జాతివారై యుండిరి. కైకేయియు మాద్రియు నత్యంత సుందరులై యుండిరి. మహాభారతమందు మాద్రియొక్క కొడుకు నకులుఁడు బహు సుందరుడై యుండెనని లిఖింపఁబడి యున్నది. ఈ ప్రాంతాలఁబట్టి పంజాబులోని క్షత్రియులు బహు సుందరులగు చుండిరని ప్రకటమగుచున్నది. యూనానులయొక్క పై ప్రమాణముఁబట్టి పంజాబు క్షత్రియులయొక్క విశేషత మహాభారతకాల పర్యంతము కూడ నుండెనని సిద్ధమగుచున్నది. ఇప్పుడు పంజాబువారు స్త్రీ పురుషులెల్లరును అన్యప్రాంతముల వారికంటె సశక్తులును సుందరులు నగుచున్నారు.

## వర్ణము

ఆర్యులయొక్క వర్ణము భారత సమయమున నొకటియును మహాభారత సమయమున నొకటియునై యుండునని తోఁచుచున్నది. ఆరంభ

మున నార్యులందఱ యొక్క రంగు తెల్లనిదియై యుండును. పంజాబు వారిదైతేని ప్రాయికముగా నిపుడును దెల్లనిదియై యున్నది. రెండవది యనఁగాఁ దరువాత వచ్చిన చంద్రవంశీ యార్యులయొక్క రంగు శ్యామముఁ గృష్ణమునై యుండును. ఈ సంగతి మునుపు చెప్పఁబడి యున్నది. శ్రీకృష్ణుఁడు, అర్జునుఁడు, ద్రౌపదియు వీరందఱు కృష్ణవర్ణము గలవారై యుండిరి; రంగుయొక్క యీకారణముచేత ద్రౌపదికి పేరులో కూడఁ కృష్ణ, యని తఱస్థించి యుండెను. కాని యీ శ్యామ వర్ణముచేత మరియు నయనములును జక్కఁగాఁ దెలియుచుండెను. శ్యామ గౌరవర్ణ ములయొక్క మిశ్రణము చేతఁ బసుపుపచ్చని రగు సైత ముత్పన్న మై యుండెను. ఉపనిషత్తుల నాడును మహాభారతమందును నార్యు లకుఁ దెలుపు, నలుపు, పసుపుపచ్చన యీమూఁడు రంగులుఁ జెప్పబడి యున్నవి. బ్రాహ్మణులు, క్షత్రియులు. వైశ్యులు మువ్వురియందును నీ మూఁడు వర్ణములు వచ్చియుండెను. యీనానాసుల వర్ణనముఁబట్టి మహా భారతకాలమున నీ మూఁడు వర్ణముల మనుష్యులు హిందు స్థానమననుం డిరని తెలియుచున్నది. మహాభారతములో నా శ్రమవాస పర్వమందు, పాండవులయు వారి స్త్రీలయును వర్ణము కలదు. అది యిచ్చట నెత్తిచూపఁ దగియున్నది, వనమునందు ధృతరాష్ట్రుని గలిసి కొనుటకై తమ స్త్రీలతోసహి తము పాండవులు వెళ్ళిరి. అప్పుడు సంజయుఁడు ఋషులను నారికిఁబరిచితుల గావించుటలోనే వర్ణనమున్నది; "ఎవని యొక్క యౌన్నత్యములును మిగు నున్నతమై యున్నవో, నాసిక పెద్దదియై యున్నదో, నేత్రములు విస్తీర్ణ లును దీర్ఘములై యున్నవో- మేలిమి బంగారముులవంటి గౌర వర్ణమువాఁడు యధిష్ఠిరుఁడై యున్నాఁడు అతనిపైపున ఎవని స్కంధములునిండియున్నవో మఱియు భుజములు దీర్ఘములు కడు మాంసములై యున్నవో, యీ తప్త సువర్ణవర్ణమువవంటి గౌర వర్ణము వాఁడు వృకోదరుఁడై యున్నాఁడు. అతని వెనుక నెవనియొక్క యంసములుసింహమునకువలె నున్నతములై యున్నవో కమలములవంటి పెద్దపెద్ద కన్నులున్నవో, యీ శ్యామవర్ణముకల వీరుఁ డర్జునుండై యున్నాఁడు- ఎవరియొక్క రూపము, శీలములు, ఈ మూఁటి యందుఁబోటీ చేయఁగలవాఁడు సమస్త పృథ్వియందునొకఁడై నను లేడు వీరిద్దఱు నకుల సహదేవులై యున్నారు. దేనియొక్క యంగకాంతి నీలోత్ప

లమును బోనిదై యున్నదో యీ కమల పత్రాక్షిద్రోవదియై యున్నది. శుద్ధ స్వర్ణమును బోలిన గౌర వర్ణముగల యీమె సుభద్ర మఱియు గౌర వర్ణయైన నాగకన్య యులూపి. దీని రంగు ఇప్పపువ్వువలె నున్నదో, యీమె పాండురాజు కన్యయగు చిత్రాగంద ఏది సహదేవునికిఁబ్రియ పత్నియో ఈ సంపెగమొగ్గల దండ బోలికనున్న గౌరవర్ణముగలది జరాసంధుని కూతుఁరు మఱి యీ యిందీవరశ్యామ నకులుని ద్వితీయభార్య. ఒడిలోఁ గుఱ్ఱవాఁడున్న యీ మేలి కుందనపు చాయగలది యుత్తర" (భా. ఆశ్ర.అ. ౭౮) ఈ వర్ణనముఁబట్టి యొక యర్జునుఁడే శ్యామవర్ణుఁడై యుండెననియుఁ బాండవు లందఱు గౌర వర్ణులై యుండిరనియు నగపడుచున్నది. ద్రౌపది. చిత్రాంగద, నకుల భార్యయు గౌరీ వర్ణము వారు కాకుండిరి. కడమ వారందఱు(స్త్రీలు) గౌరవర్ణముగల్గి యుండిరి. ఈ గౌరవర్ణమెల్లప్పుడును బంగారముయొక్క నమూనా కలదని వచింపఁబడియున్నది. హిందుస్థాన వాసులకు విశేషము మాత్రము వర్ణమై యున్నది. ఇయ్యది యేదేశమువారియందును గనఁబడదు విశేషించి వర్తమాన దినములయందును గొంతవఱకు సుందర స్త్రీలకునేవిధము గాఁబసుపువచ్చని రంగు గనఁబడుచున్నదో,యావిధమును సర్వదేశ స్త్రీలయం దెచ్చటను లభింపదు ఆర్యులయొక్క శ్యామ వర్ణము కూడను గొంత విలక్షణమై యున్నది. అది ద్రావిడుల కాలవర్ణము కన్న బొత్తిగా భిన్నమై యున్నది. దానికి మహాభారతమందు ఇంతవరముయొక్క లేక మధూక పుష్పము యొక్క యుపమ యీయబడి యున్నది. అగుఁగాక, ఆర్యుల యొక్క నిజమైన వర్ణము శుభ్రము. లేక తెల్లన కర్పూరగౌర, విశేషణముద్వారా మహాభారతమందక్కడ నక్కడ లభించుచున్నది. కాని మహాభారత సమయమున స్వర్ణమునకు వలె వర్ణరూపము తఱచు కనఁబడు చుండెను. మనవారివలె నిజమైన గౌరవర్ణముగల మనుష్యులు హిందుస్థానమునందుఁ జాలమంది యున్నారని యూనానులు కూడ వ్రాసి యున్నారు.

హిందుస్థాన భారతీయార్యులకు ఎత్తైన నాసికయుఁ బెద్ద బెద్ద నేత్రములునుఇవి గలవు, కేవలము కవివర్ణనలోని సామగ్రులు కాకున్నవి. ఈ లక్షణమిప్పటికిని హిందుస్థానములోని యున్నత జాతివారి యందు నధిక ముగా నగపడుచున్నది. ఈ విషయమై మహాభారతములోని వర్ణనములు కవి కల్పితములు కావు. హుయేన్‌సాంగు కూడ హిందుస్థానమువారి నిట్లే వర్ణించి యున్నాఁడు. మహాభారతములో ననేక స్థలములయందు భారతీయార్యులయెత్తు ఉన్నతమై యుండెనను విషయమున నుల్లేఖమున్నది. తాళవృక్షమువలె సరళముగను నున్నతముగను నుండుటకు సిద్ధమయ్యె నను వర్ణనము తఱచు వచ్చుచున్నది. వృషస్కంధుడనియు కవాటవక్షు డనియు వర్ణనము కూడ నెడతెగక లభించుచున్నది. దీనిఁబట్టి యెత్తైన మూపురముగల వారును వెడల్పైన రొమ్ముకల వారును భారతీయార్యులలో ముఖ్యులుగా విశ్వసింపఁ బడుచుండిరని సిద్ధించుచున్నది. మహాభారత సమయమున భారతీయార్యుల శరీరము యొక్క విధము పద్ధతియు నిట్లుం డెను.

## ఆయువు

ఇపుడు భారతీయార్యులయొక్క ఘనాయువుమీఁద గొంత విచారము చేయఁబడుచున్నది. శరీరస్థితి చక్కఁగా వర్తిల్లు చుండెను. దేశమందు వస్తువులు చవుకగా నుండెను. మఱియు నిదేశ్రప్రకారము మధ్యదేశము యొక్క యట్లు పంజాబుయొక్క గాలి నీరోగమును నుష్ణమునై యుండెను. ఈ కారణమున భారతీయార్యులకు ఖూర్ఘాయుష్యమగు చుండె ననుట యథార్థమై యున్నది. మహాభారతములో వర్ణింపఁబడిన వారంద ఱును దీర్ఘాయువులై యుండిరి. తపోబలమునంజేసి సహస్ర వర్షా యువులైన మునులమాట యట్లుంచినప్పటికిని, సాధారణమనుష్యులయొక్క యాయుస్సు కూడ నధికముగా నగుచుండుట సాపుగా నగపడుచున్నది. యుద్ధము నాఁటికి శ్రీకృష్ణుడు 83 వర్షములవాఁడై యుండెను. అర్జునుని యొక్క వయస్సు 65 వర్షములు లేక యింతకంటెను నధికమై యుండెను. తన ధామమునకుఁ బోవునప్పటికి శ్రీకృష్ణుని యాయువు 101 లేక 119

వత్సరములదియై యుండెను. అప్పటికి శ్రీ కృష్ణుని తండ్రి వసుదేవుఁడు జీవించియుండెను. అతఁడెంత తక్కువగాఁ జూడబడినను 140 ఏండ్లవాఁడై యుండువాడే. యుద్ధ సమయమునకు ద్రోణుని వయసు 85 సంవత్సరములదిగాయె యుండెను. భీష్ముఁడైతేని 100 వర్షములకుఁ బైగానుండి యుండును? భారతకాల ప్రజలయొక్క వయసు చాల యధికమై యుండెనని సారాంశము. మహాభారత కాలపర్యంతమిదె స్థితి యుండెను. యూనానుల ప్రమాణముఁబట్టియు నీ సంగతి సిద్ధమై యున్నది. యూనానీ యితిహాస కారుఁడైన అరాయను హిందుస్థానమందు 140 వర్ష పర్యంతము జనులు జీవించియున్నారని లిఖించియున్నాఁడు, నూఱువర్షములకు మీఱిన వయస్సు గలవారు చాలమంది దొరుకుచున్నారు. మఱియు నిటువంటి వారికి వేఱే యొకనామ మున్నట్లు కూడ యూనానులు వ్రాసి యుంచిరి. తిరిగియుఁ బూర్ణాయువుయొక్క మర్యాద 1!0 వర్షములై యుండును. మహాభారతములోని యనేకోల్లేఖములఁ బట్టి యిటులే తెలియుచున్నది. మహాభారత సమయమున 300 లేక 400 ఏండ్ల వయసుగల మానిసులుండిరనుట నమ్మఁబడఁజాలదు. సూతుఁడు లేక పౌరాణికుఁడు 50 వర్షముల వాఁడగునని శాంతిపర్వమునందు భీష్ము డిలా చెప్పియున్నాడు. దీని ప్రకారము 50 ఏండ్ల తరువాత మనుషులయొక్క బుద్ధి ప్రౌఢమగు చున్నదనియు వాని స్వభావము శాంతముకూడ నగుననియు విదితమగుచున్నది. ఇటులనే శాంతిపర్వమందు ఁ జెప్పబడిఁయున్నది—

యేతు వింశతివర్షా వై త్రింశద్వర్షాశ్చ మానవాః
అర్వాగేవ హితే సర్వే మరిష్యన్తి శరచ్ఛతాత్ ॥

(శాంతి. అ. 104. 20)

ఎవరు ఇరువదిలేక ముప్పది లోపల నున్నారో, వారందఱును 100 సంవత్సరము నిండక మునుపే మరణింతురు. ఈ వాక్యము బట్టి యాయావులయొక్క మర్యాద యెక్కువకంటె నెక్కువ 1!0 లేక 1!0 వత్సరముల దిగాయె యూహింపబడుచుండెను. ఇంతకంటె నధికాధికాయువుయొక్క గణన యెచ్చటనైన చేయఁబడునని అది యతిశయోక్తియో లేక యుపవాదమో యైయున్నది. మహాభారతముయొక్క ప్రమాణముఁ బట్టి ప్రస్తుత కాలమున కంటె మహాభారత కాలమందును భారతీయ యుద్ధ సమయమునను భారతీయాద్యులయొక్క యాయుర్మర్యాద మిగుల నధికమై యుండెనను సంగతి నిర్వివాదముగా సిద్ధించుచున్నదీ.

—/—

# ఆరవ ప్రకరణము:

## వర్ణవ్యవస్థ, ఆశ్రమవ్యవస్థ, శిక్ష.

మునుపటి వివేచనబట్టి, భారతీయ యుద్ధసమయము క్రీ. పూ. 3000 ఏండ్లకుఁ బూర్వమని నిశ్చితమగుచున్నది. మఱియు నీయుద్ధము హిందుస్థాన నివాసులైన యార్యుల యందు, విశేషించి చంద్రవంశ్య క్షత్రియుల యందు, జరిగియున్నట్లు కనఁబడుచున్నది. దీనికి దాదాపున భారతగ్రంథము యొక్క మూలముత్పన్నమై మెల్లమెల్లగాఁ బెరుగుచువచ్చెను; క్రీ. పూ 250 ఏండ్లకు దగ్గఱ దగ్గఱగా సౌతి దానికే మహాభారత రూపము నొసఁగెను. అనఁగా మహాభారత గ్రంథమున క్రీ. పూ. 3000—300 సంవత్సరము వఱకు నున్న పరిస్థితి యొక్క రూపముతో సంపూర్ణమైన ప్రతిబింబము కలదు. బ్రాహ్మణ కాలము మొదలుకొని గ్రీకుల యాక్రమణము వఱకు నున్న హిందుస్థానము యొక్క జ్ఞానము (చాతుర్యము) ఏదేని యొక గ్రంథమున నున్న యెడల అది మహాభారత మందేయున్నది. మఱి యెచ్చటి మనది లభింపఁజాలదు. ప్రోగయియుండఁజాలదు. హిందుస్థానము యొక్క ప్రాచీనేతిహాసమేదియు నిపుడు దొరకకున్నది. కొన్ని విషయముల జాడ బ్రాహ్మణములు, సూత్రములు, మొదలైన వైదిక గ్రంథములఁ బట్టి నిర్వాహమగుచున్నది. కాని వాని యందలి వర్ణనము సంక్షిప్తము నసంపూర్ణమునై యున్నది. మహాభారతమందువలె విస్తరించిన వర్ణనము వానియందు దొరకదు. ఈ దృష్టిచేత మహాభారతమునకు మిక్కిలి యెక్కువమహత్త్వమున్నది. ఈ మహత్త్వమును ప్రస్తుత సమాలోచన యందు నుపయోగించు సంగతి ముందే వ్రాయఁబడి యున్నది. ఈ సమాలోచన యందు, ప్రాచీన కాలమందు హిందుస్థాన నివాసుల సామాజిక స్థితి యెట్లుండునో, యచ్చట రీతిరివాజులు (వరిపాటి) ఎట్లుండెనోయేవిధమై యుండెనో మఱియు జ్ఞానమునకు నెంతటి (ప్రగతి)

యుత్కృష్టగతియై యుండెనో యీయా యనేక విషయముల గుఱించి వివేచన చేయవలసియున్నది. ఇందు, తత్త్వజ్ఞానము యొక్క మార్గమెట్లుండెనో మఱియు నెంత యాక్రమణము చేయఁబడి యుండెనో లోకుల యొక్క ధార్మికమైన యాచార విచారము లెట్లుండెనో మరియు నీతి యొక్క కల్పన యేమియైయుండెనో యిది కూడఁ జూడవలసియున్నది, ఈయన్ని విషయముల మీఁదను నీ గ్రంథమందు విచారము చేయఁబడును. హిందుస్థానవాసుల సమాజ స్థితికి ముఖ్యాంశము వర్ణవ్యవస్థయై యున్నది. కనుక నీవర్ణవ్యవస్థను ముందుగా విచారించుట యుచితమైయున్నది.

## వర్ణము యొక్క లక్షణము

హిందుస్థానమందు వ్యాపించి యున్న వర్ణవ్యవస్థ వంటి వ్యవస్థమరియే దేశమందును లేక యే లోకుల యందును, ప్రాచీనకాలములలో స్థాపింపఁబడినట్లితిహాసము చెప్పదు. హిందుస్థాన మందలి వర్ణవ్యవస్థకు నచ్చటిసమాజమునకు విలక్షణ స్వరూపమై యున్నది. ఈ వ్యవస్థ యొక్క నిజస్వరూపమును పాశ్చాత్యులు తెలిసికొనఁ జాలరు. మరియు నీవ్యవస్థయీదేశమందు నేవిధముగా నుత్పన్నమైనదని వారికి మిగుల నాశ్చర్యము కలుగుచున్నది. హిందుస్థానములోని వర్ణవ్యవస్థ విషయమై వారనేక సిద్ధాంతములను జేసి యున్నారు. కాని యవన్నియు అసత్యములై యున్నవి.

ఈ సిద్ధాంతములను స్థిరపఱుచుటకై (యావశ్యకమైన) కావలసినంత మహాభారతాది గ్రంథ జ్ఞానము పాశ్చాత్యులకు లేకుండెను: ఇందుచేతమరింత గడబిడయైపోయెను. కాఁబట్టి వారి యభిప్రాయముల వైపు ధ్యానముంపక యిపుడు మనము మహాభారతము నుండియు, మహాభారతమునకు మునుపటి వైదిక సాహిత్యము యొక్కయుఁ బిమ్మట మానుస్మృత్యాది సాహిత్యము యొక్కయు] పొలి పరిచూచుట నుండియు నేమియుత్పన్నమగుచున్నదో చూతము. వర్ణవ్యవస్థ యనఁగా నర్థమేమియో ముందుగాఁ జూడవలయును. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులే వర్ణమునకు సరాసరిగాఁ దెలిసను సరాసరి యయిన యర్థముగా నగుపడుచున్నది. కానినేఁడింత తోడనేపని జరగనేరదు.

హిందుస్థానమందిప్పుడనేక జాతులున్నవి. మహాభారత కాలమును గూడ నుండెను. ద్రౌపదీ స్వయంవరమును గర్ణుడు ధనుర్బాణములం దీసికొనుచుండె, లేచినపుడు, ద్రౌపది నేను సూతుని వివాహమాడనని స్పష్టముగాం జెప్పివైచెను. అనంగా ఆ కాలమున సూతజాతి యొకటి ప్రత్యేకముగా నుండెను. మరియు దాని తరగతి యెక్కువ విలువలేనిదియై యుండెను. తాత్పర్యమేమనంగా మహాభారత సమయమున నాలుగు వర్ణములే గాక యింకను నధికవర్ణములు జాతులు నుత్పన్నములై యుండెను. ఈ జాతులెట్లు పుట్టినవి. ఈ ప్రశ్నము మహత్త్వము కలదై యున్నది. మేగాస్థినీజు చంద్రగుప్తుని నాఁడు వ్రాసి యుండిన గ్రంథమందు, ఆ దినములలో హిందుస్థానమందు ముఖ్య జాతు లేడున్నట్లు కొన్ని మాటలున్నవి. దానిఁబట్టి ముందుగా మనము వర్ణములయు జాతులయు ముఖ్యస్వరూపము దెలియునట్టి లక్షణమును స్థిరము చేయవలసి యున్నది. సూక్ష్మముగా సమాజ వ్యవస్థను బరిశీలించిన యెడల నీ లక్షణము త్వరగా జ్ఞప్తికి రాఁగలము. మేగాస్థినీజు కూడ నీలక్షణమును వ్రాసియున్నాడు అతఁడు చెప్పుచున్నాడు. "ఏ జాతియుఁ దన జాతి కంటె నితరజాతితో వివాహమును జేసికొనరాదు. లేక తన జాతి యొక్క (నౌకరీ) పని దప్పవేఱొకరి పని కూడఁ జేయఁజాలదు." అనంగా, జాతి రెండు సంగతులయాధారణములో నున్నది. ఒక సంగతి పెండ్లి లేక వివాహము రెండవది యు పనిపాటలు దైనికప్రవృత్తి ఈ రెండు బంధనములు దక్కి జాతికిఁ బూర్ణ స్వరూపము జ్ఞప్తికిరాదు. ఈ బంధనములు, కొన్ని విషయములలో, అప వాద రూపమున హిందుస్థానమందుఁ బ్రాచీన కాలమున శిథిలమై యుండెను. ఇవి శిథిలములైన వెనుక మఱియు నెట్లుండెనివి, ఇది ముందు విచారింపఁ బడును. జాతి యనఁగా నర్థము పైని చెప్పఁబడిన బంధముల ద్వారా చేయఁ బడిన సమాజ భాగములై యున్నవి. అనంగా, ఒక జాతివారు మఱియొక జాతివారితోఁ గన్యావ్యవహారములను జేయఁ గూడదు. కన్య నిచ్చుటయుఁ బుచ్చుకొనుటయుఁ గూడదు. మఱియు నితరుల పని చేయఁగూడదు. ఈ కారణముల చేతఃజాతుల ప్రత్యేకత (భిన్నత) స్థిరమయ్యెను. అన్నిటికి నిఫలవర్ణ మొకటియై యుండెను. అన్నియు నొకహిందుస్థానమందే నివసించుచుండెను. మరియు నన్నిటి పై సర్గికాధికారము కూడ నొక విధముగానే యుండెను. మరి హిందుస్థానమందు వర్ణవ్యవస్థ యెట్లు బయలుదేరినది. నిట్లునిలబడినది.

అది యితర దేశముల నుండి నెందుకు గాలేను. ఈ ప్రశ్నమునే మనము ముందుగా విచారింపవలయును.

## వర్ణవ్యవస్థ ప్రాచీనమై యున్నది

బ్రాహ్మణులు, కొంతకాలమునకుఁ బూర్వము, హీనత్వముచేత ఫారసీ దేశస్థుల వ్యవస్థ ననుకరించి హిందుస్థానమం దీవ్యవస్థను వ్యాపింపఁ జేసి రనియు; మనుస్మృత్యాది గ్రంథముల యందు ఈ వ్యవస్థకు సంబంధించిన నియమములు దూర్చిరనియు; చాతుర్వర్ణ్యమునకు సంబంధించినయుల్లేఖములు గలవై బయులుదేరినవి గొన్ని క్షత్రియసూక్తములు ఋగ్వేద మందుఁ గూడఁ గలుపబడుట సంతోషకరమనియుఁ గొందఱ యభిప్రాయమై యున్నది. కాని యీ యభిప్రాయము బొత్తిగా నసత్యమై యున్నది. విరాట్పురుషుని నాలుగవయవముల నుండి నాలుగు వర్ణములు పుట్టినవని చెప్పినపురుషసూక్తమును ఋగ్వేద మందుఁ గలుపిరనుట సంభవముగానేరదు. కారణమేమనఁగా ఋగ్వేదములోని ప్రత్యేక సూక్తములు నితర సూక్తములును లెక్కింపఁబడి యున్నవి. శతపథాది బ్రాహ్మణ గ్రంథములలో నీ సంగతి జెప్పఁబడి యున్నది. ఈయభేద్యమైన రీతిని బట్టిఋగ్వేద గ్రంథము బ్రాహ్మణగ్రంథములకు ముందుగా అనఁగా భారత యుద్ధమునకు ముందుగనే క్రీ. పూ. ౫000 వత్సరములకు దాదాపు దిగా స్థిరము చేయఁబడి యుండెనని మనముముందే సిద్ధము చేసి యుంటిమి. సారాంశమేమనఁగ వరభేద కల్పన బ్రాహ్మణులు పిమ్మట నుత్పాదింపలేదు. అది భారతీ యార్యుల యాది యితిహాసము నుండియు యే సాగివచ్చుచున్నది, ఈ సంగతియే విశ్వసించుటయుకు చితమై యున్నది. పై మతమును ఖండిచుటకై యింత దూరము పోవలసిన యవసరమేమియును లేదు. వదతో వ్యాఘాతః అనఁగా దేనిని జెప్పుచున్నామో యదియే యసత్యమై యున్నది. ఈ న్యాయమును బట్టి ముందుగానే యీ ప్రశ్నము కలుగుచున్నది. "బ్రాహ్మణులు వర్ణవ్యవస్థ నుత్పన్నము చేసిరి" ఈ వాక్యమందు బ్రాహ్మణు లెక్కడి నుండి వచ్చిపడిరి? అర్యుల యందు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు ఈ మూఁడు భేదములే ముందుగా నెట్లైనవి? బ్రాహ్మణులకు యధికారము లెట్లు వచ్చినవి, వారి ప్రతాపమెట్లువర్ధిలెను

ఈ ప్రశ్నయు వేఱుగనే యున్నది. అనఁగాఁ బైమతమే యసత్యమై యున్నది. భారతీయార్యుల ప్రాచీనేతిహాసమందే వర్ణవ్యవస్థయొక్క యుద్గమ స్థానము వెదకఁదగి యున్నది.

ప్రతి సమాజమందును వర్ణవ్యవస్థయొక్క బీజము కొద్దియో గొప్పయో తప్పక యుండునని మనకుఁ దెలియుచున్నది. సాధారణ విషయమేమనఁగా, తండ్రియొక్క పనినే కొడుకు చేయుచుండును; అధికాంశము (బాలకులకు) వివాహములు సమానమైన బంధుత్వముగల వారికిని ఒక పనియే చేయువారికిని నడుమ జరుగుచున్నవి. అనఁగా ఒకటి కానిచో మఱియొక తరహాయైన వర్ణవ్యవస్థ ప్రతి సమాజమందును నుండనే యుండును. అందిట్లు చేయుటకై కాఠిన్యశక్తియు లేకుండుటమే భేదమై యున్నది. ఇట్టి స్వరూపము పుట్టుట — బంధనములు పుట్టుట — వీనికిఁ గొంచెమో గొప్పయో కారణముండును. ఆ కారణము సమాజముయొక్క ధార్మిక కార్యములకై యావశ్యకమగు విశేషవిధమైన యోగ్యతయై యున్నది. అనేక లోకుల యితిహాసమునుండి యీ సంగతి యూహకు రాఁగలదు; ధార్మిక కార్యముల వ్యవస్థ వశమైనవార్ని యొక ప్రత్యేక జాగామందు (భిన్నజాతి) తయారగుచున్నది. పారసీకలలోఁగూడ ముందుగా (మోవేద,) నామకమైన యొకజాతి వేఱై పోయి యుండెను. జ్యూ ప్రజలలో దేవతాపూజకుల జాతి వేఱై యుండెను, అనఁగా ఈ జాతిలోని ప్రజలు ఇతర ప్రజలతో సంబంధములు (వివాహములు) చేస్కొనకుండెడి వారు. రోమను ప్రజలయందుఁ గూడ, ధార్మికకృత్యములు చేయుటకు స్వాతంత్ర్యమున్న పేట్రిశియను ప్రజలు, (అన్యాన్య) ఇతర ప్రజలతోఁ గన్యావ్యవహారమును జేయకుండెడివారు. సారాంశమేమనఁగా, లోకుల ధార్మిక వ్యవస్థకు సంబంధించిన జాతి బంధనములు మొట్టమొదలునగును, తరువాత దాని స్థిరతకై విశేషకారణము లేదేనియది రూపు మాసిపోవుట స్పష్టమే యైయున్నది.

## బ్రాహ్మణులు క్షత్రియులును

హిందుస్థానమునకు మొట్టమొదట భారతీయార్యులు రాకపూర్వమే

వారియందు నిట్లు సహజమైనను సామాజిక వ్యవస్థాకారణమున్నగు జాతిశ బంధన బీజముత్పన్నమై యుండెననియే విశ్వసింపవలసి యున్నది; ముందుగా వారిలో రెండు వర్ణము లుత్పన్నములై యుండును—బ్రాహ్మణులు, క్షత్రియులును. ఆర్యుల— దేవతలను స్తుతించుటయే దేవతా యజ్ఞములను జేయుటయు బ్రాహ్మణుల పనియై యుండెను; యుద్ధము చేయుట క్షత్రియుల పనియై యుండెను, రెండు పనులకును రీతియొక్క వ్యాసంగ మావశ్యకమై యుండెను, కాఁబట్టి వారి మొదటి యుద్యమము వలన రెండు విభాగములయ్యెను. ఋగ్వేదములోని యనేకోక్తులఁ బట్టి బ్రాహ్మణులు స్తుతిమంత్రములను జప్తి యుందుంచుకొనుట కంగీకరించిరి. యుద్ధ సమయమున వసిష్ఠుఁడు, ఇంద్రాదీ దేవతల స్తుతిని భరతుల కనుకూలముగాఁ జేయుచుండెడివాఁడు. సుదాసరాపుయుద్ధము చేయుచుండెడివాఁడు ఋగ్వేదములో నీ వర్ణనమున్నది. విశ్వామిత్రుఁడు, భరద్వాజుఁడు, కణ్వుఁడు, అంగీరసుఁడు మొదలైనవారు గూడ నిటువంటి కార్యమునే చేసి దేవతలను భరతుల కనుకూలముగా సంతుష్టులను జేయుచుండెడివారు. సారాంశము, హిందుస్థానమునకు ఋగ్వేదమునాఁడు భారతీయులు వచ్చినపుడు వారిలోఁ బనినిబట్టి రెండు జాతులు సిద్ధమై యుండెను. కాని యపుడీజాతులు అన్యబంధనములచేత బిగించి (కట్టఁబడలేదు) వఁబడలేదు; అనఁగా వారి యాచారవ్యవహారములు భిన్నములై కాకుండెను వారియందుఁ గన్యావ్యవహారమునకు లేక పనికిఁ వ్యాపారమునకు గఠినమైన యాటంకమేదియును లేకుండెను. క్షత్రియులయొక్క బ్రాహ్మణులయు బాలికలు పరస్పరము వివాహము చేయఁబడుచుండిరి; చంద్రవంశ్య క్షత్రియులతోఁ గొందఱు క్షత్రియులు తమ కృత్యమును విడిచి బ్రాహ్మణులగుచుండెడివారు. మహాభారతములోను నున్న చంద్రవంశ వర్ణనమువల్ల నీ విషయము స్పష్టపడుచున్నది. ప్రతీపుని పెద్దకుమారుఁడగు దేవాపి క్షత్రియోద్యమమును విడిచిపెట్టి వనములో తపస్సుచేయుచుండెను. అతఁడొక

సూత్రమును గూడఁ దయారుచేసియున్నాఁడు. మతినారుని వంశమునఁ గణ్వుఁడు పుట్టి యుండెను. అతఁడు బ్రాహ్మణుఁడయ్యెను. అతని వంశజు లందఱును గూడ బ్రాహ్మణులేయైరి. ఈ కణ్వవంశ్యులు ఋగ్వేదములోఁ గొన్ని సూక్తములకుఁ గర్తలై యున్నారు.

నిస్సందేహముగా నా సమయమున బ్రాహ్మణులు స్వతంత్రోన్నతి తత్పరులై కూర్చుండి యున్నట్లు కనబడుచున్నది; అనగా యజ్ఞయాగాది క్రియలను మేమే చేయవలయునను పట్టుదల వారికుండెను. వేద విద్యను బఠించుటయనెడు కఠినకార్యమును బ్రాహ్మణులు ప్రచారములో నికిఁ దీసికొని వచ్చిరి. యజ్ఞయాగాదుల విషయమై యావశ్యకమైన వేర్వేఱు జ్ఞానమును మంత్రతంత్రములను వారు సురక్షితముగా నుంచిరి. బ్రాహ్మణుల కర్మము కఠినమైపోయెను. వారు తమ బుద్ధియొక్క శక్తిని పెంపుచేయవలసి వచ్చెను. ప్రతి యుద్యమమునకును వంశాను గతమైన సంస్కారము చాలనుపయోగించుచున్న సంగతి ప్రసిద్ధమే యై యున్నది. అనఁగా బ్రాహ్మణ బాలకులే జ్ఞాపకశక్తివలన వేదవిద్యను గ్రహించుటకై యుక్తులగుచుండిరి. కాఁబట్టి బ్రాహ్మణబాలుఁడే బ్రాహ్మణుఁ డగునను పట్టుదల మాత్రమును పెద్ద విషయముకాదు. ఈ పట్టుదల (అపరిహార్యమై) సహజమైయున్నది. కాని మొదట క్షత్రియులు బ్రాహ్మ ణులయొక్క యీ మాటను (పెల్ల)సాగనీయలేదు. వసిష్ఠ విశ్వామిత్రుల వివాదమును బట్టి క్షత్రియులీవిషయమై చాలఁ బోరాడిరని స్పష్టమగు చున్నది. దీని తరువాత వేర్వేఱు స్వరూపములు రామాయణ మహాభార తములందుఁ గనఁబడుచున్నవి, కాని తాత్పర్యమన్నిటికి నొకటియే యై యున్నది. బ్రాహ్మణ బాలుఁడు బ్రాహ్మణుఁడనియు క్షత్రియబాలుఁడు క్షత్రియుఁడనియు బట్టుదలఁ ఆగ్రహము బ్రాహ్మణులకుండెను; కాని విశ్వామిత్రుఁడు, క్షత్రియబాలుఁడు తన బుద్ధిశక్తిని వృద్ధిపొందించుకొను నెడల నతఁడు బ్రాహ్మణుఁడగుటకు నాటంకమేమియున్న దనిపట్టుపట్టెను. తుదకు జయము విశ్వామిత్రునికే కలిగెను. అతఁడు స్వయముగా బ్రాహ్మణుఁడయ్యెను. ఇంతేకాక పిమ్మట నతఁడనేక బ్రాహ్మణ కులము లకుఁ బ్రవర్తకుఁడు కూడ నయ్యెను. ఆది పర్వమున వసిష్ఠ విశ్వామి

త్రుల కథ కలదు, దానిబట్టి యీ కథ బహు ప్రాచీన కాలికమని తెలియుచున్నది. ఈ కథ సూర్యవంశ్య క్షత్రియులనాఁటిదియుఁ బంజాబులోనిదియు నై యున్నది. వసిష్ఠఋషి విపాశ, శతద్రు అనెడి నదులలో బ్రాణములఁ ద్యజించుటకు యత్నించెను. ఎందుచేతననఁగా విశ్వామిత్రుఁ డతనియొక్క నూఱుగురు కొడుకులను జంపివైచెను. కాని యానదులు వసిష్ఠుని మునుఁగనీయలేదు: ఈ కారణముచేతనే యానదులకు విపాశయనియు శతద్రువనియు నామములు వచ్చినవి, (భా, ఆది, అ 177) ఇదే విధముగా మఱియొక వర్ణనము విశ్వామిత్రుఁడు సూర్యవంశీయుఁడగు కల్మాష పాదుఁడను రాజుచే యజ్ఞము చేయించియుండెను. ఈ కథనుబట్టి యీ జగడము చాల కాలము క్రిందటిదనియు నిది పంజాబులో జరిగెననియుఁ బ్రకటమగుచున్నది. ఆ. సమయమున, బ్రాహ్మణులని యనిపించుకొనుటకై ఎక్కువ యభిలాష పడుచున్న క్షత్రియులు బ్రాహ్మణులు కాఁగలిగిరి: కాని యిట్టి వ్యక్తులు బొత్తిగాఁ దక్కువ యుందురను సంగతి ప్రకటమే యై యున్నది: బ్రాహ్మణుల యుద్యమమగు వేద పఠనము, యజ్ఞయాగాదిక్రియానుష్ఠానము మిగులఁ గఠినములై యుండెను: ఈ కారణముచేత నాయ్యవితుదకు బ్రాహ్మణుల హస్తమందే యుండెను,

వసిష్ఠ విశ్వామిత్రుల జగడమునందు వర్ణో (వ్యవసాయ) ద్యమ విషయకమైన బంధనముయొక్క సమానత్వమునకై దగిన పరీక్షవలెనె నహుషాగస్తి కథయందు జాతియొక్క యొకట రెండు తత్వముల పరీక్ష జరగెను. "బ్రాహ్మణుల కృత్యము నితరులెందులకుఁ జేయఁగూడదు. అను నీ జగడమునకుఁ దోడు, మఱియొక జాతివారి పనిని బ్రాహ్మణునిచే నెందులకుఁ జేయింపఁజాలరు? అని యింకొక ప్రశ్నము కలుగుచున్నది. నహుషుఁడు తనపాలకీని మోచుటకై ఋషులనందఱ నాజ్ఞాపించెను: ఋషులు పాలకినెత్తుకొని వడి వడిగా నడువజాలనియపుడు అతడు వారితో

"సర్ప సర్ప" అనఁగా "నడు నడుము" అని చెప్పఁ దొడఁగెను. అపు డగస్త్య నీవు సర్పమేగాను పొమ్ము, అని అనెను. అతఁడు సర్పమై క్రిందఁ బడెను. (భా. వన. అ 181). ఈ కథకు, బుద్ధి కార్యము చేయు వారియందు శారీరక పరిశ్రమము చేయు శక్తియుండఁజాలదనియే తాత్పర్యము.

## వైశ్యులు — శూద్రులు

ఈ ప్రకారముగా ఋగ్వేదమునాఁడు ప్రాచీనార్యులు హిందుస్థానము నకు వచ్చినపుడు వారిలో రెండు జాతులుత్పన్నములై యుండెను; కాని ఆనాఁటి దశకు వానియందు బిగువైన బంధనము లేప్పడియుండలేదు. పంజాబునకు వచ్చి వారు స్థిరపడినపుడు సహజముగనే మూఁడవ వర్ణ ముత్పన్నమయ్యెను. దేశములో గృషి ముఖ్యవ్యాపారముగా నుండెను, చాలమంది యీ (వ్యవహారము) పనినే చేయుచుండిరి. వీరొకచోటనే నివ సించిరి. లేక వీరు ఉపనివేశముల నేర్పఱచుకొనిరి, కాఁబట్టి వీరు విశులు లేక వైశ్యులు అనఁగా సామాన్యముగా స్యులని యనిపించుకొన సాగిరి. ఋగ్వేదములో విశశబ్దము తఱచు వచ్చుచున్నది. దానిఁబట్టి పంజాబులో మూఁడు జాతులుత్పన్నములై యుండెనని ప్రకటమగుచు న్నది. మొదట రెండు జాతులు మాత్రముండెడివను వర్ణనము రామాయ ణములో నున్నది; పిమ్మటఁ త్రేతాయుగము నమూఁదయ్యెను. ఆ వర్ణన మిచట యుక్తి యుక్తముగాఁ దోఁచుచున్నది. సారాంశమేమనఁగా, సూర్యవంశక్షత్రియులు నివసించినపుడు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్యజాతులు మూఁడుత్పన్నములయ్యెను. దీనికిఁ బిదప వెంటనే దాసులయొక్క లేక మూలనివాసులయొక్క సమావేశము వాల్గవ శూద్రజాతియందుఁ గానారం భించెను. పై మూఁడార్యవం జాతులకుఁ బేరు త్రైవర్ణికమని యయ్యెను. మరల నిప్పటినుండి జాతికిఁ గటిన నియమముల స్వరూపములుత్పన్నము కాఁదొడఁగెను.

హిందుస్థానమున కార్యులు వచ్చినపుడు వారియందు జాతిబంధన బీజము కొలదిగా నుండెను; బ్రాహ్మణులు క్షత్రియులు నీ రెండు జాతులు లేక బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల వృత్తి భేదమువలన నుత్పన్నమైన మూఁడు జాతులుండెను. ఇట్టి భేదములు ఫారిస్ దేశస్థులయందుఁగూడ నుండెను. రోమనులయందుఁ గూడ నుండెను. జర్మనులయందుఁ గూడ నుండెను. ఆ దేశములయందు, జాతి భేదమునకు వివాహ ప్రతిబంధనములందు నాధారము దొరకి, యభేద్య బంధనములుగల జాతులనెడి వృక్షములు హిందుస్థానమందు వలెనే యెందుకుత్పన్నములు కాలేదు? అను గొప్పమహత్త్వముగల ప్రశ్నము కలుగుచున్నది. ఆర్యశాఖ లన్నిటియందును జాతికి సధికమైన బంధనముండెను. అట్టి స్థితిలో (అపుడు) హిందుస్థానమందే జాతి బంధనమునకుఁ బ్రాబల్యము పెరుఁగుటకై కారణము ఇచటి విశేషపరిస్థితి యని ప్రకటమే యగుచున్నది. ఆ పరిస్థితి వైపుటినుండి వచ్చిన యార్యులకును హిందుస్థానమందు నివసించిన దాసులకు నేక యనార్యులకును నడుమనున్న గొప్ప యంతరమే యై యున్నది. ఆర్యులు గౌర వర్ణముగా నుండిరి. వారి నాసిక సుందరమై యుండెను; దీనికి విరుద్ధముగా అనార్యుల రంగు నల్లదిగను ముక్కు చప్పిడిదిగను బల్లపుపుది గనుండెను. వారికిఁగల బుద్ధిశక్తియందుఁ గూడఁ జాలనంతరముండెను. రెండవ యార్య శాఖలు వెళ్ళిన యూరోపు మొదలగు దేశములందెచ్చటను నిటువంటి పరిస్థితి లేకుండెను. ఆ దేశములోని ప్రాచీన నివాసులు చాలమంది యార్యవంశపువారే యై యుండిరి, అక్కడివారు ఆర్యవంశము (లోని) వారు కానప్పటికిని రంగునను బుద్ధియందును గ్రొత్తగా వచ్చిన యార్యులకంటె నెక్కువ భేదముగలవారు కాకుండిరి. జర్మనీయందిట్టి భేదము బొత్తిగనే కనఁబడదయ్యెను. రోములోఁ గొలది పాటి భేదమవశ్యముగా నుండెను, కొన్ని దినములవఱకు వివాహోటిరము లగుబంధములు రెండు జాతులయందు నుండెను. కాని యది శీఘ్రముగనే తొలగింపఁబడి పోయెను. గ్రీకులకును ఫారసీలకును గూడ నిట్టి స్థితియే యుండెను. ఒక హిందుస్థానమందే యుభయ జాతుల మిశ్రణ మసంభవమై రెండింటి నడుమను వాదమారంభమై యిప్పటి వఱకు నశింపని యంత బలమైన భేదముండెను. తులసీదాసు తన కాలములో నిట్లున్నదని

వర్ణించియున్నాఁడు-- "వాదహి శూద్ర ద్విజానసే, హమతరుసే కుఘు ఘాటి॥ జానహి బ్రహ్మసో విప్రవీర అఖి దిఖావహి డాటి॥" అనఁగా, బ్రాహ్మణులతో శూద్రులు మేము మీకంటె నేమిటఁ దక్కువ వారమని వివదించుచున్నారు. వారు తంత్ర (తాశేరదార) వెట్లువేసి బ్రహ్మజ్ఞానము కలుగువాఁడే బ్రహ్మణుఁడని చెప్పుచున్నారు. ఇట్టి జగడము అప్పటినుండియు సాగి వచ్చుచున్నది. మఱియు నార్యులతో నుత్పన్నమైన జాతి బంధనము వీరి కారణమున (నెన్కపగా) నింకను దృఢపడి, వేఱు వేఱు జాతులనేక ముత్పన్నములయ్యెను. దీనికిఁ బిమ్మట యితిహాసము మహాభారతమువలనఁ జక్కఁగాఁ దెలియుచునే యున్నది. హిందుస్థానములోని యీ విచిత్ర పరిస్థితికి సమానమైన పరిస్థితి యితిహాసములోఁ గొంలము దక్షిణాఫ్రికాయందే యుత్పన్నమై (దృష్టి గోచరమగుచున్నది) కనిపించుచున్నది. అచట గౌరవర్ణము (తెలుపురంగు) గల యూరోప్యులకు నల్లని (గ్రోజాతి వారి) తో సంబంధము తటస్థించిన కారణముచేత హిందూస్థానము వంటి పరిస్థితి కొంత యుత్పన్నమై యున్నది. దానిఁబట్టి మనము కొంచెము అంచనావేయు వేయఁగలము.

## శూద్రుల కారణమున వర్ణముల యుత్పత్తి.

హిందుస్థానములో వర్ణజాతి శబ్దములకున్న నిట్టి సంబంధమునకుఁగూడ నిదియే కారణమై యున్నది. పాశ్చాత్య దేశములలో జయించిన వారికి (జితులకు) జయింపఁ బడినవారికిని (జితులకు) వర్ణ మొకటియే యగుటచేత వర్ణమునకు మహత్త్వమేమియు నీయఁబడఁ జాలదయ్యెను. ఇచట హిందుస్థానములో వారి రంగునకు భూమ్యాకాశముల యంతరముండుటఁ బట్టి రంగునకు జాతియొక్క రూపము తటస్థించెను. వారి సంబంధమువలన నార్యవంశీయుల యందుఁ గూడ రంగునకుఁ గొంచెము భేదము తటస్థించెను. వైశ్యులు కృషికర్మమును జేయుచుండుటచేత వారి తెలుపురంగు పసుపురంగుగా మాఱెను. గాలి, వ్యాసంగము వీని భేదముచేత క్షత్రియుల రంగు గూడ యెఱ్ఱగా మాఱిపోయెను బ్రాహ్మణులరంగు మాత్రము యథాప్రకార మార్యులదిగనే (మిగిలి) యుండెను, అనఁగా వారు తెల్లగనే యుండిరి. ఇందుచేత ననేకకార

ణములఁబట్టి యనేకాపవాదము లుత్పన్నమగుచున్నవనుట సత్యమై యున్నది. అయినను బ్రాహ్మణులు తెలుపు, క్షత్రియులు ఎఱుపు, వైశ్యులు పసుపు, శూద్రులు నలుపు అనెడి నియమము సాధారణమై యున్నది. ఈ కారణము చేతనే నాలుగు యుగములలో విష్ణుని నాలుగు రంగులును, మాఱునను కల్పన వచ్చెను. నల్లని బ్రాహ్మణుఁడు తెల్లని శూద్రుఁడుకాని యున్నచో నీ విషయమై మనలోఁ గలిగిన భయంకర కల్పనకుఁ గూడ నిద్దియే కారణమై యున్నది. ఈ ప్రకారముగాఁ జాతుర్వర్ణ్యము అనఁగా రంగుచే నిశ్చితములైన నాలుగు జాతులను హిందుస్థానమున నుత్పన్నమయ్యెను, వీనిలో విరోధమే విధముగాఁ బెరిఁగిపోయెనో యిపుడిచ్చటఁ జూడవలయును.

తొలుదొల్త నార్యులు హిందుస్థానమునకు వచ్చినపుడు వారిలో మూఁడు జాతులే యుండెను. గన్యలనిచ్చి పుచ్చుకొనుట (కన్యావ్యవహారము) లోఁ గొంచెపాటి యాటంకముండెను. బ్రాహ్మణులకు మూఁడువర్ణములలోను నేకన్యను వివాహము చేసికొనుటకును నిషేధమేమియు లేకుండెను. కాని క్షత్రియులు బ్రాహ్మణేతరములైన రెండు వర్ణములలోని కన్యకలఁగైకొనఁ వచ్చునని గలరనియు వైశ్యులు మాత్రమొక వర్ణమందే అనఁగా వైశ్యులయందే వ్యవహరించుకొనవలయుననియు నియమముండెను. నాల్గవ శూద్రవర్ణము సమాజములోఁ గలిసిపోవునపుడు సమాజములో శూద్రవర్ణమందలి కన్యకలను గైకొనుట గైకొనకుండుట విషయమై గొప్ప మహత్త్వముగల జగడము తటస్థమయ్యెను. చాలమంది లోకుల సాధారణ రీతినిబట్టి వారి కన్యలను వివాహమాడుటకు విరుద్ధముగా నుండుట మామూలు సంగతి యయ్యెను. మరల వైశ్యుల వ్యాపార కృషి ఆగుటచేత వారికిని శూద్రులకును విశేష సంపర్కముండెడిది, వైశ్యునికొక వర్ణమందే వివాహము చేసికొను నధికారముండెను. ఇందుచేత వారియందు శూద్రకన్యను వివాహమాడు పద్ధతి మిక్కిలి యెక్కువగాఁ బ్రచారములోనికి వచ్చియుండును. క్షత్రియులయందు వీరికంటెఁ దక్కువగను బ్రాహ్మణుల యందు మిక్కిలి తక్కువగను వచ్చియుండును. ఇటువంటి స్త్రీలనుండి కలిగిన సంతానమునకు రంగు మిశ్రణమై బుద్ధిమిశ్రమై మరల నుండి యుండునని తోఁచుచున్నది. స్త్రీ యేవర్ణపుది యైనను దాని సంతానము

నకుఁ బతియొక్క వర్ణమే యగుచుండుటయే పురాణ నియమమై యుం డెను. అనఁగా బ్రాహ్మణునికి క్షత్రియ వైశ్య స్త్రీలయందు పుట్టిన సంతా నము బ్రాహ్మణులనియే విశ్వసింపఁబడుచుండెడిది. ఆర్యులు మొట్టమొదట వచ్చినపుడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల రంగునందును బుద్ధియందును నెక్కువ యంతరము లేకుండెను. అన్న పానాదులయందును నెక్కువ భేదము లేకుండెను. ఈ కారణము చేత నీ నియమము సరియైనదిగానే యుండెను. శూద్ర కన్యలను వివాహమాడవచ్చునను మీఁదఁ గూడ నా నియమమే యుంపఁబడునో లేక యేమి చేయఁబడును అను ప్రశ్న లపుడు కలిగెను.

పూర్వకాలమున నిజముగా నిట్టి నియమముండెను. మహాభారత ములోనొక మహనీయ శ్లోకమునుబట్టి యీ సంగతి తెలియుచున్నది. అనుశాసనపర్వములో 44 వ యధ్యాయమందు, బ్రాహ్మణుఁడు మూడు వర్ణముల కన్యకలను గైకొనఁగలఁడనియు, అతనికి వీరివలన గలిగిన సంతతి బ్రాహ్మణులే యగుదురనియుఁ జెప్పఁబడి యున్నది.

త్రిషువర్ణేషు జాతోహి బ్రాహ్మణా బ్రాహ్మణో భవేత్ ॥
స్మృతాశ్చ వర్ణాశ్చత్వారః పంచమో నాధిగమ్యతే ॥

ఇందు, మూఁడు వర్ణముల స్త్రీలయందునయు బ్రాహ్మణునికి బ్రాహ్మ ణుఁడే యగునను నియమము చెప్పఁబడి యున్నది; తరువాతఁ దరువాత నీ నియమము మాఱిపోయే యున్నది. మహాభారతమందే యీ నియమము మాఱినట్లు (ప్రమాణము) లభించుచున్నదను సంగతి జ్ఞప్తియందు కొనఁ దగియున్నది. (అనుశాసన. అ. 48) లో, (కేవలము రెండు స్త్రీల బ్రాహ్మ ణులు క్షత్రియులు—నుండియే బ్రాహ్మణ సంతతి యుత్పన్నమగుట చెప్ప బడి యున్నది) బ్రాహ్మణ క్షత్రియ స్త్రీ బిడ్డలనుండియే బ్రాహ్మణ సంతతి యుత్పన్నమగుట చెప్పఁబడి యున్నది. మనుస్మృతిలో నున్న నియమ మీ సంకుచిత నియమమే యై యున్నది. దీనింబట్టి, మొదటి నియమము కొంత బిగువులేనిది యై యుండెనని ప్రకటమగు చున్నది.

మఱిలనది సంకుచిత మయ్యెను. మహాభారత సమయమున అనఁగా సౌతి సమయమున రెండువర్ణముల స్త్రీలనుండి పుట్టిన సంతతియే బ్రాహ్మణత్వము మన్నింపఁబడెను. బ్రాహ్మణజాతి స్త్రీ యొక్క లేక క్షత్రియజాతి స్త్రీయొక్క గర్భమునుండి యుత్పన్నమైన బ్రాహ్మణ సంతతి బ్రాహ్మణుఁడుగా నమ్మఁబడు ననెడి నియమ ముత్తరోత్తరాభి వృద్ధినయ్యెను. పిమ్మట నిందుఁగూడ సంశోధనమయ్యెను యాజ్ఞవల్క్యాదిస్మృతులయందు, బ్రాహ్మణునికి బ్రాహ్మణ స్త్రీ నుండి సంతానము కలిగినపుడే యది బ్రాహ్మణుఁడుగాఁ జెప్పఁబడునని చెప్పఁబడి యున్నది. శాంతము, అనుశాసన పర్వములో మొదటి వచనము విశేషించి, ఆర్యులు హిందూస్థానమునకు వచ్చినపుడు ప్రచలితమైన నియమమును జూపుచున్నది. అప్పటి తాత్పర్యమేమనఁగా, బ్రాహ్మణునికి మూఁడు వర్ణముల నుండియుఁ గన్యలను గైకొను నధికార మున్నది; మఱియు వారి గర్భమునుండి యాతనికిఁ గలిగిన సంతానము బ్రాహ్మణుఁడే యగు చున్నాఁడు. ఈ నియమమునే యుపయోగించి బ్రాహ్మణుఁడు శూద్రకన్యను వివాహమాడిన యెడల నతని సంతానము బ్రాహ్మణుఁడు గనే తలంపఁబడునా లేదా? మత్స్య గంధి యొక్క గర్భమునుండి పరాశర ఋషికిఁ బుట్టిన వాఁడును బ్రాహ్మణులలో మేధావియు శ్రేష్ఠుఁడునైన వాఁడునగు వ్యాసమహర్షి యట్లే పుట్టియుండెను. ఇది యనుకరింపఁ బడునా? లేక "సదేవచరితం చరేత్, అను న్యాయముఁబట్టి వ్యాసఋషి యొక్క యుదాహరణమును విడిచిపెట్టి, శూద్ర స్త్రీ నుండి పుట్టిన సంతతి తక్కువ తరగతిదిగా నెంచఁబడునా? ఈ ప్రశ్నము పెద్ద జగడపుదియు వాద వివాదపుదియు నగును. దీని నిర్ణయము తుదకు శూద్ర స్త్రీకిఁ బ్రతికూల మయ్యెననుట సహజమే యై యున్నది. ఇంత భిన్నపరిస్థితిగల వర్ణముల సంతతి యెన్నఁడును దేజస్వి కాజాలదు. కనుకనే బ్రాహ్మణుఁడు శూద్ర కన్యను గ్రహింపరాదనియే నిర్ణీతమై పోయెను. ఇది మహాభారతమందును జెప్పఁబడి యున్నది--"లోంపటికి నియమము మాన్యము కాదు "కాని యచట, గొప్పవారు శూద్రవర్ణ స్త్రీ యందు సంతానము నుత్పాదింపరను సంగతియుఁ జెప్పఁబడి యున్నది. ఈ వివాదము చాలఁగనే యెక్కువయై యుండెనని తెలియుచున్నది. శూద్ర స్త్రీ నుండి యుత్పన్నుఁడైన పుత్రునికి ( సంపత్తి ) ఆస్తిలో

భాగము వచ్చునా? రాదా? ఈ ప్రశ్నము కూడ నుపస్థితమయ్యెను. మహాభారతకాలమందే, వానికి 1/10 అంశమీయనగునని నిర్ణయము గూడ జేయఁబడి యున్నది. కాని మహాభారతమునకుఁ దరువాత స్మృత్యాది సమయమున, వానికిఁ గొంచెము కూడ భాగమీయఁ బడదని నిర్ణయింపఁ బడి యున్నది. అగుఁగాక: శూద్ర స్త్రీ నుండి యుత్పన్నుఁడైన పుత్రుని జాతికిఁ దాదాపు బ్రాహ్మణునికంటె భిన్నమగు నిర్ణయము చేయఁ బడుట సహజమే యై యుండెను. ఎందుచేత ననఁగా వారిరువురి వర్ణ ములయందును బుద్ధిమత్త యందును జాల నెక్కువ యంతరముండెను మఱలఁ గొందఱు దీనికిఁ బ్రతికూలురుగనే యుండిరి. మనుస్మృతిలో బీజక్షేత్రముల పరస్పర మహత్త్వాదము జాల నధికముగా వర్ణింపఁబడి యున్నది, శూద్రస్త్రీ క్షేత్రమును బ్రాహ్మణజాతి బీజము నైనచో మహ త్త్వము దేనికీయఁబడును ఎంత యీయఁబడును? ఈ వాదము మనుస్మృ తిలో మిక్కిలి యెక్కువగా విస్తృతమై యున్నది. తుదకు, బ్రాహ్మణుని వల్ల నుత్పన్నమైన శూద్ర స్త్రీ యొక్క సంతతి బ్రాహ్మణుఁడునా నెంచఁ బడలేదు శూద్రుఁడుగను నెంచబడలేదు. ఒక స్వతంత్ర జాతిగా నుంచి దాని తరగతి కూడ వేఱుగనే యుంపఁబడెను. అనుశాసన పర్వముయొక్క 48 వ యధ్యాయమునందు నీ జాతికి నామము పారశవమని యుంపఁ బడెను. దాని కర్థమేమనఁగా—

> పరంశవాద్బ్రాహ్మణస్యైష పుత్రం। శూద్రాపుత్రం పారశవం
> విదుః। శుశ్రూషకః స్వస్య కులస్య స స్యాత్ స్వచారిత్ర్యం
> నిత్యమథో న జహ్యాత్॥

"బ్రాహ్మణునికి శూద్ర స్త్రీ నుండి పుట్టిన పుత్రుని శవమునకంటె నావలి వానిగా అనఁగా, పారశవునిగా నెఱుఁగవలయును. వాఁడు తన కులమునకు శుశ్రూష చేయవలయును మఱియుఁ దానునిత్యకర్మమును విడువఁగూడదు." ఈ భేదభావము చేతను నుచ్చ వర్ణమునందుఁ గూడ నితర వర్ణముల వారి కన్యకను గైకొనుట కాటంకము మెల్ల మెల్లగా నవకాశమును బొంద నారంభించెను. క్షత్రియుఁడు శూద్రను వివాహ మాడునేని దాని గర్భమునుండి పుట్టిన సంతానము నతియొక్క వర్ణము

దిగా నెంచఁబడ నారంభమయ్యెను. ఇట్టి సంతతికిఁ బేరు ఉగ్రుఁడని తట స్థించెను. కాని వైశ్యవర్ణమునకు వైశ్యశూద్ర వర్ణములు రెండింటిలోని కన్యకను వివాహమాడు నధికారముండెను, ఇందుచేత, ఇద్దఱు నుండియే వైశ్యసంతాన ముత్పన్నమగుచున్నదని చెప్పఁబడి యున్నది. కాని తరు వాత నొక స్మృతికారుఁ డీ సంగతిని మన్నింపలేదు. మహాభారత కాలము నకుఁ బిమ్మట నీ సంగతికూడ లేదయ్యెను. ఇంతకంటెఁ బూర్వము సూత్రమారీతి యుండనే యుండెను. కనుక వైశ్యజాతియందు శూద్రు లకు నధికమైన మిశ్రణమై పోయెను. ఇందుచేత వైశ్యులార్యుల గుటలో గొంచెము సందేహము కలిగెను. బ్రాహ్మణుఁడు వైశ్యబాలికను వివాహ మాడునేని దాని సంతానము బ్రాహ్మణుఁడుగా నెంచఁబడఁడు వాఁడు వైశ్యుడుగా నెంచబడును లేక యంబష్ట జాతి వాడుగా నెంచఁ బడును అని నిర్ణయము చేయఁబడెను. సారాంశమేమనఁగా, వేఱు వేఱు వర్ణముల బాలికలను వివాహమాడు విషయమై యించించుక విచారము బంధనము నుత్పన్నములు కాఁదొడఁగెను. ఇది యనులోమ వివాహ విష యమైన సంగతి, ప్రతిలోమ వివాహ విషయమై యారంభము నుండియు విరుద్ధమైన కటాక్షమగపడు చున్నది. కాని మొదట నుచ్చ వర్ణములోని కన్యకలను వివాహమాడుటకు నీచవర్ణములకు నిషేధము లేక పోవచ్చును మఱల వెంటనే యాటంకమై యుండును. ఎందుచేతననఁగా ఇట్టి నింద్య మైన వివాహము లేక సంబంధమువల్లఁ బుట్టిన సంతానముయొక్క తర గతి బొత్తిగనే చులకనగా (నెంచఁబడి యున్నది) చూడఁబడి యున్నది. క్షత్రియునుండి యుత్పన్నుఁడైన బ్రాహ్మణ స్త్రీ యొక్క కుమారుఁడు సూతజాతి వాఁడుగా నెంచఁబడి యున్నాడు బ్రాహ్మణ స్త్రీకి వైశ్యు నుండి పుట్టిన పుత్రుఁడు వైదేహకుఁడుగా నెంచఁబడి యున్నాఁడు. బ్రాహ్మణ స్త్రీ నుండి శూద్రునికి సంతానము కలిగినట్లైన నప్పుడది బొత్తి గనే నింద్యముగా నెంచఁబడి యున్నది. వాఁడు చాండాలుఁడుగా దలంపఁ బడు చుండెడివాఁడు. ఆర్యులైన మాతాపితల నుండియే యుత్పన్ను డైన కారణముచేత సూతుఁడును వైదేహుఁడును వైదిక సంస్కారములకు బాహ్యులుగాఁ దలంపఁ బడరైరి. కాని చాండాలుఁడు మాత్రము నస్పృశ్యుఁ డుగా నెంచఁబడి యున్నాఁడు, ఇంతమాత్రమేకాదు. గ్రామములో నుండు

టకుఁ గూడ ననర్హునిగా నెంచి వాఁడు గ్రామమునకు బయటనే యుండవ లయునను బంధనము చేయఁబడియెను. [అను. అ. 48] బ్రాహ్మణ గ్రంథములలోఁ గూడ నీ నియమ మగపడుచున్నది. దీనిఁ బట్టి దాని యొక్క ప్రచారము బహు ప్రాచీన కాలమునుండి యుండి యుండు నను జాడ నిర్వహమగుచున్నది.

ఉచ్చవర్ణములోని కన్యకలు నీచవర్ణములకు విశేషించి శూద్రులకు గృహిణులుగా నుండుటవలన భయంకరమగు హాని కలుగునని దృఢనిశ్చ యము బహు ప్రాచీనకాలము నుండియు నడచి వచ్చుచున్నది. ఇది స్వాభావికమై యున్నది. రెండు వర్ణములలోఁ జాలా భేదము అనఁగా నొకటి తెల్లనిదియు రెండవది నల్లనిదియు నైనపుడు, మఱియు వాని సభ్యతయందును జాల నంతరము అనఁగా నొకటి [శుద్ధ] జనపం తము రెండవది పొత్తిగా నజ్ఞానములో మునిఁగినది యిట్లు పొత్తిగా ననుంగళ రీతిగా నుండునది యైనపుడును, ఇటువంటి వర్ణముల మిశ్ర ణము విశేషించి ప్రతిలోమ మిశ్రణము [అనఁగా ఉచ్చవర్ణములోని యొక్క స్త్రీకిని నీచ వర్ణములోని పురుషుని యొక్క [కిని] మిశ్ర ణము] నింద్యముగా నెంచఁబడునేని యాశ్చర్యమేమియును లేదు. బ్రాహ్మణ కాలము మొదలుకొని మహాభారతము వఱకు వర్ణ సంకేతమును మిక్కిలి నిందించుటకిదే కారణమై యున్నది. వర్ణ సంకరము వలన చాండాల తుల్యమైన నీచ సంతానము కలుగునని యూహింపఁబడుచుండెడిది. దీనికి [గారణము రెండు వర్ణములయందును సభ్యతా స్వరూపము భిన్నముగా నుండుటయై యున్నది. భగవద్గీతయందుఁ గూడ వర్ణసంకరము వలని భయమెక్కువగాఁ జూపఁబడి యున్నది. అందు సంకరము వలన గలుగు దుష్పరిణామము "సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య" అని చెప్ప బడి యున్నది. వర్ణ సంకరము కాకుండ రాజుదూడఁ జూచుచుండవలయు ననియుఁ జెప్పబడు చుండెడిది. వర్ణ సంకరము కాకుండుటకై [రాజు లెంత పరిశ్రమము చేయుచుండిరో, ప్రజలు వారి నంతయే పొగడుచుం డిరి] రాజులు పరిశ్రమము చేసిన కొలఁదియు ప్రజలు వారిని పొగడు

చుండిరి. వర్ణ సంకరమగుట యెక్కువ పాపముగా నెంచబడు చుండెను. లోకులు దానినెక్కువ యసహ్యించు కొనుచుండిరి.

## వర్ణ సంకర భయము

పంజాబులోని కొందఱు లోకుల ప్రస్తుత పరిస్థితిఁబట్టి వర్ణసంకరము వలని భయంకర పరిణామము కేవలము కల్పన కాదనియుఁ బ్రత్యక్షమై యుండెననియుఁ దెలియుచున్నది. కొందఱు లోకులు 'బ్రాహ్మణ స్త్రీనుండి శూద్రుని కుత్పన్నుఁడైన పుత్రుని చాండాలుఁడని విశ్వసించు కల్పన కేవలము ధర్మశాస్త్రపుదియై యున్నది. వాస్తవమునను నిట్టి సంతానము చాండాలుఁడుగా విశ్వసింపఁబడి యుండలేదు. చాండాలురు ఇచ్చటి మూల నివాసులలో మిగుల నీచులును దుస్థితిగల లోకులునై యున్నారు." అని చెప్పుచున్నారు. కాని శీర్షరూపన శాస్త్రమునుబట్టి, పంజాబులోని యస్పృశ్య జాతులలోనున్న చూహడ్ జాతివారి యందు అసలు (మూల) ఆర్యజాతి యొక్క మిశ్రణము కలదు. చాండాలురి యొక్క యీ జాతిఁ పైని వ్రాయఁబడినట్టుగా, ఉత్పన్నమై యుండుననుట సంభవమై యున్నది. చూహడుల యుదాహరణము బట్టి వర్ణసంకరము వలని భయముచేత భిన్న జాతులెట్లుత్పన్నము లైనవో వ్యక్తము కాఁగలదు. ప్రతిలోమ వివాహ విషయమునఁ జూపఁబడియున్న వర్ణసంకర భయముచేతఁ బిమ్మట నిట్టి వివాహము లాఁగి పోయియుండును. ఇంతియేగాక యనులోమ వివాహ ములు సైతము మెల్ల మెల్లగాఁ దగ్గిపోయెను. అనులోమ వివాహము వల్లఁ బుట్టిన క్రొత్త జాతులు తమలోనే తాము వివాహములు చేసికొను నియమమును స్థిరపఱుచుకొనెను.

వర్ణ సంకరముచే ననిష్టము కలుగునని భయపడి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు నాలుగు వర్ణములును దమ దమ వర్ణములలోనే వివాహ ములు చేసికొన నారంభించిరి. ఈ సిద్ధాంతము పైని, ఇట్లు జేయుటలో బ్రాహ్మణులు బొత్తిగా నన్యాయము చేసిరని యాక్షేపము రాఁగలదు. బ్రాహ్మణులకును శూద్రులకును వివాహ సంబంధమున్న మీఁదటఁ గలిగిన సంతానము తక్కువ తరగతిదియని యెందుకు విశ్వసింప బడవలయును?

పరమేశ్వరుఁడందఱు లోకులకు సమానమైన బుద్ధినిచ్చి యున్నాఁ డనునాక్షే పము సహజమే యై యున్నది: మఱియు బ్రాహ్మణులందఱు గూడఁ జాల యెక్కువ నీతి మంతులును శుద్ధాచరణులు నగుచున్నారను సంగ తియు లేదు: మరియు శూద్రుల యందు గూడ బుద్ధిమంతులు సదాచార ణులు నీ తి మం తు లు నై న మనుష్యులున్నారు. ఏ యొక జాతి వారును బుద్ధిని లేక సదాచారమును గుత్త గొనియుండలేదు. కుఁబు చ్చికొని యుండలేదు. బ్రాహ్మణులయందును మూర్ఖులు దురాచారులునై న లోకులున్నారు. అపుడు వర్ణభేదము వంశము మీఁదలేదు, కేవలము స్వభా వము పై నే యవలంబితమై యుండవలయును. ఇట్టి యాక్షేపము లెప్పుడు నగుచునే యున్నవి యివి బౌద్ధుల కాలమునను నై యుండును. మహా భారతములో నిట్టి విషయమునకు సంబంధించిన యొక మహత్వపూర్ణ మైన యాఖ్యాన మున్నది. అది యిచ్చటఁ బూర్తిగా నీయఁదగి యున్నది, నహుష రాజునకు బ్రాహ్మణులు శాపమిచ్చిన వర్ణనమిది వరలో వచ్చి యున్నది. నహుమని మనస్సులో బ్రాహ్మణ ప్రతాపము యొక్క పూర్ణప్రసిద్ధి బాగుగా దెబ్బకొట్టి యుండును. మన ముందఱ బ్రాహ్మణుఁడు శ్రేష్ఠుఁ డెట్లగుచున్నాడు. అని యెల్లప్పుడును ప్రశ్నము కలిగియుండును. వన పర్వతములో యుధిష్ఠిరుని సర్పయోనియందు బడిన నహుషునికిని సంవాదమున్నది. ఈ సంవాదము మిగుల మహత్వ పూర్ణమై యున్నది. నహుషుఁడు చెప్పుచున్నాడు— "ఓ ధర్మరాజా? నా ప్రశ్నమునకు సముచితమైన యుత్తరము నిచ్చెద వేని నేను నీ సోద రుని విడిచిపెట్టుదును. "ఆ సమయమున నహుషుఁడు భీమసేనుని బట్టు కొని యుండెను. యుధిష్ఠిరుఁడు చెప్పెను— "సర్పమా, అడుగుము; నేను నా యెఱిఁగినంత మట్టు ఉత్తర మిచ్చెదను." నహుషుఁడడిగెను— "బ్రాహ్మణుఁడని యెవరి ననవలయును?" దీనికి సరళమైన యుత్తర మును యుధిష్ఠిరుఁడు, బ్రా హ్మ ణ స్త్రీ పురుషులనుండ యుత్పన్నుఁ డై న వానిని బ్రాహ్మణుడుగాఁ దెలిసికొమ్మని యిచ్చియుండలేదు, అతఁడు విలక్షణమైన యుత్తరము నిచ్చియున్నాఁడు, అతఁడు చెప్పెను— "శాంతి' దయ, దానము, సత్యము, తపస్సు, ధర్మముగల వాఁడే బ్రాహ్మణుఁడగును." యుధిష్ఠిరుఁడు బ్రాహ్మణుని లక్షణమును దానయిచ్చ

స్వభావము ననుసరించి చెప్పెను, కాని యీనా వాదమింతటితో ముగియు లేదు. నహుషుడు దీనిపై మరల ప్రశ్నించెను.

చాతుర్వర్ణ్యం ప్రమాణం చ సత్యం చేద్బ్రహ్మచైవహి ॥
శూద్రేష్వపి చ సత్యం స్యాద్ దానమక్రోధ ఏవచ ॥

అనగా చాతుర్వర్ణ్య వ్యవస్థను ప్రమాణముగా విశ్వసింపవలయును మఱియు సత్యమే బ్రహ్మము లేక బ్రాహ్మణ్యమైన యెడల శూద్రుని యందును సత్యము, దానము, శాంతి మొదలగు గుణములు చూపట బడుచున్నవి. (దీనికి గతియేమున్నది?) యుధిష్ఠిరుడు దీనికే యుత్తరము నిచ్చెను—"శూద్రునియందీ లక్షణములున్న యెడల బ్రాహ్మణునియందు లేని యెడలను శూద్రుడు, శూద్రుడు కాడు ఆ బ్రాహ్మణుడు, కాడు. ఈ వృత్తము అనగా ఆచరణమగపడిన వాని బ్రాహ్మణుడని చెప్పవల యును అది యగపడని వానిని శూద్రుడని చెప్పవలయును." దీనిపై నహుషుడడిగెను— "వృత్తముమీదటనే నీవు బ్రాహ్మణత్వమును సిద్ధాం తీకరింతురేని జాతిని గూర్చిన వివాదము ప్రయోజనము లేనంత వ్యర్థ ముగా నున్నది. "యుధిష్ఠిరుడు దీనికి విలక్షణమైన యుత్తరమిచ్చి యున్నాడు (వ. అ. 181).

జాతిరత్ర మహాసర్ప మనుష్యత్వే మహామతే ॥
సంకరాత్సర్వ వర్ణానాం దుష్పరీక్ష్యేతి మే మతిః ॥
సర్వే సర్వా స్వపత్యాని జనయంతి సదా నరాః ॥
వాఙ్మైథునమథో జన్మ మరణం చ సమం నృణాం ॥
ఇద మార్షం ప్రమాణం చయే యజామహ ఇత్యపి ॥
తస్మాచ్ఛీలం ప్రధానేష్టం విదుర్యే తత్త్వదర్శినః ॥
కృత కృత్యాః పునర్వర్ణా యది వృత్తం న విద్యతే ।
సంకరస్తత్ర రాజేన్ద్ర బలవాన్ ప్రసమీక్షితః ॥

యుధిష్ఠిరుఁడు చెప్పెను. "ఓ సర్పా, ముఖ్యజాతి యీ రోజులలో మనుష్యత్వమేదై యున్నది. ఎందుచేతననఁగా వర్ణములన్నియును సంకరమై పోవుట చేత నేర్పాటు జాతుల పరీక్షయే చేయఁబడఁజాలదు. నేనిట్లే యూహించుచున్నాను. అన్ని వర్ణముల వారును నానాజాతుల యందును సంతానము నుత్పాదించుచున్నారు. ఈ కారణముచేత వారియొక్క జన్మమరణములు నందఱకు సాధారణముగానున్నవి. ఇదిగాక యీ యజామహే, ఇది వేదము యొక్క యార్ష ప్రమాణమైయున్నది. ఇందుచేతఁదత్త్వదర్శులైన లోకులు శీలమును ప్రధానముగా మన్నించుచున్నారనుట సిద్ధమైయున్నది. వృత్తముస్వచ్ఛము కాని యెడల వర్ణములు లాభకారి కానేరవు. ఎందుచేతననఁగా నేఁటి రోజులలో సంకరము బలవత్తరముగా కనఁబడుచున్నది." ఈ యుత్తరమును సూక్ష్మముగా విచారించిన యెడల, ఇందు వర్ణముయొక్క యస్తిత్వము స్వీకరింపబడిని యట్లు తెలియఁగలదు. వర్ణములు సంకరమైపోవుటకు కారణముచేత వివిధ ప్రజల యందు భిన్నభిన్నాచరణము కనఁబడుచున్నది. ఇందుచేత, మొదట వర్ణములఁబట్టి వృత్తము పరీక్షింపబడుచున్నట్లు (గుర్తింపబడు) బడినట్లు ఇప్పుడు వృత్తము బట్టి వర్ణమును బరీక్షింపవలసియున్నది. బ్రాహ్మణ వర్ణములోని మనుష్యుఁడు శీలవంతుఁడై యుసత్యము కావలయునను పృథనిశ్చయము ప్రాచీనమై యుండెను. కాని వర్ణ సంకర కారణమున బ్రాహ్మణుల యందును చెడ్డవారు పుట్ట నారంభమయ్యెను; ఇట్లు భయంకరమైన గడబిడయైపోయినది. అపుడు శీలమునకు ప్రాధాన్యమీయ వలసియున్నది. ఎవరిశీల ముత్తమమైయున్నదో వారిని బ్రాహ్మణులుగాఁ దెలిసికొనవలసియున్నది. యుధిష్ఠిరుని యొక్క యుక్తి యిట్లున్నది, దీనిఁ బట్టి వర్ణము యొక్క యస్తిత్వము పునాది లేనిది కానేరదు. ఈ గనబడుచుంతయు వర్ణసంకరముచేతఁ గలిగినదని యుధిష్ఠిరుని భాషణమునకుఁ దాత్పర్యము యుధిష్ఠిరుని యభిప్రాయము. శూద్రుల యందు శ్రేష్ఠులున్న యెడల, శూద్రుల యందు జ్ఞానము, దానము, దయ, సత్యము మొదలగు గుణములగపడిన యెడల ఇటువంటి గుణములు శూద్ర జాతియందును గాఁగలవని యూహింపఁబాడదు. ఇఁకనేమంటే శూద్రుల యందు బ్రాహ్మణ సంకరమైన కారణముచేతఁ గొందఱు శూద్రుల యందు బ్రాహ్మణ జాతియొక్క గుణములగపడనారంభించినవి. బ్రాహ్మణునియందు అసత్యము, క్రూరతఁ

అధర్మము మొదలగు దుర్గుణములగపడిన యెడల, బ్రాహ్మణులలో, జెడ్డ మనుష్యులు పుట్టఁ గలరని యూహింపరాదు. ఇకనయినా బ్రాహ్మణులయందు శూద్ర వర్ణము సంకరమైపోయిన కారణముచేత నిటువంటి దుర్గుణములగపడు చున్నవని యూహింపవలయును. సారాంశమేమనఁగా యుధిష్ఠిరునియుత్తరములో వర్ణమునకు జాతిచే అస్తిత్వ విశ్వాసము తిరస్కరింపఁ బడలేదు. ఇఁక నేనుంనే యరని భాషణమును బట్టియైతే వర్ణమున అస్తిత్వమే ప్రకటమగు చున్నది.

యుధిష్ఠిరుని భాషణమందు వర్ణసంకరము వలని యనర్థోత్ప్రేక్షణము పూర్తిగా సిద్ధించుచున్నది. హిందుస్థానమందలి యార్యులకు నెప్పుడును ఏవర్ణ సంకర భయమారంభయ్యెనో దానికిఁ గారణమిదియేయై యున్నది. వర్ణము లేక వంశమే మనుష్యుని స్వభావమునకు ముఖ్యస్తంభమని వారూహించు చుండిరి. ఈ వర్ణము వారి కిటువంటి స్వభావమే యగునని వారి యొక్క దృఢనిశ్చయమై యుండెను. వారు వర్ణముతోపాటు స్వభావమునకు నిత్య సాహచర్యమును విశ్వసించుచుండెడివారు. ఈ సిద్ధాంతమెంతవఱకు సత్య మనునది మఱియొక విషయము. మఱియు నిటువంటి దృఢనిశ్చయము కేవ లము భారతీయార్యులకే యుండునదికాదు. ప్రస్తుత కాలమున యూరోపీ యార్యులు గూడ నిట్లే తలంచుచున్నారు. యూరోపియన్ ప్రజలజాతి నవ్య ఖండముల వారు పోటీ చేయఁజాలరాని వారి దృఢనిశ్చయమై యున్నది దక్షిణాఫ్రికా యందలి హిందువుల యెడ నీగ్రోవారి యెడ యూరోపియనుల నడవడికిదే కారణమని నమ్ముట కేయాటంకమునులేదు. జర్మనువారును ఫ్రెంచివారును మొదలైనవారు ఆర్యజాతితోఁ బోటీని ఇతరజాతి మనుష్యులు చేయఁజాలరను సంగతిని విశ్వసించుచున్నారు. వీరిలో విశేషించి జర్మనుల యాక్షేపమిదియేయై యున్నది. భారత, బుద్ధి మొదలగు వానిలో జర్మ నులు మిగిలిన వారి కంటె జాలయెక్కువ యని వారభిమానించుచున్నారు. ఇంగ్లీషు వారు మొదలగు పాశ్చాత్యులు స్వయముగాఁ దమ్మునార్యులని చెప్పి చెప్పించుకొనుచున్నారు వ్యవహార జ్ఞానమునకును రాజకార్యములకును

నావశ్యకములైన గుణములును వ్యాపారములోఁ బోటీచేసి గెలిచికొను సామర్థ్యమును ఆర్యవంశమందెక్కువగా నున్నవని వారు తలంచుచున్నారు; అన్యఖండములవారును నన్యజాతివారును ఇందులో వారిని బోటి చేయ జాలరు. తాత్పర్యము, పాశ్చాత్య దేశములలో నేటివఱకు, ఆర్యవంశము వారియందుఁ గొంత విశేష సామర్థ్యమున్న దనియు, ఈ సామర్థ్యముతో నార్యవంశమునకు నిత్యసంబంధ మున్నదనియు దృఢ నిశ్చయమున్నది.

## భా ర తీ యా ర్యు ల నీ తి మ త్త

పాశ్చాత్యార్యులకంటెఁ గూడ విశేషించి యధికముగా నుదాత్తము నుదారములైన కల్పన భారతీయార్యులది యై యుండెను. భారతీయార్యులు ఆర్యవంశములను కేవలము, వారు శూరులు, వ్యవహారములలో నేర్పరులు, బుద్ధిమంతులు నుద్యోగులు ననియే యుచ్చతములుగా విశ్వసింపలేదు: కాని ఆర్యవంశములయే మతియొక సామర్థ్యమును బట్టియు గొప్పతనము నొసగియుండలేదు— ఔన్నత్యమునకుఁ గారణము, ఆర్యులు నైతిక సామర్థ్య మందఱికంటెను శ్రేష్ఠులని వారియొక్క కల్పనయుండెను. ఇందియేకాదు, ఆర్యశబ్దమున కేజాతివాచమైన యర్థముండెనో యది గూడ మాఱిపోయి శ్రేష్ఠమైన నీతివాచకార్థము అయిపోయెను, ఈ యర్థ మందీశబ్దము పురాతన గ్రంథములలో నెచటెగకుండ వచ్చుచున్నది. వారు మంచి యాచరణమును ఆర్యాచరణమనియుఁ జెడ్డదానిని అనార్యాచరణమనియుఁ దెలుపు చుండెడివారు. భగవద్గీతలో అనార్య జుష్టశబ్దము నందే వచ్చియున్నది. స్త్రీ ణామార్య స్వభావానాం" (రామాయణము) (సమయములో) చెప్పి వారు, ఆర్య స్త్రీ లార్యస్వభావము గలవారు అనఁగా పతి దేవతలై యున్నారని విశ్వసించుచుండిరి. సారాంశము, ఆర్యవంశీయులు శూరతయందును బుద్ధిమత్తయందును శ్రేష్ఠులై యున్నట్లే నీతికార్యములయందును శ్రేష్ఠులై యున్నారని వారికి దృఢ నిశ్చయ ముండెను. యుధిష్ఠిరుఁడు బ్రాహ్మణుని యొక్క వర్తనము నెట్లు చేసెనో అంతకంటె నీతిమత్తయొక్క యధికమైన యుదాత్త చిత్రమును వ్రాయ జాలఁడు. భారతీయార్యుల యూహలో ...

దయ, శాంతి, తపస్సు, దానము మొదలైన సద్గుణము లుండనే యుండవలయును. "ఉక్తానృతమృషిర్యథా" (రామా) ఈ యుపమను బట్టి కూడ బ్రాహ్మణులయొక్క సత్యవాదిత్వ కల్పనమున యెదుట నిలబడిపోవుచున్నది. "ఏ ఋషి ముఖమునుండి అనృత భాషణము వెడలునో, వానివలె నిస్తేజస్కుఁడగును."— ఈ ఉపమానము గైకొన బడినపుడు. బ్రాహ్మణుల సత్యవాదిత్వము భారతీయుల యుద్ధ సమయమున లేక రామాయణ మహాభారతముల సమయమున మాన్యమై యుండియుండుననియే విశ్వసింపవలయును. బ్రాహ్మణుని యందుఁ జెప్పఁబడిన గుణములు బ్రాహ్మణ జాతి మనుష్యుని యందెల్లపుడు నుండనే యుండవలయును. భారతీయార్యుల దృఢనిశ్చయమిట్లే యుండెను. జాతి గుణములు సహజముగ (సులభముగా)నే స్వభావ సిద్ధములై యున్నది. అవి మారునేని వాని జాతియందే భేదము తటస్థించి యుండును. ఈ దృఢనిశ్చయము చేతనే యుధిష్ఠిరుఁడు, గుణముచేత జాతి గుర్తింపఁ బడఁ గలదని నిర్ణయము చేసెను. ఇట్టిది మహత్త్వ పూర్ణమైన యొకకథ యుపనిషత్తులో నున్నది. ఒక ఋషి యొద్దకు సత్యకామజాబాలుఁడు ఉపనయనము (శిక్షాప్రాప్తి) కై వెళ్ళెను. అపుడు గురువు వాని నామమును జాతిని గూడ నడిగెను. వాఁడుత్తర మిచ్చెను— నా తల్లి "నీ బాబెవరో నాకు జ్ఞప్తి లేదు" అని చెప్పెను. అపుడు ఋషి యనెను—" (ఎచట వేలకొలది మనుష్య లసత్యమాడు చుందురో యచట) నీవు సత్యమాడుచున్నావు. ఈ కారణముచేత నీవు బ్రాహ్మణుని పుత్రుఁడవేయని నేను నిశ్చయించుకున్నాను." ఈ ప్రశ్నోత్తరములబట్టి, ప్రాచీనకాలమున బ్రాహ్మణుని యొక్క సత్యవాదిత్వము విషయమై ఏయుదాత్త కల్పన యుండెనో దాని దిగ్దర్శనము కాఁగలదు. ఇంతియేగాదు. ఇఁకనేమంటేని ఆ కాలమున బ్రాహ్మణునికిని సత్యమునకును నత్యంత సాహచర్య మూహింపఁబడుచుండెను.

వర్ణమునకు స్వభావముతో నిత్య సంబంధమున్న కారణముచేత, వర్ణమునందు మిశ్రణమైపోయినచో స్వభావమునందుఁగూడ మిశ్రణము

తప్పక కావలసియున్నదని భారతీయార్యు లూహించి చెప్పుచున్నారు. వర్ణ సంకరమున వర్ణము స్వభావ సంకరమని వారు విశ్వసించుచుండిరి. అనేక వర్ణనములంబట్టి, వారియొక్క యూహా ప్రకారము శూద్రజాతి స్వభావ మనార్యము అనంగా పెద్దదిగాం దప్పక యుండవలయునని వారి యొక్క స్థిరాభిప్రాయమైనట్లు తోంచుచున్నది. మ్లేచ్ఛులును నస్యమైన వర్ణ జాతులును దుష్టములగు చున్నవని వారికి నమ్మకముండెను. పై వర్ణనముం బట్టి వర్ణ స్పష్టముగ క్షత్రము వంశము చేయుచుండవలయునని యూగవచ్చుం గలదు. భారతీయార్యులలో వర్ణ సంకరము విషయమై యతిశయమగు ద్వేషముండెను, ఇందుచేత జాతుల బంధనము విషయమై వారి యభిప్రాయ మనుకూలముగా నుండెను. మఱియు భిన్న భిన్న జాతులు వివాహబంధనము చేత బంధింపంబడెను. ఇంతేకాక జాతియొక్క బీజము భారతీయ సమాజమునందుం బూర్ణముగా నిండియుండెను. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకుం గూడ స్వాభావిక ధర్మములు ప్రత్యేకముగ స్థిరమైపోయెను. భగవద్గీతలో జాతులు స్వభావసిద్ధము లనుకల్పన కలదు. మఱియు, అందులో, ఈ భేదమీశ్వర నిర్మితమని స్పష్టముగా జెప్పంబడియున్నది. 'చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః,' ఇది భగవద్గీతా వచనము. ఇందు భిన్న భిన్న జాతులకు స్వభావ సిద్ధములైన భిన్న భిన్న గుణములు కలవను సంగతి మన్నింపంబడి యున్నది. ఇందుచేతనే వంశము యొక్క భేదము అనంగా జాతి భేదము (వర్ణము-జాతి) యొక్క బంధనము స్థిరము మయ్యెను. మఱియు హిందుస్థానమందు భిన్న భిన్నములైన జాతులనెడి వృక్షములు విస్తరిల్లెను.

పైని వర్ణింపంబడిన యుధిష్ఠిర నహుష సంవాద మెప్పటిదో యిపుడు నిశ్చయించుట కిచ్చుటలుగుచున్నది. " ఈ సమయమున నన్ని వర్ణముల వారును నన్ని జాతులయందు సంతానము నుత్పాదించుచున్నారు." అని యుధిష్ఠిరుండు చెప్పిన సంగతి యెప్పటిది? మహాభారతమునకు మునుపు జాతి బంధనము విశేషించి యున్ని సమయములయందు నుండెను. లోకులందఱియందును వర్ణసంకరము అయి యున్నదని యుధి

షిరుని యొక్క కథనము, ఈ మాట యే సమయమును లక్ష్యముగాఁ జేసి చెప్పఁబడి యున్నది? దీని నిశ్చయింప వలయును. ఈ కటాక్షము విశేషించి బౌద్ధులపై నై యుండును. బౌద్ధులు జాతి కలహములను దూరముగాఁ ద్రోసివైచి యున్న జాతులను నేకము చేయుటకై ప్రచారము నారంభించి యుండెను. ఈ వర్ణన మప్పటి స్థితిదే యై యుండును. లేక, చంద్రవంశీయార్యులు మొట్టమొదట హిందుస్థానమునకు వచ్చినపుడు తొలుదొల్త వర్ణము విషయమై విశేష లక్ష్యమును జేయు లేదు. భిన్న భిన్న వర్ణస్థులు శూద్ర స్త్రీలను జేసికొనిరి. ఆ వైపు ఈ వర్ణనమును గూర్చిన సూచన యై యుండును. ఈ రెండు సమయములను మినహాయించి మఱి యెన్నడును జాతియొక్క బంధనములు శిథిలములు కాలేదు. పైని సత్యకాముఁడైన జాబాలుని గుఱించి వ్రాయబడిన సంగతి ఛాందోగ్యోపనిషత్తులోఁ గలదు. అదియుఁ బై సమయపుదియే కావచ్చును. బౌద్ధుల కాలమున జాతిబంధనము పై ననాద్ధారము కలిగిన కారణముచేత మహాభారతానంతరము చాల శీఘ్రముగనె జాతికి సంబంధించిన నియమములు బాగుగా (గఠినమై) నాటుకొని పోయెనని మతము చూపియుంటిమి.

## బ్రాహ్మణుల శ్రేష్ఠత్వము

ఋగ్వేదము మొదలుకొని అనఁగా క్రీస్తు వత్సరమునకు 3011 ఏండ్ల మునుపటి నుండియు మహాభారతకాలము వఱకుఁ జాతుర్వర్ణ్య సంస్థ వ్యాపించి యుండెననియు నాలుగు వర్ణములుగాక వాని మిశ్రణము వలన ననేక వర్ణములు గాక వాని మిశ్రణము వలన ననేక వర్ణములు అయి యుండెననియు నింతదాఁకఁ జెప్పఁబడియెను. ఈ విస్తారమునకు ముఖ్య బీజము, ఆర్య వర్ణముల నైతికాన్యత్య స్వరూపము మిశ్రితి యుచ్ఛమై యుండుటయు శూద్రులయందును నీ సంగతి లేకుండుటయు నై యుండెను. ఇందుఁగూడ నిర్విశేష పరిస్థితిలో బ్రాహ్మణుల యుందరము

చేత దానికి స్థిరస్వరూపము ప్రాప్తించెను. మహాభారతములో మాటిమాటికిని బ్రాహ్మణులవిషయమై యందఱి మనస్సులోను సత్యంతాదర ముండవలయు నని చెప్పఁబడియున్నది. దీనికిఁగారణము బ్రాహ్మణులయొక్క నీతివిశేషము మహాభారతమం దెక్కువరీతిగా వర్ణింపఁబడుటయైయున్నది. బ్రాహ్మణు లందఱును దమ యాచారమును నిజముగా నుత్తమమైన రీతిని రక్షించుకొని యుండిరో లేదో మనమిది చూడవలసిన యవసరములేదు; ఇఁకనేమంటే మహాభారతమందు బ్రాహ్మణులయొక్క తపస్సు; సత్యవాదిత్వము, శాంతి వీని యొక్క వర్ణనమున్నది; దానిచేత నిప్పటివారికి బ్రాహ్మణుల విషయమై యున్న యభిప్రాయము చక్కఁగాఁ బ్రకటము కాఁగలదు. మహాభారతము యొక్క యాదిపర్వములోనున్న కణ్వఋషి వర్ణనమునుబట్టి బ్రాహ్మణులు వేదవిద్యా పఠనమును ఇంద్రియనిగ్రహ పూర్వకముగాఁ దపశ్చరణమును బ్రపంచమునఁ దమకర్తవ్యములుగా విశ్వసించియుండిరని ప్రకటమగుచున్నది వసిష్ఠ విశ్వామిత్రుల కలహమును వర్ణించుట బట్టియు బ్రాహ్మణ క్షత్రియుల మధ్య నుపస్థితమై యున్న భేదము బాగుగాఁ గన్పట్టగలదు. ఇంద్రియ దమనము, శాంతి, తపశ్చర్యయు బ్రాహ్మణుల ముఖ్యకర్తవ్యములుగా విశ్వసింపబడుచుండెడివి. విశ్వామిత్రుఁడు వసిష్ఠుని కామధేనువును హరించెను; అపుడును వసిష్ఠునికిఁ గోపమురాలేదు. విశ్వామిత్రుఁడు వసిష్ఠుని నూఱుగురు కొడుకులను జంపివైచెను. అప్పుడును వసిష్ఠుఁడు బ్రహ్మదండమునెత్తలేదు; (పైకిఁ దీయలేదు) సన్నద్ధము చేయులేదు. విశ్వామిత్రుని స్థితి దీనికి విపరీతముగాఁ జూపింపఁబడి యున్నది. ఆతనియొక్క శాంతి వెంటనే యొక మాటలోనే తొలఁగిపోవుచుండెడివి. పంపలకొలఁది యేండ్లవరకు నీతఁడు తపస్సు చేసెను. కాని మేనకనుజూడఁగనే యతఁడు కామవశుడై పోయెను. ఈవిధముగా శాంతి ఇంద్రియ నిగ్రహము మాటిమాటికి ఖండితమైనప్పటికిని నీతఁడు బ్రాహ్మణ్య ప్రాప్తికై పలుమాఱు ప్రయత్నించెను. తుదకు శాంతి, ఇంద్రియనిగ్రహము వీనిపై నధికారము లభించినప్పుడు అతఁడు వెంటనే బ్రాహ్మణుఁడై పోయెను. మహాభారతములో నిటువంటికథ లనేకము లున్నవి, జరత్కారుఋషి కేవలము తపస్సుమీఁదనే ధ్యానముంచి, వివాహము చేసికొను నభిప్రాయమును విడచి రిక్తుఁడై యుండెను. కాని పితృదేవతల యాజ్ఞచేత నొకపుత్రుఁడుకలుగువఱకు గృహస్థాశ్రమములోనుండి, పుత్రుఁడు కలిగినతర్వాత, గృహస్థాశ్రమమువిడిచి

యుతఁడు తపస్సుచేసెను. ఈ కథ లన్నిటిబట్టియు యుధిష్ఠిరుడు బ్రాహ్మణుని లక్షణములలోఁ జెప్పిన శాంతి, దయ, దానము, సత్యము, తపస్సు, ధర్మము మొదలైనగుణములు బ్రాహ్మణునియందు నిజముగా నుండెడివని ప్రకటమగుచున్నవి. అట్టి గుణములచేత లోకులు బ్రాహ్మణులను సమాదరించుటయే గాక, తపస్సామర్థ్యముచేత బ్రాహ్మణులయందు వారు విలక్షణశక్తినిగూడ విశ్వసించుచుండిరి. స్వభావముగా లోకులకు వసిష్ఠునందువలె నానాప్రకార సుఖసాధనములు కేవలము తన యిచ్ఛచేత తనకేగాక యితరుల యుపయోగమునకును ఉత్పాదించుశక్తి బ్రాహ్మణులయందున్నదను దృఢ నిశ్చయము కలిగిపోయెను. ఇతిహాస కాలమందుఁ గూడ జాలసారులు సదాచారమందును దపస్సందును గొంతయద్భుతసామర్థ్యమున్నట్లు చూడఁబడుచున్నది. ప్రాచీన కాలమందు దానివిషయమై యంతకంటెను నధికకల్పన యున్నదో నేమియు నాశ్చర్యములేదు. వసిష్ఠునిప్రభావమును జూచి విశ్వామిత్రుఁడు తుదకిట్లనెను, "ధిగ్బలం క్షత్రియ బలం బ్రహ్మ తేజోబలం బలం" అగుఁగాక; ఈ విధముగా సదాచారము ఇంద్రియ దమనము శాంతి సంసారమునుండి విరక్తి మొదలైన గుణములచేత బ్రాహ్మణుల యాధ్యాత్మిక తేజము సహజముగనే వృద్ధి నొందుచుండెడిది. మఱియు వారి విషయమున లోకులకుఁ బూజ్య భావము కలిగిపోయెను. అన్ని వర్ణములపైనను బ్రాహ్మణుల శ్రేష్ఠతయొక్క ముద్ర నాటుకొనెను. అదే కారణముచేత వర్ణవిభాగమున కొక విధమగు నధిక సహాయము లభించెను.

## చాతుర్వర్ణము యొక్క యైతిహాసకోత్పత్తి

ప్రాచీనకాలము నుండి హిందుస్థానములోని యైతిహాసిక రీతి మీఁద విచారించునపుడు పై వివేచనము యొక్క సారాంశమునుబట్టి పాఠకులు వర్ణ వ్యవస్థయొక్క యుత్పత్తి యేవిధముగా నయ్యెనో యీ సంగతి యొక్క కల్పనను జేయఁగలరు. హిందుస్థానమున కార్యులు మొట్టమొదట వచ్చినపుడు వారిలో బ్రాహ్మణులు, క్షత్రియులు వీరిద్దఱే యుండిరి. వేదవిద్యను పఠించి యజ్ఞ యాగాది సమయములయందు ఋత్విక్కార్యమును జేసిన కారణమున బ్రాహ్మణులకు గొప్పతనము లభించెను. వారిది స్వతంత్ర జాతిగా నేర్పడెను.

బ్రాహ్మణుల యీ కార్యములు కఠినములై యుండెను: విశ్వామిత్రుని కథను బట్టి యా సమయమున నీ జాతి యుభేద్యము కాకుండెనని ప్రకటమగు చున్నది; అనఁగా. ఇతరులైన క్షత్రియు జాతివారు, ఇచ్ఛయు సామర్థ్యము నున్నమీఁదట? బ్రాహ్మణులు కాఁగలిగిరి. పంజాబులో నార్యులు నివసించిన మీఁదఁ గృషికర్మ నారంభించువారిని యొక ప్రత్యేక జాతి యై పోయెను. వారు నిట్టులు లేక వైశ్యులు. పంజాబులో నివ్విధముగా భిన్న భిన్న వ్యాపారముల కారణమున బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు నని మూఁడు జాతులేర్పడెను. కాని యిప్పటి వఱకు మూఁడు వర్ణములు లేకుండెను. మూఁడు జాతులవారును ఆర్యులే యై యుండిరి. మఱియు వారి వర్ణము కూడ నొకటియే యై యుండెను. అనఁగా వారు తెల్లగా నుండిరి. ఈ మూఁడు విభిన్న జాతులయందును బరస్పరము కన్యనిచ్చి పుచ్చుకొనుట యుండెను (కన్యా వ్యవహారమగు చుండెడిది, అనఁగా బహుప్రకారముల ననులోమ రీతినిబట్టి బ్రాహ్మణులు మూఁడు వర్ణముల కన్యలను క్షత్రియుఁడు రెండు వర్ణముల కన్యలను స్వీకరించు చుండెను. దీనికిఁ బిన్మట మెల్ల మెల్లగా హిందుస్థానమందార్యుల నివాసము పెరుగఁ జొచ్చెను పిదపఁ జంద్రవంశీయార్యులు గూడ వచ్చిరి. గంగా యమునా ప్రదేశమందు వారి రాజ్యములు స్థాపితములయ్యెను. ఆ సమయమున నార్యుల సమాజ వ్యవస్థయందు హిందు స్థానముల నివాసు (ల ప్రవేశమయ్యెను) లు చేరుట తటస్థమయ్యెను. వారి ఉపయోగము సాధారణముగా నన్ని విధముల దాస కర్మమునందును గానారంభమయ్యెను. మఱియు శూద్రులు అనఁగా మూఁడు జాతులకు శుశ్రూష చేయు నాల్గవ జాతిగా నేర్పడెను. (నయ్యెను)

మెల్ల మెల్లగాఁ బై జాతివారు శూద్ర స్త్రీలను గ్రహింప నారంభించిరి. ఇప్పటి నుండియే వర్ణోత్పత్తి యయ్యెను. ఆర్యజాతివారి రంగు తెలుపును శూద్రజాతి వారి రంగు నలుపును నై యుండెను. ఈ కారణము చేత వర్ణము (రంగు) నామ జాతి స్వరూపము ప్రాప్తించెను. పాశ్చాత్య దేశములందుఁ గూడఁ బాశ్చాత్యార్యులకు నీగ్రోలతో సంబంధము కలిగి

నపుడు, వర్ణమునకు జాతి స్వరూపము ప్రాప్తమయ్యెను. ఇట్టి వైదిక కాలమందుఁ దుష్టవర్ణులైన శూద్రుల సంబంధము చేత వర్ణము అనఁగా జాతి యొక్క భేదము పుట్టెను. మఱల శూద్ర స్త్రీని గ్రహింపవచ్చునా లేదా యని జగడము లేచెను. దీనికిఁ పిమ్మట శూద్ర స్త్రీ సంతానమునకు తరగతి తక్కువగా నెంచఁ బడెను మఱియు నీ కారణముచేత నింకను భిన్న భిన్న జాతులుత్పన్నమయ్యెను. ఆర్యుల సభ్యతము బుద్ధిమత్తయు శూద్రుల బుద్ధికంటెను నున్నతమై యుండెనుఁ ఈ కారణములచే శూద్ర స్త్రీ వల్లఁ బుట్టిన సంతతిని దక్కువగా నెంచుసలవాటు బయలుదేరెను. అట్లు ఉగ్రులు, పారశవులు మొదలైన జాతులయ్యెను. వైశ్యులు శూద్ర స్త్రీని గ్రహించునెడల వారి సంతతి వైశ్యులుగనే విశ్వసింపఁ బడుచుండెను, ఈ కారణముచేత వైశ్యుల రంగుసందుఁ జాలభేదము తటస్థించెను వైశ్యవర్ణము పచ్చనిదిగా విశ్వసింపఁ బడెను. క్షత్రియుల రంగునందును నిట్లి భేదము తటస్థించుచు వచ్చెను. వారి రంగు ఎఱ్ఱనిదిగా (నూహింపఁ బడెను) దెలుపఁబడెను. కాని యీ వర్ణముల (రంగుల) యొక్క యిది (స్థూలమైన) మోటతక్కువుగా నున్నది. దీని కపవాదము లేదన్నమాట లేదు.

ఆర్యజాతి వారియు శూద్రజాతి వారియు వర్ణము (రంగు) నను సంస్కారములయందు నున్న భేదమే నీతిమత్తయందును నుండెననుట యన్నిటికంటెను ముఖ్యమైన విషయము: ఆర్యుల యీ దృఢనిశ్చయము చాలగనే యుదాత్తమై యుండెను. వారు జేత (విజయు) లైన కారణము చేతనే గొప్పతనమునకుఁ బట్టుదొరకుటగాక యింకొక కారణము మేము నీతియందుఁ గూడ శూద్రులకంటె శ్రేష్ఠులకును కల్పనైయుండెను. మఱియు, వారి యాచరణము సైతము నిజముగ నిటువంటిదియై యుండెను. వారార్యులను సకలసద్గుణ యుక్తులగను అనార్యులను దుర్గుణ యుక్తులగను నూహించుచుండిరి. ఆర్య శబ్దమునకు సధికముగా నర్థము మాఱిపోయెను. దానికి నీతిమత్తతో సంబంధము దొరకెను. ఇదే కారణముచేత నార్యుల సంబంధము నిష్టముగా నూహింపఁ బడెను. దీనిచేత

నీతియందుఁ గూడ, గళంకము (కొఱత) తటస్థించునని వారూహించుచుండిరి. వర్ణసంకరము విషయమై వారికున్న అనర్థోత్ప్రేక్షణమునకుఁ గారణము ఆర్యవర్ణపువారు నీతిలో నున్నతులై యుండుటయు, శూద్రవర్ణముతో వారికి సంకరమగునేని వారి సంతాన మాచరణమందుఁ గూడ నీచులు కాఁగలరనుటయు రెండే యై యుండెను. ఇందుచేత బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు శూద్రస్త్రీని గ్రహింపఁ గూడదను నియమము తటస్థమయ్యెను. ఈ నియమబంధనము యొక్క న్యాయాధికతల కారణమున బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులందుఁ గూడ దిన దినము శుద్ధికముగాఁ బెరుగుచు వచ్చెను. బ్రాహ్మణుల యాచరణ మంత్యంతము శ్రేష్ఠమై యుండెను. ఇందుచేత సమాజమందు వారి విషయమై యాదరము పెరుగఁ జొచ్చెను. బ్రాహ్మణుల శాంతి, వారి తపస్సు వారికిఁగల సంసార విరక్తి మొదలైన గుణములు వారి వర్ణమును శ్రేష్ఠముగాఁ జేసివైచెను. చాతుర్వర్ణ్యము యొక్క యైతిహాసికోత్పత్తి యీ విధముగాఁ గనిపించుచున్నది. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు నాలుగు వర్ణములు, వంశానుగత స్వభావముచేత నుత్పన్నములైనవి. వారియందుఁ బ్రతిలోమ వివాహమందైతే విశేష దృష్టి యుంపఁబడెను. బ్రాహ్మణ స్త్రీకి శూద్రపతినుండి పుట్టిన సంతానము మిగుల నింద్యముగా నూహింపఁ బడి చాండాలురలో గణింపఁ బడెను. ఇదే విధముగా క్షత్రియ స్త్రీకి శూద్ర పురుషునుండి పుట్టిన సంతతి ధర్మబాహ్యులైన నిషాదులుగా గణింపఁ బడెను. పై మూఁడు వర్ణములయందుఁ బ్రతిలోమ వివాహమువల్ల నుత్పన్నమైన సంతానము వేఱు జాతిదిగా గణింపఁ బడెను. కాని పైని జెప్పఁ బడిన శూద్రసంతతివలె ధర్మ బాహ్యముగా నూహింపఁ బడలేదు. ఈ ప్రకారముగా వర్ణములయొక్క భిన్న భిన్న జాతులయొక్కయు నుత్పత్తియొక్క జాడ యైతిహాసిక రీతిచే లభించుచున్నది మహాభారతమందు వర్ణముల యుత్పత్తి యెట్లు చెప్పబడెనో పైని వ్రాయబడిన యుత్పత్తితో దానికి మైత్రి యెట్లు కుదురునో యిది యిప్పుడు చూడవలయును.

## మహాభారతముయొక్క సిద్ధాంతము

శాంతిపర్వముయొక్క 188 వ యధ్యాయమందిట్లు వర్ణింపఁబడి యున్నది— బ్రహ్మ మొదట బ్రాహ్మణులనే పుట్టించెను. పిమ్మట స్వర్గ ప్రాప్తికై యతఁడు సత్యము, ధర్మము, తపస్సు, వేదము, ఆచారము, పవిత్రత సృజించెను. దీని తరువాత మనుష్యులలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణములను మఱియు సత్యాది గుణములు గలిగిన యన్య ప్రాణివర్ణముల వర్ణములను నతఁడుత్పాదించెను. బ్రాహ్మణుల వర్ణము (రంగు) శుభ్రము, క్షత్రియుల వర్ణము అరుణము, వైశ్యులది పీతము శూద్రులది కృష్ణమునై యున్నది," ఇట్లు చెప్పి యొక శంకను లేవఁ దీసెను— "బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యమందుఁ గల భేదమునకుఁ గారణము శ్వేతాది వర్ణము (రంగు) లైన పక్షమున మరల నన్ని వర్ణములును సంకీర్ణములై యున్నవి. ఎందుచేతననఁగా ప్రతివర్ణమునందును వేర్వేఱు రంగులు గల మనుష్యులున్నారు. కేవలము రంగుచేతనే వర్ణభేదము విశ్వసింపఁ బడఁ జాలదు. ఇతర కారణములచేతఁ గూడ వర్ణమందు భేదము విశ్వసింపఁ బడఁ జాలదు; ఎందుచేతననఁగా బ్రాహ్మణాదు లన్నిటి యందును గామ, క్రోధ, భయ, లోభ, మోహ, చింతలయొక్క యొక విధమైన ప్రభావమున్నది. మఱివర్ణభేదముండుటకుఁ గారణమేమి? బ్రాహ్మణాది సర్వవర్ణస్థుల శరీరమునుండి స్వేద, మూత్ర, మల, కఫ, పిత్త రక్తములొక విధముగనే (వెలువలికి వచ్చుచున్నవి) వెలువడుచున్నవి; ఇఁక వర్ణభేదమును విశ్వసించుటకు నవసరమేమి?" భృగువు దీనికి ఉత్తరము నిచ్చియున్నాడు— "సమస్త ప్రపంచము మొదట బ్రాహ్మణ మయము గనే యుండెను; కాని కర్మానురోధమున దానికి వర్ణ స్వరూపము ప్రాప్తించెను. బ్రాహ్మణులలో రజోగుణ ప్రధానులైనవారు కామభోగము నందలి ప్రీతి, క్రోధము యుద్ధముచేయు నలవాటు, సాహసకర్మమునఁ బ్రేమ వీనిచేత క్షత్రియులై పోయిరి. రజస్తమో గుణముల మిశ్రణముచేతఁ బశుపాలనము, కృషికర్మమును జేయనారంభించిన బ్రాహ్మణులు వైశ్యులైరి. తమో గుణప్రధానులైన కారణముచేత హింసయందు నసత్యమందు

నాసక్తులై మనసుకు వచ్చిన కామముల జీవనోపాయము చేయు నారంభించిన వారు శూద్రులైరి. కార్మయోగమును బట్టిఁ యొక జాతియే భిన్న భిన్న వర్ణములయ్యెనని తాత్పర్యము. ఈ వివేచమందు వర్ణత్వముయొక్క యుపపత్తి సత్వ రజస్తమో గుణములతోఁ గలుపఁబడి యున్నది. దీనియొక్కయుఁ దాత్పర్యము పై యైతిహాసికోపపత్తితోఁ గలసి మెలసి యున్నది. సత్వముయొక్క రంగు తెలుపు, రజస్సది యెఱుపు తమస్సది నలుపు నగుచున్నది. రజస్సు గలిసిన రంగు పసుపగుచున్నది. సత్వ రజస్తమస్సుల కాల్పనికమైన రంగుల యాధారము మీఁద వర్ణముల యొక్క కల్పన చేయఁబడి యున్నది; మరల నందు స్వభావభేదమనెడి ప్రధాన విషయము కట్టువడి పోపలేదు. బ్రాహ్మణులు సత్వశీలురగుచున్నారు. శూద్రులు తమోయుక్తులును క్షత్రియులు రజో యుక్తులు నగుచున్నారు. ఈ మొదలగు వర్ణనములయందు వర్ణముల స్వభావభేదముయొక్క యస్తిత్వము మన్నింపఁ బడుచున్నది. ఇందు రెండు వంశీయుల వేఱగు నీతిమత్తచేతనే వాని యుచ్చనీచ భావము నిర్ణయించుటకై ప్రయత్నము చేయఁబడి యున్నది. ఇందు, నిజముగానేక జాతియేయుండి తరువాత వేర్వేఱు స్వభావముల ననుసరించి వంశము యొక్క అనఁగా వర్ణముయొక్క భేదము తటస్థమయ్యెనను సంగతి మాన్యము చేయఁబడి నట్లగపడుచున్నది. వర్ణమునకు గుణము స్వాభావికమై యున్నది. ఈ సిద్ధాంతము విశేషించి బ్రాహ్మణ శూద్ర వర్ణములకే యుపయుక్తమగును. ఒకటి సత్వప్రధానము రెండవది తమః ప్రధానమునై యుండెను. యుధిష్ఠిరుని యుత్తరములో బ్రాహ్మణులయందుఁ జెప్పఁ బడిన సత్యము, తపస్సు మొదలైన గుణములే యుచటఁ గూడ జెప్పబడి యున్నవి.

## వివాహ బంధనము

చాతుర్వర్ణముయొక్క యుత్పత్తిమాట యెట్లున్నను, మహాభారతమునకు మునుపటినుండియు హిందుస్థానమందుఁ జాతుర్వర్ణ్య వ్యవస్థ

యుండెననుటలో సందేహమేమియునులేదు. మఱియు నీ వ్యవస్థకు మూల బీజమైన రంగుయొక్క భేదము సభ్యతయొక్క భేదము మహాభారత కాలికమైన స్థితియందు లేదనుటయు మన్నింపఁదగి యుండును. ఎందుచేత ననఁగా పై నీయఁబడిన శాంతి పర్వాను వాదములో, అన్ని వర్ణముల యందు నన్ని రంగులు కనఁబడుచున్న వనియుఁ గామ క్రోధాదుల ప్రబలత సర్వత్ర మున్నదనియు విశ్వసింపఁ బడి యున్నది. కాని యీ రెండు సంగతుల యధిక స్వరూపము మహాభారత కాలమందును స్థిరమై యుండును. ఇది లేని యెడల బ్రాహ్మణుల విషయమై పూజ్యబుద్ధి స్థిరముగా నుండక పోవును. మంచిది; యీ సంగతి నటుంచి యీ వర్ణములయందుఁ బరస్పరము కన్యనిచ్చి పుచ్చుకొనుట యను నీతి బంధనము మహాభారత సమయమున నుపస్థితమై యుండెననుట మన్నింపఁదగి యున్నది. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రుల వఱకు సాధారణముగా దమ జాతిలోనే వివాహమును జేసికొను చుండిరి. మెగస్థినీజు చేసిన యీ సమయపు వర్ణము బట్టియు నిదే సంగతి తెలియుచున్నది. అతఁడు చెప్పుచున్నాఁడు— "ఈ జాతులు ఒండొరులలోన్నే వివాహముఁ జేసికొను చున్నది. కేవలము బ్రాహ్మణులకు, ఉచ్చవర్ణమగుట బట్టి, యన్ని జాతుల స్త్రీలను గ్రహించెడి స్వాతంత్ర్యము కలదు." (సంభవ్ హై, ఉన్కే వహా జాన్కాపీ యపూర్ణహో) క్షత్రియులును వైశ్యులును దమకంటె నీచ జాతివారైన స్త్రీలను గ్రహించుచుండి యుందురు. కాని సమస్త ప్రమాణముల మీఁద విచారింపఁగా మహాభారత సమయమున బ్రాహ్మణులిట్టి యనులోమ వివాహమును బ్రత్యక్షముగాఁ జేయుచుండిరి. మఱియు అనుశాసనిక పర్వముయొక్క 44 వ యధ్యాయమందు స్పష్టమైన వచనముకూడ నున్నది. పూర్వకాలమున బ్రాహ్మణునికి మూఁడు వర్ణముల స్త్రీల నుండియుఁ బుట్టిన సంతానము బ్రాహ్మణుఁడు గనే విశ్వసింపఁబడు చుండెను; కాని తరువాత మరల నీ నియమము సంకుచితమయ్యెను.

మఱియు మహాభారత సమయమున బ్రాహ్మణ, క్షత్రియులు వీరిరువురనుండి పుట్టినసంతానము బ్రాహ్మణుఁడుగా నెంచఁబడుచుండెను. విలోమ అనులోమ సంబంధముల కారణమునఁ గొన్ని ధర్మ బాహ్యములును, గొన్ని శుద్ధాచార యుక్తములునైన జాతులేర్పడినవి. వానిలోఁ దమ తమ జాతులయందే వివాహము లగుచుండెడివి. విశ్వామిత్రుని యుదాహరణముఁ బట్టి ప్రాచీన కాలమందు నీచ వర్ణమునుండి యుచ్చ వర్ణమునకుఁ బోవు నలవా టున్నట్లు కనిపించుచున్నది. కాని మహాభారత సమయమున నీసంగతి లేకే యుండును; ఎందుచేత ననఁగా విశ్వామిత్రుని విషయమున ననుశాసన పర్వముయొక్క మూఁడు నాలుగధ్యాయములయందొక నవీనకథయున్నది. ఆ కథ విశేషించి యీ సంగతినే కనఁబఱుచుచున్నది. యుధిష్ఠిరుఁడు ఆకస్మికముగా నిట్లు ప్రశ్నించెను.—"ఓ భీష్ముఁడా ? క్షత్రియ వైశ్య శూద్రులకు బ్రాహ్మణ్యము దుర్లభమగునేని మఱి విశ్వామిత్రుఁడు బ్రాహ్మణుఁ డెట్లయ్యెను? విశ్వామిత్రునిది అద్భుత తాపము. క్షత్రియుఁ డయ్యును నాతఁ డెట్టిట్టి కార్యముల నెట్లు చేయఁగలిగెను ? ఇతరేతర యోనులయందుఁ బ్రవేశింపకుండనే యిదే దేహమునుండి ఇతనికి బ్రాహ్మణప్రాప్తి యెట్లయ్యెను ?" భీష్ముఁడు దీని కిచ్చిన యుత్తరమందు, భృగుఋషికిఁ బుత్రుఁడైన ఋచీకుని గాధి కూతురు వివాహమాడె నను కథ యున్నది. గాధికిఁ బుత్రుఁడు లేకుండెను; అపుడు గాధి భార్య ఋచీకుని యత్తగారు ఋచీకునుండి పుత్రుఁడు కావలెనని ప్రార్థించెను. ఇచట ఋచీకుని భార్యయు పుత్రుఁడు కావలెనని ప్రార్థించెను. అపుడు ఋచీకుఁ డిరువురకును మంత్రితమైన చరువునిచ్చెను. తనస్త్రీకి బ్రహ్మతేజముచేత నభిమంత్రితమైన చరువు నిచ్చెను. అత్తగారికి క్షత్రియ తేజముచేత మంత్రించి చరువు నిచ్చెను. తల్లి కూతులిద్దరును తమ తమ చరువులను మార్చుకొని భక్షించిరి. ఈ కారణముచేత ఋచీకుని భార్యకు క్షత్రియాంశుఁడగు బ్రాహ్మణుఁడు పరశురాముఁడు జన్మించెను. గాధి భార్యకు బ్రహ్మ తేజోయుక్తుఁడైన విశ్వామిత్రుఁ డుదయించెను. బ్రాహ్మణ వంశమందు క్షత్రియ పరాక్రమమును జూపు పరశురాముఁ డెట్లు జన్మించెనో క్షత్రియుని యింట బ్రాహ్మణ పరాక్రమమును జేయు విశ్వామిత్రుఁ డేవిధముగా జన్మించెనో ఈ రెండు విషయముల సంక్షేప మిచ్చటఁ గలదు. ఈ సంక్షేపము తరువాతఁ జేయఁబడినట్లు కనిపించుచున్నది. పూర్వకాలమున క్షత్రియులు బ్రాహ్మణు

లుగా నైన కొన్ని యుదాహరణములు ఆరంభమున నిచ్చియే యుంటిమి. కాని కాలక్రమమున నిది కట్టు విడిపోయి యుండును. మహాభారత సమయమున నన్యజాతి మనుష్యుఁడు బ్రాహ్మణుఁడు కాజాలకుండె నని స్పష్టముగా నగపడుచున్నది. ఇంతమాత్రమే కాదు, ఇఁక నేమంటేని వైశ్యుఁడు క్షత్రియుడు కాజాలకుండెను. శూద్రుఁడు వైశ్యవర్ణమునఁ బ్రవేశింపఁజాలకుండెను. ఏ జాతి లేక వర్ణము తన వర్ణమును లేక జాతిని విడువఁజాలకుండెను. బొత్తిగా నాలుగువర్ణములు నభేద్యములేయైయుండెను. వారి సంకరమువలనఁ బుట్టిన జాతులకుఁగూడ నిట్టి స్థితియే యైయుండెను. దీనిఁబట్టి సమాజమునందొక విధమైన జగడము స్థిరమైపోయియుండెను. మంచిది, ఐనను బ్రాహ్మణ వర్ణమునకుఁ దనకంటె నీచములైన మూడు వర్ణముల స్త్రీలను గ్రహించు నధికారముండెను. దీనిఁబట్టి క్షత్రియులకు నీచములైన రెండు వర్ణముల స్త్రీలను గ్రహించు నధికార ముండుటచేత సమాజమందు బరిపూర్ణమైన విభిన్నత లేకుండెను. ఇది గాకుండఁ తొలుదొల్తఁ బ్రాహ్మణులకు క్షత్రియ వైశ్య స్త్రీల నుండి యుత్పన్నమైన సంతానము గూడ బ్రాహ్మణులుగా విశ్వసింపబడుచుండెడిది. విరోధమును దొలఁగించుటకై యీ విషయ మనుకూలమై యుండెను. కాని మహాభారత సమయమందే కొంచెముగా సంకోచము చేసి బ్రాహ్మణునికి బ్రాహ్మణి, క్షత్రియ వీరినుండి పుట్టిన సంతానము బ్రాహ్మణుఁ డగునను నిర్ణయము చేయఁబడియెను. వైశ్య స్త్రీ నుండి కలిగిన సంతానముయొక్క జాతి వేరైపోయెను.

శాంతిపర్వము యొక్క 246వ యధ్యాయమందు, మహాభారత సమయమునఁ గల జాతు లన్నియు లెక్క వేయఁబడి యున్నవి. ముఖ్యమైన వర్ణములు నాలు గుండెను. వానియొక్క సంకరమున లేక మిశ్రణమున అధిరథులు, అంబష్ఠులు, ఉగ్రులు, వైదేహులు, గృపాకులు, పుల్కసులు, స్తేనులు నిషాదులు, సూతులు, మగధులు, అయోగావులు, కరణములు, వ్రాత్యులు, చాండాలురు మొదలగు ప్రతిలోమానులోమ వివాహములవల్లఁ బుట్టిన జాతులు చెప్పఁబడి యున్నవి. ఈ యధ్యాయమందే జాతియొక్క హీనత కర్మముపై నవలంబితమా లేక యుత్పత్తి మీఁదనా యను ప్రశ్నమునకుఁ గూడ నిర్ణయము చేయఁబడి యున్నది. కర్మము, ఉత్పత్తి రెండు కారణములు ముఖ్య

ములై యున్నవని స్పష్టముగాఁ జెప్పఁబడెను. "ఎవని (భాగమున) పంతుస హీన జాతియు, హీన కర్మము వచ్చునో, అది జాతిని లక్ష్యపెట్టక హీన కర మును త్యజింపవలయును. ఇట్లు చేసినయెడల వానియొక్క గణన యుత్తమ పురుషుల యందు అగుట కారంభమగును. దీనికి భిన్నముగాఁ జాతి యుచ్చ మైనను గర్మము హీనమైన యెడల నా మనుష్యునికి హీనత ప్రాప్తమగు చున్నది." తాత్పర్య మేమనఁగా ఇచటఁ గర్మము యొక్క ప్రశంస యోగ్య మగురీతిని జేయఁబడి యున్నది. కాని దానితో పాటుగనే జాతి జన్మసిద్ధ మని కూడ మన్నింపఁబడియున్నది. ఇచటఁ బ్రశ్నము వేయబడియున్నది. "అనేక ఋషులు హీన జాతిలోఁ బుట్టినవారైనను శ్రేష్ఠ తత్పరులలో నెట్లు చేరిరి? స్వయముగనే జన్మయందు నుత్తమ వర్ణము నెట్లు పొందిరి?" దీని కుత్తర మీ యధ్యాయమందే యున్నది. —"మునులు తమ తపస్సామర్థ్యము వలన నిష్టమువచ్చిన క్షేత్ర మందు బీజారోవణమును గావించి తమ సంతానమును ఋషిత్వమునందుఁ జేర్చిరి." అనఁగా పురాతన ఋషుల యుదాహరణమును గైకొనుట న్యాయము కాదని మహాభారత ప్రణేతలు చెప్పుచున్నారు. సారాంశ మేమనఁగా సౌతి సమయమున వర్ణములు, జాతులు నభేద్యములై యుండెను. బ్రాహ్మణాది వర్ణములందుఁ బుట్టిన వారే తమ దమ జాతుల వర్ణము వారుగా మన్నింపఁబడుచుండిరి.

## వ్యాపారము యొక్క బంధనము

ఈ విధముగా నింతవఱకు వర్ణ వ్యవస్థ యొక్క ప్రాచీన స్వరూపము మీఁద విచారింపఁబడెను. వివాహము యొక్క యే బంధనములె ట్లుత్పన్నములైనవో: ఆరంభమున. వైదికకాలమందు, వర్ణవ్యవస్థ యెట్టిస్వరూప ముండి యుండునో; సౌతి సమయమున అనఁగా మహాభారత సమయ మున దాని దశయెట్లుండునో యీ సంగతికూడ విచారింపఁబడి యున్నది. ఇపుడీ వర్ణవ్యవస్థ యొక్క రెండవ పక్షము చూడవలయును. మఱియు నే వర్ణమునకేయే యుద్యమములఁ జేయుట కధికారము లేక స్వాధీనత యుండెనో యీ సంగతి యన్వేషింపఁ దగియున్నది. జాతికి ముఖ్యము లైన బంధనములు రెండున్నవని ముందే వ్రాయబడియెను. జాతికి వెలు

పఱ వివాహ నిషేధమున్నట్లే జాతియొక్క వ్యాపారమును విడిచి మఱి యొక వ్యాపారము చేయఁ గూడదనికూడ నియమముండెను. అపుడు, ప్రతిజాతికి నే వ్యాపారములు నియుక్తములై యుండెనో లేక లేవో,- ఈ విషయమై విచారింపఁగా వివాహ విషయమై యున్న యపవాదమే వ్యాపార విషయమునఁ గూడ నుండెననుట చిత్రమైయున్నది. ఏ వర్ణ మైనను, ఆపత్కాలమందు, తనవంటి నీచ వర్ణముయొక్క యే పనినైనను జేయవచ్చును; అనులోముల వ్యాపారమును జేయవచ్చుననునది కఠిన నియమై యుండెను. కాని తనకంటెఁ బై వర్ణము వారి పనిఁ జేయఁ గూడదు అనఁగా ప్రతిలోముల వ్యాపారము జేయఁగూడదు. నాలుగు వర్ణముల యుద్యమములును మహాభారతమందు భిన్న భిన్న స్థలములలోఁ జెప్పఁబడి యున్నవి. సంక్షేపముగా నవి యిట్లున్నవి;—బ్రాహ్మణుని కాఱు వ్యాపారములుండెను. పఠన పాఠనములు, యజనయాజనములు, దానప్రతిగ్రహములు. ఇందుచేత బ్రాహ్మణుఁడు షట్కర్మాధికారిగాఁ జెప్పఁబడు చుండెను. క్షత్రియునికి యజనము, అధ్యయనము, దానము చేయుట కధికారముండెను; అతనికి విశేష కర్మము ప్రజాపాలనము యుద్ధము నై యుండెను. వైశ్యులకుఁ గూడ నీ మూఁడు కర్మములను జేయునధికారముండెను అతనికింకను మూఁడు విశేషకార్యములు- కృషి, గోరక్ష, వాణిజ్యము నుండెను. శూద్రులకు మాత్రమొక్క వ్యాపారము— మూఁడు వర్ణములకు శుశ్రూష చేయుట యై యుండెను. అతనికే అధ్యయనము, యజనము, ప్రతిగ్రహము లేకుండెను. ఇంతియే కాదు శూద్రవర్ణ మార్యవర్ణమునకు వెలుపటిదియై యుండెను. వేదాధ్యయనాధికారము త్రివర్ణములకు అనఁగా ఆర్యులకే యుండెను. వైదిక సంస్కారాధికారము కూడ వీరికుండెను, దీనిఁ బట్టి యార్యుల వంశము భిన్నమై యుండెను వారి నీతి. సభ్యత, జయించువాని యోగ్యత వీనిద్వైతే వారి యధికారములు భిన్నములై యుండెను. శూద్రులను వారు సమాజ వ్యవస్థలోనికిఁ దీసికొనిరి; కాని యీ పనిని వారు కేవలము శుశ్రూష చేయించుకొనుటకును మనమందఱమొక దేశముననే నివసించు చున్నారమను ప్రేమచేతను గూడ జేసిరి. భిన్న భిన్నములైను ముఖ్య వర్ణములకు సంకర వర్ణములకు నేయే యుద్యము లుండెడవో మనము

కొంచెము విస్తరించి చూతము; మఱియు నొక్కొక్క యుద్యమమును వేఱు వేఱుగా విచారింతము.

## బ్రాహ్మణుల యుద్యమము

బ్రాహ్మణుల మొదటి కర్తవ్యము అధ్యయనము చేయుటయై యుండెను. వేదముల నధ్యయనము చేసి వానిని రక్షించెడి కఠిన కార్యమును వారు స్వీకరించి యుండిరి. ఈ కార్యము వారి పవిత్రతకును ఘనతకును గారణ భూతమయ్యెను. మహాభారతమందు చాల చోట్లను వేదాధ్యయన మందు సదాచారమందును రెండింటియందే వారి సమస్త ముండెనని చెప్పఁబడి యున్నది. వేదముల నధ్యయనము చేయుటకు స్వాతంత్ర్యము మూఁడు వర్ణములకు నున్నప్పటికిని బ్రాహ్మణులతో పని నుత్తమముగా, జేసిరను టలో సందేహములేదు. వేదములతోపాటు ఇతర విద్యలనుగూడ నధ్యయ నము బ్రాహ్మణులకుఁ జేయవలసి యుండెను; ఎందుచేత? అధ్యయన కార్యము బ్రాహ్మణుల విశేష కర్తవ్యములో నుండెను. బ్రాహ్మణ గురువు లన్ని వర్ణములకు నధ్యాపకులై యుండిరి. దీనిఁబట్టి భిన్న భిన్న వర్ణము లకు భిన్న భిన్నోద్యములకై యావశ్యకమైన విద్యలు బ్రాహ్మణులకు నేర్చుకొనవలసి యుండెను. సారాంశమేమనగా, విద్యాధ్యయనము చేయుట విద్యను నేర్పుట యనెడు సర్వ కఠినములైన కార్యములను బ్రాహ్మ ణులు స్వీకరించి యుండిరి. అనఁగా బ్రాహ్మణులను భరించుట పోషిం చుట యనెడు బరువు సమాజములో నందఱియందును నుండెను. మరియు అధ్యయనాధ్యాపన కార్యములను గైకొనుటచేత తమ భరణ పోషణములను నిర్వహించుకొనుటకు వారికి ధ్యానము పోఁజాలకుండెను. ఈ కారణముచేత బ్రాహ్మణుల కుటుంబ వ్యయము జరుపు భారము లోకులపై, విశేషించి సమాజముపై నుండెను.

బ్రాహ్మణుల యితర కార్యములు యజన యాజనములై యుండెను. యజనము అనఁగా యజ్ఞము. పూర్వకాలమందు, గృహస్థాశ్రమములో నున్న ప్రతి బ్రాహ్మణుఁడును అగ్నిని స్థాపించి ప్రతిదినము దాని

పూజను హోమమును జేయవలయునను నియమముండెను. వైదిక కాలమందు ప్రతి బ్రాహ్మణుఁడును దమ దమ యింట నగ్నిని స్థాపించి హోమమును జేయుచుండెడివారు. శై. కే జొహపా ఖ్యాన (శాంతి. అ. 76) మందు గైకేయరాజు చెప్పియున్నాఁడు— "నారాజ్యమందు ఎవఁడు విద్వాంసుఁడు కాఁడో, ఎవఁడధ్యయనము చేయఁడో లేక యజ్ఞశీలుడు కాఁడో ఇట్టి బ్రాహ్మణుఁడొకఁడైనను లేఁడు." పూర్వకాలమందు అగ్నిని స్థాపించి యజ్ఞమును జేయుట గృహస్థాశ్రమిమైన బ్రాహ్మణునికి ముఖ్య కర్తవ్యముగా విశ్వసింపఁబడు చుండెడిది. యాజనమును అనఁగా క్షత్రియుఁడు వైశ్యుఁడుగాని యజ్ఞమును జేయునపుడు ఋత్విక్కార్యమును బ్రాహ్మణుడుఁ చేయవలయును. క్షత్రియులార్యరాజ్యము చేయుటకు నిషేధముండెను. విద్వాంసులయిన బ్రాహ్మణుల నిర్వాహమునకై యీ సమాజ వ్యవస్థ యుండెను. ఇట్లే బ్రాహ్మణునికి దానప్రతిగ్రహాధికారముండెను. ప్రతి గ్రహము అనఁగా దానము పుచ్చుకొనుట బ్రాహ్మణులకు విశేష కర్తవ్యమై యుండెను. అనఁగా దానము పుచ్చుకొను నధికారము బ్రాహ్మణులకుఁ దక్క నితరులకు లేకుండెను. బ్రాహ్మణులు వేదాధ్యయనమును జేయుటలో నిమగ్నులగు చుండెడివారు. ఇందుచేత వారు తమ నిర్వాహము వైపు ధ్యానముంపఁ జాలకుండిరి. ఇందుకై వారికిఁ బ్రతిగ్రహాధికార మీయఁబడి యుండెను. సమాజములో జరుగుచున్న దాన ధర్మములవల్ల బ్రాహ్మణులకే లాభము చేకుఱుచుండెను. ఈ ప్రకారముగా బ్రాహ్మణులకు మూఁడు కర్తవ్యములును మూఁడే యధికారములును నుండెను వేద పఠనము,అగ్ని స్థాపనము,యథాశక్తి దానము బ్రాహ్మణుల కర్తవ్యములై అధ్యాపనము. యాజనము,ప్రతిగ్రహము ఇవివారికివిశేషాధికారములై యుండెను. ఈ మూఁడధికారముల ద్వారమునను వారికి ద్రవ్యప్రాప్తి యగుచుండెడిది, దానిచేత నిర్వాహమగుచుండెను. చెప్పఁబడిన వర్ణనము కేవలము కాల్పనికమా లేక యైతిహాసికమా యని యిపుడొకగొప్పప్రశ్నము కలుగుచున్నది. వర్ణ విభాగమును వర్ణించునపుడెల్లను మహాభారతమందీ వర్ణనము వచ్చుచున్నది. కాని యసలు సంగతియేమోయిదికూడఁజూడవలయును మహాభారత మందెచ్చటను గడమ వర్ణములు బ్రాహ్మణుల విశేషాధికారముల వల్ల నుపయోగించు బనిపుచ్చుకొనినట్టి యుదాహరణములు దొరకకున్నవి.

విశ్వామిత్రుఁడు సూర్యవంశ్యుఁడైన త్రిశంకువు కల్మాషపాదుఁడు మొదలైన రాజుల యాజనమును జేసియుండెను అనఁగా యజ్ఞమును జేయించియుండెను. కాని యితఁడా సమయమునకు బ్రాహ్మణుఁడై యుండెను. ఇతరులు ప్రతిగ్రహమును జేసినట్టి యుదాహరణము దెచ్చటను లభింపకున్నవి. అధ్యాపనముఁ గూడ బ్రాహ్మణులే చేయించుచుండిరి. అన్య వర్ణములచేత నాయా వర్ణవిద్యలను బ్రాహ్మణులే చదివించుచుండిరి. కౌరవులకు ధనుర్విద్య గఱపుటకై బ్రాహ్మణుఁడైన ద్రోణుఁడు నియుక్తుఁడై యుండెను. అకైకేయోపాఖ్యానమందు నిది కూడఁ జెప్పబడియున్నది నారాజ్యమందు క్షత్రియులు యాచింపరు అధ్యయనము చేయింపరు చేయరు. వారితరులచేత యజ్ఞయాగములఁ గూడ జేయింపరు. మహాభారత సమయము వఱకు బ్రాహ్మణుల విశేషాధికారముల నెవరును లాగుకొనలేదు. వాని నుపయోగించుకొనను లేదని తాత్పర్యము. బ్రాహ్మణులు తమ కర్తవ్యముల నెంతవఱకుఁ జేయుచుండిరో యిపుడు చూడవలయును. అందఱు బ్రాహ్మణులును వేదాధ్యయనము చేయుచున్నారనుసదియు అగ్నిని సిద్ధముగా నుంచుకొనుచున్నారను సంగతియు లేదు. ఇట్టి కర్మత్యాగులైన బ్రాహ్మణులు సమాజమందుండిరి. వేదాధ్యయనమును నగ్న్యాధానమును జేయని బ్రాహ్మణులు శూద్రతుల్యులుగా నూహింపబడుదురనియు ధర్మాత్ములైన రాజులు వారి నుండి పన్ను వసూలు చేయవలయుననియు వెట్టిచాకరీ కూడఁ జేయింపవలయుననియు స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. దీనిఁబట్టి స్వకర్మ నిరతులైన బ్రాహ్మణుల నుండి పన్ను వసూలు చేయకుండిరనియు వెట్టిచాకిరీ కూడఁ జేయింపకుండిరనియుఁ దెలియుచున్నది. నహుషరాజు ఋషులను తనపాలకీ మోయుట యందు నియోగించియుండెను. మంచిదే నరే యతఁగాడీ యపరాధమును జేసియుండును. కాని మహాభారత సమయమున కావల బ్రాహ్మణత్వ సంబంధమున బ్రాహ్మణుల కీయఁబడిన యనుకూల్యము (యధికారము)లనుండి ప్రతి బ్రాహ్మణుఁడును లాభము తీయఁజాలకుండెనన్న తత్త్వము మాన్యమై యుండెను. తమ కర్తవ్యములను జేయఁజాలని బ్రాహ్మణులు ప్రత్యక్ష శూద్రతుల్యులుగా విశ్వసింపఁబడుచుండిరి. బ్రాహ్మణులు చేయుచుండిన యితర కార్యములు కూడ నీయధ్యాయమందు బేర్కొనఁబడియున్నవి (శాంతి అ. 76) నెలనెలకు జీతము పుచ్చుకొని పూజారితనము చేయుట, నక్షత్రజ్ఞానముపై జీవిక నడుపుట (పంచాంగము చెప్పి జీవించుట) సముద్రపై

నోడమీద బోవుట మొదలగు నుద్యోగములఁ జేయువారును, పురోహితుఁడు, మంత్రి, దూత, వార్తాహరుఁడు, సేనయందునశ్వారూఢుఁడు, గజారూఢుఁడు రథారూఢుఁడు, లేక పదాతి మొదలగు నౌకరీ చేయువారునగు బ్రాహ్మణులా సమయన నుండిరి. తన రాష్ట్రమందలి బ్రాహ్మణులు దొంగతనముచేయుటకు దిగుదురేని యఁగడగుదురేని యిది రాజుయొక్క యపరాధముగా విశ్వసింప బడుచుండెడిది వేదవేత్తయైన బ్రాహ్మణుఁడు చౌర్యకర్మకు దిగునేని రాజతని నిర్వాహమును జేయసలయును. ఇట్లు చేసినఁ గూడ నతడా పని విడువని యెడల వానిని రాష్ట్రము నుండి వెడలనడప(గొట్టు) వలయును." ఈ ప్రకార ముగా బ్రాహ్మణులు, ఇప్పటి విధముగా, వివిధములైన వ్యాపారముల నాదినములయందు సహితము జేయుచుండిరి.

ఇట్టి వ్యాపారములను బ్రాహ్మణులు కేవలమాపత్కారణముసనే చేయు చుండిరను మాటలేదు; ఇంకనేమంటేని దీనికిఁ గారణము స్వభావవైచిత్ర్యమే యైయుండెను. బ్రాహ్మణుల యందు స్వభావముచేతనే యుండఁదగిన వైరాగ్యమునకు శాంతి ప్రభావమునకును లోటు వాటిల్లి యుండెను. మఱియు నితరుల వివిధములైన కార్యములను గావించి, తమ వ్యావహారిక స్థితినుత్కృ ష్టముగాఁ జేసికొనుటకై స్వాభావిక మోహము బ్రాహ్మణులకు గలుగుచుండె డిది. అపత్కాల మందు బ్రాహ్మణుడు తనకంటె నీచవర్ణము యొక్క ధర్మము నవలంభించి కుటుంబమును నిర్వహించుకొనవచ్చునని యానతీయఁబడి యున్నది. అనఁగా అతనికి, క్షత్రియ కృత్యమును జేసి సేనలో నౌకిరీ చేసి కొనుట కాజ్ఞ యుండెను. ప్రాచీన కాలమందు క్షత్రియ వృత్తిలో నున్న బ్రాహ్మనులు చాలమంది యుండి యుందురు. ఒకటి బ్రాహ్మణ క్షత్రి యుల నడుమ భేదము కొలఁదిగనే యుండెను. రెండవది బ్రాహ్మణులుక్షత్రియ స్త్రీలను గ్రహించుచుండిరి. ఈ కారణమున క్షత్రియోత్పన్నులైన బ్రాహ్మ ణులు సులభముగనే క్షత్రియ వృత్తి వైపు మునిగిపోవుచుండిరి. బ్రాహ్మ ణులాపత్కాలయందు వైశ్యధర్మము నవలంబింపవచ్చునాలేదా ? యని యుధి ష్ఠిరుఁడు భీష్ముని బ్రశ్నించెను. (శాంతిప. అ. 78) ఇట్టి సమయమున బ్రాహ్మ ణుడు కృషిని గోరక్షను జీవికగా జేసికొనవలయునని దీని కుత్తర మిచ్చెను. కాని యొక (షరతు) నియమము కలదు. బ్రాహ్మణుడు క్షత్రియ ధర్మము

నుపయోగించుకొనుటలో నసమర్థులైనపుడే యీ విధముగాఁ గుటుంబ నిర్వహణమును జేసికొనవలయును. క్రయవిక్రయములఁ జేయుటకుఁ గూడ నాజ్ఞ యుండెను. కాని తేనె, ఉప్పు, పశువులు, మాంసము, పక్వాపక్వ పదార్థములు వీని నమ్ముటకు నిషేధముండెను. అనఁగా, మహాభారత కాలమందు బ్రాహ్మణులు కేవలము (సిపాయితనము) సైనికత్వమును జేయుటయేగాక కృషి, గోరక్ష, దుకాణము పెట్టుకొనుట, మొదలైనవి, ఇప్పటి యట్లే, యపుడుగూడఁ జేయుచుండిరి. కాని తఱచుగా నీవనులాపత్సమయ మందే చేయుచుండిరి.

## క్షత్రియుల కృత్యము

ఇపుడు క్షత్రియుల యుద్యమమును విచారింపవలసి యున్నది. వారి కధ్యయనము, యజనము, దానము చేయు నధికార ముండెను. వేదాధ్యయనమును జేసి తనయింట నగ్నిని స్థాపించి హోమమునుజేయుటకు యథాశక్తి దానము నిచ్చుటకు వారి కధికార ముండెను. కాని యివి వారి కృత్యములు కావు. బ్రాహ్మణులవలె, ఈ కృత్యములమార్గమున, వారు తమ్ము నిర్వహించుకొనఁ జాలకుండిరి. క్షత్రియులు ప్రాచీన కాలమందు సంపూర్ణ వేదాధ్యయనమును జేయుచుండి రనియు హోమమును గూడ స్వయముగాఁ దెలిసికొని చేయుచుండి రనియు విశ్వసించుటకు నాపత్తి యేమియు లేదు. మహాభారత మందు వేద పారంగతులును, యజనశీలురు నైన రాజుల వర్ణము లనేకము లున్నవి. ఇంతకు మునుపు పేర్కొనఁబడిన కైకేయోపాఖ్యాన మందు, నా రాజ్యమందు క్షత్రియు లధ్యయనము చేయుచున్నా రనియుఁ (దమకుఁ దాము) స్వయముగా యజ్ఞములు చేయుచున్నా రనియు స్పష్టముగాఁ జెప్పబడి యున్నది. బ్రాహ్మణ గ్రంథములవల్ల నుపనిషత్తులలోని యనేక వర్ణనములవల్లను ప్రాచీనకాలమందు బ్రాహ్మణులకును, క్షత్రియులకును వేదాధ్యయనము విషయమై జాల పోటీ యున్నట్లు స్పష్టముగాఁ గనఁబడుచున్నది. కాని మెల్ల మెల్లగా వేదవిద్యకఠినమైనకొలఁదియు యజ్ఞయాగములు క్లిష్టములైన కొలఁదియు నీ కృత్యములు విశేషజాతిదిగామైపోయెను. క్షత్రియులలో నీ కృత్యముల ప్రవృత్తి తగ్గిపోయెను. మహాభారత కాలమందు క్షత్రియులకు వేద ప్రావీణ్యము తగ్గిపోయి యుండును. ఎందుచేత ననఁగా యుధిష్ఠిరుఁడు

వేదమందు ప్రవీణుఁడైనందుకును యజ్ఞాది కర్మముల యందుఁ గుశలుఁడైనందుకును ప్రశంసించుట యొకప్పుడుఁ గలదు. దానికి వ్యతిరేకముగాఁ గొన్ని స్థలములలో నీ కృత్యము లెఱిఁగినందుకు నతఁడు నిందింపఁబడెను. మహాభారతకాలమున సామాన్య రూపమున క్షత్రియు లందఱును వేదములోఁ బ్రవీణులైనచో నిట్లు నిందింతమను యూహయే యెవనిమనసునను బుట్టదు. అనఁగా సౌతి సమయమున వేద విద్య పఠింపవలెనను నభిలాషము క్షత్రియులలోఁ దగ్గిపోయి యుండెను. ప్రజా పాలనము, యుద్ధము క్షత్రియుల విశేష కృత్యములై యుండెను. యుద్ధములలో శూరత్వమును బ్రకటించు కృత్యము క్షత్రియులదే యైయుండెను. ఈ కృత్యమును బహు దినముల నుండి చాల బాగుగాఁ జేయుచు వచ్చిరి. క్షత్రియులకుఁ యుద్ధేచ్ఛాప్య పలాయనం వృత్తి స్వాభావికమై యుండెను. అయుధ కార్యమును వీరు నడుపుచుండిరి. కాని యీ పనిని గొందఱు బ్రాహ్మణులు గూడఁ జేయుచుండిరి. ఇది గాకుండ విశేషాపత్సమయములందు నన్ని జాతులవారును శస్త్రముల గ్రహింపవచ్చునని శాస్త్రముయొక్క యాజ్ఞఁగూడ నుండెను, మరియు యుద్ధకృత్యమున నెంతముంది తయారైనను వారి యందఱ యావశ్యకత యుండనే యుండెను. ఈ కృత్యమే, యందు శూరులకే నిర్వాహమున్నది యని యనవలసి నట్టిది. అందుచేత, శూరత్వమున్న వానికి కృత్యమును చేయు స్వాతంత్ర్య ముండవలయును. మహాభారత సమయమునఁ జాలమట్టు క్షత్రియులిదే పనిని జేయుచుండిరి. ఆపత్సమయమునఁ గూడ క్షత్రియులు యాచింపరాదు—ఈ కారణము చేతను, యాచనను బ్రాహ్మణులు దమ వ్యాపారముగా నిర్వహించుట చేతనుగూఁడ, ప్రతిలోముల కృత్యమును దృష్టిచేత నియ్యది క్షత్రియులకు నిరాటంకమైనది కాదయ్యెను. క్షత్రియులకు, కేవలము విపత్కాలమందు, వైశ్య వృత్తి చేయుటకు స్వతంత్రత యుండెను. అనఁగా క్షత్రియుఁ డిష్టపడిన యెడల గోరక్షను గృషిని జేయవచ్చును. మహాభారతకాలమందు గృషిని జేయు క్షత్రియులుండిరో లేరో యీ సంగతి నిశ్చయ పూర్వకముగాఁ జెప్పఁబడఁ జాలదు. అయినప్పటికి నట్టి వారున్నట్లూహించుట కవకాశ మున్నది. యుద్ధము గాకుండ క్షత్రియులకొక కార్యము ప్రజాపాలనమై యుండెను. రాజ్యము చేయుట క్షత్రియుల కార్యమై యున్నది. ఇదే వారికి విశేషాధి

కారము. ఆ సమయమునఁ జిన్న చిన్న రాజ్యములుండుట ప్రసిద్ధమే యైయున్నది. ఈ చిన్న చిన్న రాజ్యములకుఁ బ్రభువులు క్షత్రియులే యై యుండిరి. మహాభారత సమయమున లేక యంతకంటె గూడఁ బూర్వము, విశేషించి, అందఱు రాజులు క్షత్రియులై యుండిరి. క్షత్రియులకంటె నితర వర్ణములకు రాజ్యము చేయు నధికారము లేకుండెను. ఆర్యదేశమం దన్యవర్ణము రాజ్యము చేసిన యుదాహరణముకూడ మహాభారత మందెచ్చటను లేకున్నది. అశ్వమేధ సమయమున నర్జునుఁడు ఆర్యరాజులను మ్లేచ్ఛరాజులను గూడఁ గెలిచెనని వ్రాయఁబడి యున్నది. ఆ సమయమున హిందూస్థానమందు మ్లేచ్ఛరాజు లెవరెవరో చెప్పఁజాలము. ఈ మ్లేచ్ఛరాజులు విశేషించి హిందుస్థానమునకు బయటి వారై యుండిరి. ఆ సమయమున నుత్తరము వైపున శాకయ సంజ్ఞగల మ్లేచ్ఛులై యుండిరి; ఇంతియేకాదు; ఇకనేమంటేని దక్షిణమందలి యాంధ్రులు, చోళులు. కేరళులు మొదలైన వారికిఁ గూడ నీ సంజ్ఞయే యుండెను; అనఁగా ఆ సమయము వఱకు వీరి యంతర్భావము ఆర్యావర్తమందు లేకుండెను. మఱియు నీ దేశములయందార్యుల నివాస స్థానములు కూడ లేకుండెను. ఇట్టి దేశములయందుఁ బ్రజలును మ్లేచ్ఛులై యుందురు. రాజులును మ్లేచ్ఛులై యుందురు. ఈ ప్రశ్నయు స్థలాంతరమందు విచారింపఁ బడును. కాని యార్యప్రజల దేశమందు క్షత్రియులే రాజ్యము చేయుచుండిరని చెప్పవలసి యున్నది. బ్రాహ్మణులుగాని వైశ్యులుగాని రాజ్యము చేసినట్లుదాహరణము మహాభారతములో లేదు. ఒక యుపనిషత్తులో శూద్రరాజొక్క వర్ణమున్నది మరియు నిషాదాధిపతి గుహునియొక్క వర్ణనము మహాభారతమందున్నది. కాని యా చిన్న చిన్న రాజ్యములు ప్రజలవి యనఁగా శూద్రులవి నిషాదులవే యై యుండునని తోఁచుచున్నది. రాజ్యము చేయు నధికారము క్షత్రియులదే యై యుండును. ఆ పనియందు మహాభారత సమయమున బ్రాహ్మణులుగాని వైశ్యులుగాని ప్రవేశించి యుండలేదు. మొట్టమొదట నీ యధికారమును చంద్రగుప్తుఁడు లేక నవనందులు గ్రహించిరి. చంద్రగుప్తునినాఁడు లేక యతనికిఁ దరువాత శీఘ్రముగనే మహాభారతము చేయబడెను అందు "నందాంతం క్షత్రియకులం' ఈ వచనమునకు— పూర్వపు పురాణములకువలె— ఎచ్చ

టను నుల్లేఖములే లేకపోవుట స్వాభావికమే యై యున్నది. మహాభారతము వఱకుఁ బరంపర క్షత్రియ రాజులదే యై యుండెను. ఈ పరంపర తరువాతఁ దరువాతఁ జెడిపోయి మరల బాగుపడలేదు. రాజ్యము చంద్రగుప్తుని చేతికి వచ్చిన తరువాతఁ జాలమంది శూద్రులును బ్రాహ్మణులును రాజులైరి. తరువాత శకయవనులు, తరువాత నాంధ్రులనైరి. సారాంశమేమనఁగా, రాజ్యము, చివరకు సార్వభౌమత్వము, మరల క్షత్రియ కులమునకు హిందుస్థానేతిహాసమందు రాలేదు. మరల క్షత్రియుల చిన్న చిన్న రాజ్యములు హిందుస్థానమందు శాశ్వతముగా నుండనే యుండెను "దానమీశ్వరభావశ్చ క్షాత్రకర్మ స్వభావజం" ఈ గీతా వాక్యమునను సరించి రాజ్యము చేయు వృత్తి క్షత్రియులయందు ఇప్పటికిఁ గూడ క్షత్రియులకు రాజ్యము లేకుండ సమాధానము కాఁజాలనంత సహజమును వారి ప్రతినరమునను నిండినదియునై యున్నది. ఆ రాజ్యము బొత్తిగాఁ జిన్నది యైనను సరియే—ఒక గ్రామపుదియే యైనను సరియే—కానిమ్ము యుధిష్ఠిరునియొక్క యాచన యీ సహజ ప్రవృత్తినే యనుసరించి యుండెను. అతని యంతిమ ప్రార్థన యిట్లుండెను— "లేని యెడల మా యైదుగురు సోదరులకు నైదు గ్రామములైన నిమ్ము." ఇందు ఆ సహజ స్వభావముయొక్క ప్రతిబింబము వచ్చియున్నది. రాజ్యముచేయుట క్షత్రియునికి సహజ కృత్యము నుద్యోగమునై యుండెను. ఎందుచేతననఁగా వారు బిచ్చమెత్తను గూడదు కృషిచేయను గూడదు. రెండు విషయములును తుచ్ఛములని వారికి నచ్చియుండెను. అప్పుడు బొత్తిగా దారిద్ర్యములోనున్న వారికి నై నికత్వముండెను. మంచి స్థితిలో నున్న లోకులకు నెచ్చటనో యవశ్యకముగా రాజ్యముండవలయును మహాభారత సమయము వఱకు వారు తమ రాజ్యము చేయునధికారమును. జక్కఁగా రక్షించుకొను చుండిరి. ఇందు బ్రాహ్మణులుగాని వైశ్యులుగాని ప్రవేశింపరైరి.

## వైశ్యల కృత్యము.

ఇఁక వైశ్యులకు స్వాభావికమైన యుద్యమము పైని విచారము చేయఁబడుచున్నది. భగవద్గీతలో వైశ్యునికి ముఖ్యవృత్తి కృషి, గోరక్ష, వాణిజ్యము

చెప్పఁబడియున్నది. మహాభారతమున శాంతి పర్వములోఁ గూడ నీ సంగతియే వ్రాయఁబడియున్నది. పూర్వకాలమున వైశ్యుల వ్యాపారము కృషియై యుండెను. మఱియు గోరక్ష అనఁగా గొల్లవాని వ్యాపారముఁ గూడ వీరే చేయుచుండిరి. పరిస్థితి బహుప్రాచీనము నాఁటిదియై యున్నది, ఇప్పటి వైశ్యులు మాత్ర మీరెండు యుద్యములలో నొక వ్యాపారమైనను జేయుట లేదు. గోరక్షా వ్యాపారమును శూద్రజాతులనేకము చేయుచున్నవి. కృషి గూడ శూద్రులు, రాజపుత్రజాతి, బ్రాహ్మణులు మొదలైన వారి హస్తములో నున్నది. కాని ప్రాచీనకాలమందీ రెండు వ్యాపారములను నార్య వర్ణస్థులైన వైశ్యులు చేయుచుండిరనుటలో సందేహములేదు. సౌతినాటి కా పరిస్థితి మారి యుండును. ఎందుచేతననగా ఆ సమయమునకు శూద్రుల స్థితి భాల బాగు పడి యుండునని మునుపటి వివేచనబట్టి స్పష్టము కాఁగలదు. వైశ్యులు మాత్రము కేవల వాణిజ్యమును జేయుచున్నారు. ఈ వ్యాపారమును వారు ప్రాచీన కాలమునుండియు నేఁటివఱకుఁ జేయుచు వచ్చుచున్నారు ఈ వ్యాపారములో నితరులకుఁ బ్రవేశము చాలఁ దక్కువయై యున్నది. వేలకొలది వత్సరములనుండి వంశానుగతమైన సంస్కారములఁ బట్టి వైశ్యులీ వ్యాపారములో సిద్ధి నొంది సిద్ధ హస్తులై యున్నారు. వాణిజ్యములో వారితోఁ బోటీ చేయుట యందే యితర వర్ణము సమర్థము కానేరదు. మంచిది; ఈ విచారము విడిచిపెట్టుఁడు. వైశ్యులు తాము ముఖ్యవ్యాపారమైన వాణిజ్యమును ప్రాచీనకాలమునుండి మహాభారత సమయమువఱకుఁ జేయుచుండిరి. మొదట తఱచుగా వైశ్యజాతి యందుఁ జాలమంది చేరియుండిరి. కాని యిపుడీ జాతి సంకుచితమైపోయెను. కృషి చేయు ననేక వైశ్యజాతులు శూద్రులలోలెక్కింపఁబడుట యారంభమయ్యెను. దీనికిఁ గారణ మేమనఁగా వేదాధ్యయనము యజనము ఈ రెండధికారములు బ్రహ్మ క్షత్రియులకు వలెనే వైశ్యులకుఁ గూడఁ బ్రాప్తములై యుండెను. కాని వారు వీనిని రక్షింపలేదు. క్షత్రియులలో వేదాధ్యయనము కొంతమాత్రము ఉండియుండును, కాని వైశ్యులలో నయ్యది చాల తగ్గిపోయి యుండును; అవతల నది నొత్తిగా లుప్తము కాకుండెను. వ్రజము నందలి గోపీగోపులు వైశ్యులై యుండిరి. భాగవతములోఁగూడ గోపాలకులు యజ్ఞము చేసినట్లు వర్ణన మున్నది. ఇది గాక కృషి కార్యములో రాత్రింబగళ్ళు శూద్రు

లతో పాటు నివసించిన కారణమునంగూడ వేదాధ్యయన ప్రవృత్తి వైశ్యులలో తగ్గిపోయియుండును. ఈ ఈ కారణములచేత ఆ వైశ్యజాతు లిపుడు శూద్రులలో లెక్కింపంబడ నారంభ మయ్యెను. కాని మహాభారత సమయమున వారు శూద్రులుగా విశ్వసింపంబడక యుందురు. ఉదాహరణార్థము మూల మందు గృషి కర్మ చేయు వైశ్యులు ఒక హిందూ జాతి వారై యుందురు. గోరక్షా వ్యాపారముచేయు వైశ్యులు గూడ గొల్ల, ఒక క్షత్రియజాతివారై యుందురు; ఎందుచేత ననంగా వీరి పద్ధతి, యాకారము వీరియందుం జాల మటుకు నార్యులై యున్నారు. శీర్ష మాపన (తల కొలత) శాస్త్ర పండితులకుం గూడ నీ విషయమై యాసక్తి లేదు. మహాభారతములోని యీ వర్ణనములు ప్రత్యక్ష స్థితి ద్యోతకములై యున్నవి. లేక అట్లు పరిగణింపబడుచు నుందుకు పోయిరని చెప్పుట కఠినమై యున్నది. అయినను బూర్వకాలమందుం గృషి, గోరక్షయుం జేయుట వైశ్యుల వ్యాపారములై యుండె నను మాటయైతే స్పష్టమై యున్నది.

నచ వైశ్యస్య కామః స్యాన్న రక్షేయం పశూనితి ।
వైశ్యేచేచ్ఛతి మాన్యేన రక్షితవ్యాః కథంచన॥ (21 శాం. అ. )

సౌతిసమయమున నిందుం గొలందిగాం బరివర్తనమైపోయియుండును. ఖతియు వైశ్యుల ప్రవృత్తి కేవలము వ్యాపారము లేక వాణిజ్యము వైపుననే యుండిపోయి యుండును.

## శూద్రుల కృత్యము

ఇంక శూద్రుల కృత్యము విచారింపం దగియున్నది. ప్రాచీనకాలమున శూద్రుల స్థితి కేవలము దాసులదియై యుండెను. వీరు మూండు వర్ణములను సేవింపవలయుననియు దీని ననుసరించి వారు సేవయే చేయుచుండిరనియు నిర్ణయమై యుండెను. వారి కధ్యయనము గాని, యజనము గాని చేయుట కధికారములేకుండెను; ఇంతమాత్రమే కాదు. ఇక నేమంటేని వారికి ద్రవ్యార్జన కూడ నిషేధింపంబడినది. వారికిం గడుపునిండ భోజనము పెట్టుటయు, ధరించుటకుం జినిగిన ప్రాంత గుడ్డల నిచ్చుటయు రెండే వారి యజమానునికిం గర్త

వ్యములై యుండెను. తరువాత నిట్టి స్థితి మాఱిపోయి యుండును. ఉత్తరో త్తరమున నార్యుల నివాసము దక్షిణము వైపున తగ్గిపోయిన కొలఁదియు శూద్రుల సంఖ్య పెరిఁగిపోయి యుండును. ఇదె గాక వీరు కృషి నెక్కువగా చేయ మొదలిడియుందురు. దక్షిణపువైపు రాష్ట్రముఁన వైశ్యులైన యార్యులు తగ్గియుండిరి; ఇందుచేత కృషి ధర్మమును శూద్రు లెక్కువగాఁ జేయువలసి వచ్చెను. ఈ విధముగా వారి పరిస్థితి మాఱిపోయెను. ఇందుచేత శూద్రులకు ధన మార్జించు నధికారము లభించెను. శాంతి పర్వములో 60 వ యధ్యాయ మందు రాజానుమతిని బొంది శూద్రులు ధన సంచయమును జేయువచ్చు నని చెప్పఁబడి యున్నది; కాని యీయనుమతి యాజ్ఞలేకుండఁగూడ శాశ్వతముగా లభించెను. మెల్లమెల్లగా వారికి ద్రవ్యముతో పాటుగనే యజ్ఞ యాగాదులను జేయు నధికారము లభించెను; దానమిచ్చుటకుఁగూడ నధికారము లభించెను శూద్రుఁడు యఁజ్ఞియ వ్రతము నాచరింపక యమంత్రకమైన యజ్ఞమును జేయవలయునని షర తుండెను.

స్వాహాకార వషట్కారౌ మంత్రః శూద్రే న విద్యతే।
తస్మా చ్ఛూద్రః పాకయజ్ఞై ర్యజే తా వ్రతవాన్ స్వయం॥
(38 శాం. అ. 60)

శూద్రునికి స్వాహాకారమునకు, వషట్కారమునకు, వేదమంత్రమునకును నధికారము లేదు. ఈ యధ్యాయమందు శూద్రులకు ఋగ్యజు స్సామముల యధికారములేదను సంగతియుఁ జెప్పఁబడి యున్నది. యజన, దాన, యజ్ఞముల యధికార మన్ని వర్ణములకుఁ గలదు. శ్రద్ధా యజ్ఞ మన్ని వర్ణములకు విహితమై యున్నది; ఈ మొదలగు వచనములఁ బట్టి యార్య ధర్మములోని యధికారము క్రియలలో– శ్రాద్ధాదుల వఱకు– అధికారము శూద్రులకు మహాభారత సమయమునకుఁ బూర్వమే లభించి యుండెను. శూద్రుని యొక్క, అనఁగా సేవలము దాసునియొక్క పరిస్థితి నుండి వెడలి యిపుడు శూద్రులకు స్వతంత్రోద్యమము, కృషి మొదలైనవి చేయు నధికారము లభించి వారు ద్రవ్య సంపాదనము చేయ నారంభించిరో యప్పుడీ స్థితి ప్రాప్తమయ్యెను; కాని త్రైవర్ణి కార్యులు తమ వైదిక కర్మాధికారమును శూద్రుల కీయలేదు.

కేవలము మూఁడు వర్ణములే యధ్యయనముచేయు నధికారమును గలిగియుండెను; అనఁగా సమంత్రకములైన ఈ వైదికక్రియలెఱిఁగియుండుటవారికే సంభవమై యుండెను. వైదిక కాలము మొదలుకొని మహాభారత సమయమువఱకు శూద్రులయొక్క వ్యాపారము, కర్మాధికారము మిగుల నెక్కువ తరగతిది యైపోయెను.

## సంకర జాతుల కృత్యములు

భిన్నభిన్న వర్ణముల సంకరముచేతఁ బుట్టిన జాతులకును విశిష్ట కర్తవ్యములు లేక యుద్యమములు గూడ విచారింపఁదగి యున్నవి. ప్రతిలోమ వివాహములవల్లఁ బుట్టిన మొదటిజాతి సూతులదియై యుండెను. బ్రాహ్మణ స్త్రీకి క్షత్రియ పతివల్ల దీని కుత్పత్తి చెప్పఁబడి యున్నది. (అనుశాసనపర్వం అధ్యా. 48). ఇట సూతుల కృత్యము రాజుల స్తుతించుటయని చెప్పబడినది పురాణముల నధ్యయనము చేసి కథలను వినిపించుటయు వీరి కృత్యమై యున్నట్లు తెలియుచున్నది. మహాభారత కథను వినిచిన లోమహర్షణుఁడు సూతపుత్రుఁడై యుండెను. ఇతనిని పౌరాణికునిగాఁ గూడఁ జెప్పుచున్నారు. పురాణములయందు రాజుల వంశావళులుండును. రాజులయు, ఋషులయు * వంశావళిని రక్షించు పని సూత పౌరాణికులదియై యుండెను. ఇప్పటి భట్టువాండ్రుకూడ నీ పనినే చేయుచున్నారు. వీరుకూడ వంశావళిని వల్లెవేయుచున్నారు. రాజులను స్తోత్రము చేయుచున్నారు. భట్టులజాతి బ్రాహ్మణుల జాతి వలెనే పూజ్యముగా విశ్వసింపఁబడి యున్నది. భాగవతమం దొకకథలోఁ జెప్పిన ప్రకారముగా లోమహర్షుని బ్రాహ్మణుఁ డని విశ్వసింపవలసిన యావసరము లేదు; ఎందుచేత ననఁగా సూతులకుఁ గూడ వేదాధికార ముండెను. సూతుఁడైన అధిరథునికిఁ బుత్రుఁడైనప్పటికిని గర్ణుఁడు వేదమును బఠించుచుండెను. ఇట్లు మహాభారతములో వర్ణన మున్నది. కుంతి యతని జూచుటకు వెళ్ళినపుడు అతఁడు వేద ఘోషము చేయుచుండెను. (ఉద్యో. అ. 144) అచ్ఛములైన బ్రాహ్మణ క్షత్రియ వర్ణములు రెండిఁట నుండి సూతజాతి కలి

* ఆదిపర్వమందు సూతునితో శౌనకుఁడు, ముందుగా భృగుల వంశావళిని వినుమనియే చెప్పెను.

గిన కారణముచేత నయ్యది బ్రాహ్మణ జాతితోఁ దుల్యముగా మన్నింపఁబడి యుండును; నేఁడును రాజపుత్ర జాతి యందలి రాజుల రాజ్యమందు బ్రాహ్మణునికిని భట్టులకును సమానమైన గౌరవమున్నది.

సూతుల కింకొక వ్యాపారము గూడఁ దెలియును. వారు సారథ్యము గూడఁ జేయుచున్నారు. రథము తోలుట సూతుని పనియై యుండెను. అతని పేరు అధిరథిగూడ నై యుండెను. కర్ణుఁ డధిరథికిఁ బుత్రుఁడై యుండెను; అనఁగా అతఁ డొక సారథికిఁ బుత్రుఁడయి యుండెను. ఈ కారణముచేతనే ద్రౌపది యతనికి జయమాల వేయలేదు; సూతుని వ్యాపారమును నిర్ణయించు నపుడు ఆ కాలపు పరిస్థితిపైని విచారము గావించి, తల్లిదండ్రుల బిడ్డల వ్యాపారము ననుసరించి అతనికి వ్యాపారము నిశ్చయింపఁబడియుండును. బ్రాహ్మణుని వ్యాపారము బుద్ధిదియై యుండెను; ఈ దృష్టిచేత వేదముకంటెఁ దక్కువైన పురాణముల నధ్యయనము చేయు నధికారము సూతుని కీయఁబడి యుండును; క్షత్రియుని వ్యాపారము యుద్ధమై యుండెను; అది సూతునికి క్షత్రియ జనక సంబంధమును బట్టి లభించి యుండును. అనఁగా సూతునికి సారథియొక్క వ్యాపారము నేర్పఁబడి యుండును. దక్షిణాఫ్రికాయందు నీగ్రో స్త్రీల నుండి యూరోపియనులకుఁ గలిగిన సంతానము విషయమునఁ గూడ నిట్టి వ్యవస్థయే చేయఁబడి యున్నది. వారి కీ వ్యాపారమే బండి తోలుటకును గుఱ్ఱపు చాకిరీ చేయుటకును నప్పగింపఁబడి యుండును. ఇదే విధముగా హిందుస్థానమందుఁ గూడ యూరోపియన్ పురుషులనుండి యేషియా స్త్రీలకుఁ గలిగిన యూరోపియన్ సంతానమునకు యూరోపియనులకంటెఁ దక్కువ దర్జా గల చిత్తరువు పని లభించి యున్నది. తాత్పర్యము, ఈ దినములలోని యూరోపియనులు ఇప్పటి హిందూస్థానపు బ్రాహ్మణ క్షత్రియులై ఉన్నారు. వీరికి శూద్ర స్త్రీల నుండి కలిగిన సంతానమును వారు తమకు సమానముగా నెంచరైరి. కాని వారిసంతానమును వేఱుగు నొక క్రొత్తజాతిగాజేసిరి. వారిని స్పష్ట రీతిగాఁ గాదుకాని యప్రత్యక్ష రీతిగా మాత్రము ఒక భిన్న వ్యాపారమందుఁ బెట్టిరి. ఈ యుదాహరణమును బట్టి పాఠకులు ప్రాచీన కాలమందు హిందుస్థానములోని యార్యులలో మిశ్రవర్ణముగల మఱియొకజాతి యెందుచేఁ గలిగెనో దానికి వ్యాపారము వేఱుగా నెట్లుచేయఁబడియెనో చక్కఁగాఁ దెలిసికొనఁగలరు.

ఏదో కానిండు; వైశ్యునికి బ్రాహ్మణస్త్రీ నుండి పుత్పన్నమైన సంతతి యొక్కపేరు వైదేహుఁడయి వుండెను. అంతఃపురస్త్రీలను రక్షించుట వీరి పని యైయుండెను. ఇదే విధముగా క్షత్రియ స్త్రీ యందు వైశ్య పురుషుని వలన నుత్పన్నమైన సంతతికిఁ బేరు మాగధుఁ డయియుండెను. ఈ మాగధులపని రాజుల స్తుతించుటయై యుండెను. ఈ యుచ్చ వర్ణములు మూఁడిటికిఁ బ్రతిలోమ వివాహములవల్లఁ బుట్టిన సంతానము సూత వైదేహ మాగధ జాతులని విశ్వసింపఁబడెను. మఱియు రాజుల స్తుతిగానమును బాడుట వీరి కృత్య మయ్యెను. ఈ జాతుల పేరులు "సూత వైదేహ మాగధాః" ఈ విధముగా నెల్లపుడుఁ గలిసివచ్చుచున్నవి.

ఉచ్చ వర్ణ స్త్రీలయందు శూద్రుని వలనఁ బుట్టిన సంతానము యొక్క వ్యాపార వ్యవస్థ యిపుడు చూడవలయును వైశ్య స్త్రీకి శూద్రపురుషుని నుండి పుట్టిన సంతతిని అయోగవులని చెప్పుచుండిరి. ఈజాతి యెక్కువ నింద్యముగా నెంచబడలేదు, ఎందుచేత ? వైశ్య శూద్రవర్ణములుదగ్గఱదగ్గఱవియై యున్నవి వడ్రంగిపని వీని వ్యాపారమయ్యెను. క్షత్రియ స్త్రీకి శూద్రుని వలన నుత్పన్నమైన సంతానము అధిక నింద్యమైన నిషాదజాతియై యున్నది చేపలఁ బట్టుట వీరి పనియైయుండెను; ఇంకను వీరు వ్యాధుల పనిఁ గూడఁ జేయుచుండిరి. సరోవరమందు దుర్యోధనుఁడు దాగిన సమాచారము పాండవులకు నిషాదుల నుండి దొరకినట్లు వర్ణన మున్నది. చివరకు బ్రాహ్మణ స్త్రీకి శూద్రుని నుండి పుట్టిన సంతానము అత్యంత నింద్యుఁ డగు చాండాలుడై యున్నాఁడు. వీరికి ఘాతుక కృత్యము లభించెను. ప్రాణాంత దండనము విధింపఁ బడుచున్న యపరాధుల శిరస్సులను వీరు ఖండించుచుండెడివారు. అనులోమ జాతులలో అంబష్ఠులు, పారశవులు, ఉగ్రులు అను జాతులు చెప్పఁబడియున్నవి. వారి యుద్యమముయొక్క వర్ణనము (అను. ప. అ. 48లో) లేదు. అయినను ద్విజులను సేవించుట వారి కృత్యమై యుండెను. సంకరజాతుల యందుఁ గూడఁ సజాతీయ స్త్రీపురుషులనుండి వారి జాతియొక్క సంతానము కలుగుచున్నదని చెప్పఁబడి యున్నది. ఈ నియమమను నుల్లంఘించి, యుత్తమ పురుషునికి నధమ స్త్రీకి లేక యధమ పురుషునికి నుత్తమ స్త్రీకి సమాగమము వలన న్యూనాధిక ప్రమాణమున నింద్యమైన సంతతికలుగుచున్నది. విశేషించి ప్రతి

లోమ సంతతి పెరుగఁగా పెరుగఁగాఁ నొకదాని కంటె రెండవది హీనమైనది. ఇట్లు పదునైదు విధముల బాహ్యాంతర సంతతి కలుగుచున్న దని యిచట నీ సంగతి మొదటఁ చెప్పఁబడి యున్నది. వానిలోఁ గొన్ని నామము లివియై యున్నవి. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకుఁ గ్రియా లోపము సంభవించునేని వారినిదస్యులుగా విశ్వసించుచున్నారు. ఇటువంటిదస్యునినుండి యాయోగవ స్త్రీయందుఁ గలిగిన సంతానమునకుఁ బేరు సైరంధ్రులని యైయున్నది. ఈ జాతి పురుషుల వ్యాపారము రాజుల యలంకారములయు దుస్తులయు వ్యవస్థచేయుట, నలుగుపెట్టుట, పాదము లొత్తుట మొదలగునవియైయుండెను స్త్రీల పని నిట్లే రాణుల సేవ చేయుటయై యుండెను. ఈ సంతానము నిజముగా (అసలు) దాస కులముది కాదని వ్రాయఁబడి వున్నది. కాని వీరికి సేవావృత్తి చేయుటయే నియమమై యుండెను. సైరంధ్రీ జాతి విషయమునఁ గొన్ని మాట లింతను వ్రాయఁబడుచున్నవి. ఆర్యవర్ణములోని పతి నుండి యనాయోగవస్త్రీనుండి వారి యుత్పత్తియైయుండెను. ఈకారణముచేత నయ్యది బాహ్యములు లేక బాహ్యతరములైన జాతులలో లేక యుండును. ద్రౌపది సైరంధ్రియైనపుడు ఆమె చెప్పియుండెను—"సైరంధ్రినామికలైన స్త్రీలు, లోకులు ఇంటఁగలాకౌశల కర్మమును జేసి తమ్మునిర్వహించుకొనుచున్నారు. ఈ స్త్రీలు భుజిష్యలైయున్నారు. అనఁగా యజమానునికి వీరిపైనొకవిధమైన సత్తా యున్నదని కూడ వర్ణనమున్నది. ఇందుచేత, సైరంధ్రి ముందుగనే నాపతులు గంధర్వులని చెప్పియుండెను. అనఁగా దాసికంటెసైరంధ్రియొక్క స్థితి కొంత మంచిదియైయుండును. ఈ సైరంధ్రులలో ననేక భేదములు చెప్పబడియున్నవి; ఏ విధముగా మాగధ సైరధ్రులు, వైద్యుల పనిచేయుదురో, వైదేహ సైరంధ్రులు, ఇంకను వధ్యము చేయుదురు. మరియును సైరంధ్రి స్త్రీల నుండి చాండాలునికిఁ గలిగిన సంతానమునకుఁ బేరుశ్వపాకులని చెప్పఁబడియున్నది ఈ జాతులు తఱచుగా నూరిబయట నుండువారును తుచ్ఛాభ్యాసము చేయువారును నీచులైన మూలనివాసులలో వారును నై యుందురు. ఈ జాతి జనులు కుక్కలు, గాడిదలు మొదలగు వాని మాంసమును దిని నిర్వహించు జీవించుచుండియుందురు. ఆ యోగవస్త్రీనుండియు చాండాలునుండియు బుల్కస పుక్కస జాతి పుట్టుచున్నది. "ఈ జాతివారు గజాశ్వముల మాంసమును దినుచున్నారు. సీను గుహైఁ గప్పు బట్టలను

దాల్చుచున్నారు, పుఱ్ఱెలలోఁ దినుచున్నారు. వీరి వర్ణన మిట్లేవున్నది, శ్వపాకుల వ్యాపారము అభ్యాసము శ్మశానమందు శవములరక్షించుటయైయుండెను. అత్యంత నింద్యములైన యీ యనేక జాతులు గ్రామముదెలుపలనుండ వలయునను. నియమిపుడు నుండెను. ఈ సమయమునఁ గూడ నున్నది. మహాభారతమందు వర్ణ సంకరమునకై వర్ణింపఁబడిన భయంకరనింద్యత్వము యొక్క కల్పన పైవివేచనఁ బట్టి కాఁగలదు. అట్లు సంకర జాతుల సంఖ్య యనంతముగాఁ జెప్పఁబడియున్నది, అయినను త్రైవర్ణిక ప్రతిలోమ జాతియందు సూతవైదేహమాగధులు, అట్లనులోమ జాతియందు నాంబష్ఠపారశవులు ఆర్య సనాతన సమాజములోఁ బ్రవేశించి వుండిరి. నిషాదులు, ఛండాలురు, పుల్కసులు మొదలైన బాహ్యములు బాహ్యతరములునైన యనార్య జాతులుండెను వీనియందును అనార్య జాతి కొంత మిశ్రమమై వుండునుడు. ఇందుచేత వీని విషయమై యివి మ్లేచ్ఛజాతి కంటె వేఱైవుండెనను కల్పన యుండెను. వీని నివాసము ఆర్యావర్తమందే ఉండెను. మఱియు సవియస్య వర్ణముల వరుసలో నుండెను. వారి ధర్మ సంతానము ధర్మమునుండివిడిపోయియుండలేదు వారందఱకు సనాతన ధర్మము యొక్క ముఖ్య నియమములనుచరములయి ఉండెను చూడఁగా వారుచాతుర్వర్ణ్యమునకు బాహ్యులై ఉండిరిమరియుదాని నుండి బొత్తిగా భిన్నులై ఉండలేదు. వారి నార్యులని చెప్పినను వారు మ్లేచ్ఛులుకారు. ఆర్యశబ్దము జాతివాచకమై యున్నది. మరియుఁ ద్వైవర్ణి కార్థమునను న్నది యార్య సంస్కారమున్న వారిని బోధించుచున్నది. అనగా ఈ నింద్యజాతులు త్రివర్ణ బాహ్యములై ఉండెను. వీని యాచరణము కూడ నపవిత్రమై వుండెను. ఈ జాతుల త్రివర్ణమునకుఁ గోసులమేరలోలేదు వారి సమాజమునకును లేక ధర్మమునకును బొత్తిగా వేరయి వుండలేను. అగుగాక హిందుస్థానమందలి సమాజ వ్యవస్థ కొకప్రధానాంగము చాతుర్వర్ణ్యవ్యవస్థయై ఉన్నది. చాతుర్వర్ణ్య వ్యవస్థ లేని దేశము మ్లేచ్ఛదేశమనియు అచ్చటి వారార్య భాష మాటాడుచున్నను నది యేమాత్రము ఆర్యదేశము కాజాలదని మనుస్మృతియందు స్పష్టముగాఁ జెప్పబడి ఉన్నది. మహాభారతము యొక్క సమయమున మధ్యదేశమందువర్ణవ్యవస్థ యొక్క ప్రచారమెక్కువగానున్నట్లు కనిపించుచున్నది. కర్ణపర్వమందు, కర్ణుఁడు శల్యుని నిందించునపుడు భాషిం

చిన భాషణముఁ బట్టి హిందుస్థానములోనే యే భాగములందు వర్ణవ్యవస్థ పూర్ణముగాఁ బ్రచలితమై వుండెనో యనుమానము చేయఁ దగలదు. ఉత్తపర్వము యొక్క 45వ యధ్యాయమందు మత్స్యకురుపాంచాల నైమిషనైద్యాదిదేశ జనులు నిరంతరము ధర్మమును బాలించుచున్నారు: కాని మద్రపాంచనదదేశముల జనులు ధర్మలోపమును జేయుచున్నారని చెప్ప బడి యున్నది. దీనికిఁ బూర్వమిది కూడఁ జెప్పఁబడియున్నది "బాహ్లీకదేశ మందు మొదటి మనుష్యుఁడు బ్రాహ్మణుఁడగుచున్నాడు, పిదప క్షత్రియుఁడు వీని తరువాత వైశ్యుఁడు, అపుడు శూద్రుఁడు, పిమ్మట నాపితుఁడు ఈ విధ ముగాఁ గాఁగా నిరూపింపఁగా నతఁడు మంగలియైపోయెను అయినను మరల నతఁడు బ్రాహ్మణుఁ డగుచున్నాఁడు మరల బ్రాహ్మణుఁడైన తరువాత నతఁడు బానిసయగుచున్నాఁడు." ఈ వర్ణనముఁ బట్టి పంజాబులో వర్ణవ్యవస్థ కొంత శిథిలమైపోయినట్లు అనుమానము కలుగుచున్నది. ఈ భాషణ మందతి శయోక్తి యున్నదనుటలో సందేహములేదు, అయినను కురువులతో వర్ణ వ్యవస్థ యొక్క స్వరూపము కఠినమై యున్నంతగాఁ బంజాబులో లేకపోయి యుండును, అన్నపానముల సంగతితోఁ బంజాబున నేఁడును విశేషబంధన మేమియు లేదనుట సంతోషకరమై యున్నది. ఇదిగాక మహాభారతములో కారస్కరులు, మాహిషకులు, కాళింగులు, కేరళులు, కార్కోటకులు మొదలైన దుర్మతస్థులైన లోకులతోఁ గూడ సంపర్కము చేయఁగూడదనియుఁ జెప్పఁబడి యున్నది. వీనిలో జాలదేశములు దక్షిణము వైపువియైయున్నవి. ఈ దేశ ముల యందా సమయము వరకు నార్యుల నివాసము తక్కువియైయుండెను విశేషముగాఁ గనిపింపకుండెనని తోఁచుచున్నది. ప్రాయికముగా, ఆ సమయ మున, ఈ దేశములు జైనబౌద్ధమతముల ఛాయ క్రిందికి నధికముగా వచ్చి యుండును. ఈ మతములు జాతిభేదమును స్వయముగా విడిచిపెట్టియుండె నను సంగతి వ్రాయఁబడియేయున్నది. మరల హిందుస్థానమందున్న చాతు ర్వర్ణ్య వ్యవస్థ యొక్క పరిపూర్ణ ప్రాబల్యపు ఛాయ హిందూస్థానములోనియి తర దేశములయందు వ్యాపింపకుండుట యసంభవమై యుండెను. ఈ కార ణముచేత, మెల్లమెల్లగా, హిందుస్థానములో నన్ని భాగముల యందుఁ జాతుర్వర్ణ్య వ్యవస్థ ప్రబలముయ్యెను. మరియుఁ దీప్రపముగానములోనికి వచ్చెను. పంజాబునకు మ్లేచ్ఛదేశములతో విశేష సంపర్కముండెను. ఈ శిథి

లత్వము వివాహము, అన్నపానములు, లేక వ్యాపారము వీని విషయమున నుండెనని చూపఁబడియే యున్నది.

## సారాంశము

హిందుస్థానమందలి వర్ణవ్యవస్థ యొక్క స్వరూపము, దాని యితిహాసము ఈ ప్రకారముగా నున్నది. సారాంశమేమనఁగా హిందుస్థానమునకుఁ బ్రాచీనార్యులు వచ్చినపుడు వారిలో బ్రహ్మక్షత్రియులనెడి రెండు వ్యాపారముల జాతులుండెను. అప్పటికి వివాహ సంబంధమైన బంధనమేమియును లేకుండెను. పంజాబులో నివసించిన పిమ్మట వైశ్యులు అనఁగా కృషికర్మము గోపాలనము చేయు మూఁడవజాతి యేర్పడెను. పిదప శీఘ్రముగనే యిచ్చటి పూర్వనివాసులలో, శూద్రజాతి యార్యుల సమాజమందుఁ గలిసిపోయెను. వారి రంగైన నలుపు, జ్ఞానశక్తి, నీతి తక్కువయైన కారణముచేత వర్ణశబ్దమునకు జాతినీ జెప్పు మహత్త్వము ప్రాప్తించెను. శూద్ర స్త్రీల గ్రహింప నారంభించుటచేత మధ్యదేశమందు శూద్రుల జనసంఖ్య యెక్కువగా నుండియుండును. మరియు నిచ్చటి నాగులను వారి స్త్రీలరూపము కూడఁ జక్కఁగానుండియుండును. వర్ణముల యొక్క విభేదమింకను స్థిరపడిపోలేదు. వైశ్యులు కృషి చేయుచుండిరి. శూద్రులతో వారికిద్దఱనుసుగాఁ బనిగలిగియుండెను ఈ కారణముచేత వారు శూద్రస్త్రీల నెక్కువగా గ్రహించిరి. ఈ జాతిస్త్రీల సంతానము కూడ వైశ్యులుగనే విశ్వసింపఁబడ నారంభమయ్యెను; ఇందుచేత వైశ్యవర్ణమందు గొలదిగాఁ గళంకముండెను. క్షత్రియులకుఁకూడ నిట్టిస్థితియే తటస్థించెను. బ్రాహ్మణులు శూద్రస్త్రీ సంతానమును వేఱు జాతిగాఁ జేసివెచిరి.

దీని ననుకరించి ఈ యనుకరణము నాధారము చేసికొని మెల్లమెల్లగా అన్యములైన యనులోమ వర్ణ జాతులయి పోయెను. ప్రతిలోమ వివాహ విషయమున లేక సంతానము విషయమున నధికమైన జుగుప్స యుండెను; ఇందుచేత ఆ జాతి విషయమున, విశేషించి శూద్రోత్పన్నమైన సంతానము విషయమున, నెక్కువ నింద్యత్వము విశ్వసింపఁబడెను. కాని సూతవైదేహ

జాతులనెడి యీ యార్యోత్పన్న సంకరజాతులు పెద్ద దర్జాకలవిగా నూహింపబడెను. ఈ వేర్వేఱు వర్ణముల వ్యాపారములు కూడ వేర్వేఱుగా నిశ్చయింపఁబడియున్నది. బ్రాహ్మణుల విశేష వ్యాపారము అధ్యయనము, యాజనము, ప్రతిగ్రహము గా విశ్వసింపఁబడెను. యుద్ధము, రాజ్యము చేయుట క్షత్రియుల వ్యాపార మయ్యెను; కృషి, గోరక్ష, వాణిజ్యము వైశ్యులవ్యాపారము శూద్రులవ్యాపారము దాస్యముగను నిశ్చితమయ్యెను. కాని య్యాపత్సమయమునఁ దమదమ వర్ణము కంటెఁ దక్కువ వర్ణము యొక్క వ్యాపారమును జేసి నిర్వహించుకొను స్వతంత్రత యుండెను; కనుకఁ గొందఱు బ్రహ్మక్షత్రియులు రయితు వ్యవసాయదారులుగా కూడనై పోయిరి కొందఱు క్షత్రియులు వైశ్య వ్యాపారులై పోయిరి. వైశ్యులు కృషి గోరక్షణములను విడిచిపెట్టి కేవలము వ్యాపారమునే చేసిరి. మిశ్రజాతులకుఁ గూడ భిన్నభిన్న వ్యాపారములు స్థిరమైపోయెను. ఇదే మహాభారతమునాఁటి సంక్షిప్తనిష్కర్షము.

ఇపుడు, సంక్షిప్తముగా మహాభారత కాలము తరువాత వర్ణవ్యవస్థ యొక్క రూపమెట్లు మాఱెనో యిది కూడ విచారించుట సమంజసముగా నుండెను. దీనిఁబట్టి, మహాభారత సమయమున నెట్టి వ్యవస్థ యుండెడిదో చక్కగాఁ దెలియఁగలదు. జాతి వ్యవస్థకు విరుద్ధముగా బౌద్ధమతము యొక్క కటాక్షముండెను. ఇందుచేత జాతి బంధనమందుఁ జాల గడబిడయైపోయెను. ఈ కారణమున హిందూ మతమునకు మంచిదినము వచ్చినపుడు జాతి బంధన నియమములు మరింత కఠినములయ్యెను. ఎప్పటి యట్లు భిన్నభిన్న వర్ణముల స్త్రీలను గ్రహించు పద్ధతి యాఁగిపోయెను. మహాభారతమునకుఁబిమ్మట స్మృతులలో, ప్రతివర్ణము తన వర్ణమందే వివాహము చేసికోవలయుననియు, సవర్ణ స్త్రీవలన నుత్పన్నమైన సంతానమే యా వర్ణపుదిగాఁ జెప్పవలయుననియు నిర్బంధము కలిగెను. బ్రాహ్మణునికితర వర్ణస్త్రీ గ్రహణము బంద్దైపోయెను. క్షత్రియుఁడు కూడ నన్యవర్ణ స్త్రీని జేసుకొనుట మానివైచెను ఈ కారణముచేత, భిన్నభిన్న వర్ణముల మిశ్రణమువలన నిత్యమునేర్పడుచుండెడి క్రొత్త జాతులు బంద్దైపోయెను. ఈ వర్ణవ్యవస్థ వలన నుత్పన్నమగు జాతి గర్వము ఇతర సమాజముల మీఁదఁ దనపరిణామమును వినియోగింప నారంభించెను. అనఁగా అనార్య జాతుల యందును జాతి భేదము పుట్టుట

యారంభమయ్యెను. హిందుస్థానమందలి ప్రతి జాతికి మనమేదో యొక జాతి కంటె నవశ్యముగా శ్రేష్ఠులమని తోఁచెను. మఱియు ద్రవ్యము చేతగాని శక్తిచేతగాఁని మహత్త్వము ప్రాప్తమైన చోటనెల్ల నొకప్రకారమగు నభిమాన మెుక్కువయై వేర్వేఱు జాతులు పుట్ట నారంభమయ్యెను. ఈ విధముగా ప్రతి జాతియందును నంతర్భేదములు పుట్టుట నారంభించెను మరియునా చిన్న యవధి లోపలనే వివాహబంధన మయ్యెను. ఇదిగాకుండ దేశభేదముచేతఁ గూడ జాతిభేదము విశ్వసింపఁబడ నారంభమయ్యెను. భిన్నభిన్న దేశములలోని యన్నపానములు, ఆచారములు, ఇతిహాసము భేదమువలన నొకదానిపై రెండవది దానికి సందేహింప నారంభించెను; ఈ కారణము చేతఁ గూడనంత ర్భేదములకు దృఢబంధనము యొక్క స్వరూపము ఇప్పటి బ్రాహ్మణులయం దనేక భేదములు తటస్థించినట్లే తటస్థించెను, ముఖ్యభేదములు బ్రాహ్మణులలోఁ బది విధములు (దశవిధములు) అనఁగా పంచద్రావిడులు, పంచగౌడులు; కాని మహాభారతములో నీ దశభేదముల నాములుకూడ లేకున్నవి. మహాభారతములో బ్రాహ్మణుని పేరు వచ్చినపుడెల్ల దేశభేదమేదియుఁ జూపఁబడుటలేదు. ఈ బ్రాహ్మణుఁడు గౌడుడు కాన్యకుబ్జుఁడు లేక దాక్షిణాత్యుఁడు అని వర్ణన మెచ్చటనులేదు. మరల నిపుడు మహారాష్ట్ర బ్రాహ్మణుల యందుఁ గూడ నున్న దేశస్థకొంకణస్థాదిభేదములనులేక కాన్యకుబ్జాద్యంతర్భేదములకునునుట్లే ఖమెచ్చటి నుండి లభించెను. క్షత్రియులలోని యంతర్భేదముల జాడ కూడ మహాభారత మందు దొరకదు. చంద్రవంశీయులయు సూర్యవంశీయులయు భేదభావము కూడ వ్యక్తీకరింపఁబడి యగపడదు. యాదవ, కౌరవ, పాంచాలాది దేశభేద ములు మాత్రము కలవు. కాని యవి నేఁటి క్షత్రియుల యంతర్భేదముల వంటివికావు. ఏయేల, వారందఱు యాచారవిచారములు, వ్యాపారము గూడ నొకటివియై యుండెను: అందఱియందును. బరస్పరము వివాహములుం డెను. వైశ్యులలోని యవాంతర భేదములు కూడ నెచ్చటను గనిపింపవు. యీ యున్న యవాంతర భేదములోను శ్రీ శంకరాచార్యుని పిమ్మటవియై యున్నవి; ఇట్లనుమానించుట కవకాశము కూడ నున్నది. బౌద్ధధర్మోచ్ఛేదా నంతరము హిందూ ధర్మసమాజమునకు మరల సంఘటనమైనపుడు ఆయా దేశముల యందును నాయా భాగముల యందును. నివసించిన వారికెల్లను నితర భాగస్థుల యన్నపానముల యెడను వర్ణ పరిశుద్ధత విషయమున ను

సందేహము కలిగెను. ఇందుచేతఁ బ్రతిజాతి యందును నంతర్భేదములు క్రీస్తు సం 800 దాదాపున నై పోయెను. మఱియు వివాహ బంధనములచేత బిగించి కట్టిన కారణమున నా భేదములు నేఁటివరకు నిలిచియున్నవి. సారాంశమేమనఁగా ఇప్పటి రోజులలోనున్న కనౌజీలు, మహారాష్ట్రులు, గుజరాతీలు లోనగు బ్రాహ్మణ భేదములకుగాని. రాఠోడులు,చందేలులు, మహారాలుమున్న క్షత్రియ భేదములకుగాని. మహేశ్రీలు, అగరవాలులు, మహారాష్ట్రులు మొదలగు వైశ్య భేదములకుగాని నిర్దేశము మహాభారతమందు లేదు. మహాభారతమందు బ్రాహ్మ క్షత్రియ వైశ్యులు వర్ణ భేదరహితులై యుండిరి. ఇట్లే సంకర వర్ణములు కూడ సూత మాగధులలొకరేయై యుండిరి; వానిలో నేవిధముగ నంతర్భేదము కనఁబడదు.

జాతుల యీ విషయముతో సంబంధించునది మఱియొక విషయమున్నది. శాంతిపర్వముయొక్క 29వ యధ్యాయమందు దీని విషయమై వ్రాయఁబడినది "తొలుత నాలుగు గోత్రము లుత్పన్నములై యున్నవి. అంగిరకుఁడు, కశ్యపుడు. వసిష్ఠుఁడు, భృగువు. మఱలఁ దత్ప్రవర్తకుల కర్మ భేదములచేత నితకను గోత్రములుత్పన్నములైనవి. మఱియుఁ దపః ప్రభావముచేత నా గోత్రములు తత్ప్రవర్తకుల నామములచేత బ్రసిద్ధములై యున్నవి. సమయ గతిచేతను విజ్ఞులైన లోకులు వివాహాది శ్రౌతస్మార్త విధులలో నీ విభిన్న గోత్రముల నవలంభింప నారంభించిరి" ఈ యనువాదముఁబట్టి మహాభారతమునకు పూర్వకాలము నుండియు గోత్రముల ప్రవృత్తి కలదనియు వాని యుపయోగము శ్రౌతస్మార్త కర్మములలో నగుచుండెననియు బ్రకటమగుచున్నది, కాని యీ వర్ణనమందుఁ జెప్పఁబడిన విషయముల కొంతక ఛచిత్రమైనదివలె నున్నది. ఇప్పటి దృఢనిశ్చయమువనుసరించి బ్రహ్మ క్షత్రియవైశ్యవర్ణములయందు మూడింటను బ్రతి మనుష్యునికినేదో యొక గోత్రమగుచున్నది, క్షత్రియ వైశ్య పరివారముల గోత్ర పరంపర స్థిరమైనదోలేదోయనునీసంగతిఒకపుడుసందిగ్ధమగుఁగాక;కాని బ్రాహ్మణులయొక్క అనేక భేదములయందు శ్రౌతస్మార్తాది కర్మ పరంపరఁబట్టి యొక విధముగా సాగి వచ్చుచున్నవి. వానియందు గోత్రోచ్చారణము సదా యగుచున్నది పై యనువాదముఁబట్టి యీ పరంపర మహాభారత సమయమునఁగూడఁ

పూర్వము వఱకుఁ బోయి చేరుచున్నది. కాని పరాలగోత్రము లిప్పటిలోని వెనిమిదిగా దెలియఁబడుచున్నవి. కాని చెప్పఁబడిన వచనములో నయ్యవి నాలుగే యెందుకుఁ జెప్పఁబడెను? మఱియు; ప్రవర్తకుల కేవల కర్మ భేదము వలన గోత్రములెట్లుత్పన్నములై యుండునన్న ప్రశ్న యుండనేయున్నది. పాణిని, గోత్రమునకర్థము అపత్యమని చేసియున్నాడు. అపుడు గోత్ర పరంపర కూడ వంశ పరంపరయే యైయున్నది. సప్తర్షులు అగస్తి వీరెనమండ్రు [illegible] మొదటి గోత్ర ప్రవర్తకులై యున్నారు; మఱియు [illegible] కులమందు విశేష ప్రసిద్ధులైన పూర్వ ఋషుల నామములు గోత్రములందింకను జోడింపఁబడెను; కాని యీ సంగతి కర్మ భేదములచే వచ్చినది గాక [illegible] వారి తపః ప్రభావముచేత వారి నామములు కూడ నుత్తరోత్తరాభివృద్ధియై యుండుట కాఁగలదు. అగుఁగాక; గోత్రముయొక్క యుచ్చారణము మఱియు నవలంబము కాలగతిచేత సాగియుండుటయు నూహకు రాకున్నది; దీనిఁబట్టి దీని యవలంబము లేనియట్టి యొకసమయము కూడనుండెనని తోఁచుచున్నది ఇచట మఱియొక సంగతి కూడఁ జెప్పఁదగి యున్నది. సూర్యచంద్ర వంశ క్షత్రియుల వంశావళియందు నీ గోత్ర ప్రవర్తకుల నామములు లేవుదమరలఁ ద్వంశ క్షత్రియులకు గోత్ర నామములెట్లు ప్రాప్తించెను? ఇవిగాక కొందరు బ్రాహ్మణుల కూటములు చంద్రవంశ క్షత్రియులనుండి పుట్టినవనియు; వారి సంబంధముపై గోత్రములతో నెట్లు కలిసెననియు ఒక ప్రశ్నము కలుగు చున్నది. విశ్వామిత్రుఁడు క్షత్రియుడై యున్నాడు; బ్రాహ్మణుఁడై యతఁడు తన పుత్రుల ద్వారమునఁగొన్ని గోత్రములను బ్రవర్తింపఁజేసియున్నాడు. అతని సంబంధమెట్లు లభించెనో కూడఁ జూడఁదగియున్నది. బాగు, పై యనువాదముఁబట్టి యిపుడున్న గోత్ర పరంపర దానియొక్క యుపయోగ ప్రవృత్తియు మహాభారత కాలమునకు మునుపటినుండిఅనఁగా క్రీస్తు పూ॥ మొదటి 400 సంవత్సరములకు మునుపటినుండియై యున్నదను సంగతి నిర్వివాదముగా సిద్ధించుచున్నది.

## ఆశ్రమవ్యవస్థ

వర్ణవ్యవస్థ హిందూసమాజమునకొక విశేషాంగమైనట్లే యాశ్రమవ్యవస్థయు నొక గొప్ప యంగమై యున్నది. కాని రెండింటి యితిహాసము వేరై

యున్నది. వర్ణవ్యవస్థ ప్రారంభమైనది మొదలుకొని దాని వికాసమే యే విధముగా జరిగెనో: ఈ సమయమున వర్ణవ్యవస్థకు నభేద్యము ప్రచండమునైన స్వరూపమెట్లు ప్రాప్తించెనో చూడఁబడియెను. ఆశ్రమ వ్యవస్థయొక్క యితిహాసము దీనికి విపరీతమై యున్నది. ఆశ్రమ వ్యవస్థ మొదట మంచి స్థితిలో నుండెను. పిదప మెల్లమెల్లగా ఈ వ్యవస్థకుఁదగ్గులదయ్యెను ఇప్పుడది చాలవఱకు లుప్తప్రాయమయ్యెను. మహాభారత సమయమున దాని స్థితి యెట్లుండెనో చూడఁదగియున్నది. వర్ణవ్యవస్థ యొక్క బీజము ప్రతి సమాజమందున్నట్లే యాశ్రమ వ్యవస్థ యొక్క బీజము కూడఁదఱచుగా నున్నది. ప్రతి సమాజమందును వ్యాపారము ననుసరించి వేఱువేఱు దర్జాలున్నవి; విశేషించి తమతమ దర్జాలలోనే వివాహములు కూడ జరుగుచున్నవి. కాని యిట్టి వర్ణ వ్యవస్థకు నభేద్యమైన ధార్మిక బంధనము యొక్క స్వరూపము ప్రాప్తింపనేరదు. అట్లే ప్రతి సమాజమందును చిన్నతనమున మనుష్యుఁడు విద్య చదువ వలయును; పడుచుతనమునఁ గుటుంబము నిర్వహింపవలయును. ముసలితనమునఁ గుటుంబ జంఝాటమునుండి నివృత్తుండై (విముక్తుఁడై) కేవలమీశ్వరుని భజింపవలయునను అనెడి నేర్పాటు కూడ నున్నది. కాని యీ కల్పన ధార్మిక బంధనమనెడు చొక్కాను దొడుగుకొనఁజాలదు. ఆర్యులీ ఆచరణకుఁగూడఁ తమ సమాజమందు స్థిరతనొసఁగి వర్ణ వ్యవస్థవలె ఆశ్రమ వ్యవస్థను ధర్మ విషయముగా విశ్వసించిరి ఈ వ్యవస్థమూఁడు వర్ణములకే యుండెను. అనఁగా ఆర్యులే దీనికి బద్ధులై యుండిరి. మొదట నాలుగాశ్రమముల పరిపాలనమును ప్రతి యార్య వర్ణస్థుఁడు జేయవలయునని నిశ్చయింపఁబడెను. ఆర్యులు తమ సమాజమును మున్నతావస్థకు జేర్చుటకై చేసిన నిపుణమైన యత్నము లీయాశ్రములై యున్నవి. కాని యీ యాశ్రమములను యథా యోగ్యములుగాఁ బాలించుటకు నాధ్యాత్మిక నిగ్రహ సామర్థ్యములుకూడ నావశ్యకములై యున్నవి. ఇందుచేత మొదట ఈ వ్యవస్థ యత్యంత లాభదాయకమైనప్పటికిని మెల్లమెల్లగా నీయాధ్యాత్మిక సామర్థ్యము తగ్గియుండుటచేత నాశ్రమ వ్యవస్థయందు మెల్లమెల్లగా న్యూనత వచ్చియుండుననుట యాశ్చర్యము కాదు. మహాభారతమందున్న యాశ్రమ వ్యవస్థా వర్ణనము ముందుగాఁ జేర్కొనఁబడుచున్నది.

ఆశ్రమములు నాలుగు– బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము సన్యాసము. ఏడెనిమిది యేండ్ల యవస్థయందుఁ బిల్లవానికి నుపనయన సంస్కార ద్వారమున, మొదటి యాశ్రమమందుఁ బ్రవేశమగుచున్నది. ఈ యాశ్రమమునందుండి విద్యార్జనము చేయవలయును. ఈ విషయముపై విస్తృతమైన వివేచనము ముందునకుఁబోయి శిక్షా విషయమునఁజేయఁబడును. ఇచట మాత్రము గురునియింటనుండి విద్యార్థి విద్యాభ్యాసమును జేయవలయు ననియు భిక్షచేత నిర్వహించుకొనవలయుననియు నింతమాత్రము చెప్పినఁ జాలును. మంచిది, యిదే నియమముండెను. పండ్రెండు లేక యింక ను నెక్కువ యేండ్లదాఁక విద్యాభ్యాసము చేయుచుండవలెను. బ్రహ్మ క్షత్రియ వైశ్యులు ముగ్గురును వేద విద్యను బఠించి తమ తమ విద్యను నేర్చుకొను చుండిరి. పండ్రెండు * వర్షముల యనంతరము బ్రహ్మచర్యమును బూర్తి చేసి, గుర్వాజ్ఞచేత గృహస్థాశ్రమమును స్వీకరింపవలెనని నియమముండెను. ఈ గృహస్థానముయొక్క ముఖ్య నియమము వివాహము చేసికొని ప్రతి మనుష్యుఁడు తన గృహస్థాశ్రమ కార్యములను జేసికొనవలయుననియు అగ్నిసేవను నతిథిపూజను జేసి కుటుంబమును బాలించుకొనవలయుననియు నుండెను. గృహస్థాశ్రమముయొక్క కర్తవ్యములు విస్తరించి చెప్పఁబడి యున్నవి; అవి ముందు పేర్కొనఁబడును; గృహస్థాశ్రమమును బూర్తి చేసి కుటుంబమును బిల్లవాండ్ర కప్పగించి తాను వనవాసమునకుఁ బోవలయును. స్త్రీ జీవించియున్న యెడల దానిని తనతోఁదీసికొనిపోయి వనమందు నివసించి నాల్గవ యాశ్రమమునకుఁ బోవుటకై మెల్ల మెల్లగాఁ దయారై యుండవలయును. ఈ వానప్రస్థము అనఁగా వనమునకుఁ బ్రస్థితుఁడైన మనుష్యుని స్థితి మూఁడవ యాశ్రమమై యున్నది. మఱియు, ఈ ప్రకారముగాఁ గొన్ని సంవత్సరములు శరీర క్లేశమును సహించుటకై మనస్సు తయారైనపుడు పరమేశ్వరుని ప్రార్థించుచు నాయువు గడుపుటకు గ్రహింపఁబడు నాల్గవ యాశ్రమమే సన్యాసమై యున్నది. నాలుగాశ్రమములకు నిదియే స్థూలమైన స్వరూపమై యుండెను.

---

* ఉపనిషత్తులలోఁగూడ ఈ మర్యాదయే కనిపించుచున్నది. "స హ ద్వాదశ వర్ష ఉపేత్య చతుర్వింశతి వర్షః సర్వాన్ వేదానధీత్య మహామనా ఏయాయ" ఛాం. సం. ప్రపా, 6.

ఆశ్రమ వీరుల వర్ణనములోఁ బైని వ్రాయఁబడి యున్న విషయము లకు వాస్తవముగా ననుపయోగమున్నదియో లేదో, మఱియు మహాభారత సమయమున నేయే ప్రజలకు వానిఁ బాలించు నను మతియుండెనో యిపుడు చూడవలసియున్నది. మహాభారతమందును నుపనిషత్తులందును గల యనేక వర్ణనములఁ బట్టి గురుని యింట నివసించి బ్రహ్మచర్యాశ్రమములో విద్యాభ్యాసమును బూర్వ సమయమునఁ దఱచుగా బ్రాహ్మణ విద్యార్థులు చేయుచున్నట్లు కనిపించుచున్నది. ఋషులయొద్ద పెద్ద పెద్ద శాలలుండెడివి. వానియందు బ్రాహ్మణ విద్యార్థులు తమ యుదర పోషణమును భిక్షాద్వారమున లేక మఱొక రీతిని జేసికొని, విద్య నభ్యసించుచుండిరి. మహాభారత కాలమున క్షత్రియ వైశ్య బాలకులు విద్యఁ బఠించుటకై గురుకులమున నుండిరో లేదో సరియైన జాడ దొరకకున్నది. హరివంశమందును మహాభారతమందును, ఉజ్జయినిలో గురుకులమున వసించి శ్రీ కృష్ణుఁడు విద్య పఠించి యుండెనని వర్ణనము కలదు. పాండవులును దుర్యోధనాదులును దమయింటనే విద్యపఠించిరి. విద్యాభ్యాసమునకై ద్రోణాచార్యుఁడు వీరియింటనే యుంచుకొనఁబడి యుండెను. బ్రహ్మచర్యాశ్రమము యొక్క ముఖ్య భాగము, అనఁగా గురుకులమున నివసించుట, తగ్గిపోయి యుండెను; దానికి బదులుగా నీ రెండవ పద్ధతి యాచారములోనికి వచ్చియుండెను. మెల్ల మెల్లగా భిన్న భిన్నులైన క్షత్రియ వైశ్యులందు బ్రహ్మచర్యాశ్రమము యొక్క మహత్త్వము తగ్గి మహాభారత సమయమున నిప్పటి విధముగాఁ గేవలము ఉపనయన సంస్కారము మిగిలియుండును. ఇఁక గృహస్థాశ్రమమును జూడవలయును. గృహస్థాశ్రమముయొక్క ముఖ్యవిధి వివాహము, అది లోపించుట యెన్నఁడును నసంభవము. అది మాత్రమన్ని వర్ణములయందును నన్ని జాతులయందును నుండనే యున్నది, దాని విషయమై విశేష మేమియుఁ జెప్పవలసినదిలేదు. కాని గృహస్థాశ్రమునకు రెండవ ముఖ్యభాగము అగ్నిసేవయై యుండెను. అగ్నిని స్థాపించి నిత్యము యజించుట గృహస్థాశ్రమమునకు ముఖ్య కర్తవ్యమై యున్నది. ఈ కార్యమును బ్రాహ్మణులు తఱచుగఁ జేయుచుండిరని తోఁచుచున్నది. క్షత్రియులు గూడఁ జేయుచుండిరని చెప్పుటకుఁ గూడ నేయాటంకమును లేదు. శ్రీ కృష్ణుఁడు

సంధికై వెళ్ళినపుడు, విదురునియింట, — సభకుం బోక మునుపు— స్నానము చేసి యతండు జపించి యగ్ని నుంచాహుతి నిచ్చెనని మహాభారతమందు వ్రాయబడి యున్నది. ( ఉ. అ. 14 ) వసుదేవునికి దేహాంతమైన పిమ్మట నతని కార్ధ్వదైహిక కర్మమును జేయునపుడు రథమునకు ముందు నశ్వమేధ సంబంధించిన త్రము ప్రదీప్తాగ్ని యుంచబడి యుండెనని వ్రాసియున్నాండు. ఇదే విధముగాం బాండవులు వనవాసమందు నపుడు గృహ్యాగ్నిని నిత్యము సేవించెడి వారని వర్ణనము కలదు. పాండవులు మహాప్రస్థానమునకు వెళ్ళినపుడు, వారి గృహ్యాగ్నిని జలమున విసర్జించి వేసిన వర్ణనము కలదు. భారతీయ యుద్ధ సమయమున క్షత్రియులందఱును గృహ్యాగ్ని నుంచుకొనియుండిరని సారాంశము. ఈ సంగతి మిక్కిలి స్పష్టమై యున్నది. మహాభారత కాలమందు అనంగా సౌతి సమయముననే వ్యవస్థ యుండెనో చెప్పుటకై సాధనమేదియును లేదు. అయినను, అగ్నిసేవకు అటంకమైనపుడు క్షత్రియులనేకులగ్ని విరహితులై యుందురని విశ్వసించుటలో క్షతియేమియును లేదు. అందఱు బ్రాహ్మణులును నగ్నిసేవ చేయుచుండిరను మాటయు లేదు; వారిలోం గొందఱు దీని విడిచిపెట్టి యుందురు. అగ్ని నుంచుకొనని బ్రాహ్మణులతో శూద్రతుల్యముగా వ్యవహరింపవలయునని చెప్పంబడి యున్నది. ఇంక గృహస్థాశ్రమము యొక్క మూండవ యంగమైన యతిథిసేవ మిగిలిపోయినది, దీని నందఱును జేయుచుండిరి. గృహస్థాశ్రమము యొక్క కవాటమందఱకును దెఱచియే యుండెను. చాలమంది బ్రాహ్మణులు క్షత్రియులును మాత్రము దాని యథాశాస్త్రముగాం బాలించుచుండిరి. వనమునకుం బోవుటకును తపశ్చర్య చేయుటకును నధికారము మూండు వర్ణముల కుండెను మూడు వర్ణముల వారును వానప్రస్థులగుచుండిరి. ధృతరాష్ట్రుండు వనమునకు వెళ్ళిన వర్ణనమున్నది. ధృతరాష్ట్రుండు తన పత్నితోడను గుంతితోడను వనమునం దపస్సు చేయుటకై వెళ్ళి యుండెనని చెప్పంబడి యున్నది. రామాయణములో వానప్రస్థుండైన యొక వైశ్యుని యొక్క వర్ణనము కలదు. వనమునకుం బోయి బ్రాహ్మణులు తపస్సు చేయుచున్న నందలకొలంది యుదాహరణములు మహాభారతమందు గలవు. గృహస్థాశ్రమము యొక్క యనుభవమైన తరు

వాత దానినుండి విముక్తులై వనమునకుఁ బోవనిచ్చించుట సహజమే యై యున్నది; ఈశ్వరుఁడు చక్కగా నాయుర్దాయమునిచ్చిన వారికే వనమునకుఁ బోవుట సంభవమై యున్నది. అనఁగా వానప్రస్థుల సంఖ్య యెప్పుడును దక్కువయే యుండును. అయినను మూఁడు వర్ణములకు వానప్రస్థమునకై యధికారముండెను; మహాభారత సమయము వఱకు వన ప్రస్థులైనవారుండెడి రనియుఁ జెప్పఁ గలము. శూద్రునికి వనప్రస్థ నిషేధ మున్నట్లు మహాభారతము వలన స్పష్టముకాదు; కాని శాంతి పర్వములో 63 వ యధ్యాయమందు రాజాజ్ఞ చేత శూద్రునికి నన్ని యాశ్రమము లకు నధికారమున్నదని చెప్పివేయఁబడి యున్నది. రామాయణమందు, తపస్వియై శూద్రుఁడు రాముని ద్వారా దండితుఁడైన కథ యున్నది. దీనిఁ బట్టి శూద్రులకే యాశ్రమమున నధికారము లేకుండెనని తోఁచుచు న్నది. నిజమైతేని యాశ్రమ ధర్మములు మూఁడు వర్ణములకే చెప్పఁ బడి యున్నవి. ఇక నాల్గవ యాశ్రమము విచారింపఁ బడును.

## సంన్యాసమెవనికి విధింపఁబడెను.

భారతీయార్యుల మానసిక ప్రవృత్తి మొదటి నుండియు సంసార త్యాగమునకు అనగా సంన్యాసమునకు నభిముఖమై యున్నది. ఈ విష యమై, వారికిని పాశ్చాత్యులకును జాల భేదమున్నది. విరక్తులై, కేవ లము పరమేశ్వర చింతనము ననేక భారతీయార్యులు కావించి, వేదాం తానుగుణమైన తత్త్వజ్ఞానమును బ్రపంచమున కుపదేశించి యున్నారు. ముసలి తనమున సంసారమందే యంటిపెట్టుకొని యుండి అనేకములైన సంసార వాసనలయందు దేహము దుర్బలమై పోయిన తరువాతఁ గూడ— మనస్సును దొర్ల నిచ్చుటకంటె, తమ యాయుస్సుయొక్క శేషాంశమున నింద్రియ నిగ్రహమున వేదాంత విచారములయందుఁ గడు పుట పరమోత్తమముగా వారికి నచ్చుచుండెడిది. ఈ యభిప్రాయముతో నార్యులు సంన్యాసాశ్రమమును బ్రచురింపఁ జేసియుండిరి. ప్రాచ్యప్ర తీచ్య సభ్యతల యందున్న భేదమిదియే. హిందుస్థానమందుఁ గేవలము

భిక్షయడిగికొని యుదర పోషణము చేసి కొనుచు వేదాంత జ్ఞానమును విచారించు సంన్యాసులు వందలకొలఁది యుగపడుచున్నట్లుగా మఱి యెచ్చటను గనఁబడరు; పారిసీల యందును యూరపియనుల యందును గూడలేదు. ప్రాచీన కాలము నుండియు సంన్యాసాశ్రమము భారతీయార్య సమాజమునకు విశేషాలంకారమై యున్నది. ఆరంభమందు నీయాశ్రమము విషయమై యధికారము మూఁడు వర్ణములకు నుండెను. సంసార దుఃఖములచేత కుమిలిపోయిన శూద్రునికిఁ గూడ, వేదాంతజ్ఞానము యొక్క యాశ్రయమును గొని, తన యుపశిష్ట జీవితమును సార్థకము చేసికొనెడి యిచ్ఛ కలుగుట స్వాభావికమై యున్నది. ప్రాచీనకాలమందు శూద్రులుకూడ వేదాంత జ్ఞానమున కధికారులై యుండిరి, వానికిఁ జతుర్థాశ్రమాధి కారముండెను. కాని తరువాతఁ దరువాత సంన్యాశ్రమము లోని కఠిన ధర్మములను పాలించుట బ్రాహ్మణులకుఁ దక్క నితరులకే విధముగా నసంభవము కాఁదొడఁగెను. ఈ కారణముచేత నితర వర్ణములకు సంన్యాసము పుచ్చుకొను నధికారమున్నదా లేదా యని ప్రశ్నము వచ్చి యుండును, శాంతిపర్వములో 61 వ యధ్యాయమందు సంన్యాసము తీసికొను నధికారము బ్రాహ్మణులకే యున్నదని చెప్పి యున్నాడు కాని 63 వ యధ్యాయమందుఁ జెప్పఁబడి యున్నది — " పురాణాల ద్వారా వేదాంతమును విను నిచ్ఛయెవనికున్నదో, ఎవఁడు త్రివర్ణసేవారూపమైన స్వధర్మమును యథా శక్తిగాఁ జేసి యున్నాడో, సంతానము వానికిఁ గలదో, రాజువానికాజ్ఞ యిచ్చునో, యట్టివాడు శూద్రుడైనను ద్విజవర్ణములకుఁ గల యోగ్యత గలవాఁడై యున్నాఁడు;" సారాంశము" స్వధర్మము నాచరించిన శూద్రునికి, వైశ్యునికి క్షత్రియునికిని సంన్యాసాశ్రమము విహితమై యున్నది." శూద్రుఁడును వైశ్యుఁడును రాజాజ్ఞను పొంది సంన్యాసము పుచ్చుకొన వచ్చునని చెప్పఁబడి యుండుట యాశ్చర్యముగా నున్నది. " సర్వకర్మముల నాచరించి పుత్రునికిఁగాని మఱియొక శ్రేష్ఠగోత్రీయుఁడై న క్షత్రియునికిఁ గాని రాజ్యమర్పించిన యెడల క్షత్రియుఁడు కూడ సంన్యాసము గ్రహించుట కటంక మేమియు లేదని," వేదాంత శ్రవణమునకే రాజు భిక్షావృత్తి నవలంబింప వలయును కేవలము భోజన ప్రాప్తీచ్ఛ చేత నతఁడీ వృత్తి నవలంబింపఁగూడదు.

టీకాకారునియొక్క కథన మేమనఁగా 'సంన్యాసాశ్రమ రూపమైన కర్మము బ్రాహ్మణునికిఁ దప్ప నితరములైన క్షత్రియాది వర్ణత్రయమునకు నిత్యము కాదు, విచారింపఁగా అంతఃకరణ విక్షేపమును గావించు కర్మమును త్యజించుట కామ్య సంన్యాసమై యున్నది. యిదియే వారికి విహితమై యున్నది,"

ఈ విషయము మహత్త్వపూర్ణమై యున్నను వివాదాగ్రస్తమై యున్నది. కాబట్టి మూల వచనములను గూడ నెత్తి చూపుట తగియున్నది. శాంతిపర్వము యొక్క 61 వ యధ్యాయమందుఁ బ్రారంభమున నీ శ్లోకమున్నది—

"వానప్రస్థం భైక్ష్యచర్యం గార్హస్థ్యంచ మహాశ్రమం॥
బ్రహ్మచర్యాశ్రమం ప్రాహుశ్చతుర్థం బ్రాహ్మణైర్వృతం॥"

భైక్ష్యచర్యమనఁగా నభిప్రాయము సంన్యాసమై యున్నది. మఱియు నా చతుర్థాశ్రమము బ్రాహ్మణుల చేత వరింపఁబడినది అనఁగా నంగీకరింపఁబడినది. ఇంతమాత్రమున నది యితరులకు నిషిద్ధమని సిద్ధించ నేరదు. ఇంతకంటెను స్పష్టముగా 61 వ యధ్యాయమందు సంక్షేపింపఁబడి యున్నది. "యుక్తత్రయాణాం వర్ణానామిచ్ఛా దాశ్రమసేవనం। చాతురాశ్రమ్యముక్తాశ్చ సర్వాంస్తాన్ శ్రుణు పాండవ। ॥ఈలాగునఁజెప్పి శూద్రునికి రాజానుమతి లభించిన మీఁదట సర్వ కర్మములు పూర్తియైన పిమ్మట మరల నధికారమున్నదని తిరుగ జెప్పఁబడి యున్నది. "ఆశ్రమా విహితాః సర్వే వర్జయిత్వా నిరాశిషం। భైక్ష్యచర్యాం తతః ప్రాహుస్తస్య తద్ధర్మ చారిణః॥ తథా వైశ్యస్య రాజేంద్ర రాజపుత్రస్య చైవహి॥ ॥అనఁగా రాజపుత్రునికి తేర క్షత్రియునికి భైక్ష్యచర్యసంన్యాశ్రమము నెడల నాటంకమేమియును లేదు. వైశ్యునికి "కృతకృత్యో వయోతీతో రాజ్ఞః కృత పరిశ్రమః వైశ్యోయుచ్ఛేదనుజ్ఞాతో నృపేణాశ్రమ సంశ్రయం॥" దీని ద్వారా రాజాజ్ఞ యావశ్యకమని చెప్పఁబడి యున్నది. కాని క్షత్రియునికైతే దీనితోఁ గూడ నవసరములేదు. రాజు చతుర్థాశ్ర

మము నెపుడు గైకొనవలయునో ముందు చెప్పఁబడియున్నది. "రాజర్షిత్వేన రాజేంద్ర భైక్ష్యచర్యాం న సేవయా। అపిత గృహధర్మోపి చవేజ్జీవిత కామ్యయా॥" ఈ శ్లోకమందు రాజునకు భైక్ష్యచర్య విడిపింపఁబడియున్నది. అయినను రాజధర్మము అనఁగా ప్రజాపాలన ధర్మము అన్నిటిలో శ్రేష్ఠమనియు, ఈ ధర్మమును బట్టి రాజునకు సర్వాశ్రమముల ఫలము లభించుననియు వర్ణింపఁబడినది. ఈ వర్ణనము మిగుల జక్కగానున్నది."మహాశ్రయం బహు కల్యాణరూపం క్షాత్రం ధర్మం నేతరం ప్రాహురార్యాః। సర్వే ధర్మారాజ ధర్మ ప్రధానాః సర్వే వర్ణాః పాల్యమానా భవంతి॥" ఇది మొదలుగాఁగల రాజధర్మస్తుతి కాననగును.

అన్ని వచనములఁబట్టియు మహాభారత సమయమునందు సంన్యాసాధికారి బ్రాహ్మణ వర్ణమేయను నియమము కలదని తెలియుచున్నది. అయినను ఆ సమయమున నిట్టి పట్టుదల యుండినట్లు లేదని తోఁచుచున్నది. ఎందుచేతననఁగా అనేక బ్రాహ్మణ సంన్యాసులు శాస్త్రమార్గ విహిత మగు రీతిని సంన్యాస ధర్మమును స్వీకరించుచు సంన్యాసము యొక్క విశేష ధర్మములను పాలించుచుండిరి; కాని యన్య వర్ణములో యథావిధిగా సంన్యాసము స్వీకరింపక వట్టి సంన్యాస వేషమును వేసికొనుచుండిరి. కొందఱు శూద్రులు మాత్రము పొట్ట కూటికొఱకే భిక్షావృత్తి నవలంబించుచుండిరి. భిక్ష మడిగికొను నధికారము సన్యాసికేగాని మఱియెవరికిగాని లేదంతనను సంగతి జ్ఞప్తి యుంచుకొనఁదగియున్నది. కొందఱు గోపురమున గట్టి శూద్రులు కూడ భిక్షువులు లేక సంన్యాసులగుచుండిరి; దీనిఁబట్టి యితర వర్ణములవారు సంన్యాసమును గైకొనఁగూడదను నాగ్రహములు తప్పక యుండును. ఆర్యుల సంసార పరాఙ్ముఖమైన ప్రవృత్తిని గారణముగాఁ జేసికొని యున్ని వర్ణముల యందును జాలమంది సంన్యాసులగుచుండెడివారనుట మాత్రము నిర్వివాదము. మహాభారత సమయము వఱకు పందలకొలది సంన్యాసులు వనమందుండి తత్త్వవివేచనము జేయుచుండెడివారు. అలగ్జాండరు చక్రవర్తికిఁ బంజాబులో పరమహంస రూపమున నరణ్యమందు నివసించెడి నిస్పృహియులైన యనేకతత్త్వవేత్తలు లభించియుండిరి. ఈ సంగతినిబట్టి మహాభారత వర్ణనము కల్పనికము కాదనియు ప్రత్యక్ష స్థితిదేయనియు సిద్ధించుచున్నది. బౌద్ధ

మతము సంన్యాస ధర్మమునకుఁ దన గ్రంథములో నగ్రస్థానమునిచ్చి వర్ణములకును నీయాశ్రయమును నిరాటంకముగాఁ జేరిపై చి యుండెను. [illegible] ణముచేత వేలకొలఁది శూద్రులు బౌద్ధ సంన్యాసులు–భిక్షువులు–అయి [illegible] వారు బౌద్ధమతమును హీనదశకుఁదెచ్చిరి. ఇది మఱింత విచారింపఁ [illegible].

## సంన్యాస ధర్మము

సంన్యాసముయొక్క యద్దిష సంబంధమున అసంగా బ్రహ్మనిష్ఠా [illegible] మును యోగ్యమగు రీతిని నడుపుటకై సంన్యాసాశ్రమస్థుఁడైన మనుజుఁడు బాలింప నావశ్యకములైన ధర్మముల సంబంధమునసే సూక్ష్మమైన ని [illegible] ము లుపస్థితములై యుండెను. "అతని కన్ని పంథములందును [illegible] పూర్వకమైన నడవడిక యుండవలయును. అన్ని యింద్రియములను వశములో నుంచుకొని మననశీలుఁడై యుండవలయును. ఒకరి నడుమనుండి తాను పంట చేసకొనకూడదు. దాని కడే లభించిన యేదో కొంత భోజనమును గ్రహింపవలయును. మధ్యాహ్న కాలము వఱకుఁ గొంచమైనను లభింపని యెడల అందఱును భోజనము చేసియున్నట్టియు వంట యింట ధూమము వెడలియున్నట్టియు [illegible] భిక్షమడిగికొనవలయును. మోక్ష విదుఁడైన మనుష్యుఁడు [illegible] యన్ని విధముల భోజనములు నాదర పూర్వకముగాఁ [illegible] భిక్షమడిగికొనఁగూడదు. భిక్షమడిగికొనుటకుఁ బోయినపుడు ఏ [illegible] నుండియుఁ బుచ్చుకొనఁగూడదు. ఏకాంత స్థానమున [illegible] వలయును. శూన్య గృహమును, అరణ్యమును, వృక్షచ్ఛాయను [illegible] ను అవలంబింపవలయును. వేసవి కాలమందొక [illegible] యుండవలయును. (విశ్రమింపవలయును.) వర్షాకాలమందు, అవశ్యకమైనయెడల నొకచోటనే విశ్రమింపవచ్చును. సూర్యుఁడు చూపిన మార్గమున (దారి తెలిసినచోట) తిరిగి తిరిగి యేమియు సంగ్రహించుకొనక, మిన్నకుండఁగూడ నుండవలయును. జలములో దిగి స్నానము చేయఁగూడదు. [illegible] కార్యమునుజేసి నిర్వాహముచేసికొనఁగూడదు. తనకుఁదాను అడుగి [illegible] నుపదేశము చేయగూడదు. సామాను కూడ నుంచుకొనఁగూడదు. ప్రాణిమాత్రమునందు సమభావముండవలయును

ముందు విషయములకై శోకింపఁగూడదు. కేవలము ప్రస్తుత విషయము నుపేక్షింపవలయును. ఈ విధముగా నిరాశుఁడు, నిర్గుణుఁడు. నిరాసక్తుఁడు ఆత్మసంగి, తత్త్వజ్ఞుఁడు నైనవాఁడు నిస్పందేహగా ముక్తుఁడగును."ఇత్యాది వర్ణనములును గీతలోఁగలవు. (అశ్వ, అ. 46). ఈ వర్ణనమందు సంన్యాసము యొక్క కర్తవ్యములను సనాతన ధర్మము నిర్దేశించియున్నది, అందులోఁ జాలమట్టుకు బౌద్ధ సంన్యాసులు త్యజించివైచిరి. మఱియు కర్తవ్యత్యాగమును జేసివైచుటచేత బౌద్ధ భిక్షువులకుఁ బిదపఁబిదప నపసతి తటస్థించనట్లు కనఁబడును.

బౌద్ధ సంన్యాసులు ఏకాంతముననుండుట మాని సంఘమునుజేర్చుకొని యుండ నారంభించుట మొదట గట్టి పొరబాటు. సంఘమునందు వివిధము లైన దుష కల్పనములు ప్రచలితమగుచున్నవి, ఉచ్చనీచ భావము పుట్టు చున్నది. పరమేశ్వర భజనము, ఆత్మచింతనము చెడిపోవుచున్నవి. సంఘ మున కధిపతి యగుటకై మహత్త్వాకాంక్ష యుత్పన్నమగుచున్నది సన్యాసి వనవాసము లేక యరణ్యాశ్రయమును గ్రహింపవలయును. ఈ ప్రాచీన నియమమును వదలివైచి బౌద్ధులు పెద్దపెద్ద సంఘారామములయందు నివ సింపనారంభించిరి. రాజులు ఆ సమయమునందు వీరికై సంఘారామములను నిర్మించి యిచ్చుచుండిరి. ఈ స్థానములలో నుండుటచేత వారు సుఖమున కలవాటుపడిరి. సంన్యాసి ఒక్క గ్రామమందొక్క దినముకంటె నెక్కువ యుండగూడదనునది ప్రాచీన నియమమై యుండెను; కనికిఁ బూటుగా బౌద్ధ సంన్యాసులు వేర్వేఱు గ్రామములయొద్ద సంఘారామములయందు నివాసు లైరి. సంన్యాసి భక్తిపూర్వకము భిక్ష దొరకని చోటనే భిక్షమడుగుటకై పోవల యును, కాని బౌద్ధ భిక్షువులు ఇందుకుఁజాల విపరీతముగా ధనసంతులైన యుపాసకులయొద్ద విందులు కొట్టనారంభించిరి. సంన్యాసి ద్రవ్యమును గాని సామానునుగాని పోగుచేయరాదు; కాని సంఘారామములో బౌద్ధభిక్షువులు సంఘారామముయొక్క వ్యవస్థకు పెద్దపెద్ద యీనాళ్ళను భూములను గైకొననారంభించిరి. తాత్పర్యమేమనఁగా సనాతన ధర్మమైన సంన్యాసము కావశ్యకములైన కఠిన నియమములను విడిచిపెట్టి బౌద్ధభిక్షువులు పొట్ట పోసి కొనుట కోయనునట్లు లేక పరిగణల కధిపతులు కానున్నట్లు వ్యాపారము తటస్థ

మయ్యెను. ఇందుచేత బౌద్ధ సంన్యాసులు బహు శీఘ్రముగా హాస్యాస్పదము లైరి. ఇదే విధమైన యధోగతి తరువాత సనాతన ధర్మమందుఁగూడ సంభవించెను.పురాణములు కలియుగమందు సంన్యాసముఁగైకొనరాదని నిషేధము

ఈ యితిహాసము మహాభారతముకు పిమ్మటిదై యున్నదిసంన్యాసమునకావశ్యములైన కఠోర నియమములు మహాభారత సమయమునఁ బ్రత్యక్షముగా నుపయోగింపఁ బడు చుండెడివని విశ్వసించుటలో హాని యేమియును లేదు. ‘‘యత్రసాయంగృహోమునిః—సాయంకాలమైన చోటనే యాగిపోవు మునులు లేక సంన్యాసులు ప్రాచీనకాలము మొదలుకొని మహాభారతకాలము వఱకుఁ గనఁ బడు చుండిరనుటలో సందేహములేదు. సనాతనులైన సంన్యాసుల వస్త్రములు కావి రంగుగా నుండెడివి. బౌద్ధులు తమ సంన్యాసులకుఁ బసుపురంగు గుడ్డల నిచ్చిరి. కావి రంగు గుడ్డల ధరించి వంచక వ్యాపారమును జేయువారు గూడ మహాభారత సమయమున నుండిరి. రాజులు భిన్న భిన్న స్థానములకు సంన్యాసి వేషమునఁ దమ గుప్త చారులను బంపవలయునని చెప్పఁబడి యున్న నియమమును బట్టి యీ సంగతి సిద్ధించుచున్నది. మహాభారత సమయమున స్త్రీలు సంన్యాసమును గ్రహించినందులకుఁ గూడ నుదాహరణములున్నవి. ఉపనిషత్తులలో గార్గి, వాచక్నవి మొదలైన తత్త్వజ్ఞలైన బ్రాహ్మణ స్త్రీలు వర్ణింపఁ బడి యున్నట్లే మహాభారతములో సులభ యను పేరుగల సంన్యాసిని యొక్కయు వర్ణనము కలదు. జనకునితో నామె చేసిన వక్తృత్వ తత్త్వ జ్ఞానములతోఁ బరిపూర్ణమైన సంవాదము యొక్క వర్ణనము శాంతి పర్వములో ౩౨౦ వ యధ్యాయమందుఁగలదు సంవాదమునకుఁ జివరనామె ‘నేను క్షత్రియకన్యను; నాకుఁ దగిన భర్త దొరకలేదు, ఇందుచేత గురుని వలన నేను మోక్షశాస్త్రముయొక్క శిక్షను గ్రహించి నైష్ఠికబ్రహ్మ చర్యము నాశ్రయించితిని; మఱియు నేను యతి ధర్మముతో నున్నాను. అని చెప్పియున్నది. సారాంశమేమనఁగా ప్రాచీన కాలమునక్షత్రియ స్త్రీలు కూట వివాహము చేసికొనక యొకమాఱుగానే సంన్యాసమును గైకొనుచుండెడివారు. కాని మహాభారత సమయమున నిది ప్రచారములో లేక యుండునని తోఁచుచున్నది. ఎందుచేత? ఆరంభమందే సులభ సత్యయుగము నాటిదను సంగతి చెప్పఁబడి యున్నది.

మోక్ష ధర్మముయొక్క ప్రాప్తి సంన్యాసాశ్రమ మందే యున్నదో లేక యన్యాశ్రమముల యందు నున్నదో యనునది యొక మహా ప్రశ్నమై యున్నది. ఈ ప్రశ్నమీఁదనే జనక సులభా సంవాదమీయఁ బడి యున్నది. దానియొక్క నిర్ణయము నిశ్చయాత్మకముకాదు. మరల దాని యాశయము మోక్షపాలనమునకుఁ దీసికొని పోవుటలో సంన్యాసమే సమర్థమైనదని తెలియుచున్నది. ఈ విషయముయొక్క వివేచనము మఱియొకస్థానమున గూడఁ గలదు. ఈ సంవాదములో సంన్యాసమున కీ క్రింది లక్షణములు చెప్పఁబడి యున్నవి;— కావిగుడ్డలు, బోడి తలలు, త్రిదండ ధారణము, కమండలువు ఇదిగాక సంన్యాసము నితరాశ్రమ ధర్మముల నాచరింపఁ గూడదనియు జెప్పఁబడి యున్నది. సంన్యాసి మరల గృహస్థుడైన యెడలఁ బతితుఁడగును, అనఁగా ఆర్యుల సమాజమునుండి భ్రష్టుఁడగును. ఆ సమయమున ఈ దృఢ నిశ్చయమే యుండెను. ఈ విషయమై ధర్మ శాస్త్రమందును వేదాంత సూత్రములందును నిట్టి పరిణామములే చెప్పఁబడి యున్నవి, వర్ణ సంకరము నింద్యమైన యొక భయంకర ప్రసంగముగా విశ్వసింపఁ బడినట్లే యాశ్రమ సంకరమును కూడ లోకులు భయంకరముగా నూహించుచుండిరి. ఈ సులభా జనక సంవాదమందు నీ యాశ్రమసంకరముక్క భయంకరమైన పాతకము వర్ణితమైనది.నీచ వర్ణములు ఉచ్చవర స్త్రీలను గ్రహించుట నింద్యముగా నూహింపఁబడుచున్నట్లే యుచ్చాశ్రమము నుండి నీచాశ్రమములో దిగుటయు నింద్యముగా నూహింపఁబడుచుండెడిది. ఈ కారణము చేతఁ గూడ సనాతన ధర్మమందలి సంన్యాసమును బాలించుట యత్యంత కఠినమై యుండెను.

## గృహస్థాశ్రమము యొక్క గౌరవము

బ్రహ్మచర్యము, గార్హస్థ్యము: వానప్రస్థము, సంన్యాసము ఈ నాలుగాశ్రమములును చూడఁగా నొకటి కంటె నొకటి యధిక శ్రేష్ఠముగా విశ్వసింపఁబడుచున్నవి, అయినను గృహస్థాశ్రమము యొక్క గౌరవ మన్నియాశ్రమముల కంటె నధికమై యున్నది. శాంతి పర్వములో 247వ యధ్యాయమందు దీని వర్ణనమున్నది.గృహస్థు వివాహము చేసికొనియగ్న్యాధానమ్ము

చేయవలయును. గృహస్థాశ్రమమునకు దగినఁ యాచరణములను గావింపవల యును. సాధ్యమైనంతవఱకు, గృహస్థాశ్రమి యుజనము, అధ్యయనముదానము ఈ మూఁడు కర్మములనే యాచరింపవలయును. గృహస్థుఁ డెన్నడును గేవలము తన యుపయోగమునకే వండుకొనఁ గూడదు. వ్యర్థముగాఁ బశుహింస చేయఁగూడదు. పగలు రాత్రియు మొదటి కడపటి జాముల యందతఁడు నిద్రింపరాదు. ప్రాతస్సాయములందుఁ దక్క మధ్యగా భోజనము చేయఁ గూడదు. ఋతుకాలమునఁదక్క స్త్రీని శయ్యకుఁ బిలువఁగూడదు. స్త్రీతో శయ్యపైఁ బరుండఁగూడదు. అతిథి సత్కార మెప్పుడును బాగుగాఁ చేయవల యును. దంభమునకు జడలను గోళ్ళను బెంచుకొని స్వధర్మము నుపదేశించు వారికిని అవిధితో అగ్ని హోత్రమును త్యజించు వారలకును గృహస్థు వంటలో భాగమున్నది. బ్రహ్మచారియు సన్యాసియుఁ దమయింట వంట చేసికొనరు; వారికి గృహస్థాశ్రమి భోజనము పెట్టవలయును. అతడెన్నడును విఘసము అమృతము భుజింపవలయును; యజ్ఞములో మిగిలిన హోమ ద్రవ్యమును అమృతమనుచున్నారు, పోష్యవర్గ మనుభవింపఁగా మిగిలిన వంటను విఘసమని చెప్పుచున్నారు. అనఁగా, యజ్ఞము చేసి బ్రహ్మచారి, సన్యాసి,అతిథి,చిన్నచిన్న శిశువులు,దాసిదాసులు, మొదలగువారికిముందఁగా అన్నము పెట్టిన తరువాతఁ దాను భోజనము చేయుట గృహస్థాశ్రమికిధర్మమై యున్నది. ఈ ప్రకారముగా నన్ని యాశ్రమముల వారికిఁ బోష్య వర్గమున కును బోషణకర్త యగుటచేత గృహస్థాశ్రమము యొక్క యోగ్యత యన్నిటి కంటె శ్రేష్ఠమై యున్నది. గృహస్థాశ్రమి స్వతంత్ర వ్యాపారమును జేసికొని ద్రవ్యోపార్జన మార్గమున రాజును యాచించి తెచ్చిన ధనముచేత యజ్ఞ యాగాది క్రియలను కుటుంబ పాలమును జేయవలయును. కొందఱ యభి ప్రాయముఁ బట్టి గృహస్థాశ్రమమందే యుండి యంతము వఱకుఁ గర్మ యోగము చేయవలయును. అనఁగా ఈ యాశ్రమందే వారికి మోక్షము దొర కును. వేయేల, ప్రతి యాశ్రమము యథావిధిగా నాచరించుచుండిన నా యాశ్రమమందే సద్గతి దొరకఁ గలదు. ఇందుకై యాశ్రమ ధర్మమునుయథా యోగ్యముగా సేవింపవలయును. గృహస్థాశ్రమమును యథావిధిగాసేవించుట మిగులఁ గఠినమై యున్నది. ఈ యాశ్రమముకుఁబైని వ్రాయఁబడిన నియమము లపై ధ్యానముంచిన యెడల నీ సంగతి సులభముగనే యూహకుఁ తెలియఁ

గలదు. గృహస్థాశ్రమము ద్వారా ధర్మము, అర్థము, కామము, మోక్షము నాలుగు పురుషార్థములును సిద్ధింపఁగలవు. కాని పుత్రునికిఁ గార్యములను సమర్పించి వార్ధకమున వానప్రస్థము, సన్యాసము వీనిపైపు నడచుటయే యుత్తమమైనది. మహాభారతమున కిట్టి యభిప్రాయమే యగపడుచున్నది.

## 3. శిక్షా పద్ధతి

ప్రాచీనకాలమందు హిందుస్థానములోని శిక్షాపద్ధతి యెట్లున్నది? గురు శిష్య సంబంధ మెట్లుండెను? సాధారణ జనుల కెట్టి శిక్ష యీయఁబడుచుండె డిది? క్షత్రియులకేమి నేర్పఁబడుచుండెను. స్త్రీలకేమి నేర్పింపబడుచుండెను? రాజకుమారుల కెట్లు ఏమి నేర్పఁబడుచుండును? లోకులకు వ్యాపార శిక్ష యెట్లు లభించుచుండెను? ఇత్యాది ప్రశ్నముల మీఁద నీ ప్రకరణ మందు విచారము చేయఁదగియున్నది. ఈవిషయమై సమస్త విషయముల సంపూర్ణ జ్ఞానము మహాభారతములో లభింపఁజాలదనుట మాత్రము ప్రకటమేయై యున్నది. అయినను భిన్న భిన్న స్థానము లందలి యుల్లేఖములఁ బట్టి యీ విషయమునఁ జాలవఱకు జ్ఞానము ప్రాప్తింపఁ గలదు. దాని నొకచోటకు జేర్చి యీ వర్ణాశ్రమము యొక్క ప్రకరణమందీ విషయమై చర్చింప వలయును.

ప్రాచీన సమయమున లోకులకు శిక్షనిచ్చు పనిని బ్రాహ్మణులు తమ సంరక్షణలో నుంచుకొని యుండిరనుట మొదటి సంగతి యై యున్నది. వర్ణవ్యవస్థ యందున్న యనేకములైన యుత్తమ నియమ ములలో నీ నియమము కూడ నొకటి యై యుండెను—శిక్షించెడు పనిని బ్రాహ్మణులు చేయవలయును. బ్రాహ్మణుని మొదటి కర్తవ్యము లలోను అధికారములలోను అధ్యాపనము అధ్యయనము నుండెను. అన్ని విధముల శిక్ష నిచ్చెడు యోగ్యతను బ్రాహ్మణుఁడు అధ్యయనము చేసి, సంపాదింపవలయును, పిమ్మట వాని ననుసరించి యందఱకును వారు. శిక్ష నీయవలయును. ప్రాచీనకాలమందీబంధన ముండెను. ధార్మిక శిక్షనే గాక యితర వ్యాపారముల శిక్షకూడ బ్రాహ్మణులే యీయవలయును.

వారలిచ్చుచుండిరనుట కూడ నిర్వివాదమై యున్నది. చూడఁగా నా సమయమున శిక్షనిచ్చుట రాజకృత్యముగా విశ్వసింపఁ బడుచుండెడిది. అయినను రాజు పాఠశాలలను నెలకొల్పి యీ పని చేయవలయునని దాని యభిప్రాయముకాదు. రాజు బ్రాహ్మణుల జీవికను జింతింపవలయునని దీని కర్థము. బ్రాహ్మణుల నిర్వాహమును విచారించుట సమాజ కర్తవ్యమై యుండెను. ఈ కర్తవ్యమును బూర్తిచేయు దృష్టితో దానము పుచ్చుకొను నధికారము బ్రాహ్మణులకే యీయఁ బడి యుండెను. బాగు; కాని యీ విధముగా వారికి నిర్వాహము కానిచోట వారి యావశ్యకములను రాజు పూర్తి చేయవలయునని నియమముండెను. ఈ సంగతి స్వకర్మ నిష్ఠులైన బ్రాహ్మణుల యొక్కవిషయము ననే యుండెను, మామూలు బ్రాహ్మణుల యెడఁగాదు. ఇతర బ్రాహ్మణులు 'బ్రాహ్మణకులు' లనియు రాజు వారితో శూద్రునితో వలె వ్యవహరింప వలయుననియు మహాభారతములో వ్రాసియున్నాఁడు. ప్రాచీన కాలమందిట్టి శిక్షావ్యవస్థ యత్యుత్తమమై యుండెను. సమాజమున స్వార్థత్యాగ పద్ధతిమీఁద శిక్షకుల యొక్క స్వతంత్రవర్గము తయారగు చుండెను. బ్రాహ్మణులు ప్రాచీన కాలమందు లోకులనజ్ఞానములో నుంచి రనుమాట యసత్యము; కాని వారి విషయమై యాదరపూర్వకముగా, అందఱకు శిక్షనిచ్చెడి పనిని వారు తమ సంరక్షణలో నుంచి యుండిరని చెప్పవలయును.

పైని వ్రాయఁ బడి నట్లుగా, ప్రాచీన కాలమందు శిక్షా దానము నకై ప్రభుత్వ పాఠశాలలు లేకుండెను. ప్రతి బ్రాహ్మణుని గృహముకూడ విద్యా పఠనమునకై పాఠశాలయే యై యుండెను. ఇచ్ఛ వచ్చినట్లుగానే గురుని యింటికైనను వెళ్ళి విద్యార్థులు అధ్యయనము చేయుచుండెడి వారు; గురువు తనయింట విద్యార్థులకుఁ బాఠము జెప్పవలయునని కూడ నియమముండెను. ప్రాచీన వర్ణవ్యవస్థ యందు శిక్షకులకు సౌకర్యముల నేర్పఱచినట్లే వర్ణవ్యవస్థయందు త్రివర్ణములలోని ప్రతి బాలుఁడును విద్యఁ దప్పక చదువవలయునని దూడ నియమముండెను. నేటి దినములలో ప్రస్తుత కాలమున్న మన మనివార్యమైన శిక్షనిచ్చుట యనెడు ప్రశ్నముపై విచారించుచున్నారము. కాని ప్రాచీన కాలమందు వర్ణవ్య

వ్యవస్థయే దీనిని నెఱవేర్చి యుండెను. ప్రతి బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, వైశ్యుఁడును విద్య తప్పక నేర్చుకొన వలయునని ప్రాచీన నియమ ముండెను. గురుని యింటికి వెళ్లి త్రివర్ణములలోని ప్రతి బాలకుఁడును విద్యనభ్యసింప వలయునని నిర్బంధముండెను. ఇందుకై యా సమయ మందు ఉపనయన సంస్కారమును ధర్మములోఁ జేర్చి ప్రచురింపఁ జేయఁబడి యుండెను. విద్యాభ్యాసమునకై ప్రతి బాలకుఁడును గురుని యింటఁ గొంత కాలముదాఁక, నివసింపవలసి యుండెడిది. ఇపుడు ఉపనయన సంస్కారము యొక్క వట్టి సంస్కార స్వరూపము మాత్రము మిగిలి యున్నది. దాని యొక్క ముఖ్య కర్తవ్యము లుప్తప్రాయమైనది. కాని మహాభారత సమయమున నిట్టి దుస్థితి యగపడదు. తుదకు భారతీయ కాల ప్రారంభమునను లేకుండెను. గురునింటనుండి ప్రతి విద్యార్థియు విద్యను సంపాదింపవలయునను నిబంధము ప్రాచీన కాలమున నుండెను. అగును ఈ శిక్ష ముఖ్యముగా ధార్మికమై యుండె నన్నమాట నిజము. కాని వేదవిద్యను నేర్పి యన్యవిద్యలుకూడ నేర్పఁబడుచుండెడివి. మరియు, సాధారణ రూపమున, అన్ని విధముల శిక్షయు నొక్క గురుని యింటనే లభించు నేర్పాటుండెను. ఈ విధమైన శిక్షకుఁ బుట్టుతుదకుఁ బండ్రెండేండ్లు పట్టుచుండెను. కాని కొన్ని చోటుల నింతకంటెఁ గూడ నెక్కువయేఁడులు కావలసెను. ఒక్కొక్క చోట నింతకంటెం దక్కువ నగుచుండెను. శిష్యుఁడు లేక బాలకుఁడు విద్య నేర్చుకొనుచున్నంత వఱకు వాఁడు వివాహమాడరాదని కూడఁ గఠిన నియమముండెను, గురుని యింటికి వెళ్ళుట యొక ధార్మిక విధియైనట్లే విద్యను బూర్తి చేసికొని గురు గృహమునుండి తిరిగి వచ్చుటయు నొక ధర్మ విధియే యై యుండెను. దీనిపేరు సమావర్తనమై యుండెను. గుర్వాజ్ఞ లభించిన పిమ్మట నీ సమావర్తనము చేయఁబడు చుండెను, అనఁగా గురువు బాలకుఁడుత్తీర్ణుఁడైనట్లు అనుమతి పత్రము నిచ్చినపుడు వారికి విముక్తి లభించుచుండెను. తన యింటికి వచ్చుటకై యాజ్ఞాపత్రము దొరకుచుండెడిది. ఈ ప్రకారముగా సమావర్తనమైన తరువాతను వానికి వివాహము చేసికొనుటకై స్వాతంత్ర్యము

కలుగుచుండెను. దీనికిఁ బిమ్మట వైరాగ్యయుక్తులును బ్రహ్మనిష్ఠులు నైన కొందఱు బ్రాహ్మణులు వివాహము చేసికొనుట యనెడు సంకటములోఁ బడక గురుగృహమందే విద్య పఠించుటకుఁ దపశ్చరణమునకును నుండిపోవుచుండిరి. వీరిని నైష్ఠిక బ్రహ్మచారులని చెప్పుచుండిరి. వీరు గృహమందుండక యెచ్చటనైనను మఱియొక చోట స్వతంత్రముగా నుండనారంభించుటయుఁ గలుగుచుండెను. వారు జన్మమంతయు బ్రహ్మచర్యమును బాలించుచు బ్రహ్మచర్యము యొక్క కఠిన వ్రతములను గూడ నాచరించుచుండిరి. దీనిపేరు మొదటి యాశ్రమము. ప్రాచీన కాలమున నీ యాశ్రమము ప్రత్యక్షమై యుండెననుట నిర్వివాదము. ప్రస్తుత సమయమున నుపనయనము సమావర్తనము రెండును ఫార్సులు తమాషా లయిపోయి యున్నవి. బ్రాహ్మణముల యభిప్రాయమును బట్టి కలియుగములో దీర్ఘకాలము వఱకు బ్రహ్మచర్య పాలనము నిషిద్ధమై యున్నది. అది యొకరి దృష్టిచేత బాగుగాఁ గూడ నున్నది. ఎందుచేతః స్మృతులయందున్న నిజమైన బ్రహ్మచర్యము యొక్క నియమములను సరిగాఁ బాలించుట ప్రస్తుతము శక్యముకాదు. అగుటయులేదు. అయినను ప్రాచీన కాలమందు మహాభారత సమయమున నీ విధముగా బ్రహ్మచర్యమును బాలించురీతి ప్రచురితమై యుండెననుటలో హానియేమియు లేదు. మహాభారతములోఁ జాలచోట్లను బ్రహ్మచర్య నియమముల వర్ణనము కలదు. ఇచట, దాని సంక్షిప్త తాత్పర్య మీయఁ బడును;—

"ఆయువుయొక్క మొదటి నాల్గవ భాగము బ్రహ్మచర్యములోఁ గడపవలయును, ధర్మతత్త్వ జ్ఞానమును సంపాదించుచు గురుని యింటఁగాని యుండవలయును. గురువు నిద్రపోయిన తరువాత నిద్రపోవలయును, వారు మేలుకొనక మునుపే లేచి కూర్చుండవలయును. శిష్యుఁడుగాని దాసుడుగాని చేయవలసిన పని నతఁడు చేయవలయును. పని చేసిన తరువాత గురుని దగ్గఱకు బోయి యధ్యయనము చేయవలయును. మిగుల నిర్మలుఁడుగాను కార్యదక్షుడుగాను నుండవలయును. గురువు భోజనము చేయకుండఁ దాను భోజనము చేయఁ గూడదు. గురుని దక్షిణ పాదమును దక్షిణ హస్తము

తోను ఎడమకాలు ఎడమ చేతితోను దాటవలయును. బ్రహ్మచారికి నిషిద్ధములైన గంధములను రసములను సేవింపఁ గూడదు. శాస్త్రములో జెప్పఁ బడిన బ్రహ్మచర్య నియమము లన్నిటిని బాలింప వలయును. ఈ రీతిగా గురుని బ్రసన్ను జేసికొనియు నతనికి దక్షిణ నిచ్చియు యథావిధిగా సమావర్తనమును జేయవలయును, తరవాత గురుని యాజ్ఞ చేత వివాహముఁ జేసికోవలయును" (శాం. 243 అ.)

ఈ వర్ణనమును బట్టి శిష్యునికి భోజనపు టేర్పాటు తఱచు గురు నింటనే యయి యుండునని తెలియుచున్నది. శిష్యుఁడు గురునియింటఁ గొంతపని చేయవలసి యుండును. ప్రస్తుత కాలమునవలె చదువు చెప్పు టకై జీతము పుచ్చుకొన లేకుండిరి. భోజనము పెట్టినందుకుఁ గూడ నేమియుఁ బుచ్చుకొన కుండిరి, కాని ప్రతిఫలమెక్కువగనే కఠినమై యుండెను. చాలమంది బ్రాహ్మణ విద్యార్థులు భిక్షకూడ నడుగుకొను చుండెడివారని విదిత మగుచున్నది. స్మృతులయందు క్షత్రియ వైశ్యులకు భిక్షా విషయమున నిషేధమున్నది. గురునింటఁ బనిచేయుట మాత్రము అందఱకు ననివార్యమై యుండెను. ఈ విధముగా గురుని యొద్ద కృష్ణాదులు కూడఁ బనిచేసినట్లు వర్ణనము హరివంశములోఁ గలదు. ఈ ప్రకారము గురువునింటఁ బనిచేయు విద్యార్థుల శరీరము మిగుల బలము, చురుకుదనము గలది కావలయును. ఇది యొక పెద్ద లాభమే యై యుండెను. కాని కొందఱు గురువులు శిష్యులను జాలఁ బీడించు చుండి యుందురు. ఆది పర్వములో మూఁడవ యధ్యాయమందు నీ వర్ణము కలదు— ఋషి, వేదనామకుఁడై తన శిష్యుని, నాగటియందుఁ గూడ జోడించి యుండెను. అయినను వానికిఁ గొంచెము కూడ చేదము కాదయ్యెను. గురుని యింటఁ బడిన కష్టములను స్మరించుకొని వేదుఁడు తన శిష్యులను గురుసేవ వంటి దుర్భర కార్యములఁ జేయించి, కొంచెమైనను గష్టపెట్టలేదు. "ప్రతి శిష్యుఁడును దక్కువో యెక్కువో పనిని మాత్రము నిస్సందేహముగాఁ జేయవలసి యుండెను. గురుని స్వభావము ననుసరించి, యందలి కష్టము మాత్రమధికమే కావచ్చును. గురుని సంతుష్టుఁ జేసి విద్య సంపాదింపవలసి వచ్చెడిది. గురుని కృప

లేకుండ విద్య రానేరదని యా సమయమునఁ జెప్పఁబడుచుండెను. ఈ కారణముచేత, ఆ కాలమందు,గురుని కత్యాదర ముండెను. గురుపుత్రునికి గురుపత్నికిని నాదరము గూడ నెక్కువగా నగుచుండెను. గురుపత్ని విషయమున శిష్యుడెన్నఁడును దుష్టముగా వ్యవహరింపఁగూడదు, ఈ నియమ ముండుట స్వాభావికమై యుండెను. గురుతల్ప గమనము మహాపాతకములలో నొకటిగా విశ్వసింపఁబడియున్నది. ఈ మహాపాతకమునకు మరణదండమే ప్రాయశ్చిత్తమై యుండెను. గురుపత్నికి ప్రణామము చేయవలసిన యెడలఁ గూడ దూరము నుండియే చేయవలయును. పాదములు స్పృశింపఁగూడదు అని స్మృతులాజ్ఞాపించియున్నది. ఇట్లు ఉచితముగా శిక్ష నిచ్చెడి యాచారము ప్రాచీనకాలమందుండెను; కాని చదువు పూర్తియైన తరువాత, మాత్రము గురువునకు దక్షిణ నిచ్చుటయు నాచారమై యుండెను. చూడఁగా నిప్పటి విధముగా గురువునకుఁ గాని డాక్టరునకుఁగాని ముందుగాఁ గొంతధనమిచ్చు నలవాటు లేకుండెను, అయినను బనియైపోయినతరువాత గురుదక్షిణము ఇచ్చుట యావశ్యకమై యుండెను. సాధారణముగా రెండు గోవులే దక్షిణగా నీయఁబడుచుండెడివి. ఇది యుఁగొంత యతికఠినము కాకుండెను. కొందఱు గురువులు మాత్రముదక్షిణపుచ్చుకొనకుండనే వెళ్ళుము విద్యఅయిపోయినది. అనిశిష్యునికి నింటికి వెళ్ళుటకై యాజ్ఞ యిచ్చివేయుచుండెడివారు. గురుని యింట విద్య పఠించునపుడు సాధారణముగా దనయింటికిఁ బోవుటకై స్వాతంత్ర్యము శిష్యునికి లేకుండెనని తోఁచుచున్నది. ఈ క్రిందినియమములేకుండెను—గురువునకెప్పుడును దూరముగా నుండకుము"గుర్వాజ్ఞచేత శిష్యుఁడు తనయింటికిఁ బోఁగలిగియుండును చివరి యాజ్ఞకు మాత్రము దక్షిణ యొక్క యావశ్యకత యుండెను. ఈ దక్షిణ విషయమై యసంభావ్యములైన యనేక కథలు మహాభారతములోఁ గలవు. కాని యా వర్ణనములఁ బట్టి యవి తఱచుగా శిష్యుల గర్వము వల్లనే వచ్చినవని తెలియుచున్నది. గురువులు దక్షిణ పుచ్చుకొనుటకై యనిచ్చను ప్రకటించుచుండిరి; అయినను శిష్యులు పట్టుపట్టి మీకేమి దక్షిణకావలయునో చెప్పుఁడని యడుగుచుండిరి. ఇట్టి పెంకితనము మీఁదట గురువులు తమ కిష్టము వచ్చినదక్షిణ నడుగివేయుచుండిరి. అందువలన శిష్యుఁడు కష్టపడవలసి వచ్చెడిది. ఆదిపర్వములో ఉత్తంకునిదియు ఉద్యోగపర్వములోగలవు· నిదియు నిట్టి కథలేయై యున్నవి. శిక్ష సమాప్తమైన తరువాత నీ గురుదక్షి

ణయు నిశ్చితముగా నుండెను. అంత రెండు గోవులు దక్షిణ నిచ్చి శిష్యుఁడు సమావర్తన విధిని జేసికొని తన యింటికి వెడలుచుండెడివాఁడు గురు ప్రస్తుచేత వివాహమును జేసికొనుచుండెడివాఁడు.

ఆర్యులందరకును నీ శిక్షాపద్ధతియే పూర్వకాలమునఁ బ్రచలితమై యుండె నని తోఁచుచున్నది. ప్రాచీనకాలమందు, పాశ్చాత్యార్య దేశములందు గురు కులమున నివసించి విద్య పఠించుపద్ధతియే కనఁబడుచున్నది. దీనికి రూపాం తరముగా నచ్చటఁ బ్రస్తుత సమయమున బోర్డింగు స్కూళ్ళు కలవు. విద్యా పఠన సమయమున శరీర పరిశ్రమము చేయవలసి యుండెను. గురునియంట నియమ పూర్వకముగా నుండవలసి యుండెను. అన్ని విధముల కఠోర వ్రత ములను బాలించుట యనివార్యమై యుండెను; ఇందుచేత నన్నపానాదులు సాత్వికములుగను కొలత తూనిక కలిగిగను పరిమితములుగను నుండెడివి. ఈ శిష్యుల బుద్ధిని తీవ్రముగను శరీరము రోగరహితముగనుండునని విశ్వసించుటకు నాటంకమేమియునులేదు. ప్రాచీనకాలమందు నొక గురువు నొద్దనే యనేక విద్యార్థులు ఉండజాలకుండిరి, ఇందుచేత ఆ సమయమున, బోర్డింగులలో వందలకొలఁది కలసి నివసించుటవల్ల సంభవించు దోషములు కూడ లేకుండెను. అనుమానమును బట్టి ఒక్క గురువు నింట విశేషించి నలుగురైదుగురు విద్యా ర్థులుండెడివారనియు, అంతకంటె నెక్కువ విద్యార్థులు లేక యుండురనియు దోచుచున్నది. ఎందుచేత సాధారణ రీతిని బట్టి, గురునింట నుండుటకు సౌక ర్యము లేక యుండును. ఇదిగాక గురుపత్నులు అనేక విద్యార్థులను వంట చేయుట యనెడు కష్టమును బడవలయుననుటయు ఉచితమనుటయు సంభవము కాదు. విద్వాంసుఁడైన ప్రతి బ్రాహ్మణునికి అధ్యాపనాధికారముండెను, కనుక నిటువంటి శాలలనేక ముండియుండును ఇందుచేత నెల్లరకును శిక్షా సౌకర్యముండెను.

ప్రాచీన కాలమందు గురువులేకుండ విద్యపఠించు నలవాటులేక ఉండును. వేదవిద్య మాత్రము గురువు లేకుండఁ జదువఁ గూడదని లోకుల యభిప్రాయమై యుండెను. వనపర్వములో 128వ యధ్యాయమందు యావ క్రీతుఁడు గురువు లేకుండనే వేదాధ్యయనమును జేసియుండెననియు అందు,

చేత ననేక దుఃఖములు ననుభవింపవలసి వచ్చెననియు వ్రాసియున్నాఁడు. దీనిబట్టి యీ సమయమున వేద పుస్తకములు కూడ నుండియుండునని యనుమానము కలుగుచున్నది. ఎందుచేత? గురువు లేకుండ వేదాధ్యయనము పుస్తకములవల్లనే కాఁగలదు. ప్రాచీనకాలమందు, విద్యలన్నియు గురునివద్ద బఠించిన మీఁదటనే సఫలము లగుననియు వేద విద్యను గురువు నొద్దనే యభ్యసించు నిర్బంధముండెననియు దృఢాభిప్రాయముండెను. గురువు లేకుండ వేద విద్య పఠనము సంభవమే కాదనుట ప్రకటమై యున్నది. ఎందుచేత? వట్టిపుస్తకముల వల్ల వేదముల యుచ్చారణము సరిగను శుద్ధముగను రాఁ జాలదు. ఏదియో గురుముఖమునుండి వలసియే యున్నది. శూద్రునికి వేదవిద్యాధికారము లేకుండెను, వారు వేదములను జదివింపఁబడకుండిరి. కానిశూద్రవిద్యార్థులు అన్య విద్యల నేర్చుకొనుటకై వచ్చుచుండి యుందురని యనుమానము కలుగుచున్నది. శూద్రులకాశ్రమ ధర్మము లేదని స్పష్టముగాఁ జెప్పఁబడలేదు. నాలుగు వర్ణములకు సంన్యాస ధర్మము విహితమా కాదా? ఈ ప్రశ్నము మహాభారత సమయమున ననిశ్చితస్థితి యందున్నట్లే శూద్రులను విద్య చదివింప వచ్చునా లేదా యను ప్రశ్నము కూడ ననిశ్చిత స్థితియందు నగపడుచున్నది. కాని యితర విద్యలఁ బఠించుటకు నిషేధములేక యుండును. ఈవిషయమై ఏకలవ్యుని దృష్టాంతము ధ్యానింపఁదగియున్నది. ద్రోణుని కీర్తి విని యనేక రాజపుత్రులు వారివద్దకు ధనుర్విద్య నేర్చుకొనుటకై వచ్చిరి. ఆ సమయమున వ్యాధరాజగు హిరణ్యధనువు యొక్క కుమారుఁడైన యేకలవ్యుఁడును వారిని గురువుగాఁ జేసికొనుటకై వచ్చెను. అపుడు, ఇతర శిష్యుల లాభమునకై, ధర్మజ్ఞుఁడైన ద్రోణుఁడు అతనిని శిష్యుడుగాఁ జేసికొనుట కంగీకరింపలేదు. ఆది పర్వము యొక్క 132వ యధ్యాయమందు, పైని వ్రాయఁబడినదియే ముఖ్య విషయమై యున్నది. ఈ సంగతి యందఱ యందును నేఁడు కూడఁగనబడుచున్నది. జపానుదేశస్థులు తమ యుద్ధ విద్యను రెండవ దేశము వారికి నేర్పకున్నారు. జర్మనులు ఇంగ్లీషువారికి నేర్పరు. నాలుగు వైపులను తత్త్వమొకటియే యున్నది. కాని యీతఁడు వ్యాధుఁడుకాక యేదేని మఱియొక శూద్రజాతివాఁడైన యెడల ద్రోణాచార్యులు నేర్పి యుండును.

అపుడాతడు వ్యాధుని కొడుకు ద్రోణాచార్యులను గురువుగాతలచి మట్టితో అతని ఆకారము చేసి దానికి నమస్కరించి ధనుర్విద్యను అభ్యసించెను. ఇంత

యైనను ద్రోణుడు గురుదక్షిణ నడుగుటకు సంకోచింపలేదు. ఇట్టి భయములేక ఇతరరాజ్యములలో అనార్యుల గురించి అడ్డు కలుగకుండెడిది. అక్కడశూద్రు లకు కూడ వేదము తక్క ఇతర విద్యలు నేర్పబడుచుండెడివని మహాభారతము వల్ల స్పష్టమగుచున్నది. వారికిగూడ వేదవిద్యకును పూర్ణాధికారము ఉండుట కష్టమైనది. మహాభారత కాలము పిదప బౌద్ధ జైన ధర్మములప్రచారమైనపుడు అందువలననే వర్ణభేదము ఎత్తి వేయబడుట వల్ల జాతులు చాల గందరగోళపు స్థితిలో నుండెను. వారును వేదవిద్యల గొప్పతనమును తగ్గించి వేసిరి. అందుచే పరిస్థితి మారిపోయెను. ఇంక ఇతర వర్ణముల వారు వేద్యవిద్యను చదువవలెనను పద్ధతిని త్రెంపి వైచిరి. కనుక సంస్థితిలో మార్పు వచ్చెను.

భారతకాలములో నేటి విశ్వవిద్యాలయముల వలె ఇట్టి పెద్దపెద్ద సంస్థ లున్నవోలేవో వానిలో చాల మంది విద్యార్థులు చేరిరోలేదో అను నొక మహా ప్రశ్న కలుగుచున్నది. మహాభారతములో ఆదిపర్వములో కులపతియైనకణ్వుని యాశ్రమవర్ణనమున్నది. దానిబట్టి మనకిట్టి విద్యాలయముల యొక్క కల్పన యగు చున్నది. మాలినీనదీతీరమున సుందరాశ్రమములోలేక బ్రాహ్మణ గ్రామములో అనేక ఋషులు ఋగ్వేద మంత్రము చదువుచుండిరి. ప్రతిష్ఠులగు ఋషులు సోమవేదగానము చేయుచుండిరి. సామాథర్వణ మంత్రములు పదక్రమ సహితముగా ఉచ్చారణ వినబడుచుండెను, అక్కడ ఒక శాఖలో అనేక శాఖలు కలుపునట్టియు అనేక శాఖల గుణవిధులుసమవాయ నామముఒకశాఖలోచేయు ఋషుల యుత్సాహమున్నది. అక్కడ మోక్షశాస్త్రజ్ఞులు ప్రతిజ్ఞా శంకా సిద్ధాంతాదులను తెలియువారు వ్యాకరణము ఛందస్సు నరుక్తము జ్యోతిషముల పారము తెలిసిన వారు ద్రవ్యగుణకర్మల పూర్ణవ్యవస్థను తెలిసినఋషుల సమావేశమును ఉన్నది. కార్యకారణ నియమములకు దెలియువారు పశుపక్షుల వాక్యములను మంత్రముల రహస్యములను దెలిసి అనేక శాస్త్రముల ఆలోచన చేయువారు వానిపై ప్రామాణికమైన రీతిగా భాషణములు చేయు వేలకొలది గుంపులుండినది. వారిలో నాస్తిక పంథలో ముఖ్యులగు వారి యొక్క వాద వివాదములు కలిసియుండుట వలన వారి వాదన ధ్వని చాల సుందరముగా వినబడుచుండెను" అను వర్ణనను బట్టి ఏయే విద్యలు చెప్పబడుచున్నవో ఏయే విషయములు వాదోపవాదములు జరుగుచుండునో మనకు తెలియును. విద్యాపీఠములు కొంచెము వ్రాయను చదువను నేర్చు స్థానములేకావు. విద్వత్తకల

వారి పరీక్షకును చదువుకొన్న విద్యలను సావధానముగా నుంచుటకును ఉన్నవి. అసలైన విద్య వేర్వేరు గురువుల దగ్గర పదిపది, అయిదయిదు గురువిద్యార్థులతో నుండును. ఎక్కడనైతే కౌరవ పాండవులలో సమానమైన విద్యార్థులొకచోట చేరియుందురో అక్కడ అందఱను గురువు నింటికిఁ బంపక యెవరో యొక స్వతంత్రుఁడైన శిక్షకుని నియమించుకొని యుండియుందురు ఇందుచేత, గురుపదవి యందు ద్రోణుని హస్తినాపురమున నియోగించిన వర్ణనము కలదు. ఈ బాలకులందఱును మొదట కృపాచార్యుని యొద్ద వేద విద్యను నస్త్రవిద్యను నేర్చుకొని యుండిరి. కాని యిక్కడ ద్రోణుఁడు భరద్వాజ పుత్రుఁడై యుండెను. మఱియు సాక్షాత్తు పరశురాముని యొద్ద నతఁడు శస్త్రవిద్య యొక్క శిక్షను బొందియుండెను; ద్రుపదుని మీఁదఁ గ్రుద్ధుఁడై యతఁడు తన భార్యాసోదరుఁడైన కృపుని యొద్దకు వచ్చి యుండెను ఇందుచేత భీష్ముఁడు అతని యోగ్యత నధికముగాఁ జూచి రాజపుత్రులందఱను నతని వశమున నుంచెను. అనఁగా ద్రోణుని వారు రాజ్యమందు సేవకునిగా నుంచుకొని గృహధనధాన్యాది సంపత్తి నతని కిచ్చివైచిరి. ఈ యేర్పాటు ఎప్పటి పరిపాటికి విరుద్ధమనుట స్పష్టము. ఒకటి రాజపుత్రులకు రెట్టింపు గురువులైరి. రెండవది ఎపుడు గురువు నింట శిష్యులుండెడిరో, అపుడు గురువే శిష్యుల యింటికి శిష్యుల కాధారమైన రాజ్యమునకు వచ్చెను. ఈ విషయము అతిధనవంతులును రాజపుత్రులునైన వారికే యుండెను. ఈ యవస్థ యందు శిష్యుఁడిల్లు విడిచి దూరముగా నుండుట తటస్థింపదనుట ప్రకటమైయున్నది. ద్రోణుని వద్దకు నితరదేశపు రాజకుమారులు విద్య పఠించుటకై వచ్చి నివసించుచుండిరని వ్రాయబడినది. ధనుర్విద్యలో ద్రోణుఁడు చాల నిష్ణాతుఁడై యుండెను. కృపాచార్యునికివలె నతనికి నైత నాచార్యపదవి యుండెను. కాని దరిద్రుఁడగుట చేత లేక ద్రుపదునిపైఁ బగదీర్చుకొను తలంపు చేత నతఁడు రాజు సేవనంగీకరించి యుండెను.

సాధారణ రీతిఁ బట్టి గురుని యింటనే శిష్యుడుండెడి పరిపాటి యుండెను. అచ్చట నున్న సమయమున శిష్యుడడిగి తెచ్చుకొన్న భిక్షను గురువునకు సమర్పణము చేసి మరలఁ దన నిర్వాహమును జేసికొనవలయును. అనఁగా

గురుశిష్యులిద్దఱును శాంతము సమాధానిసై మునవృత్తి గలవారు కావలసి యుండెను. (శాం. అ. 191), ఇది తఱచు బ్రాహ్మణ విద్యార్థులయు] వేద విద్యఁ బఠించు వారియు సంప్రదాయమై యుండెను. ప్రతి విద్యార్థియు ప్రత్యేకముగా నగ్ని నుంచుకొని ప్రాతః కాలమందును సంధ్యాసమయమం దును దానిని బూజింపవలసి యుండెను. శాంతిపర్వములో 19 వ యధ్యాయ మందు "ఉభేసంధ్యే భాస్కరాగ్ని దేవతాన్యుపస్థాయ, ప్రాతః సాయముల యందు సూర్యుని, అగ్నిని, అశ్వదేవతలను స్తుతింపవలయును పుమాఁడు మాఱులు స్నానము చేసి (త్రిషవణముపస్పృశ్య) గురు నింట స్వాధ్యాయ తత్పరుఁడై యుండవలయుననియుఁ జెప్పి యున్నాఁడు. అనఁగా ఇంత కఠిన వ్రతమును నెఱవేర్చుట బ్రాహ్మణులకే సంభవమై యుండెను. అదియు నందఱ బ్రాహ్మణులకునుగాదు క్షత్రియులకు వైశ్యులకుఁ గూడ నీనియమమే యుండును; కాని స్మృతులఁ బట్టి వారికి భిక్షానియమము లేకుండెనను జాడ తెలియుచున్నది. క్షత్రియులకు ధనుర్విద్యను రాజనీతిని లేక దండనీతిని గూడ బ్రాహ్మణులే నేర్పుచుండిరి; వైశ్యులకుఁ గూడ వార్తాశాస్త్ర జ్ఞానము లేక శిల్పజ్ఞానము బ్రాహ్మణ గురువులవల్లనే లభించుచుండెను. ఈ విద్యల శిక్ష నిచ్చువారు రాజ్యము వైపు నుండియు నియుక్తులగుచుండియుందు రనియువారిముఖ్యోపయోగమురాజపుత్రులకునుయోధులకునుధనుర్విద్యనేర్పు టలో నగుచుండెననియు ననుమానము కలుగుచున్నది. సభాపర్వములో ఒక అధ్యాయమందు నారదుఁడీ ప్రశ్నమును జేపియున్నాఁడు

కచ్చిత్కారణికా ధర్మే సర్వశాస్త్రేషు కోవిదాః
కారయంతి కుమారాంశ్చ యోధముఖ్యాంశ్చ సర్వశః ॥

ఇందు కారణిక శబ్దము విశేషార్థమున వచ్చియున్నది. ఇచట దాని యుపయోగము ప్రభుశిక్షకునియర్థమందుఁ జేయఁబడియున్నది. టీకాకారుఁడు కాకయంతి అను దానికి అర్థము కూడ శిక్షయంతి అని చేసియున్నాఁడు, అనఁగా; యోద్ధలకుఁ జక్కఁగా నేర్పుటకై ప్రభు శిక్షకులు నియుక్తులై యుందురు. ఇచట నిట్టి విద్వాంసులైన యాచార్యుల ప్రశంసయెక్కువగాఁ చేయబడియున్నది.

కచ్చిత్సహస్రైర్మూర్ఖాణా మేకం క్రీణాసి పండితం
పండితో హ్యర్థకృచ్ఛ్రేషు కుర్యాన్నిశ్శ్రేయసం పరం ॥

క్షత్రియులకు ముఖ్యశిక్ష యుద్ధకళకు సంబంధించినదై యుండె నని చెప్పవలసిన యావశ్యకతలేదు. ద్రోణుఁడు ధృతరాష్ట్రునియొక్క దుర్యోధనాది పుత్రశతము చేతను పంచపాండవుల చేతను బరీక్ష నిప్పించినపుడు వారికేమేమి నేర్పియుండెనో వీని వర్ణనము ఆది పర్వములోఁ జేయబడియే యున్నది. అన్నియును ముఖ్యమైనవి ధనుర్బాణములు, దానికంటెఁ గొంచెముగానే తక్కువయైనగద దాని తరువాత డాలు తలవారుల ప్రసిద్ధియై యుండెను. ఇట్లే గుఱ్ఱము, ఏనుగు, రథము వీనిపైఁ గూర్చుండి పలు విధములైన శస్త్రములతో యుద్ధము చేయుట మొదలగు కౌశలములను రాజకుమారులు చూపి యుండిరి. ఈ యన్ని విద్యలను గురువు నేర్పియే యుండెను. కాని గురుశిక్షతోటిపాటుగ ప్రతి యొక శిష్యుని క్రియ లేక అనఁగా వ్యాసంగము కూడ స్వతంత్రములై యున్నవనియుఁ జూపియున్నాఁడు. అర్జునుఁడు రాత్రికూడ ధనుర్వ్యాసంగము చేసినట్లు వర్ణనమున్నది. విద్యావ్యాసంగముతో పాటుగను గురువుల కృపతో పాటుగను మూఁడవది యీశ్వర దత్తమైన యోగ్యతయుఁ గావలసియే యున్నది. ఈ శిక్ష క్షత్రియ కుమారులకు నీయఁ బడుచుండెను. బ్రాహ్మణులు శిక్షకులై యుండిరి. చూడగా మంత్రాది విధులు అస్త్రములయందగు చున్నదనియు నిందు విషయమై చూడఁగా బ్రాహ్మణ శిక్షకులుండి యుందురనుటయు సరియే యై యున్నది. అయినను ఈ విషయములయందు గాక బ్రాహ్మణులు మానవ యుద్ధ విద్యాశిక్షణ మందును స్వయముగా యోగ్యులై యుండిరి. దాని ననుసరించి వారు శిక్షకూడ నిచ్చుచునే యుండిరి. ఎందుచేత? చదువు నేర్పుట వారి కర్తవ్యమే యై యుండెను. శిక్ష నిచ్చు జవాబుదారీని వారు నెత్తిమీఁద బెట్టుకొని కండ్ల నద్దుకొని గైకొని యుండిరి.

## వ్యవసాయము యొక్క శిక్ష

సాధారణ మనుష్యులకు వ్యాపార శిక్ష తఱచు వారి నౌకరి— కంటితోఁ జూచినఅనగా ప్రత్యక్షానుభవముఁ బట్టియే సిద్ధించుచుండియుండును అయినను శిక్షయందలి విశేష విషయములను నేర్పుటకై బ్రాహ్మణులే తయారగుచుండి యుందురు. వేర్వేఱు వ్యాపారములు గలవారికి బ్రాహ్మణులు వివిధోపాయములను నేర్పవలయునని వర్ణన మున్నది. కృషి, గోరక్ష, వాణిజ్యముల శాస్త్రము వార్త, అను పేరితోఁ బ్రసిద్ధములై యుండెను. కనుక ఈ యాశాస్త్రమునకు శిక్షకులు గూడ బ్రాహ్మణులే యై యుండిరి. ఈ శాస్త్రము సరియైన పద్ధతిమీఁద నేర్పఁ బడుచున్నదో లేదాయని నారదుఁడు యుధిష్ఠిరుని బ్రశ్నించెను. భిన్న భిన్న విద్యలను, జ్యోతిషము, వైద్యము మొదలైన వానిని తఱచు బ్రాహ్మణులే చదువుచుండిరి. బ్రాహ్మణులే చదివించు చుండిరి. సర్వవిద్యలను బఠించుటకై యుత్తేజనము నిచ్చుట రాజు కర్తవ్యమై యున్నది. ప్రాచీనకాలమందిటువంటి దృఢ నిశ్చయముండెను. వేర్వేఱు విషయములయందుఁ బరీక్ష పుచ్చుకొని ఆ విద్యలలో నుత్తీర్ణులైన వారికి రాజు దక్షిణ లిచ్చుట యుత్తేజనము నిచ్చు పద్ధతియై యుండెను. వర్తమానకాలమందువలెఁ బ్రాచీన కాలమందును నీ వరిపాటియే యుండెను. మొదట నాయకుల సముఖమునను ప్రస్తుతకాలమునఁ గొన్ని యిస్టేటులయందును విద్వాంసులైన బ్రాహ్మణులకు, కేవలము విద్వత్తుకుఁ బ్రతిఫలముగా, దక్షిణనిచ్చెడు పద్ధతి యుండెను. అది యీ విధముగాఁ బ్రాచీనకాలము నుండియుఁ గనఁబడు చున్నది. విద్య పఠించుటకుఁ బ్రోత్సాహమిచ్చుటకై యిది యొక ప్రాచీన యుక్తియై యున్నది. అప్పటి పరిస్థితిలో నయ్యది యుచితమై యుండెను, ఎందుచేత? దక్షిణఁ బుచ్చుకొనుట బ్రాహ్మణుని కర్తవ్యమై యుండెను; ఇందుకై యతఁడు విద్యచదివి చదివించుపనిని సమ్మతించి యుండెను. ఇదియొక విధమైన యిప్పటి విద్యా వేతనము లేక శిష్యవృత్తిని బోలి యున్నది. దీనిని దక్షిణ యనక శిష్యవృత్తి యని చెప్పినను భేదము తటస్థింపదు. నారదుని ప్రశ్నమిచ్చటఁ జేర్కొనఁ దగియున్నది.

కచ్చిత్తే సర్వ విద్యాసు గుణతో ఒర్చాప్రవర్తతే।
బ్రాహ్మణానాంచ సాధూనాం తవనై శ్రేయసీ శుభా॥
దక్షిణాస్త్వం దదాస్యేషాం నిత్యం స్వర్గాపవర్గదాః।

(96 స. 5. అ.) లోని గుణతః శబ్దముఁ బట్టి యిది పఠించు నాచారమై యుండునని తెలియుచున్నది. ఇది కేవలము బ్రాహ్మణుల వేద విద్యయొక్క పరీక్ష కాకుండెను. ఇఁక నేమంటేని యన్ని విద్యలదియు నై యుండెను. ఇందు బ్రాహ్మణులేగాక సాధువులు గూడఁ జేరుచుండిరి. సాధుశబ్దమున కర్థము తత్త్వజ్ఞానములోఁ బ్రవీణులైన మనుష్యులను, జేయవలయును. ఎందుచేతః ఎవరి యాచారము సాధువుల వంటిదిగా నిశ్చితమగునో యట్టి సాధువులు దక్షిణ నెందులకుఁ దీసికొనఁ దొడగిరి. మంచిది, దక్షిణ లేక విద్యార్థి వేతనమిచ్చి సమస్త విద్యా శిక్షకై ప్రాచీన కాలమందు రాజువైపునుండి ప్రోత్సాహనము లభించుచుండెడి దనుటలో సందేహములేదు.

బాల్యావస్థయందు నేర్చుకొనఁబడు చుండెడివిగాక ప్రౌఢులైన మనుష్యులు నేర్చుకొను చుండెడి యనేక విషయములు గూడ నుండెడివి. వారికి శిక్ష సప్రయోగముగా నగుచుండెను. ఈ విషయములు విశేషించి యుద్ధమునకు సంబంధించినదై యుండెను. నారదుని ప్రశ్నములో నియ్యది యడుగఁబడి యున్నది— "నీవు స్వయముగా హస్తి సూత్రము, రథసూత్రము, అశ్వసూత్రము పఠించుచున్నావా లేదా" టీకా కారుఁడు గృహ్ణాసి అను దాని కర్థము, నేర్చుకొనుట—అని యర్థము చేసి యున్నాఁ ఇందు ప్రతి విషయమునకును వేర్వేఱు గ్రంథములు, అయా విద్యలయందుఁ బారంగతులైన బ్రాహ్మణులు లేక యితరులు దప్పక యుందురు. వాని నాచార్యులు చెప్పుచుండిరి. దీని కభిప్రాయము ఆచార్యులనుండి రాజులోకము ప్రయోగ సమేతముగా నా విద్యలను నేర్చుకొన వలయునని తెలియుచున్నది. చివరకి యుధిష్ఠిరుని యుద్ధ మంత్రులకు లేక కుమారులకు విద్యలన్నియుఁ బఠించుట యావశ్యకమై యుండెను.

ఈ ప్రశ్నమున్నది— కచ్చిదభ్యస్యతే సమ్యక్ గృహ్యతేభరతర్షభ॥
ధనుర్వేదస్య సూత్రం వై యంత్రసూత్రం చ నాగరం॥

ఇందు యుధిష్ఠిరుని యింట అనఁగా అతని యధికారులకును గుమారులకును ధనుర్వేదాభ్యాసము కావలయుననియే తెలుఁప బడి యున్నది. ఈ యభ్యాసము పెద్ద విద్యార్థులదియై యున్నది. మఱియు ఆయా విద్యల యాచార్యులయొక్క నిరీక్షణమున నియ్యది యగుచున్నది. "యంత్రసూత్రం చనాగారం" ఇది స్పష్టముగా నర్థమగుటలేదు; చివరికి నేవి మనకర్థమగుటకు వీలుగాలేవో యిట్టివి గలవు; అయినప్పటికి నందు యంత్రమునక— యిద్ధమున కుపయోగించునట్టి యంత్రము యొక్క జ్ఞానమావశ్యకమని చెప్పఁబడి యున్నది. అట్టిచో శాస్త్రీయ జ్ఞానముతో పాటు ఈ జ్ఞానమునకు మైత్రియున్నది. ఈ జ్ఞాన మభ్యాసము చేత వృద్ధినొందించుకొనఁ బడు చుండెనని ప్రకటమే యై యున్నది.

మహాభారత సమయమునఁ బురుషుల శిక్షకు నిట్టి వ్యవస్థయుండెను బ్రహ్మ, క్షత్రియ వైశ్య వర్ణములకు మూఁడిటికి బ్రహ్మచర్యము అనఁగా శిక్ష యావశ్యకమై యుండెను. అందు అది ధార్మికాచారము యొక్క యేదో యొక విషయమై యుండెననుట సారాంశమై యుండెను. విద్యార్థుల యాచరణము విషయమునఁ గఠోర నియమములు ప్రచితమై యుండెను. స్మృతి గ్రంధములయందా నియమములు ఉపస్థితములై యున్నవి. మహాభారతమున లో నియ్యవి లేవు కాని యని చాలమార్మికముగా నున్నవి; దేనియందు విద్యార్థి సశక్తుఁడుగను సద్ధర్మశీలుఁడుగను, విద్యా సంపన్నుఁ డుగును చేయఁగల యోగ్యత కలదు. మఱియు ఇట్టి విద్యపూర్ణము కాకుండ వివాహము కాఁజాలకుండెనను నియమముండెను. సారాంశమేమనఁగా ప్రస్తుత కాలమున నాశ్రమ సంకరము కానీయకుండుటకై యే మాత్రము ధ్యానము కూడఁ జేయ వట్టి స్థితివంటి స్థితి యా దినములయందు లేకుండెను. ప్రౌఢావస్థయందే విశేష వాస్యంగముచేతఁ బొందఁ జాలినట్టివియు, జక్కఁగా వృద్ధినెంపఁ బడఁ బారినట్టివియు నైన విద్యలు కొన్ని యుండెను. వానిని నేర్చు కొనుటకై రాజు దగ్గఱనుండి దక్షిణ రూపమునఁ బ్రోత్సహించు నేర్పా

టుండెను. నేర్పునట్టి యాచార్యుని గృహమున నిలుపుకొను నాచార ముండెను. ఈ విధముగా ప్రజాశిక్షకై రాజువైపునుండి సకల విధమైన యేర్పాటుండెడిది. ముఖ్యముగా శిక్షాభారము బ్రాహ్మణ సమూహమందుం డెను. రాజువైపునుండి వారికి [న]ప్రత్యక్షముగా సాహాయ్యము లభించు చుండెడదని నిష్కర్షమై యున్నది.

## స్త్రీ శిక్ష

ఇపుడు స్త్రీ శిక్షను గూర్చినది విచారింపఁ బడుచున్నది. మహాభారత సమయమున నున్నత వర్ణ స్త్రీలకు శిక్ష నిచ్చెడు నాచారము నిస్సందే హముగా నగపడుచున్నది. ఈ స్త్రీలు వ్రాయను చదువను సమర్థులై యుందురు. ఈ శిక్ష పెద్ద తరగతిది గూడ నగుచుండెను. ద్రౌపదిని వర్ణించినపుడు పండితా శబ్దముయొక్క ప్రయోజనము కనఁ బడుచున్నది.

ప్రియా చ ధర్మనీయా చ పండితా చ పతివ్రతా (వన. అశ్వ. 27)

ఈ శిక్ష యెచ్చట నీయఁబడుచుండెనను ప్రశ్నము మహత్త్వ పూర్ణమై యున్నది. స్త్రీల పాఠశాలలు లేకుండెననుట మాత్రము నిర్వివాదము. ఇట్టి శాలః వర్ణన మెందును లేకున్నది. ద్రౌపది యుధిష్ఠిరునితోఁ జేసిన సంభాష ణను నిజముగాఁ బండిత స్త్రీది యెట్లుండవలయునో యట్లే యున్నది. ఈ శిక్షను బొందుటకై యామె యే పాఠలకు వెళ్లినో, దీని వర్ణనము దొర కదు. ఆమె ఆ నేను తండ్రి యొద్ద నున్న సమయమున నొక ఋషి వలన వింటినను సంగతిని జెప్పియున్నది. అనఁగా స్త్రీలకు వారి యింటనే శిక్ష యీయఁబడుచుండెను. తండ్రిచేత సోదరునిచేత, లేక వృద్ధులు సన్మాన్యులు సగు సంగతి పురుషుల చేత వారికి శిక్ష లభించుచుండియుండును. స్త్రీలకు వేద శిక్ష యీయఁబడియుండునని యనుమానముగాచున్నది. ఎందుచేత? వేదము చదివించుటకై వారికుపనయనాది సంస్కారములు జరిగిన వర్ణన మెందును గనఁబడదు. మనువు యొక్క యీ వచన మొకటి ప్రసిద్ధమై యునకుది. "పురాకల్పేతు నారీణాం మౌంజీబంధన మిష్యతే" కాని భారతీయ కాలమందు నీవిధముగాఁ బ్రబలితమైన వర్ణనము మహాభారతమందులేకున్నది.

వారి శిక్ష వారి - మామూలు వ్యవహారమునకుఁ తగినంత వ్రాయనుజదువను వచ్చునంతయేయై యుండును. వారు ధార్మిక కథల విచారములను జక్కగా నెఱిగి ప్రకటింపఁగలిగిరి. కొన్ని ధార్మికగ్రంథములను బఠింపఁగలిగిరి.

స్త్రీలు సహధర్మచారిణులై అనఁగా పతితో వైదిక క్రియలను జేయుట కధికారిణులై యుండిరి; కాని వారికి వేదవిద్య చెప్పఁబడకుండెను. మహాభారతమందు, వారు స్వతంత్రముగా వైదిక క్రియల నాచరించినట్లును వర్ణములేదు.

విరాటపర్వములో నున్న వర్ణనమును బట్టి, మామూలుగా వ్రాతకోతలు లేఖనపఠనములయు ధర్మము యొక్కయు శిక్ష వారికీయబడుచుండెననియు మహాభారత కాలమందు క్షత్రియులకు లిఖితకళలయు శిక్షణ యీయఁబడుచుండెననియుఁ దెలియుచున్నది. విరాటుని కూతురగు నుత్తరకు గీతము. నృత్యము, వాదిత్రము నేర్పుటకై బృహన్నల నియోగింపఁబడియుండెను, ఈ వర్ణనము బట్టి, ప్రాచీనకాలమందు క్షత్రియస్త్రీలకుఁ బాటయు నాటయుఁ నేర్పఁబడుచుండెనని స్పష్టపడుచున్నది. ప్రస్తుత కాలమున స్త్రీలకు గీతనృత్యముల నేర్పుట నింద్యముగా విశ్వసింపఁబడుచున్నది. కాని మహాభారత సమయమున మాత్రము అది క్షత్రియ బాలికలకునేర్పఁబడుచుండెను. వీనిశిక్షకై విరాటుని భవనములలో వేఱుగా నొక నృత్యశాల నిర్మింపఁబడిన వర్ణనమున్నది. నృత్యము నేర్పుటకై మంచి విశాల స్థానము కావలయుననిసంగతి నందఱు నెఱుంగుదురు. అట్టిచో ఇట్టి శిక్ష నిప్పించుట ధనవంతులకేక ర్తవ్యమై యుండెను(అర్థమేయుండెను) ఈ శిక్ష కుమారి కలకేయీయఁబడుచుండెను, వివాహ సమయమున నా కన్యలకుఁ జెప్పఁబడుచుండెడి విశేషగుణములలో నొకటిగా నియ్యదికూడ మన్నింపఁదగినదిగాఁజేయఁబడియుండును. ఉత్తరతో గూడనంతఃపురములోనివారును బయటి వారును గూడగొందఱు వివాహితలైన కన్యలు నేర్చుకొనుచుండిరి. "సుతాశ్చ మే నర్తయ యాశ్చతాదృశీః। కుమారీపుర ముత్ససర్జతం" ఈ వాక్యమును బట్టి తోయ వివాహితలైన బాలికలకే యుండి యుండునని తెలియుచున్నది. స్త్రీలకుఁ గన్యకావస్థయందే శిక్షనిచ్చుట యుత్తమము మఱియు నా కాల

మందున వివాహితులకే శిక్షనిచ్చెడునాచార ముండియుండును. వివాహము కాఁగానే స్త్రీలు తత్క్షణము కుటుంబపు గొడవలోఁ బడుచుండిరి. ఇందు చేత శిక్షా సమయమున కుమారీ దశయందే యుండెను. స్త్రీలకు బ్రహ్మ చర్యాశ్రమము లేకుండెను గురు గృహమందు నివసించు నిబ్బంధియు లేకుండెను. కాని, పైని జేయఁబడిన వర్ణనముఁ బట్టి బాలికలకుఁ బుట్టింటనే శిక్షకుల వలన శిక్ష యిప్పింపఁ బడుచుండెను. గురువిద్య కూడ విశేషించి లలితకళలందే యగుచుండెను. ఇందు నృత్యగీతవాదిత్ర నామము చాలకాలము ఎక్కువగా క్షత్రియ కన్యలకుండెను. నృత్యశాల యందు శిక్షపొంది బాలికలు తమ తమ యిండ్లకుఁ బోవుచుండిరి. రాత్రి నృత్యశాల శూన్యముగా నున్నదనియు వర్ణనమున్నది. 'దివాత్ర కన్యా నృత్యంతి రాత్రౌయాంతి యధాగృహం" (వి. అ. 22). అపుడు బయటి బాలికలు కూడ శిక్ష పొందుటకై వచ్చుచుండెడివారని స్పష్టమగు చున్నది. కాని యిచ్చట నుండెడివారు కారు— మరలఁ బోవుచుండిరి.

నృత్యగీతములు నేర్పుటకై విరాటుఁడు బృహన్నల నుంచి యుండెను. దీనిఁ బట్టి బాలికలకు శిక్షనిచ్చుటకై పురుషులుంచఁ బడ కుండిరని యనుమానమగు చున్నది. బృహన్నలను శిక్షనిచ్చు పనిమీఁద నియోగించెను. ఇదికూడ నాశ్చర్యము గలిగించుటకుఁ దగిన సంగతియై యున్నది. ఎందుచేత? నపుంసకులు వ్యవహార మందందఱకంటెను విశే షించి త్యాజ్యులను నభిప్రాయము చింతకాలము నుండి యున్నది, విరా టుఁడు పరీక్ష చేసి బృహన్నల పురుషుఁడు, కాదు, నపుంసకుఁడని జాడదీసి యుండెననియు వర్ణనమున్నది. దీనిఁబట్టి యతఁడు ఖోజ్జా కాకుండెననియుఁ బ్రకటమగుచున్నది. యేల ఇతరత్ర వర్ణింపఁ బడిన ట్లుగా. ఖోజ్జాగాఁ జేయుటపట్టి దుష్టము నింద్యమునైన, ఖోజ్జాగాఁ జేయువట్టి పద్ధతులు భారతీయార్యుల యందెన్నఁడును లేకుండెను. ఆ ఖరునకు మహా భారత సమయమందుఁ గూడ లేకుండెను. ప్రాచీనులైన బాబిలోనియనులు అసీరియనులు, పర్షియనులు మున్నగు లోకుల యందీరీతి యుండెను. కాని భారతీయార్యుల యందు లేకుండెను. వారియందిపుడును లేదు. వారికీసంగతి భీతావహమై యున్నది. విరాటుఁడు పరీక్షచేత బృహ

న్నలను క్లీబునిగా నెఱింగి యంతఃపురమందలి కుమారికలకు నృత్యము నేర్పుటకై పంపెను. ఈ వర్ణనముఁ బట్టి మొదట మహాభారత కాలమందు బాలికలకు నృత్యము నేర్పుటకై షండులే నియోగింపఁ బడుచుండిరని యగపడు చున్నది. కాని కాళిదాసుని మాలవికాగ్ని మిత్రనాటకమందీపద్ధతి కూడలభింపదు. మాలవికకు నృత్యము నేర్పు నిదఱాచార్యులును-- గుణదాసులు హరదాసుఁడు-- గ్లీబులయిన వర్ణనము లేకున్నది. అట్టియెడ మఱి యిది సమస్యయే యగును. రెండవ సమస్య. స్త్రీలకు నృత్యము గానము నేర్పుటకై స్త్రీ లుపయోగింపఁ బడినట్లును లభింపదు. పాశ్చాత్య దేశములయందు గూడ స్త్రీలకు నృత్య గానములు నేర్పబడు చున్నవి; కాని వీని శిక్ష వారికి పురుషుల నుండియే ప్రాప్తమగు చున్నది. అర్జునుఁడు మిగుల దృఢమైన వాఁడును, చిక్కని స్వరూపము గలవాఁడును బలము చుఱుకుఁదనము గలవాఁడునైన యువకుఁడుగా నగపడు చుండెను. ఇందుచేత, విరాటుఁడు ఇతడు నిజముగా నపుంసకుడు లేక స్త్రీల కౌశములను ధరించి క్షత్రియుఁ డేసంపదకై వచ్చినాఁడో యని పరీక్ష చేయించెను. ఇచ్చట నిట్టిగర్హితార్థము తీయవలసి యున్నది. కుమారికలకు నృత్యముగానది కళలునేర్పుటకు యుపవములు సడలిన యవస్థతో నున్న పురుష శిక్షకులే, సాధారణముగా నియమింపబడియుందురు. ఇట్టి శిక్ష సాధారణముగా స్త్రీలను దొరకఁ జాలదని మాత్రము యున్నది. స్త్రీలు పురుషులవలె, శిక్షితలు కావలయుటయు నెంతయు నావశ్యక లేకుండెను. గురునింటికి వెళ్ళి విద్య తప్పక చదువవలయునను నియమము పురుషులకునలట్లుగా, స్త్రీలకు లేకుండెను. ఇందుచేత సాధారణ నృత్యములోని స్త్రీలు, అశిక్షతమైన బ్రాహ్మ క్షత్రియుల బాలికలు, సులభముగనే లభించు శిక్షకులు అధికులై యుందురు. కేవలము క్షత్రియ బాలికలకు లలిత కలలు నేర్పుటకై నా శిక్షకులుంచఁబడు చుండిరి. మహాభారత సమయమున కిట్టి శిక్షకు పరిస్థితి యగపడుచున్నది.

ఆరవ ప్రకరణము సమాప్తం.

ఏడవ ప్రకరణము

# వివాహ సంస్థ

హిందూ సమాజము యొక్క పరిస్థితికి మహత్త్వపూర్ణమైన రెండవ యంగము వివాహ సంస్థ, భారత కాలికులైన యార్యులయందు వివాహము నకెట్టి రీతులు, ఏవిధముగానుండెనో, మహాభారతసమయము వఱకు నవియెట్లు బయలుదేఱెనో; ఆ సమయమున భార్యాభర్తల సంబంధ మెట్లుండెనో యీ భాగమందుఁ జూడవలయును. వర్ణవ్యవస్థలో మొదటఁ జేయఁబడిన విచారము నందు నీ విషయమై కొంత దిగ్దర్శనమై యున్నది, చాల విషయముల వల్ల మతభేదమునకు సైత మవకాశమున్నది. కనుక నీ ప్రకరణమం దీవిషయమై సంపూర్ణముగా విచారము చేయఁబడియున్నది.

సమాజములన్నియు బయలుదేఱిన యితిహాసమందు, సమాజమందు వివాహ బంధనము బొత్తిగా లేని యట్టి సమయ మవశ్యముగా నుండవల యును. మహాభారతములో నొకచోట, ఒకానొక సమయమున భారతీయార్య సమాజము యొక్క పరిస్థితి యీ దశలో నుండెనని వర్ణింపఁబడియున్నది. ఈ స్థితి కేవలము కాల్పనికమని విశ్వసింపఁబడఁజాలదు. ఆదిపర్వములో 122వ యధ్యాయమందు, ఉద్దాలక ఋషి యొక్క పుత్రుఁడగు శ్వేతకేతుడు ఈ వివాహమర్యాదను స్థిరపఱచెనని కథ కలదు. అతనితల్లిచేయి యొక ఋషి పట్టుకొని యుండెను, అందుచేత నతనికిఁ గోపము వచ్చెను. అపుడే యతఁడీ మర్యాద నారంభము చేసెను. పశువులలో నగపడని యీ వివాహ మర్యాద మనుష్యులలో నప్పటి నుండియే ప్రచలితమై యుండెను. అతడొక కట్టుబాటు చేసి యుండెను. ఎవతె పతిని విడిచి యితరునితో సమాగమము చేయునో దానికి భ్రూణహత్యా పాపముకలుగునని ఏర్పాటు చేసిదానితోపాటుగనే యతఁడీ నియమమును గూడఁ జేసెను—తాను స్త్రీని విడిచి ఇతర స్త్రీ గమము చేయు పురుషునికిఁ గూడ నీపాతకమే తగులును.

భార్యాం తథా ప్యుచ్చరతః కౌమార బ్రహ్మచారిణీమ్ ।
పతివ్రతా మేతదేవ భవితా పాతకం భువి ॥ (ఆదిపర్వము12వ అ. 28శ్లో)

కాని యాశ్చర్య విషయ మేమనఁగా, హిందూ సమాజమం దీరెండవ నియమమును గూర్చి కొంచెము గూడ ధ్యానముంపఁబడలేదు. పురుషునికిఁ గూడ స్త్రీకి వలెనే వ్యభిచార పాతకము ఉన్నదని తల చీవిషయమైయెవనికిని జ్ఞానమే లేకున్నది. ధర్మశాస్త్ర మందుఁ బ్రాచీన ఋషు తేర్పఱచిన నియమములు ఇద్దఱకుఁ గూడ నొక్క విధముగా నుపయుక్తములును న్యాయములునై యున్నవి. ప్రాచీన కాలమందిట్టి నియంత్రితమైన వ్యవస్థ యున్నందులకు రెండవ యుదాహరణము ఉపనిషత్తులో సత్యకామ జాబాలునిదియై యున్నది. సత్యకామజాబాలుని తల్లి యీ పిల్లవాఁ డెవరివాడో చెప్పఁజాలకుండెను. కాని యీ పిల్లవాఁడు సత్యవిషయమును జెప్పి నైచెను. ఇందుచేత ఋషి అనఁగా అతని గురుఁడు, ఇతఁడు బ్రాహ్మణుని కొడుకనినిశ్చయించెను. ఈ రెండుదాహరణముల బట్టియు, వివాహ బంధనము పూర్వకాలమందు బొత్తిగా లేకుండెనని విశ్వసింపఁబడఁ జాలదు. ఇట్టి స్వాతంత్ర్యము ఐతిహాసిక సమయమున గూడ నెప్పుడైన నుండెనో లేదో యీ విషయమై సందేహమే యగుచున్నది. అయినను వివాహరీతి యొక్కకాల్పనికమైన యుత్పన్నకథఁ బట్టి హిందూస్థానార్యుల యందు వివాహమునకుఁ బ్రాప్తమైన యుత్పత్తియును పవిత్రమునైన స్వరూపమునకుఁ బునాది పూర్వమునుండియుఁ గలదని పాఠకులు దెలిసికొనగలరు.

## ని యో గ ము

పైకథ కాల్పనికమైనను గాకున్నను హిందుస్థానమందు భారతీయులైన ఆర్యులలో నియోగరీతి ప్రాచీనకాలమున నుండి యుండుననుట మాత్రము నిర్వివాదము తన పతినివిడిచి స్త్రీ యథేచ్ఛముగా నేపురుషులనైన వివాహమాడవచ్చును; అను సంగతి యే సమాజమందును బ్రకటముగాఁ జెల్లుబడి కాఁజాలదు; కాని ప్రాచీన కాలమందనేక సమాజముల యందు, పతియొక్క యాజ్ఞ చేతఁ గాని పతి తరువాతఁగానిపుత్ర ప్రాప్తికిగాని, స్త్రీ యన్యపురుషునితో సంగ

మింపవచ్చునను నియోగరీతి యుండెను. బైబిలు గ్రంథమునుబట్టి జ్యూ ప్రజలయందును నిట్టి యాచరణ ముండెనని ప్రకటమగుచున్నది. ప్రతి సమాజము నందును మృత వ్యక్తికై, పుత్రునుత్పాదించు నావశ్యకత ప్రాచీనకాలమందెక్కువగా నుండెడిది. సమాజము యొక్క బలము మనుష్యసంఖ్య మీఁద నాధారపడి యుండెను. ఇందుచేతఁ బ్రాచీనకాలమందు, బుత్రునికి గౌరవము కూడ నధికముగా నుండెను. ఈ నిమిత్తముగాఁ గూడ నియోగ పద్ధతియుత్తరోత్తరాభివృద్ధి యొంది యుండును. ఇంకఁ గూడ దన యింటనే కుటుంబములోని పురుషునిచేత సంతతి నుత్పాదించు నిచ్ఛ స్థిరమై యుండుటస్వాభావికమై యున్నది. ఇందుచేత, నియోగమందుఁ దఱచుఁ దనకుటుంబములోని పురుషుని యొద్దకే పోవుటకై స్త్రీలకాజ్ఞ యుండెను. అది కూడఁ బుత్రప్రాప్తి కానంతవఱకే. ఇదిగాక నియోగమున కనుమతి, పతి యే కారణముచేతనైన నసమర్థుఁడైనపుడు, లేక చనిపోయినపుడు మఱియు నతనికిఁ బుత్రుఁడు లేనపుడు మాత్రమే లభించుచుండెడి. కుటుంబ పురుషునిచేత, పతియొక్క సోదరునిచేత లేక సమ్మానితుఁడైన ఋషిచేత సంతతి నుత్పాదించు నియమమున్న కారణమున సంతానము హీనసత్త్వమగునని హీనవర్ణమగునని కాని శంక లేకుండెను. ఈ నియోగపు మార్గముననే ధృతరాష్ట్రుఁడును పాండురాజు నుత్పన్నులైన కథ మహాభారతమందుఁ గలదు; పాండురాజునకుఁ గూడ నిట్టి నియోగ మార్గముననే ధర్మభీమాది పుత్రులు నుత్పన్నులైనట్లు మహాభారతములో వర్ణనమున్నది. అప్పటి యితిహాసము మీఁదను నితరులైన ప్రాచీనులయి తిహాసము ను విచారింపఁగా నీ కథలు సంభావనీయములుగాఁ దోపకమానవు.మఱియు నతిప్రాచీనకాలమందునియోగాచారమార్య ప్రజలయందుండెనని నమ్ముటకు గూడ నాటంకమేదియును లేదు,

ఈ యాచారము శీఘ్రముగనే బంధైకట్టు విడిపోయి యుండును.సమాజము పెరుగఁగాఁ బెరుగఁగాఁ భిన్నభిన్న దేహముల యందును మనుష్య సంఖ్య చాలినంతయైన కొలఁది, వైవాహికములైన యుచ్చ కల్పనకై బాధా స్వరూపమైన యీ నియోగచారమునుగేవలము పుత్రప్రాప్తికిఁగానువ్యాప్తిలో నుంచుట యనువితముగా నూహింపఁబడియుండును. ఈ యనియోగరీతిచేత మనుష్య బలమును వృద్ధిచేయు నిచ్ఛ మెల్లమెల్లగా సమాజమునుండి తిరో

హితమై యుండును. భారతీయార్యుల యందు స్త్రీల పాతివ్రత్యము విషయమై యుత్పన్నమైన యత్యంత గౌరవము చేతఁ బ్రాచీనమైన యానియోగ రీతి నింద్యముగాను గర్హణీయమగును దోఁచ నారంభించి యుండును ఈ కారణముగా నయ్యది రానురాను గట్టువడిపోయెను. మహాభారత సమయమున దానికిఁ జలనము బొత్తిగా లేకుండెను. మనుస్మృతియందు నియోగము శాస్త్ర సిద్ధమా కాదా యను విషయమై పెద్ద వాదవివాదములున్నవి. చివరికి ననేక ఋషులు మతముఁ బట్టి నియోగము దోషయుక్తమును నింద్యమునని నిర్ణయము చేయఁబడి యున్నది. అనఁగా మనుస్మృతి మహాభారతముల సమయమున నియోగము యొక్క వ్యవహారము లేనేలేకుండెను. ఇచ్చట ప్రాచీనకాలమందు నియోగము ప్రచలితమై యున్నపుడు గూడ దాని కనేక బంధము లుండెనను సంగతియు ధ్యానింపఁదగియున్నది. పుత్రుఁడు లేనపుడే నియోగమున కనుమతి దొరకుచున్నది. అదికూడఁ బుత్రప్రాప్తినే పతియొక్క లేక కుటుంబుల యొక్క యాజ్ఞచేతనే రాశాంశ మేమనఁగా నియోగమునకై యే సమయము నందును ననియంత్రితమైన సంబంధము యొక్క స్వరూపము ప్రాప్తము కాకుండెను. ఈ సంగతి ధ్యానింపఁదగియున్నది.

నియోగాచారము బహు ప్రాచీన కాలమందే యాటంకపడి యుండును ఎందుచేతననఁగా, భారతీయార్యులయొక యునార్య స్త్రీలయొక్కయుఁ బాతివ్రత్యవిషయమైన కల్పన, చాల మునుపు, ఉచ్చస్థితికిఁ బోయి యుండెను. మహాభారతమందున్న యనేకమైన యుదాహరణములఁబట్టియుఁ గథానథాకములఁ బట్టియు నార్య స్త్రీల ప్రాతివ్రత్యము విషయమై మన మనస్సు మీఁద నాచారము యొక్క యద్భుత ముద్ర పడియున్నది. ఇట్టి, భారతీయార్య స్త్రీల యుదార చరిత్రమే జాతివారి యందును గాంచఁ జాలము "స్త్రీణామార్య స్వభావానాం పతిరేకోహి దైవతం" అప్పటి యార్య స్త్రీల వర్ణనముఁ బట్టి ఆర్య స్త్రీలకొక మాత్రమగు దేవత పతియే అను ధృఢ నిశ్చయము స్పష్టముగా నగపడుచున్నది. ఈ విషయమున సావిత్ర్యాఖ్యానము మనయెదుటఁ బాతివ్రత్య ధర్మముయొక్క యత్యుదాత్తము, మూర్తిమంతము, సుందరమునైన చిత్రమో యన్నట్లు మహాభారత మందు సన్నద్ధము చేయఁబడి యున్నది. ఎడతెగకుండ వేలకొలఁది సంవ

త్వములనుండి హిందు స్త్రీల యంతః కరణము మీఁదను దాని పూర్ణ పరిణామము అయి యున్నది. ద్రౌపది, సీత, దమయంతి మొదలైన యనేక పతివ్రతల సుందర చరిత్రము, వేలకొలది వత్సరములనుండి మన హిందూ స్త్రీల (దృష్టుల ధ్యానముల) లో-- మహాభారతము యొక్క కృపవలన దిరుగుచున్నవి. ఇందుచేతఁ బాతివ్రత్యము హిందూ స్త్రీలకు వర్ణింపరాని యలంకారమువలె నున్నది. హిందూ సమాజమునకు మహాభారతము చేసియున్న యనేకోపకారముల కంటెఁ బాతివ్రత్యము యొక్క వర్ణనము చాల సుందరమై యున్నది. స్త్రీల పాతివ్రత్యము యొక్క యే యత్యుదాత్త స్వరూపము--ఈ గ్రంథమందు-- వర్ణింపఁ బడి యున్నదో యదియొక గొప్ప యుపకారమై యున్నది, దీనిని హిందూ సమాజ మెప్పటికిని మఱువఁజాలదు.

## పునర్వివాహము నశాటంకము

పాతిప్రత్యముయొక్క యుచ్చ కల్పనచేత యార్యుల ప్రజల నుండి నియోగాచార మొకటియే తొలఁగి పోవలేదు, పునర్వివాహ పద్ధతి కూడ నీ కారణము చేతనే యార్యులయందు-- త్రైవర్ణికులయందు-- కట్టువడిపోయెను. భారతీయార్యులయందుఁ బ్రాచీన కాలమునుండియుఁ బునర్వివాహము యొక్క వ్యవహారము కట్టువడి యున్నది. ప్రపంచమునందు ననేక జాతులమధ్యఁ గేవలము రెండు జాతుల నడుమనే-హిందూస్థాన భారతీయార్యుల యందును బశ్చిమమున జర్మనుల యొక శాఖయందును-- పునర్వివాహము యొక్క మార్గము ఆగిపోయి యున్నదని యితిహాసము వల్లఁ దెలియఁగలదు. రోమన్ ఇతిహాస కారుడు టేసిటస్సు జర్మనులను వర్ణించుచు వ్రాయుచున్నాఁడు--"కొందఱు జర్మను స్త్రీలు యావజ్జీవము నొక్కపతినే తనవానిగాఁ జేసికొనుచున్నారు. అతనిని దమ జీవన సుఖమనెడి సర్వస్వమునకు నిధిగాఁ దలఁచి యతనిని మిగులఁ బ్రేమించుచున్నారు." దీనిఁ బట్టి, పాతివ్రత్యము యొక్క యుదాత్త కల్పనచేత నీ ప్రణాళిక. భారతీయార్యుల యందువలెఁ బ్రాచీన శర్మణ్యశాఖయందును బ్రచలితమై యుండెను. యూనాని యితిహాస లేఖ

కుల వర్ణనముఁ బట్టియు భారతీయార్యులయందుఁ బునర్వివాహ నిషేధము బహుప్రాచీన కాలమునుండి మహాభారత సమయము వఱకు నుండి యుండునని తెలియుచున్నది. సికందరు తోడి యితిహాస కారులు, పంజాబులోని యార్యులలోఁ బునర్వివాహ పద్ధతి లేదని వ్రాయుచున్నారు. స్త్రీలు తమ భర్తలకు విషముఁ బెట్టి మఱియొకరి వారై కాకుండుటకు గాను వీరి పద్ధతిని నడపింప లేదనియు చెప్పుచున్నారు. ఈ విచిత్ర కారణము పైఁ గొంచెమైనను విశ్వాసం చేయఁబడఁజాల దనుటలో సందేహము లేదు. మహాభారతముతో నొక కథయందు దీనినిషేధము యొక్క యావిర్భావము కలదు. ఆ కథ యిట్లున్నది— దీర్ఘతముఁ డను ఋషి యంధుఁడై యుండెను. అతని స్త్రీ పేరు ప్రద్వేషి, ఆమె, ఋషులను ఋషి కుమారులను గాలించుఁ గాలించుచు, విసిగి, అతని విడిచి పోవుట కుద్యుక్తురాలియ్యెను. అపుడు ఋషి, జన్మమంతయు స్త్రీకొకడే పతియుండుఁ గాక నని యిట్టి మర్యాదను నేఁటి నుండియు నేర్పరచుచున్నా నని పలికెను. పతి బ్రతికి యున్నను లేకున్నను సరియే, స్త్రీ మఱియొక భర్తను జేసికొనఁ జాలదు. అది మఱియొకని బతిగాఁ జేసికొన్నచోఁ బతితురాలగును.

ఏక ఏవపతిర్నార్యా యావజ్జీవ పరాయణం।
మృతే జీవతి వాతస్మిన్ నాపరం ప్రాప్నుయాన్నరం॥
(ఆదిపర్వ. అ. 114)

ఈ కథకుఁ దాత్పర్యము చాలవఱకుఁ బైని వ్రాయఁబడి యున్నట్లే యున్నది. దీర్ఘతముఋషి యేర్పరచిన, యీ పునర్వివాహ బంధనము భారతీయార్యులలోఁ దొందరగా వ్యాపింపఁ గలిగెను. ఎందు చేత? దీర్ఘతమునికిఁ దోచిన యిబ్బంది సమాజమున కంతకును సమానముగా నుపయుక్తమై యున్నది. కాని వేలకొలఁది యితర సమాజములయందు నీ బంధనము ప్రచారములోనికి రాలేదు. మన యభిప్రాయ మేమనఁగా భారత స్త్రీల యంతఃకరణమందు దృఢపడి యున్న. పాతివ్రత్యము యొక్క యుదాత్తకల్పన చేత దీర్ఘతముఁడు చేసిన నియ

మము భారతీయార్యులయందు ఉత్తరోత్తరాభివృద్ధి నొందెను. దీర్ఘతముఁడు వైదిక ఋషి యై యున్నాఁడు. కనుక నీ బంధనముకూడఁ జాల ప్రాచీనమై యుండును.

ఈ బంధనము ప్రాచీనకాలము నుండియు నుండెనేని. పతివ్రతా శిరోమణియైన దమయంతి రెండవ వివాహముఁ జేసికొనుటకై యెందులకుఁ దయారై యుండెను? అని దీనిపై నిపుడు ప్రశ్న ము కలుగుచున్నది. ఆర్యులయందు అనఁగా బ్రహ్మ క్షత్రియ వైశ్యులయందుఁ బునర్వివాహము ప్రాచీన కాలమందు నిషిద్ధమై యుండెనేని, మఱల దమయంతి ద్వితీయ స్వయంవరమునకై యెట్లుద్యుక్తురాలైనది; లేక తండ్రియే యామె కేవిధముగా నాజ్ఞ యిచ్చెనో. రాజలోకము కూడ నామె ద్వితీయ స్వయంవరమునకై యెందులకుఁ బ్రోగైరి? ఈ ప్రశ్నముల కుత్తరము కొంచెము కఠినమై యున్నది. ఆ సమయమున హిందూస్థానమందుఁ బునర్వివాహము బొత్తిగనే కట్టు వడిపోయి యుండదు. త్రైవర్ణ్యమును విడిచి యన్యవర్ణముల యందు విశేషించి శూద్రుల యందు దానియొక్క వ్యవహారము ఉండియే యుండును. శూద్రులు నితరులునను కారణముచేచే గౌండదార్యస్త్రీలు స్వచ్ఛందముగా వ్యవహరించి పునర్వివాహమునకై సన్నద్ధలగుచుండియుందురు. కాని యార్యులయందుఁ గ్వాచిత్కముగా జరుగుచున్న యిట్టి పునర్వివాహములు లోకప్రశస్తములు లేక జాతి మాన్యములై గాకుండియుండును. నలునితో దమయంతి కలిసికొన్నపుడు నలుఁడు కంట నీళ్ళుఁ దెచ్చుకొని యీ ప్రశ్నమునే చేసెను.

> కథం తు నారీ భర్తార మనురక్త మనువ్రతం ।
> ఉత్సృజ్య వరయే దన్యం యథా త్వం భీరు కర్హిచిత్ ॥
> దూతాశ్చరంతి పృథివీం కృత్స్నాం నృపతి శాసనాత్ ।
> భైమీ కిల స్మ భర్తారం ద్వితీయం వరయిష్యతిః ॥
> స్వైర వృత్తా యథా కామ మనురూపమివాత్మనః ॥ (వన. అ. 76)

"భర్తకు సహధర్మచారిణియై యున్న యే స్త్రీయైనను రెండవ పురుషుని వివాహమాడునా? నీదూతలు పృథివి యంతటను, స్వతంత్రముగా వ్యవహరించు దమయంతి తన కమరూపుఁడైన రెండవభర్తనుజేసికొనుననిచెప్పుచు దిరుగుచున్నారు." ఈ వాక్యమందుఁ స్వతంత్రముగా వ్యవహరించు అను నీ శబ్దములు మహత్త్వము కలవియై యున్నవి. ఇందు, రెండవ పతిని జేసికొనుట స్వచ్ఛందముగా వ్యవహరించుట యని స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది. దీనికి దమయంతి యిచ్చిన యుత్తరమందుఁ గూడ నీభావమే వ్యక్తమగుచున్నది. "నిన్నిచటికిఁ బిలుచుటకై నేనీ యుక్తి నుపయోగపఱచితిని. ఎందుచేత? ఏ యితర మనుష్యుఁడును, ఒక దినములో, నూఱుయోజనములు బోఁజాలఁడు. నేను మనస్సులోనే ఛెడ్డపని గూడ నూహింపలేదనినీచరణముల తోడుగాఁ జెప్పుచున్నాను. నేను బాపముఁ జేయుచున్న యెడల నీవాయువు నా ప్రాణముల నశింపఁజేయుఁగాక." అభిప్రాయ మేమనఁగా దమయంతి పునర్వివాహమును జేసికొనునేని యది పాపము స్వచ్ఛంద వ్యవహారముఁ గూడనగును. అనఁగా అ సమయమున ఆర్యక్షత్రియ స్త్రీలకుఁ బునర్వివాహము లేకుండెను. మఱియు దమయంతికిఁ బిల్లలుఁ గూడఁ గలిగి యుండిరి. ఆమె పునర్వివాహముఁ జేసికొనునేని తన జాతి కంటెఁ దక్కువ తరగతి జాతిదియై పోవును. ద్యూతసమయమున ద్రౌపదికి దాసీ భావము ప్రాప్తమైనపుడు దుర్యోధనుఁ డిట్లే యనెను; ఓ ద్రౌపదీ యిపుడు నీవు మఱియొక పతిని గైకొమ్ము. అనఁగా ఈ రీతి నింద్యమును దాసీలకే తగినది యునై విశ్వసింపఁబడుచుండెడిది. భారతీయార్యులందఱ యందుఁ గూడఁ బునర్వివాహము లేకుండెను. పతి బ్రతికియుండియు విడిచిపెట్టినను లేక చనిపోయియున్నను ఆర్యస్త్రీలు మఱియొక పతిని గైకొనకుండిరి.

పునర్వివాహ నిషేధమునకు మఱియొక కారణము కూడ నున్నది. భారతీయార్యులయందు వివాహ విషయమై, వివాహ సమయమున వధువు కన్య అనఁగా అనుపభుక్త కావలయునని యొక నియమమున్నది. వారు ఉపభుక్తయైన స్త్రీని వివాహమునకు అయోగ్యనుగాఁ దలంపకుండిరి. మహాభారతములో నొకచోట భుక్త పూర్వయైన స్త్రీని వివాహమాడుట పాతకమని స్పష్టముగా జెప్పఁబడియున్నది. అర్జునుఁడు, నేను రేపు సాయంకాలము వఱకు

జయద్రథుని వధింపని యెడలఁ జితిలోఁబడి చత్తునని ప్రతిజ్ఞ చేసిన వర్ణన మున్నది. ఆ ప్రతిజ్ఞా సమయమున నతఁడు పెట్టుకొన్న యనేకమైనయొట్టులలో ఒక యొట్టు ఇది కూడనై యున్నది. "భుక్త పూర్వాం స్త్రియం యేచ విందదా మద్య శాంతినాం." భుక్త పూర్వ యగు స్త్రీని వివాహమాడిన పురుష లకు వచ్చు లోకములు నాకుఁ బ్రాప్తించుఁగాక. అనఁగా మహాభారతసమయ మున పురుషునితో సహవాసము చేసిన స్త్రీ వివాహమున కయోగ్యురాలను నిశ్చయము లోకుల కుండెను. దానిని వివాహమాడిన పాపాత్ముఁడు దుష్ట లోకములకుఁబోవుననియు నిశ్చయములోకులకుండెను. వివాహితయగు స్త్రీని పునర్వివాహమాడుట యీ సమయమున నింద్యముగానూహింపఁబడుచుండెను మహాభారత కాలమునకుఁ బిమ్మట గూడ స్మృతి శాస్త్రములలో నేఁటి వఱకు నిట్టి నియమమే యున్నది. వివాహమైనను ననుపభుక్తయైన కన్యకు ఆ సమ యమునఁ బునర్వివాహమగుచుండెనా లేదా? యనెడు నొక ప్రశ్న మిచ్చుటఁ గలుగుచున్నది. దీని విచారము ముందు చేయఁబడును. సాధారణముగా నం దఱు క్షత్రియుల యందును మఱియుఁ దనవర్ణము నభిమానించుకొను లోకుల యందును. పురుషోపభుక్తయైన స్త్రీ వివాహమునకు యోగ్యురాలు కాదని కల్పన కలుగుట స్వాభావికమై యున్నది. వివాహము యొక్క పారిశుధ్యము విషయమై చాల నధికమైన పరీక్షయై యుండుననుట ప్రకటమై యున్నది. కనుకనే, భారతీయార్యుల యందు ఉపభుక్త స్త్రీ వివాహ సంబంధమునకు దూషితగా విశ్వసింపఁబడు చుండెననుటలో నాశ్చర్యములేదు. ఈ దృఢ నిశ్చ యము చేతనే మన ధర్మశాస్త్రము వివాహమునకు యోగ్యురాలు కన్యకయే యని యొక విధముగా నిశ్చయించెను. గృహ్యసూత్రమందుఁ గన్య విష యముననే వచనములున్నవి. మఱియు మహాభారతమందుఁ గూడ నెచ్చటను గత భర్తృకయైన స్త్రీకిఁ బునర్వివాహపద్ధతి ప్రశస్తము కాకుండెను, వివాహ మందు వధువు అనుపభుక్త కావలయునను నియమముండెను.

## ప్రౌఢా వివాహము

ఇంక మీఁదట, మహాభారత సమయమునఁ బిల్లలకు వివాహము చిన్న తనమందే యగుచుండి యుండునను సంగతి చెప్పఁబడఁగలదు. కాని నిజ

మైన సంగతి దీనికి విపరీతమై యున్నది. మహాభారతములో వివాహ విషయమున గనఁబడుచున్న వర్ణనములన్నింటి యందును వివాహసమయమునఁ గన్యలు వరుని దగ్గఱకు అనఁగా ప్రౌఢ దశయందు వచ్చియున్నారు. స్వయంవర సమయమున ద్రౌపది యొక్క వర్ణనమునుబట్టి, ఆ సమయమున, ఆమె పెద్దదియై యుండుట స్పష్టమైయున్నది. కుంతికైతే, వివాహమునకుఁ బూర్వమే, పిల్లవాఁడు కలిగి యుండెను. అర్జునుఁడు సుభద్ర నపహరించిన సమయమునకు నామె పూర్ణావస్థలో నుండెను. ఉత్తర వర్ణనము కూడ నిట్లే యున్నది. వేయి చెప్పనేల, వివాహమైన తరువాత నొకటి రెండు నెలల లోపుగనే యామెకు గర్భ మయ్యెను. మఱి ఆరేడు నెలలకే భారతీయ యుద్ధము సమాప్తమైన పిమ్మట ఆమెకుఁ బరీక్షిత్తు కలిగెను. ఇతఁడభిమన్యుని కొమారుఁడై యుండెను. ఇట్టి యనేక స్త్రీల వర్ణనముఁ బట్టి, ప్రాచీన కాలముల, వివాహ సమయమునకు, స్త్రీలు వయస్సు వచ్చిన వారగుచుండిరని స్పష్టముగా నగపడుచున్నది. ఈ సిద్ధాంతము ఒక సంగతి వలన నింకను స్థిరమగుచున్నది. ఆ సమయమున వివాహ దినమందే పతిపత్నులకు సమాగమ మయ్యేడి పరిపాటి యుండెననుట నిర్వివాదమై యున్నది. ద్రౌపదీ వివాహ వర్ణమందుఁ ద్రౌపదికి ప్రతిభర్తతోడను వేర్వేఱు దినములందు వివాహమయ్యెనని యొక చమత్కారము చెప్పియున్నాఁడు. అప్పటి విచిత్రతత్వ మేమనఁగా మహానుభావయగు ద్రౌపది ప్రతిదినమందును అవివాహితయే యగుచుండెను అనఁగా మొదటినాఁడు యుధిష్ఠిరుడు ద్రౌపదిని వివాహ మయ్యెను; అప్పుడా రాత్రి వారికి సమాగమ మయ్యెను; అయినప్పటికి నామె మఱుచటినాఁడు అవివాహితగా నుండెను. ఈ సంగతి యెప్పటి రీతి ననుసరించి యున్నది. మఱునాఁడు మఱియొక పాండవునితో నామెకు వివాహము జరిగెను. ఆ సమయమున వివాహ ధర్మశాస్త్రము ననుసరించి వధువు కన్యఅనఁగా అనుపభుక్త కావలయును. ఆమె యిట్లే యుండెను కూడ ఇదే చమత్కారమైయున్నది. ధర్మశాస్త్రమందుఁ జాలచోట్లలను వివాహ దినముననే పతిపత్నులకు సమాగమము కావలయునని యాజ్ఞయున్నది. ఆ రాత్రి కాని యెడల మూడవరాత్రిగాని పండ్రెండవ రాత్రిగాని చేయవలయునని మఱి రెండు పక్షములున్నవి. తాత్పర్యమేమనఁగా వివాహదినమున సమాగమమగు రీతియుండెను ఇందుకై ధర్మశాస్త్రము యొక్క యాజ్ఞ కూడనున్నది. అట్టిచో వివాహసమయమునకు

వధువు యొక్క యవస్థ ప్రౌఢమై యుండవలయును. మహాభారత సమయమున ప్రౌఢస్త్రీలకే వివాహము గుట విషయమై పైని వ్రాయఁబడిన ప్రమాణముఁ బట్టి యనుమానము బయలుదేరుచున్నట్లే యితరములైన యైతిహాసిక ప్రమాణములఁ బట్టియు నదియే యగపడుచున్నది. గ్రీసువారు అలెగ్జాండ్రూనాఁటి హిందుస్థానము యొక్క వ్రాసియుంచిన వర్ణనముఁ బట్టియు నీసంగతియె సిద్ధమగుచున్నది. మహాభారత కాలమునకుఁ బిమ్మట అనఁగా క్రీ.పూ 250 ఏండ్ల తరువాత నుండి క్రీస్తునకు సంబంధించి 800 ఏండ్ల వఱకుఁ బ్రస్తుతము దొరకుచున్న యనేక సంస్కృత గ్రంథముల యందుఁగూడఁ బ్రౌఢావస్థ గల యువివాహితల వివాహములే వర్ణింపఁబడియున్నది. పతిపత్నీ సమాగమ వర్ణనములు గూడ వివాహదినపువియే వారి యందుఁ గనబడుచున్నవి. హర్ష చరిత్రమందు బాణుఁడు హర్షునితోఁ బుట్టువు యొక్క వివాహవర్ణనమును విస్తరించి హృదయంగమముగా వర్ణించియున్నాఁడు అందుఁ బెండ్లికొడుకు రాత్రి చాల సామానుతో వధువు యొక్క తండ్రి యింటికి వచ్చెను. అచ్చట సింహద్వారము నొద్ద స్వాగతమైన తరువాత మధుపర్కము చేత సతనిపూజ జరిగెను. వివాహమునకు సరియైన గడియరాగానే యంతఃపురమందుఁ బతిపత్నులకు వివాహము జరిగెను. పిదప నగ్ని సమక్షమున సప్తపది జరిగెను. అంత భోజనాదికమైన పిమ్మట, విశేషమై భవనమున నలంకరింపఁబడిన భవనమందు, పతిపత్నుల సమాగమ మయ్యెను. బాణుఁడిట్లే వర్ణించియున్నాఁడు. సారాంశ మేమఁగా ద్రౌపది వివాహము మొదలుకొనిహర్షసోదరియైన రాజ్యశ్రీ యొక్క వివాహము వఱకుఁ బ్రసిద్ధమైన వర్ణనములలో వివాహ సమయమునకు వధువు ప్రౌఢయై యున్నట్లును వివాహనాఁటి రాత్రియే పతిపత్నుల సమాగమ మున్నట్లును జెప్పఁబడి యున్నది. దీనిఁబట్టి వివాహము చేయఁబడు స్త్రీ యనుపభుక్తగా మాత్రమే యుండఁజాలదని యప్పటినియమ మగపడుచున్నది.

ఈ వర్ణనములన్నియు క్షత్రియ స్త్రీలవనియు మహాభారత సమయమున క్షత్రియ బాలికలు వివాహ కాలమునకుఁ బౌఢలై యున్నట్లే ప్రస్తుతము కూడనున్నారని ప్రశ్నమిపుడు కలుగుచున్నది. ఇందాశ్చర్యమేమున్నది, స్వయంవరము లేక గంధర్వ వివాహము చేసికొను స్వాతంత్ర్యమున్న స్త్రీలు

మాత్రము వివాహ మందుఁ బెద్దవారై యుందురు. కాని బ్రాహ్మవివాహము మాటయు బ్రాహ్మణుల మాటయుభిన్నమైయున్న. వి బ్రాహ్మణ స్త్రీల వ్యవస్థ వివాహసమయమున కెంత యగుచుండెడిదో యిపుడు చూడవలసియున్నది. ఈ విషయమున మహాభారతముయొక్క సాక్ష్యమేమియై యున్నది. ఈ దృష్టితో విచారించిన యెడల బ్రాహ్మణ బాలికలకై, క్షత్రియుల కంటె, కొంచె మైనను భిన్ననియనుము లగపడవు. అధికమెందులకు క్షత్రియ బాలికలు బ్రాహ్మణుల యిండ్లను వివాహము చేయఁబడుచుండిరి. మఱియుఁ గొన్ని చోట్ల బ్రాహణబాలికలు క్షత్రియుల యిండ్లపెండ్లిచే యఁబడుచుండిరి. ఇట్టి పరి స్థితిలో రెండువర్ణముల బాలికలును వయస్సున సరిగానే యుండుచుండిరి. చూడఁగా మహాభారతమందు బ్రాహ్మణ కన్యల వివాహ వర్ణనములు స్వల్ప ముగాఁ గలవు. అయినను ఉన్నవి యన్నియు మాత్రము పేరునఁ బడిన యనుమానమునకే పుష్టిని జేయుచున్నట్లు దొరకుచున్నవి. శుక్రకన్యయైన దేవయాని యొక్క యుదాహరణము ప్రసిద్ధమైయున్నది. వివాహమునాఁటి కామె వయసు బెద్దదియై యుండెనని చెప్పవలసిన యవసరములేదు. శల్య పర్వములో ౫౨వ యధ్యాయ మందు నొక వృద్ధ కన్యయొక్క వర్ణనమున్నది ఒక బ్రాహ్మణ బాలిక యవివాహితగనే యుంది. తపస్సు చేయుచుండెడిది. ముదిమివచ్చు వఱకు ఆ వృద్ధ కన్య వివాహము చేసికొనకుండెను. తుదకు నారదుని యుపదేశమును బట్టి యామె ముసలితనమందు వివాహమాడెను. బ్రాహ్మణ కన్యలు వివాహమునకు యోగ్యమగు వ్యవస్థ యున్న వింకను గొన్ని వర్ణనములు దొరకఁగలవు. ఆదిపర్వమున బకాసురుని కథ కలదు. అచట పాండవులే బ్రాహ్మణుని యింటి వంతు రాఁగా నతని కుమార్తె రాక్షసునహార మగుటకై తయారయ్యెను. ఆ సమయమున బ్రాహ్మణుఁడు తన కుమార్తెతో జెప్పెను.

బాలా మప్రాప్త వయసమ జాతవ్యంజనాకృతిం।
భర్తురర్థాయ నిక్షిప్తాం న్యాసం ధాత్రా మహాత్మనా॥

ఈ ప్రకారమామెను వర్ణించి బ్రాహ్మణుఁడు తన కూతురును రాక్షసుని భక్ష్యమగుటకై వెళ్ళనివ్వలేదు. పిల్ల, తరుణావస్థకు రాలేదు. అతను కూతురు

వివాహితయై యుండెను. పూర్ణవయసు రాగానే యాపెను భర్తకు వశము చేయవలసి యుండెను. అదికూడ, తారుణ్య లక్షణములు శరీరమున వ్యక్తములు కానారంభించిన యపుడే. ఈ శ్లోకముఁ బట్టి యిదే తెలియుచున్నదె. బ్రాహ్మణ బాలికలు దూడ, మహాభారత కాలమందు వరులకు యోగ్యలైన తరువాతనే వివాహము చేయఁబడుచుండిరి. బాలికలు పెద్దవయసున వివాహమాడబడుచున్నపుడు బాలురు వివాహము పెద్దవయసుననే కావలయును. బాలుర కువనయసమై వారి శిక్ష సమాప్తమైపోయిన తరువాతనే వివాహము చేయు పద్ధతి యుండెను. అట్టిచో, బాలకుల వివాహము పెద్దవయసున, ఆ కారునకు నిరువది యొకటవయేడు తరువాతను అగుచుండి యుండుననుట నిర్వివాదమేయై యున్నది.

స్మృతిశాస్త్ర మందు వయసు విషయమై స్పష్టముగా నుల్లేఖింపఁబడి యున్న వచనముఁ బట్టి బాలికా వివాహ విషయమున విభిన్న పరిస్థితి మహాభారత కాలమునకుఁ బిమ్మట నుత్పన్నమయ్యెనని యనుమానము కలుగుచున్నది. మహాభారత సమయమున బాలికలకు [illegible]హము వారి వయసు ప్రౌఢమై యున్నపుడే యగుచుండెను. పిదపఁ గొన్ని శతాబ్దుల తరువాత బాలికల వివాహావస్థ తక్కువైపోయెను, దీని యొక్క యితిహాసము లేక యుపపత్తి యిచట నీయఁబడునేని విషయాంతరమై [illegible]వును. అయినను స్మృతుల యందు వివాహ సంబంధమునున్న వచనముల వంటి వచనములు మహాభారతములో నెందుకున్నవి ? దీని భేదము తీయవలయును.

త్రింశ ద్వర్షో వహేత్కన్యాం హృద్యాం ద్వాదశ వార్షికీం॥

ఈ మనుస్మృతి వచనము ప్రసిద్ధమై యున్నది. "ముప్పదియేండ్ల వయసుగల పురుషుఁడు హృదయానంద దాయినియగువం[్రె]డెండేండ్ల బాలికను వివాహమాడవలయును" పూర్వకాలమందు ఈ శ్లోకమునకు మహాభారత పాఠము "హృద్యాం షోడశ వార్షికీం" అని యుండెను. కొన్ని నిబంధగ్రంథములలో మహాభారతముయొక్క యీ వచనమే కనఁబడుచున్నది. [అనఁగా మహాభారత సమయమున బాలికా వివాహము పూర్వమైన ప్రౌఢావస్థ వచ్చినే

తరువాతనే యగుచుండెను. కాని యనుశాసనపర్వముయొక్క 44వయధ్యాయ మందున్న శ్లోకములలో బొత్తిగనే భిన్నమైన రూపము కనఁబడుచున్నది. మఱియు నీ రూపాంతరమందు మనువుచే నిర్దేశింపఁబడియున్న యాయుర్మర్యాదకంటెఁగూడఁ దక్కువ మర్యాద కనఁబడుచున్నది. అ పా మిదియై యున్నది. "త్రింశద్వర్షో వహేత్కన్యాం నగ్నికాం దశవార్షికీం" అనువాదకులు దీనికి మామూలర్థమును జేసియున్నారు. పదియేండ్ల బాలికను వివాహమాడవలయును" ఈ పాఠము మనువుకంటెఁగూడ నిటీవలిదై యున్నది. మఱియు మూల పాఠమునకు మాఱుగా నిప్పటి పరిస్థితిలో నుత్పన్నమై యున్నది. ఈ యనుమానము నిశ్చయింపఁబడుటకుఁదగియున్నది. నిబంధకారులు మహాభారతములోని యే పాఠమును "హృద్యాంషోడశవార్షికీం" అని గ్రహించి యున్నారో, నదియే మూలపాఠమై యుండును. ఎందుచేతః మనుస్మృతిలోనున్న వచనముల కంటె మహాభారతమందున్న పరిస్థితులన్ని విషయములయందున్ను ప్రాచీనమై యున్నవి. దీని పరీక్ష మునుపు జరిగి యున్నది. వివాహ భేదము విషయమువఁగూడ నీ నియమమే కలదు. ముందీ విషయముగవఁడఁగలదు. ఇదిగాక మహాభారతములోని యొకవచనమిచట విచారింపఁదగియున్నది. వయస్థాంచ మహాప్రాజ్ఞ కన్యామారోఢుమర్హసి." వయస్థురాలు అనఁగా తారుణ్యముగల కన్యకను వివాహమాడుట యాయుష్కరమై యున్నది. అనుశాసన పర్వమందే యొకచోట నిది చెప్పఁబడియున్నది. ఈ వాక్యమందలి వయశ్శబ్దముమీఁదఁబాఠకులు మిగుల ధ్యానముంపవలయును. సంస్కృతమందు వయశ్శబ్దమునకర్థము తారుణ్యమై యున్నది. సామాన్య వయస్సుయొక్క యర్థములో, వయశ్శబ్దమును ప్రయోగించుట లేదు. తాత్పర్యమేమనఁగా పేర్కొనఁబడిన వచనవచనమందు "వయస్థాం" శబ్దమునకర్థము సాధారణ రీతినిఁబట్టి వివాహ యోగ్యావస్థ కలదియనిచేయుట సరిగానుండును. ఈ యర్థమే చేయఁబడుసెడల దానివల్ల నేయభిప్రాయమును బయలుదేఱుచు చెప్పఁబడిన వచనమందు వయస్థ అనఁగా తారుణ్యావస్థను పొందిన కన్య వివాహమునకుత్తమమనియు నాయుష్కరియనియు నన్న సంగతి చెప్పఁబడియున్నది. ఎందుచేతః ఈ యధ్యాయమందునాయుష్కరములైన సంగతుల వర్ణనమే యున్నది. ఈవచనముయొక్క దృష్టినేతఁబయోక్త వచనమును జూడఁగాఁ నగ్నికాందశ వార్షికాం అన్న పాదము తరువాతిదిగాఁ

దెలియుచున్నది; "హృద్యాం షోడశ వార్షికీం" అను పాఠమే మొదటినుండి యుండును. మహాభారతములో అనేక వచనములంబట్టి, యీ పాఠమేపూర్వ సమయపుదియనియు, మఱియు బ్రాహ్మణ వర్ణమువారుగానిమ్ము క్షత్రియ వర్ణమువారుగాని మరే యితర వర్ణములవారుగానిమ్ము మహాభారత సమయమున స్త్రీలకు వివాహము ప్రౌఢావస్థయందే యగుచుండియుండుననియు మన కనుమానము జనించుచున్నది.

మహాభారత సమయమున, పూర్వ సమయమందువలె, స్త్రీ పురుషుల వివాహము ప్రౌఢావస్థయందే యగుచుండెను. బ్రహ్మచర్యముస్కు మర్యాద పంద్రెండేడ్లుగా విశ్వసింపఁబడునేని 21 ఏండ్ల లోపల వివాహము కాకుండెను 24 ఏండ్ల దిగా విశ్వసింపఁబడునేని ముప్పదియేండ్ల వయస్సువఱకు వివాహ వయస్సు పెరుగుచున్నది. స్త్రీల యవస్థామర్యాదచూడఁగాస్పష్టముగాచెప్పఁబడ లేదుఅయినప్పటికిని వివాహసమయమునవారుతరుణులునుపభోగ యోగ్యలును నగుచుండిరి. ఎందుచేత? వివాహ దినమందే అనఁగా మూఁడవనాఁడే పతి పత్ని సమాగమము కలుగు పద్ధతి యీ సమయమునఁబ్రచలితమైయుండెను * ఈ ప్రకారము పతియు పత్నియు సంపూర్ణావస్థయందుఁగుటుంబముఁజక్క బెట్టుకొననారంభించుచుండిరి. మఱియు వారికిఁ గలిగిన సంతానము శక్తిమంతమును దేజస్వియు నగుచుండెను. పతిపత్నులకు యోగ్యమైన అనఁగా తరుణమైన యవస్థ రాకమునుపు వారి సమాగమమును లేక వివాహమును లోకులు మంచిదృష్టితోఁ జూడకుండిరి. దానినుండి రక్షించుచుండిరికూడను. మహాభారతమందు వనపర్వములో, కలియుగమందుఁగాఁ బోవునట్టి భయంకర

---

* మహాభారత కాలమందు గర్భాదానము స్వతంత్ర సంస్కారమే కాకుండెను; మఱియు నయ్యది యాశ్వలాయన గృహ్యసూత్రముమందుఁగూడలేదు. అనేక శతాబ్దులు కడచిన తరువాత బాల్యవివాహ కాలమందు దానికి గృహ్య

విషయముల వర్ణనమున్నది. వానిలో దీనింగూడ భయంకరముగా నెంచి యున్నాడు. కలియుగ నిబంధమున, ఆ సమయమందే వివాహమయి స్త్రీ పురుషులకు సంతానము కలుగఁగలదని భవిష్యము చెప్పినాడు. అనఁగా ఇట్టి సమాగమమును వివాహమును లోకులు నింద్యములుగా నెంచుచుండిరి. వివాహ సమయమునకు బాలిక మిక్కిలి పెద్దదియగుచుండెను. ఈ సంగతికి నొక బలమైన ప్రత్యక్ష ప్రమాణము నీ శ్లోకములోఁ జూడుఁడు.

ప్రదాన కాంక్షిణీనాంచ కన్యానాం వయసిస్థితే।
శ్రుత్వాకథా స్తథాయుక్తాః సాశా కృశతరీ మయా॥

ఋషభుఁడను ద్విజుఁడు మిగులఁ గృశించి యుండెను ఎవరుతరుణులై యున్నారో మఱియుఁ దమ వివాహమునకు, అట్టి రీతిగల మాటలను జెప్పి యిచ్చించుచున్నారో ఆ కన్యకల యాశ నాకంటెఁగూడ నెన్నియోరెట్లు దుర్బలమై యున్నదని యాతఁడు చెప్పుచునాఁడు. దీనిఁబట్టి చాలమంది కుమారికలు, తరుణావస్థయైన తరువాతగూడ చాలకాలమువఱకు తండ్రి కన్యాదానము చేయలేకపోవుటవలన ఖిన్నలై పోవుచుండిరని ప్రకటనమగుచున్నది. వారి వివాహాశ యధికముగాఁ గృశించిపోవుచుండెను. ప్రస్తుతమిట్టియుదాహరణములు రాజపుత్రులను విడిచి (అక్కడక్కడ సంయుక్త ప్రాంతములఁగ న్యాకుబ్జులయందును) యితరత్ర దొరకవు. ఇట్టి పరిస్థితియందు గుమారికలు మార్గగాములై పోవుదురనెడి యీ శాక యెల్లపుడు నుండెను సంగతి యేమియు నసంభవమైనదికాదు. ధర్మశాస్త్రమునకును లోకుల మనుగడ, వివాహమందు వధువు నవస్థ తక్కువ కాఁగూడదనియుఁ దానితో పాటుగా నామె యనుపభుక్త కూడఁ గావలెననియు నీ విషయము మీఁద ధ్యానముండెను. ఇందుచేతనే కన్యాత్వమును భంగము చేయుట యనెడు పాతకము చాల నన్యాయమని విశ్వసింపఁ బడుచుండెను. మహాభారతమందు, తన కన్యాత్వమందుఁ గలంకమును దెచ్చుకొన్న దానికి బ్రహ్మహత్యలో మూఁడు పాళ్ళు పాతకమంటుననియు, మిగిన పాతకమును జెఱిపిన పురుషునికిఁ దగులుననియు వ్రాయఁబడినది.

త్రిభాగం బ్రహ్మహత్యాయాః కన్యా ప్రాప్నోతి దుష్యతీ।
యస్తు దూషయితా తస్యాః శేషం ప్రాప్నోతి పాప్మనః॥
(అను. వ. అ. 108)

మనుస్మృతియందుఁ గాన్యాత్వమును దూషించిన వానికి రాజదండము కూడ జెప్పఁ బడియున్నది, మఱి వాఁడు కన్యయొక్క యనుమతి చేతనే దోషియైనను సరియే. దీనిఁ బట్టి ప్రౌఢ బాలికల కన్యాత్వమును స్థిరముగా నుంచు విషయమున, ప్రాచీనకాల మందెంత ధ్యానముంపఁ బడు చుండెనో సులభముగనే తెలిసికొనఁ బడగలదు. ప్రస్తుతమున నైతే బాల్యమందే వివాహము చేసివేయు రీతి తఱచు సర్వత్రయై యున్నది; ఇందుచేతఁ బేర్కొనఁ బడిన, కన్యాత్వ దోషమునకు సంబంధించిన నియమములు విశేషించి తెలియుటయే లేదు మఱియు వర్తమాన పరిస్థితియందు లోకుల కానియమములు చూచినను విన్నను నొక విధమైన యాశ్చర్యము కలుగుచున్నది. సాధారణ రీతిని బాలికను దానము చేయు నధికారము తండ్రికే యుండెను. బాలిక యెంత ప్రౌఢయైనను సరియే. ప్రౌఢకన్యా వివాహమందుఁ దండ్రికొంత యాపత్తిని జేయునెడల దానికిఁ గూడ మహాభారత కాలమందు, స్మృతులలో జెప్పినట్లే ప్రతిక్రియ యుండెను. ఋతుకాలము వచ్చిన తరువాత, తండ్రి తాను దానము చేయునో చేయఁడో మూఁడేండ్ల వఱకుఁ బ్రతీక్షింపవలయుననియు, అప్పటికిఁ గూడ నతఁడీయఁడేని కన్యకు స్వంతముగా దానే వివాహమును జేసికొను నధికారమున్నదనియు నియమముండెను. అనుశాసన పర్వమందు స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు — మూఁడేండ్ల వఱకుఁ బ్రతీక్షించి తన వివాహమందు స్వయముగాఁ బ్రవృత్తురాలైన స్త్రీయొక్క సంతతికిని దాని వివాహమాడిన వానికిని గొంచెమైనను దోషము తగులదు; కాని యామె యీ నియమమునకు విపరీతముగా వ్యవహరించునేని యామెకుఁ బ్రత్యక్షముగాఁ బ్రజాపతి దోషము వచ్చును దీనిఁ బట్టి, ధర్మ శాస్త్రమునకును లోకులకును, బాలికను అవివాహితగా నుంపఁ గూడదను పట్టుదల యుండెనని తెలియుచున్నది. భారతీయార్య

సమాజమునకు శుద్ధత విషయమై యీ సంగతి మిగుల మహత్త్వము కలదై యున్నది. ప్రౌఢ కన్యలను వివాహితలుగా నుండనీయ కుండు టకై సమాజమునకుఁ పట్టుదల యుండుటచేత సమాజమున కంతకును నీతిని జక్కఁగా స్థిరముగా నుంచుటకై యీ నియమము కారణభూతమై యున్నది. పాశ్చాత్య సమాజమందిట్టి బంధన మెచ్చటను దృగ్గోచరము కాదు. మహాభారతమందలి యితర శ్లోకములను బట్టియు, భారతీయార్యుల భావన ననుసరించి ప్రతి స్త్రీకిని వివాహమైపోవుటయే యావశ్యకమై యుండెనని యనుమాన మగుచున్నది. పైని జెప్పఁ బడిన వచనముల యందు, వివాహము కాని స్త్రీకిఁ బరలోక ప్రాప్తి లేదని స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది.

అసంస్కృతాయాః కన్యాయాః కుతో లోకాస్తవానఘే ।

వివాహము చేసికొనక కేవలము తపస్సు చేసిన స్త్రీకి తపో మార్గ మునఁ గూడఁ బరలోక ప్రాప్తి కలుగదు, ఈ సిద్ధాంతము స్థిరమై యుండెను. ఈ వచనమునకు సులభ యొక్క కథతోఁ గొంచెము విరోధ మగపడుచున్నది. మునుపు వర్ణింపఁ బడిన చొప్పున, సులభపేరిటి క్షత్రియ సంన్యాసినిని జనకుని రాజ సభయందు మనము చూచి యుంటిమి. వివాహమునకుఁ దగిన భర్త దొరకమిచే నామె నైష్ఠిక బ్రహ్మచర్యము నాశ్రయించి యతి ధర్మముతో నుండు చుండెను. (శాంతి. అ. ౩౨౦) ఈ కథ పురాతన కాలపుదియై యుండును. ఇంతేకాక యీ దినములలో స్త్రీలకు సంన్యాస వ్రతమును గ్రహించుట కాజ్ఞ యుండెను; లేక సంన్యాస వ్రతము గైకొనకుండనే కేవలము తపము చేయుటకు వారికధికారము లేదని నిర్ణయింపఁ బడి యుండును. మహాభారత సమయమున సులభ గార్గివంటి బ్రహ్మవాదినులైన స్త్రీలు లేనే లేరని నమ్మినను నాపత్తి యేమియులేదు. మఱియునా సమయందు, స్త్రీలకై యాశ్రమము గూర్చిన వివాదమే లేకుండెను. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, సంన్యాసము, వానప్ర స్థము ఈ యాశ్రమముల స్థానమున స్త్రీలకు ముఖ్య సంస్కారము వివాహమే యై యున్నది. ఆ కాలమందీసిద్ధాంతమే స్థాపితమైపోయి యుండెను. ఇందు చేతనే సౌతి సమయమునఁ బ్రతి స్త్రీకిని వివాహమగుచుండెను.

ఇంతవఱకుఁ జేసిన వివేచనఁబట్టి పాఠకులు, ప్రాచీనకాలము మొదలుకొని మహాభారత కాలము పర్యంతము వివాహమునకు నుత్తరోత్తరోత్క్రాంతి యేప్రకారముగా నై యుండెనో మఱియు నే విధముగా దానికుఁ దత్స్వరూపము ప్రాప్తించెనో యీ విషయము యొక్క కల్పనను జేసికొనఁ గలరు. ఆ సమయమున సమాజమందుఁ గుటుంబ బంధన ముత్తమరీతిని వ్యవస్థితమై పోయి యుండెను. దాని శృంఖల యీ నియమములచేత బద్ధమై యుండెను;— స్త్రీల కందఱకును వివాహ మవశ్యము కావలయును; వివాహ సమయమునకు స్త్రీలు ప్రౌఢలు కావలయును; వారి కన్యాత్వ మేవిధముగను దూషితము కాక యుండవలయును. వివాహమునాఁటి రాత్రియే పతిపత్నులకు సమాగమము కావలయును. ఒకమాఱు పతితో సమాగమమైన తరువాతను స్త్రీ వానిదే యై యుండును. దానికి రెండవ పతి చేసికొనుట కధికారము లేదు, అనఁగా పతియొక్క జీవితావస్థయందు లేక యతఁడు చనిపోయిన తరువాత స్త్రీలకుఁ బునర్వివాహ నిషేధ ముండవలయును. సమాజమందుఁ బతిపత్నుల నడుమ నధిక ప్రేమము, సంసార సుఖము సంతోషముగా నెఱవేఱుచుండెను. ఇది గాకుండ పైని వ్రాయఁబడిన వర్ణనముఁ బట్టి, వర్తమానమున సమాజమందగపడుచున్న దుర్భర దుఃఖము లపుడు లేనే లేకుండెను. అనఁగా మహాభారత సమయమున బాలవైధవ్యదుఃఖము సమాజమునకుఁ దెలియకుండెను. ఇందుచేత నపుడు, అనుభుక్తయైన కన్య, వివాహమైన తరువాత, విధవయగుచున్నదియేమి చేయవలయునని ప్రశ్నయే యుపస్థితము కాకుండెను. ఇచట అనుపభుక్తలైన బాల విధవలఁ గూర్చిన ప్రశ్నము, బాల్య వివాహములు కానారంభమైన సమయమునకుఁ బిదపఁ గొన్ని శతాబ్దులకుఁ బుట్టెననియే చెప్పుట చాలును.

## అనేక పత్నీ వివాహము

స్త్రీల వివాహ సంబంధమున ననేక ప్రశస్త నియమము లేర్పఱుపఁబడినట్లే పురుషుల వివాహ సంబంధమునను ఏకపత్నీత్వమనెడి యుత్తమమైన ముఖ్యనియమము భారతీ యార్యులయందు నేర్పఱుపఁబడలేదు. ఈ సరణి

మనమొప్పుకొనవలయును. వైదిక కాలము మొదలుకొని మహాభారత సమయముదాఁక పురుషులకు ననేక స్త్రీల గ్రహించు నధికారముండెను. వారిట్లు చేయుచుండిరి కూడను. వేదమందు, ఒకేయూప స్తంభ మందనేకరశనలెట్లు బంధింపఁబడెనో, యట్లే యొక పురుషుఁడనేక స్త్రీలనుంచుకొనఁగలఁడని స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది. ఈ విధముగా ననేక స్త్రీలను గ్రహించు నలవాటు భారతీయార్యులయందు సర్వ ప్రపంచములోని యితర ప్రాచీన సమయములందువలెనే వ్యవహారములో నుండెను. మహాభారతములో నున్న యనేక రాజవర్ణనములఁబట్టి యీ సంగతి స్పష్టముగా నగపడుచున్నది. పంచపాండవులకు ద్రౌపదియేగాక యింకను ననేక స్త్రీలున్న వర్ణనము కలదు శ్రీకృష్ణునకెనమండుగురు పట్టపురాణులే గాకుండ నింకను జాలమంది భార్యలుండిరి. అనేక స్త్రీలను జేసికొను నీ యాచారము విశేషించి క్షత్రియులయందు మహాభారత సమయము వెనుకఁ బ్రచారములో నుండియుండును. సౌతి స్త్రీ పర్వమును బెంచివైచియున్నాఁడని మునుపు చూడఁబడియే యున్నది విశేషించి యుద్ధ సమాప్తియందు రణరంగమునఁ బడియున్న వీరుల స్త్రీలు భర్తృ శవములను గైకొని శోకించుచున్నారు. సౌతికృతమైన యీ వర్ణనము కాల్పనికమై యున్నది. ఇందుఁగ్రూడనతఁడు తన కాలమునందలి పరిస్థితిననుసరించి ప్రతి రాజునకును ననేక స్త్రీలున్నట్లు చాలచోట్లను వర్ణించియున్నాఁడు. ఇచట ఆ వర్ణనములోని యొక్క శ్లోకమునే యిచ్చినఁ జాలును.

శ్యామానాం పరవర్ణినాం గౌరీనా మేకవాససాం
దుర్యోధన వరస్త్రీణాం పశ్య బృందాని కేశవ॥

ఈ శ్లోకమందు దుర్యోధనుని స్త్రీ బృందములనేకములు వర్ణింపఁబడి యున్నవి. ప్రాచీన కాలమున రాజులకుఁగేవల మనేక స్త్రీలనుంచు కొనుటకను జ్ఞయే కాకుండెను. ఇదియేగాక వారిట్లు చేయుచుఁగూడ నుండిరి. ఎందుచేత? మున్నుపు చెప్పఁబడినట్లుగా క్షత్రియులకు బ్రాహ్మణేతరులైన మూఁడు వర్ణముల స్త్రీలను గ్రహించునధికారముండెను; సంపత్తి చేతనేమి రాజకీయ స్థితిచేతనేమి రెండు విధములచేతను ఇట్టి యనేక స్త్రీలు వారికి లభింపఁగలుగుచుండిరి

సమస్త సమాజస్థితిని జూడఁగాఁ బ్రతిమనుష్యునికిఁ దనవర్ణములోనే యనేక స్త్రీలులభించుటసంభవముకాదు. సమస్త జనసమూహమందును పురుషులయొక్క స్త్రీలయొక్క సంఖ్య తఱచుగాఁ గొంత న్యూనాధిక పరిణామమందు సమానమగుచున్నది. ఇందుచేత, పురుషునికనేక స్త్రీలఁజేసికొనుటకు స్వాతంత్ర్యమున్నను రాజులకుఁదప్పనితరులకు ననేక స్త్రీలనుజేసికొనుట సంభవముకాదు. రాజులలోఁగూడఁ జాలమంది రాణులనుంచుకొను నాచారమందును గొంత భేదమగపడుచున్నది. సమానములైన రాజకన్యలు విశేషించి మర్యాదగల రాణులు విశ్వసింపఁబడుచుండిరి. వారి వివాహములుకూడ వేఱు విధముగా జరుగుచుండియుండును. వీరు పట్టపు రాణులని చెప్పఁబడుచుంటిరి. మఱియు సంఖ్యయందు వారు లెక్కలేని వారుగనే యుండుచుండిరి. శ్రీకృష్ణునికిఁ బట్టపురాణులెనమండుగురే యుండిరి. వసుదేవునికిఁగూడ నింతమందియే యుండిరి. విచిత్రవీరునికిద్దఱుండిరి. పాండునికిద్దఱుండిరి. భీమునికి ద్రౌపది గాక శిశుపాలుని సోదరియగు మఱియొక స్త్రీ యుండెను. ఆశ్రమవాస పర్వ (అ. 2.) మందు దీని యుల్లేఖమున్నది అర్జునునికి సుభద్రయుఁ జిత్రాంగదయు నీ యిద్దఱు స్త్రీలింకనునుండిరి. సహదేవునికి జరాసంధుని కూతురు మఱియొక భార్య యుండెను; నకులునికిఁ గూడ మఱియొక స్త్రీ యుండెను. ధృతరాష్ట్ర పుత్రులైన దుర్యోధనాదులకు నిచట నూఱుగురు స్త్రీలే వర్ణింపఁబడియున్నారు. తాత్పర్యమేమనఁగా, రాజులకుఁ గూడ ముఖ్యస్త్రీలు ఒకరిద్దఱు, లేక చాలమందియైనచో నెనమండుగురు వఱకు, గలిగియుండిరి; మిగిలిన స్త్రీలనేకమున్నను. వారి దర్జా మిక్కిలి తగ్గిపోవును. ఇందుఁగూడ విశేష రూపమునఁ జెప్పఁదగినది యేమనఁగా, మహాభారత మందు యుధిష్ఠిరునికి ద్రౌపది వినాగా మఱియొక పట్ట పురాణి యొక్క లేక స్త్రీ యొక్క వర్ణన యెచ్చటను గనఁబడదు. (ఆదిపర్వములో 95వ యధ్యాయమందు యుధిష్ఠిరునికి రెండవ స్త్రీ దేవిక యని చెప్పబడియున్నది. అది ముందు విచారింపఁబడును.) దీనిఁబట్టి, యేకపత్నీ వ్రతము యొక్క మహత్త్వము మహాభారత ప్రణేతకుఁ గూడ మాన్యమై యుండెనని చెప్పఁగలము. మహాభారతము, రామాయణము రెండును మొదటి రాష్ట్రీయ గ్రంథములు, అందలి ముఖ్యవ్యక్తులైన యుధిష్ఠిరుఁడు, రాముఁడును నేకపత్నీ వ్రతమును బురస్కరించియున్నారు. దీనిఁబట్టి పాఠకులు, భారతీయార్యులేకపత్నీ వ్రతమున కెంత గౌరవము నిచ్చియుండిరో యూహింపఁగలరు,

శ్రీకృష్ణుని విషయమై గొంత యుల్లేఖించుట యావశ్యకమై యున్నది. ఆతనికి 16,108 రాణులుండిరని చెప్పఁబడుచున్నది. ఇందులో నెనమండుగురు మహిషులుండిరి. కడకు స్త్రీలతనికి నొక్కమాఱుగా లభించియుండిరి. మహాభారతమందు, శ్రీకృష్ణునికిఁ పదునాఱువేల భార్యలు గలరని రెండు మూఁడు చోట్ల నుల్లేఖమున్నది. దీని నిర్దేశము ముందు చేయఁబడును. శ్రీకృష్ణుని యీ భార్యలసంఖ్య యతిశయోక్తి కావచ్చునని చెప్పుటలో క్షతిలేదు. హరి వంశము యొక్కనికే 60వ యధ్యాయమందు శ్రీకృష్ణుని యెనమండుగురు భార్యలను జెప్పి తొమ్మిదవది కొత్తగా నొక శైబ్య చెప్పఁబడియున్నది. ఇందుఁ బదునాఱు వేల స్త్రీలను వివాహమాడఁబడిన సంగతి కూడఁ జెప్పఁబడియున్నది. దీనినిఁ యొక్క విశేషమైన యుల్లేఖము తరువాత 61వ యధ్యాయములోఁ గలదు. నరకాసురుఁడు పదునాఱువేల యొకవంద ముద్దియకన్యలను హరించి చెఱసాలలోఁ బెట్టియుంచెను. వీరందఱు ననుపభుక్తలై యుండిరి. నరకాసురుని జంపి శ్రీకృష్ణుఁడు వారిని గెలిచెను; అప్పుడు వారు తమ సంతోషమును బట్టి శ్రీకృష్ణుని వరించిరి. ఈ కథ యిట్లున్నది. అనఁగా శ్రీకృష్ణునికింకను పదునాఱు వేలయొక వందమంది భార్యలొక్కమాఱుగా లభించిరి. కానియిక్కడ పదునాఱువేల భార్యలయుల్లేఖమే పలుమాఱు వచ్చుచున్నది. మఱి యితరమగు వంద కాంతల యుల్లేఖము లేదు. ఉద్యోగపర్వము యొక్క 158వ యధ్యాయమందు నరకాసురుని జంపి స్త్రీజనమును సంపాదించెనని వర్ణనమున్నది. కాని యచటఁ బదియాఱు వేల స్త్రీలే లభించినట్లు వర్ణింపఁబడియున్నవి. అట్టిచో, హరివంశ మొకచోట నూఱుగురు కాంతలను పెంచెనని చెప్పవలసియుండును. ఒక్కమాఱుగా లభించిన యీ కాంతలందఱును మాసెవులు కారు, తుట్టతుదకు వారార్యులుకారని ప్రకటమైయున్నది. మఱియు, ఈ సంఖ్య యతిశయోక్తిదియే యున్నది, జైన గ్రంథములయందుఁ గూడ మాటిమాటికి నుల్లేఖింపఁబడియున్న యీ సంఖ్యయు నింతకంటె నెక్కువయైయున్నది. ఒకానొక సుఖవంతుడైన రాజు యొక్క వైభవమును వర్ణించుటకై జైన గ్రంథమ్ము అతనికిఁ బదాఱువేల భార్యలను జెప్పుచున్నది. సారాంశము, ఈ సంఖ్య యతిశయోక్తియై యున్నది. బైబిలులో స్లాలోమనునకు వేయి స్త్రీలుండిరని వర్ణనమున్నది. మన మతమున శ్రీకృష్ణునికి నెనమండ్రుగు నార్య కాంతలుండిరి. వీరుగాక యతనికిఁ జాలమంది పదునాఱు వేలుగాక ఇంకను

దేవాసురుల కాల్పనిక స్త్రీలున్నారని విశ్వసించుట యుక్తి సంగత మగును.

ఆది పర్వములో 95వ యధ్యాయమందు మొదట యుధిష్ఠిరునికి దేవిక యనెడు రెండవ స్త్రీ యున్నదని చెప్పఁబడిన సంగతి మాత్రమాశ్చర్య కరమై యున్నది. అది విడువఁబడఁజాలదు. గ్రహింపఁబడను జాలదు. దాని యుల్లే ఖము మఱియెన్నటను లేకున్నది; వనపర్వమందును లేక యాశ్రమవాస పర్వమందును గూడ లేకున్నది. ఈ వివాహమెపుడయ్యెనోకూడ నెందును ఉల్లేఖము లేదు. దీనిని తరువాత సౌతి పెంచెనని యొక సంగతి మాత్రము మనము చెప్పఁగలము.

ఒక స్త్రీ కనేక పతులను జేయుట.

అగుఁగాక; అనేక స్త్రీల నొక పురుషునికి వివాహము చేయు నాచారము వైదిక కాలమునుండి మొదలుకొని మహాభారత సమయమువరకు న్యూనాధిక పరిమాణములలోఁ, బ్రచలితమై యుండెను; కాని యొక స్త్రీ కనేక పతులను జేసెడి యాచారము మొట్టమొదట, హిమాలయమునుండి క్రొత్త క్రొత్తగా వచ్చిన చంద్రవంశార్యులలో మండెను ద్రౌపదియొక్క యుదాహరణముచేత నీ సంగతిని విశ్వసింప వలసి యున్నది. ఇందు విశేషరూపమున ధ్యానమునం చఁ దగిన విషయములు, ఈయనేకపతులు భిన్నకుటుంబములవారు లేరనియు, ఒక్క కుటుంబములోని సహోదరులై యుండిరనియు నై యున్నది; ప్రస్తుత కాలమునఁ గూడ హిమాలయము పైపునఁ బర్వత ప్రజలలోఁ గొన్నిచోట్ల నీ యాచారము ప్రచారములో నున్నచోటఁ గూడ నీ సంగతియే యున్నది. అనఁగా ఈ రీతి యందు నేవిధమగు దుష్టతయుఁ బుట్టదు. భిన్న భిన్న కుటుంబముల యందు వైమనస్యము పుట్టునసెడి యాశంకయు నుండదు. వివాహమాడిన స్త్రీ కేవిధమఁగను గష్టమగునసెడి సంభావనలేదు. భారతీయార్యుల యందు మొదటినుండియు నీ యాచారము విషయమై ప్రతికూలాభిప్రాయముండెను. ఉపర్యుక్త వైదిక వచనము నాధారము చేసికొని యీ సంగతి మునుపు వ్రాయబడి యున్నది. కొందఱు చంద్రవంశా

ర్యల ద్వారమునఁ దీసికొని రాఁబడిన యాచారము భరతఖండమున వ్యాపింపలేదు. మహాభారత సమయమున భారతీయార్యులలో నియ్యది బొత్తిగా లేకుండెను. మహాభారత కారునికి, ఒక ద్రౌపది పంచపాండవులకు భార్యయగుట యొకటి మొదటిదిగానే యుండెను; దీని నిరాకరించుటకై సౌతి మహాభారతమందు రెండు మూఁడు కథలను గలిపి యున్నాఁడు. మీరు తీసుకొని వచ్చిన భిక్షను బంచుకొనుఁడని విశేషించి ముఖము చూడకుండనే కుంతి యాజ్ఞయిచ్చెను. దాని ననుసరించి యైదుగురు సోదరులు నొక్క స్త్రీనే తన తన స్త్రీగాఁ జేసికొనివైచుట మిక్కిలి విచిత్రమై యున్నది. పూర్వోక్తమైన యుధిష్ఠిరునికథ ననుసరించి, పూర్వకాలమున నీ యాచారము కొందఱయందుండెనని విశ్వసింపవలయును. కాని పైని సౌతిచేసిన ప్రయత్నమునుబట్టి, మహాభారత సమయమున భరతఖండమునుండి యియ్యది తొలఁగి యుండెనని స్పష్టముగా సిద్ధించుచున్నది.

## వివాహముయొక్క భేదములు

ఇపుడు వివాహములోని భిన్న భిన్న భేదములను విచారింతము. ఈ దినములయందలి యన్ని ధర్మశాస్త్ర గ్రంథములు, స్మృతులు వీనిబట్టియు వివాహములో నెనిమిది భేదములున్నవని సిద్ధించుచున్నది. మహాభారతమందుఁ గూడ (ఆ. అ. 74) వివాహములో నెనిమిది భేదములు వర్ణింపఁ బడి యున్నవి.

> బ్రాహ్మో దైవ స్తథాచార్షః ప్రాజాపత్య స్తథాసురః ।
> గాంధర్వో రాక్షస శ్చైవ పైశాచ శ్చాష్టమః స్మృతః ॥

కాని దైవము, ఆర్షము వీని యొక్క యంతర్భావము బ్రాహ్మమందే యగుచున్నది. వీనియందుఁ గన్యాదానమే యున్నది. పైశాచము యొక్క పేరు గల వివాహభేదమగపడుచున్నది. ఇందు వివాహములో ముఖ్యమైన భేదము లయిదే యని చెప్పవలయును. ఈ భేదములే తఱచుఁ బ్రచలితములై

యుండును. అను శాసనపర్వములోని 44వ యధ్యాయమందు బ్రాహ్మము, క్షాత్త్రము గాంధర్వము, ఆసురము, రాక్షసము అని యైదుభేదములే చెప్పఁబడి వున్నవి. పైనిజెప్పఁబడినదైవము, అర్షము, ప్రాజాపత్యముదీనికిబదులు క్షాత్రవివాహము చెప్పఁబడియున్నది. మఱియు నిందు వివాహము యొక్క యంతిమ భేదము పైశాచము, బొత్తిగనే నిర్దేశింపఁబడలేదు. అనుశాసన పర్వమందుఁ జెప్పఁబడిన యైదు భేదములే యైతిహాసిక దృష్టిచే సర్వత్ర ప్రచలితములై యుండెను. మఱియు దీనిలో మూఁడు మాత్రము ప్రశస్తములు రెండు అప్రశస్తములుగా విశ్వసింపఁబడుచుండెను.

పంచానాం త్రితయో ధర్మ్యాః ద్వావధర్మ్యౌ యుధిష్ఠిర ।

రెండుచోట్ల నిట్టి యుల్లేఖమున్నది. వీనిలో వివిధములైన నామములు వివిధ లోకుల ననుసరించి తటస్థించెననుటలో సందేహములేదు. ఈ విషయమై యిచట విస్తరించి విచారము చేయుబడుచున్నది. మహాభారతములోని యుదాహరణఁ బట్టి, విచారించఁగా మొట్టమొదట వివిధ లోకుల యందు వివాహములలోని యీ భేదములుత్పన్నమై యుండును. అయినను భారత కాలమందు నయ్యవి యార్యులలోఁ బ్రత్యక్షముగా నాచరింపఁబడి యుండెను ఇది గాక వివాహసంస్థ యొక్క యున్నాంతి దృష్టిచేత, ఏవి యొకదానికంటె నొకటి యున్నత భేదములయ్యెనో అందలి పంచశ్రేణులివి యని చెప్పఁబడి నను సరిగా నుండును. అన్నిటికంటె నధమ విధము రాక్షస వివాహమై యున్నది. రాక్షస వివాహమనఁగా నర్థము బలాత్కారముగాఁ గన్యను దీసికొని వచ్చుట. దీని కంటె హెచ్చు అయినది యాసురము, అనఁగా బాలికను గొని తెచ్చుకొనుట. దానికంటెఁ గూడ శ్రేష్ఠమైనది గాంధర్వము. అనఁగా బాలిక యొక్క యిచ్ఛానుసారమువివాహమాడుట; ఇంతకంటె శ్రేష్ఠమైనది. క్షాత్త్రము అనఁగా ఆ వివాహమందుఁ బ్రతిజ్ఞను గెలుచుకొన్న వానికి బాలిక యొక్క తండ్రి బాలిక నిచ్చును. అన్నింటికంటె శ్రేష్ఠమైనది బ్రాహ్మము. దానిని సత్కారపూర్వకమైన కన్యాదానమని చెప్పుట యయుక్తము కానేరదు. దీని యొక్క విస్తృతమైన వివేచనము ముందు కాఁగలదు.

## బ్రాహ్మము, క్షాత్త్రము, గాంధర్వము.

అన్ని వర్ణముల యందును శ్రేష్ఠుఁడు బ్రాహ్మణుఁడై యున్నాఁడు ఇందుచేత బ్రాహ్మణులకు మొదటి బ్రాహ్మవివాహము, యోగ్యమని చెప్పఁబడియున్నది, అను శాసనపర్వములోని 44వయధ్యాయమందువ్రాసినదియేమనఁగా కన్యయొక్క తండ్రి, వరుని బిలిచి, సత్కారపూర్వకముగా ధనధాన్యాదులచేత ననుకూల పఱచి యతనికిఁ గన్య . నీయవలయును. ప్రస్తుతము కూడఁ జాలవఱకు నున్నత జాతులలో నీ యాచారమే ప్రచలితమైయున్నది. కన్య యొక్క తండ్రి వరుని ప్రార్థింపవలసి యున్నది. ధనదానాదికముచే వరుని తుష్టుని గూడఁ జేయవలయును. మహాభారత సమయమున బ్రాహ్మణులలోనివివాహమే ప్రచలితమై యుండెనని తెలియుచున్నది; ఇందుచేతనే యీ భేదమునకుఁ బేరు కూడ బ్రాహ్మవివాహమని కూడ వచ్చి యుండును. వివాహములో రెండవ భేదము క్షాత్త్రమని చెప్పఁబడియున్నది. కాని యిచ్చట, ఇది యెట్లు జరుగుచున్నదో యీ సంగతి సంక్షేపింపఁబడలేదు. దీనికిఁ బేరు క్షాత్త్రమని యుంపఁబడుట చూడఁగావిశేషమును బట్టి వివాహములు క్షత్రియుల యందే జరుగుచుండి యుండును. అగుఁగాక; ఈ వివాహము బ్రాహ్మణులకును క్షత్రియులకును ఇరువురికి విహితమై యున్నదని చెప్పఁబడియున్నది. ధనాదికముచేత వరుని బూజించు పద్ధతి బ్రహ్మక్షత్రియులందు దిద్దఱియందే సమానముగా నుండియుండును. అపుడు, బ్రాహ్మక్షాత్త్ర వివాహముల భేదమును వేఱుపఱచుట కఠినమైయున్నది, మన మతమున నీ వివాహమందుఁ వరుని వైపు నుండి కన్యాదాతను ప్రార్థించుటకై పోవు నాచారములుండి యుండును. మహాభారతమందలి యనేక యుదాహరణములఁ బట్టి పూర్వమున నిటువంటిరీతి యుండెనని చెప్పఁడఁగలదు. వర్తమాన కాలమున జరుగుచున్న వివాహవిధిలోని వాగ్దానము యొక్క యాధారము మీఁద, వరుఁడు కన్యార్థియై కన్యాదాతను గన్య గడుగవలయునని నిశ్చయముగాఁ జెప్పఁబడఁ గలదు. కానిమహాభారతములో నొకమాట అడుగుటకై క్షత్రియుఁ డెన్నఁడును వెళ్ళఁగూడదని స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. ముందు దీని యుల్లేఖము లభింపఁగలదు. కనుక, ఈ వివాహభేదమునకు నామము క్షాత్రమని యెట్లు వచ్చెనో యీ సంగతి నిశ్చయ పూర్వకముగా

జెప్పఁబడఁజాలదు. క్షత్రియులలోఁ బ్రతిజ్ఞ, పట్టుదల వివాహము చేసెడియాచారమునకు నీరైదు భేదములలో దేనియందు నంతర్భావము లేదు. మన మతమునుబట్టి, క్షత్రియుఁడుగాని బ్రాహ్మణుఁడుగాని యెవఁడైతే నీపందెమును గెలుచునో లేక యంత శక్తి కలవాఁడో లేక యావీరకృత్యమును చేయునో, వానికి నేను నా కొమార్తెను వివాహము చేయుదునని కన్యాదాత దేనియెందు జెప్పునో, దాని క్షత్రి వివాహ మనవలయు. ఈ విధముగా నియమమును నిర్ధారణ చేసికొనుటయుఁ తదనుసారము చేసినవానికిఁ గూడను వివాహము చేయుటయు క్షత్రియులదై యున్నది. ద్రౌపది వివాహములో బందెము పెట్టఁబడి యుండెను. దీనిఁ బట్టి భారతకాలమందిట్టి వివాహములు జరగుచుండెడివని సిద్ధమగుచున్నది. సీతా వివాహమందును ధనుర్భంగము చేయు నియమము ప్రసిద్ధమే యై యున్నది. మిత్రవింద అను క్షత్రియ కన్యను, ఇట్టి, ప్రతిజ్ఞయందే శ్రీకృష్ణుఁడు గెలిచి తీసికొని వచ్చియుండెను, ఇటువంటి వివాహములు కొన్ని పురాతన కాలమందు మాత్రమే చేయుచుండుటలేదు. ఇంకనేమంటె మహాభారతకాలము వఱకుఁ గూడ నిట్టి పందెముగల వివాహములు జరుగుచుండెను. పంజాబులో కొందఱు లోకుల విషయమున నీ సంగతిని అలగ్జాండరు సమయమున వచ్చిన గ్రీసు ఇతిహాసకారులు వ్రాసియుంచి యున్నారు. అనఁగా ఇందుచేత క్షత్రియుల యందును బ్రాహ్మణులయందును శక్తి ఇట్టి ధనుర్విద్యాస్పర్ధ యుత్పన్నమగుచుండి యుండును. భారతీయ క్షత్రియులకు యుద్ధ క్రియయందు సమర్థులగుటకై యీ పద్ధతి మిక్కిలి ననుకూలమై యుండును. అయిదు వివాహభేదములలోను దీనిని క్షత్ర నామముతో పిలుచుటకుఁ గారణముకూడ నిద్దియే యై యున్నది. ఈ స్పర్ధాకృత్యమునందు బ్రాహ్మణులు కూడఁ గలియుచుండిరి. ద్రౌపదీ స్వయంవర వర్ణనము బట్టి యీ సంగతి ప్రకటమై యున్నది. ఎందుచేత? స్వయంవర సమయమందుఁ బాండవులు బ్రాహ్మణ వేషమందు వచ్చి యుండిరి. బ్రాహ్మణులలోనే కూర్చుండిరి. క్షత్రియ వివాహము బ్రాహ్మ క్షత్రియులకు విహితమైనుండెనని తాత్పర్యము. ఈ వివాహభేదము చూడఁగా స్వయంవరమని చెప్పఁబడి యున్నది. అయినను అందియ్యది నిజమైన స్వయంవరముకాదు.

ఎందుచేత? ఎవడుపందెము గెలుచునో వానికాకన్య నీయవలసి యుండెను విశేషించి బాలికయొక్క తండ్రియే పందెము పెట్టుచుండెను. సీతాస్వయంవర సమయమున జనకుండే ధనుర్భంగము చేయవలయునని పందెముపెట్టియుండెను ద్రౌపదీస్వయంవర సమయమునందుఁగూడ ద్రుపదుఁడు షరతుపెట్టయుండెను, అనగా కన్యకు దనకు నెట్టి స్వాతంత్ర్యమును లేకుండెను, తండ్రియెవనికి దానముచేయునో వానిని వివాహమాడు పద్ధతియామెకు నిరాటంకమైయుండెను, ఇందుచేత నీవివాహభేదము యోగ్యమగురీతిని స్వయంవరమనిగాని గాంధర్వమనికాని చెప్పఁబడఁజాలదు. అప్పుడు కూడా మనమువివాహభేదముపై విచారింపవలయును. ఇది గాంధర్వమనిపేరఁ బ్రసిద్ధమైయున్నది. ఇందు బాలికకుఁ దానియిష్టము చొప్పునపెండ్లికొమారుని కోరుకొను నధికారము ముఖ్యమైయున్నది. ఇట్టి వివాహములు గాంధర్వములలోనే యగుచుండెను, ఇందుచేత నీపద్ధతినిజేయ గాంధర్వ వివాహమయ్యెను. గంధర్వులును అప్సరలును, హిమాలయమందు నివసించు, మనుష్యజాతులని విశ్వసింపఁబడఁగలరని మనము ముందేచెప్పియుంటిమి. వీరిలోఁ బ్రచలితమైన గాంధర్వ వివాహము, ఆర్యులలో విశేషించి క్షత్రియులలో నగుట కారంభమయ్యెను. దుశ్యంతశకుంతలలు వివాహము దానికి ముఖ్యోదాహరణమై యున్నది. దుష్యంత శకుంతలోపాఖ్యానమందు, పరస్పర ప్రేమ కలిగి యొకరినొకరు వారిగళమందు హారమువేయవలయునని యింతమట్టు విధియే దానికగపడు చున్నది. కన్య కోరిన వరునికిఁ దండ్రి కన్యనీయవలయునని కూడ నిందు నావశ్యకతలేదు. కాని సాధారణముగా స్వయంవర భేదము గాంధర్వ విధియందే మిళితమై యున్నది. అనేక రాజులు గుమిగూడుట కలదు. అందెవ్వడు ఇష్టమయ్యెనో వాని గళమందు జయమాల వైచిన తరువాతఁ తండ్రి వాని నభినందింప వలయును. మఱియు కన్య యిష్టపడిన వరునికిఁ దన గన్య నర్పింపవలయును."(అను. పర్వ)దీనికి మంచి యుదాహరణము నలదమయంతులై యున్నారు.దుష్యంత శకుంతుల గాంధర్వ వివాహమందును నలదమయంతుల స్వయంవరమందును కొంత భేదమున్నది.ఈ స్వయంవరమందలయెదుట జరుగుచున్నది. మఱియుఁ గన్యాదాత- తదనుసార

ముగా—కన్యాదానముఁ జేయుచున్నాఁడు। ఇంతియే భేదము, ఇట్టి వివాహము ముఖ్యముగా క్షత్రియులకుఁ జెప్పఁబడి యున్నది. ఈ స్వయంవర వివాహము మొదట భారతీయార్యులయందు మహాభారత సమయము వఱకు ప్రచలితమై యుండెను. అలగ్జాండరు తోడి యుణనానీ యితిహాసకారులు ఈ సంగతిఁ గూడ వ్రాసి యున్నారు. పంజాబులోని కఠజాతి క్షత్రియ స్త్రీలు తమ నిమిత్తమై తామే వీరుని నేలుకొను చున్నారని వారు వ్రాసియున్నారు.

## ఆ సు ర ము

ఇపుడు ఆసురము మీఁద విచారింతము. ఈ వివాహమందుఁ గన్య కొనఁబడు నుండెను. "కన్యయొక్క యాప్తులకును గన్యకును బూర్తిగా ధనాదికమునిచ్చి కొనవలయును. అపుడామెను వివాహమాడవలయును. ఈ ధర్మ మసురులది యని జ్ఞాతలైన పురుషులు చెప్పుచున్నారు." కను కనే దీనిపేరు అసురమయ్యెను. ఈ స్పష్టమైన వచనము మహాభారత మందే యున్నది. అ సు రు లె వ్వ ర ని యైతిహాసిక రీతిని విచారింపఁబడునెడల, నేడు నిజముగా వర్షియనులు లేక పారిశీలు అయియున్నారు. శర్మిష్ఠ యసురకన్యయైయుండెనని మును ప్రాఁతుఁబడియున్నది "జంద్" ఆర్యులయందుఁ బ్రచలితమైన యీ వివాహాచారము భారతీయార్యుల యందుఁగూడ నుండెను. మహాభారతములోని చాల యుదాహరణములఁ బట్టి యీసంగతి స్పష్టముగా నగపడుచున్నది. పంజాబులోఁ గొన్ని జాతులయందు అసురవివాహము జరుగుచున్నది. వీనియందు భారతకాలమున మద్ర,కేకయ జాతులు విశేషముగానుండెను. ఈ వంశములోని స్త్రీలను విశేషించి మధ్యదేశమందలి క్షత్రియరాజులు గ్రహించుచుండిరి. పాండునికై మాద్రి— శల్యుని తోఁబుట్టువు—కొఱకుఁ బోయిన వర్ణన మహాభారతమందుఁ గలదు. ఇచట నయ్యది యెత్తఁదగియున్నది. పాండురాజునకు రెండవ వివాహము చేయుటకై శల్యుని నగరమునకు భీష్ముఁడు వెళ్లెను. అతఁడు శల్యుని, మాద్రిని పాండురాజుకిమ్మని అడిగెను. అపుడు శల్యుఁ డుత్తరమిచ్చెను. —"మన కులాచారమును దమ రెఱింగియేయున్నారు. కాన నతడు వందనీయుఁడై యు

న్నాడు. దానిని నేను నా ముఖముతో జెప్పఁదలఁచుకొనలేదు." అపుడు భీష్ముఁడతని నియమము మన్నించి స్వర్ణాభరణములును, రత్నములు, ఏనుఁగులు, గుఱ్ఱములు, దుస్తులు, అలంకారములు, మణులు, ముత్యములు, మున్నగు వానినిచ్చి యతని సంతోషపరచెను. దాని యనంతరమున శల్యుఁడు తన తోఁబుట్టువును అతని యధీనమును జేసివైచెను. ఇట్టి వర్ణనమే రామాయణ మందు దశరథ కైకేయుల వివాహపుదియై యున్నది. కైకేయి తండ్రికి సమస్తరాజ్యము నర్పించి దశరథుఁడు కైకేయిని బొందియుండెను. తాత్పర్య మేమనఁగా అసుర వివాహము క్షత్రియులయందు ప్రచలితమై యుండెను. విశేషించి క్షత్రియులకు సంబంధ మసురులతో నుండెను. వారియందీ యాచారము కాల పరంపరచేత సాగివచ్చి యుండెను. గ్రీకు ఇతిహాసకారులు పంజాబులో మహాభారతపర్యంతము ఈ రీతి ప్రచలితమై యుండెనని స్పష్టముగా వ్రాయుచున్నారు. వారు వ్రాసియున్నారు. "తక్షశిలా నగరమందు యువతులైన కన్యలు బజారునకమ్ముటకై తీసికొనిరాఁబడుచుండిరి. మరియు అందటకంటె నెక్కువపెలయిచ్చినవారిలోఁ గలుపఁబడుచుండిరి. పైని చెప్పఁబడియున్న శల్యుని యుత్తరముఁ బట్టి భారతీయార్యులందు ఈ వివాహ భేదము అప్పటినుండియే నింద్యముగా విశ్వసింపఁబడుచుండె నని ప్రకటమగు చున్నది. ప్రస్తుతముకూడఁచూడఁగా కొన్ని రజాతులయందు అసుర వివాహము ప్రబలితమైయున్నది. అయినను దానిని లోకులు అప్రశస్తముగనే తలంచు చున్నారు.

---

* జందు— అనఁగా పారిసీల ధర్మగ్రంథము. దీనిని అజండా యందురు.

## రాక్షసము

వివాహములలో నైదవ భేదము రాక్షస వివాహము. ఇది విశేషించి రాక్షసులయం దగచుండెను. ఇందుచేత దీనికిఁ బేరు రాక్షసమని తటస్థించెను. ఈ వివాహమందుఁ గన్యాపక్షమువారితోఁ బోరాడి, ప్రతికక్షు లేడ్చుచు మొత్తు కొనుచున్నను లెక్కచేయక విలపించుచున్న కన్యకను బలాత్కారముగాఁ దీసి కొని వచ్చుచుండిరి. రాక్షసు లనఁగా నెవరో మునుపు దిగ్దర్శనము చేయఁబడి యున్నది. హిందుస్థానమందు మూలనివాసుల మాంసమును భక్షించు మను ష్యాశన జాతులు కొన్ని లంకనుండి వ్యాపించి యుండెను. ఈ భేదము వారి వివాహమైయుండెను. రావణకృతమైన సీతాపహరణమువలన నీ సంగతి స్పష్ట పడుచున్నది. ఇట్టి వివాహము క్షత్రియులకు మిగుల నచ్చియుండును. ఎందుచేత? ఇందులో యుద్ధ విద్యయం దెవరు నిపుణులైయుం దురో వారే తమ సామర్ధ్యము నుపయోగింపఁ గలుగుచుండిరి. మహా భారతమందు దీనికిఁ బ్రసిద్ధోదాహరణము సుభద్రా హరణము. అర్జునుఁడు శ్రీకృష్ణుని సలహాపుచ్చుకొని సుభద్రను హరించెను. ఇందే విధముగను సుభద్ర యొక్క యనుమోదనాంశము లేకుండెను. ఆ సమయమున శ్రీకృష్ణుఁడు అర్జు నునితో ననెను. —"క్షత్రియుఁడు స్వయంవరవిధిచేత వివాహమాడవలయును, ఇది యుత్తమమైనది; కాని స్వయంవరము చేయఁబడునేని సుభద్ర యెవని గళమందు జయమాల వడవైచునో తెలియదు. కనుక శూరులైన క్షత్రియు లకు స్త్రీని బలాత్కారముగా నపహరించి తెచ్చుకొనుటయే యుత్తమమైన మార్గము". సారాంశము, రాక్షసవివాహమును క్షత్రియులు మిగులఁ బ్రేమించు చుండిరి. కాశిరాజు కూతులైన అంబ, అంబిక, అంబాలికలకు— స్వయంవరము చేయుచుండిరి; ఆ సమయమున వారి నపహరించి తెచ్చి యుద్ధుఁడు విచిత్ర వీర్యునికి వివాహము చేసెను. ఇందు విశేషించి ధ్యాన ముంపదగిన విషయ మేమనఁగా, నేను సాల్వరాజును మనస్సున వరించితిని, యని, యంబ భీష్ము నితోఁజెప్పినపుడు భీష్ముఁ డామెను వెళ్ళిపోనిచ్చెను. దీనిఁబట్టి ఒకరు (ఎవరైన నను) విఘ్నమనసు గల కన్యను బ్రతిగ్రహించుటలో, భారత కాలమున ఆర్య క్షత్రియుల కాటంక మున్నట్లు తెలియుచున్నది. ఆలోచింపఁగా నిట్లున్నది. ఆయనను విహితయైన స్త్రీని గూడ బలాత్కారముగా హరించి పరిగెత్తిపోయి

నందులకుదాహరణములు పూర్వకాలమునందు గనఁబడుచున్నవి. ఈవిషయమై సీతయొక్క ఉదాహరణమేచాలును. ఈరీతిగా వివాహితస్త్రీని దీసికొనిపోయిన పిమ్మట రాక్షసాచారము ననుసరించి, ఆ స్త్రీపై నధికారము గెలిచినవానికే యుండెడిది. ఆమె యొకవేళ నిష్టపడకున్నచో నామె యొక సంవత్సరము గడువు గడచిన తరువాత అపుడు నిచ్చివేయఁబడుచుండెది. శాంతిపర్వమందు ౯౬వ యధ్యాయములో పరాక్రమము చేత బలాత్కారముగాఁ దీసికొని రాఁబడిన కన్యతో నొక వత్సరము వరకు వివాహ విషయమై జిజ్ఞాస చేయఁగూడదని చెప్పఁబడి యున్నది. ఆ మేర గడచిన తరువాత నామె బలాత్కారముగా వివాహ మాడఁబడుచుండె నని తెలియుచున్నది. కాని ధర్మజ్ఞులైన క్షత్రియులు, మనసు చేత మఱియొకని వరించిన స్త్రీని బరిగ్రహించుట కంగీకరింపకుండిరి. పేర్కొనఁబడిన భీష్మో దాహరణమువలన నీ సంగతి వ్యక్తమగుచున్నది. వన పర్వమందు జయద్రథుఁడు ద్రౌపదిని హరించెను; దానిఁబట్టియు గొందఱుక్షత్రియులు పెండ్లియైన స్త్రీనిగూడ బలాత్కారముగాఁ బట్టుకొని తీసికొనిపోవుచుండిరని ప్రకట మగు చున్నది. కాని యామెయొక్క యాప్తబంధువుల గెలిచెడి యావశ్యకత యుండెను. ద్రౌపదియాసమయమున ధౌమ్యఋషిని ప్రార్థించెను; అపుడు ధౌమ్యుఁడు జయద్రథునితోఁబలికిన వాక్యము ధ్యానింపఁదగియున్నది.

నేయం శక్యా త్వయానేతుం। అవిజిత్యమహారథాన్।
ధర్మం క్షత్రస్య పౌరాణ మవేక్షస్వ జయద్రథ॥

మహారథు లగు వారలను జయింపకుండ నీవు ద్రౌపదిని దీసుకొని పోఁజాలవు. పురాతనకాలమునుండియు క్షత్రియులలో సాగివచ్చుచున్న ధర్మముపై ధ్యానముంపుము. (వనపర్వ।అ 268) దీనిఁబట్టి, మఱియొక క్షత్రియుని గెలిచి యతనివివాహితయైనట్టిదానినిగూడ హరింపవచ్చుట క్షత్రియులకుఁ బురాతనకాలమునుండియుఁ బ్రచలితమైన ధర్మమైయుండునని తోచుచున్నది. అనేక ప్రమాణములబట్టి ప్రాచీనకాలమందిట్టి రీతి యుండియుండునను ధారణ దృఢమగుచున్నది. మహాభారతమునకుఁ బిమ్మట కొన్ని గ్రంథములఁబట్టి రాజుల స్త్రీలు, గెలిచిన రాజుల యిండ్లను దాసిమాదిరిగా నుపయోగింపబడుచుండి

రని తెలియుచున్నది. విశేషించి పట్టపురాజులు కాని స్త్రీలను గెలిచినవారు రాజులస్త్రీలలోఁ గలిపిపై బలోఁదలుచుగా నెట్టిబాధయు లేకయుండును. మంచిది రాక్షస వివాహము క్షత్రియులకై విశేషించితగియున్నదని స్మృతుల

యందు బేర్కొనఁబడియున్నది. ప్రస్తుతమునఁగూడ క్షత్రియులయందును వారికంటెతక్కువజాతులయందును రాక్షసవివాహముయొక్కకొంతయువిశిష్టాంశము కనఁబడుచున్నది; అనఁగా వివాహసమయమందు పెడ్లికొడుకు చేతిలోఁ బెద్దకత్తిలేక చిన్నకత్తియుండెడు నాచారము ఈజాతులలో నిప్పదివీడకు వఱకు నున్నది.

ఈభిన్నభిన్న వివాహములు మొదట భిన్నభిన్న జాతులయందుఁ బ్రచలితమై యుండెను; మరియు బ్రాహ్మములక్షత్రము, గాంధర్వము, అసురము, రాక్షసము వానిపేరులై యుండెను. అయినను ఇవన్నియు భారతీయార్యులయం, ఒకసమయమందే వ్యాప్తములై యుండెను మరియు ఆ యన్నింటి రూపాంతరము మెల్లమెల్లగా బ్రహ్మవివాహమందు నగుచువచ్చెను. రాక్షసవివాహము ద్వారమునఁ జూడఁగా, కన్యహరింపఁ బడియుండును, అయినను చివరకుఁ బతివల్లా వివాహము తఱచు బ్రహ్మవిధిచేతఁ జేయఁబడుచున్నను మహాభారతమందలి యనేకోదాహరణములఁబట్టి యీ సంగతి విదితమగుచున్నది. సుభద్రా పరిణయమైన తరువాత, అర్జునుడు సుభద్రయు ద్వారకకు మరలవచ్చిరి. అక్కడ బ్రహ్మవిధిచేత వారికివివాహమైన వర్ణనమున్నది. దీనకిముఖ్యస్వరూపము దానము, ఈ గంధర్వ వివాహము వాల్లనేక క్షత్రివివాహమువాల్ల అనఁగా స్వయంవరమైన మీటలేక పందెము గెలిచిన మీదట వివాహమగుటయు ఆచారమైనపుడు గూఢఁదఱచు బ్రహ్మవిధిచేత వివాహముఁజేయుచుండిరి. అర్జునుఁడు ద్రౌపదినిగెలిచిన తరువాత ఆమెను దానియింటికిఁ దీసికొని పోయినతరువాతఁగూడ ఇరువురిని ద్రుపదునియింటిలిచి వారికి విధిపూర్వకముగా వివాహముచేసెను, ఇట్లు మహాభారతములో వర్ణనము కలదు. తఱచుగా నన్ని వివాహములయందును బ్రాహ్మ విధియొక్క రివాజున్నది. దుష్యంత శకుంతలల వివాహోదాహరణ మొక్కటి మాత్రము పై రీతికి విరుద్ధమై యున్నది. అందు

గాంధర్వ వివాహమైన తరువాత మఱియేదియు జరిగిన వర్ణనము లేదు, శకుంతల తండ్రితో దుష్యంతునికిఁ గలయిక గూడఁ గాదయ్యెను. ఇట్టి యుదాహత్మకమైన యుదాహరణము దక్క తఱచన్ని విధముల వివాహములయందును బ్రాహ్మవిధి అనఁగా దానవిధి యెల్లప్పుడు నుండుచుండెను.

అన్ని వివాహ విధులకును ముఖ్యాంగము సప్తపదియని ప్రాచీన కాలమునుండియు విశ్వసింపఁ బడినట్లు కనఁబడు చున్నది. వివాహ విధియందు నగ్ని సమక్షమునఁ బతిపత్నులు చేయుచున్న సప్తప్రదక్షిణ విధికిఁ పేరు సప్తపది యై యున్నది. మఱియు నావిధికొక ముఖ్యాంగము పాణిగ్రహణ సంస్కారము కూడ నై యున్నది. మంత్రహోమముతో సప్తపది యగుటయే వివాహమును బూర్తి చేయుట యై యున్నది. ఇది లేని యెడల వివాహము అసంపూర్ణముగనే నిలిచిపోవు చున్నది. ధర్మశాస్త్రముయొక్క యిట్టి నిశ్చయము మహాభారత సమయమువలన స్పష్టముగా నగపడు చున్నదిఁ ఇది గాకుండ కన్యాశుల్కమునకు సంబంధించి అనఁగా వెల నిశ్చయించువట్ల ననేక ప్రశ్నము లగుచుండెను. మహాభారతములోని ప్రశ్నముల సంబంధమునఁ గూడ భిన్న భిన్న విచారముల వర్ణనమున్నది. ఇచట వాని విస్తరింపవలసిన యవసరము లేదు. ప్రత్యక్షముగాఁ బాణిగ్రహణము సప్తపదియుఁ గానంతవఱకు బాలికకై మఱియొక వరుని నిర్ణయము కావచ్చును, ఈ సంగతి పదునాలు వచ్చినమీఁదట సత్యమై యున్నది. కేవలము శుల్కదానముచేత నామె యేమాత్రమును లేదు కానేరదు.

## వివాహముయొక్క బంధనములు

మహాభారత కాలమందు వివాహ విషయమై యింకను గల నియమము లిచ్చట సంక్షేపముగా వర్ణింపఁ బడుచున్నవి, వానియొక్క విస్తృత వర్ణనము పూర్వభాగమందు జరిగియే యున్నది. ప్రతివర్ణమునకుఁ దాన వర్ణపు స్త్రీనే చేసికొను నధికారముండెను. ఇది గాకుండఁ దానవర్ణము

కంటెఁ దక్కువ బాలికను వివాహమాడుటకుఁ గూడ నధికారముండెను. అనఁగా బ్రాహ్మణునికి క్షత్రియ వైశ్య శూద్రుల యింటను క్షత్రియుని వైశ్య శూద్రుల యింటను వివాహమాడు నధికారముండియుండును. అయినను మహాభారతమందనేక స్థలములలో బ్రాహ్మణుఁడు శూద్రస్త్రీని గ్రహింపఁ గూడదని చెప్పఁబడి యున్నది. ఇట్టి వివాహము నింద్యముగా నెంచబడుచుండెను. శూద్ర స్త్రీని గ్రహించు వానిని వృషలీపతి యని చెప్పుచుండిరి. బ్రాహ్మ ణకర్మమునకు అనఁగా శ్రాద్ధాదులకు లేక దానమిచ్చుటకు వృషలీపతి యర్హుఁడు కాఁడను నియమముండెను. ఇంతకంటెను నెక్కువగా వాఁడధోగతికిఁ బోవుననియు విశ్వసింపఁబడుచుండెను. జయద్రథుని జంపుదునని ప్రతిజ్ఞ చేయు సమయమున నర్జునుఁడు చేసిన యనేక శపథములలో "నాకు వృషలీపతి బోవునట్టి లోకములు ప్రాప్తించుఁగాక" అని కూడ నొక శాపమున్నది. అది యటుండగా, ఆ సమయమున లోకులు బ్రాహ్మణుఁడు లేక క్షత్రియుఁడును శూద్రస్త్రీని వివాహ మాడరాదని తలంచుచుండిరి. అయినను మహాభారత సమయమున బ్రాహ్మణులు క్రింది మూఁడు వర్ణముల కన్యలను గైకొనుచుండిరనుటలో సందేహములేదు. ఇతరములైన యైతిహాసిక ప్రమాణములఁ బట్టియు నీ సంగతి సిద్ధమై యున్నది. మేగాస్తనీజు చేసిన చంద్రగుప్త నాటి వర్ణనమునందు నా సంగతి నతఁడు స్పష్టముగా వ్రాసిపెట్టి యున్నాఁడు. మహాభారత సమయమునకుఁ బిమ్మట గూడ, చాల శతాబ్దుల వఱకు నీ నియమము జరిగెను. గుప్తకాలికమైన శిలాశాసనమందుఁ గూడ, బ్రాహ్మణులు క్షత్రియ స్త్రీలను వివాహమాడిన దృష్టాంతములున్నవి. బాణకవి తన హర్ష చరిత్రమందు తాను పారశవుని సోదరుఁడైన సంగతిని వ్రాసియున్నాఁడు. తాత్పర్యము, బ్రాహ్మణులు ఒక మహాభారత సమయమందే తమకంటె నీచవర్ణముల స్త్రీలను గ్రహింపకుండిరి, ఇఁక నేమంటే దానికి పిమ్మటఁ జాల శతాబ్దుల వఱకు నీ క్రమము ప్రచలితమై యుండెను. మొట్టమొదట బ్రాహ్మ క్షత్రియ వైశ్యులు—మూఁడు జాతుల స్త్రీలనుండి యుత్పన్నమైన సంతనము బ్రాహ్మణుఁడు గనే చెప్పఁబడు చుండెను. కాని మఱలఁదరువాత, మహాభారత సమయమున, బ్రాహ్మణ క్షత్రియ స్త్రీలనుండి పుట్టిన

సంతతియె బ్రాహ్మణుండుగా విశ్వసింపఁ బడుచుండెను. మహాభారత కాలమునను దాని తరువాత వఱకును గూడ నీ నియమముండెను. గుప్త కాలమందుఁ గూడఁ దగ్గుదల యై యుండును. మఱియు బ్రాహ్మణపతి ద్వారమున క్షత్రియ స్త్రీనుండి యుత్పన్నమైన సంతానము క్షత్రియుఁడు గనే విశ్వసింపఁ బడజొచ్చెనని యనుమాన మగుచున్నది. మెల్ల మెల్లగా గుప్తకాలము తరువాత నీ సంగతి సైతము లేదయ్యెను. ప్రతివర్ణము తన వర్ణమందే వివాహమును జేసికోవలయునని ధర్మశాస్త్రముయొక్క మర్యాద యయ్యెను. ప్రతిలోమ వివాహము లంతకుము నుపే కట్టుబడి పోయి యుండెను. తక్కువ వర్ణపు పురుషుఁడు తనకంటెఁ బై వర్ణపు దానిని గ్రహింపఁ గూడదని మిగులఁ గఠిన నియమముండెను. ఇట్టి సమాగమము నుండి పుట్టిన సంతానము వర్ణ బాహ్యము లైన నిషాద చాండాలాది జాతులలో లెక్కింపబడు నుండెను.

## సింహావలోకనము

మహాభారత కాలికులైన భారతీయార్యుల వివాహసంస్థ యొక్క వర్ణన మింత దాఁక మహాభారతము యొక్కయు నిర్వాచ గ్రీకు ఇతి యితిహాసకారుల ప్రమాణముయొక్కయు నాధారముమీఁదఁ జేయఁబడియున్నది. ఇపుడు దానియొక్క సంక్షిప్తమైన సింహావలోకనమును జేసి వర్తమాన పరిస్థితిలో దానినీ సరిచూచుచున్నారము. 1) బహు ప్రాచీనకాలమందు వివాహ బంధనము ఎక్కువ కఠినము కాకుండెను, శ్వేతకేతువు దీనిని మొదలు పెట్టెను. పత్ని వ్యభిచరించుదేని దానికి బ్రాహ్మణ హత్యాపాతకము తగుటనని యతఁడు నియమము చేసెను. వివాహమనెడు దృఢ బంధనమునకు శ్రీగంఠ మిది యయ్యెయున్నది. పతి వ్యభిచరించునేని వానికి బ్రాహ్మణహత్యా పాపము తగులునని యతఁడు గొప్ప నియమమును చేసెను; కాని యది ప్రస్తుతము కాలమునందఱచు మాన్యము గాకున్నది. 2) బహు ప్రాచీన సమయమందు నియోగమనెడి యాచారముండెను. కాని స్త్రీల ప్రాతివత్యముయొక్క గొప్ప కల్పనలు దానిని బందు చేసెను. అది మహాభారత కాలమునను లేకుండెను. ప్రాచీనకాలమందు దీర్ఘతాముండు త్రైవర్ణిక స్త్రీలకు

బునర్వివాహమును నిషేధించెను. ఈ యాజ్ఞ పాతివ్రత్యము యొక్కయే యుచ్చ కల్పనంబట్టి, భారతీ యార్యుల యందు సహస్యమై పోయెను. ఉచ్చ వర్ణపు స్త్రీలు, మహాభారత సమయమున, పునర్వివాహమును చేసికొనకుండిరి. ఏదియైనను జేసికొన్న యెడల ఆమె హీనురాలుగా, శూద్రతుల్యగా నూహింపం బడుచుండెను. హిందూ సమాజమం దిదియెట్లు నిప్పటి వఱకు నున్నది. 4] ఒక స్త్రీ యనేక భర్తలు గాంజాలకుండిరి కాని యొక భర్త యనేక భార్యలను చేసికొనుటకధికారము ప్రాచీనకాలమునుండి మహాభారతకాలమువఱకునుండెను బహుపత్నీకత్వ వ్యవహారము పూర్వ సమయమందు మిక్కిలి యధికముగా నుండియుండును. మహాభారత సమయమున నట్టిది తగ్గిపోయియుండెను మఱియిపుడుగూడం దగియున్నది. 5] బహుపతిత్వాచారము అతి ప్రాచీన సమయమందు గ్రాహ్యముగా నుండెను. క్రమముగా నది నశించెను. మఱి యీ సమయమందు నయితను దాని వ్యాపించుట లేకున్నది. 6] ప్రాచీన కాలము మొదలుకొని మహాభారత సమయమువఱకు వివాహమందు దక్షయను పభుక్త కావలయునను పట్టుదల యుండెను. మఱియిట్లే యిపుడుగూడ గలదు. 7] కాని పతిపత్నుల సమాగమము వివాహ దినమునందే లేక వివాహపు మూఁడవ దినమున నగుచుండెను. అనంగా వివాహ సమయమునకుం గన్య యుపభోగమునకుం దగినది లేక ప్రౌఢయై యగుచుండెను. 8] దీనింబట్టి పూర్వకాలమున వివాహము బాల్యమందు జరిగినది కాకుండెనని ప్రకటనమగు చున్నది. తఱచు పురుషుల యిరువదియిరువదియైదేండ్ల వయస్సు మొదలుకొని ముప్పదియేండ్ల వయసు వఱకు మఱి స్త్రీలకుం బదునైదు బదునాఱు వత్సరముల వయసునకు దాదాపున అనంగాం బెరుగుచున్న వయసునందే వివాహమగుచుండెను. ఈ సమయమున రాజులకు మఱి క్షత్రియులకుం దక్కనితరులలో లేకున్నది. హర్షచరితమునంబట్టి యీ రీతి బాణకవికిం బిమ్మట మఱియు దానికి అనుమానమగుచున్నది. 9] ఇందుచేత, ఆకాలమందు వివాహసమయమునకు స్త్రీలు ప్రౌఢలగుచుండిరి. ఇందుచేత నాప్రౌఢలు ననుపభుక్తలునైన విధవల ప్రశ్నయే యుపస్థితము కాకుండెను. ప్రస్తుతమునకును మహాభారతకాలస్థితికిని నడుమ గొప్పదియు మహత్త్వపూర్ణమునగు నీయంతరమున్నది. ప్రాచీన కాలమందు భిన్న భిన్న ప్రజలయందు వివిధములైన వివాహములు ప్రచలితములై యుండెను. మఱి వాని కారణమున కాబ్రాహ్మము క్షత్రియ

గాంధర్వము, అసురము, రాక్షసము—ఈ వివాహముల యైదు భేదములును భారతీయార్యులయందుఁ బ్రచలితములై యుండెను, అందు బ్రాహవిధి అనఁగా దానవిధి శ్రేష్ఠమని విశ్వసింపఁ బడుచుండెను, ప్రస్తుతమున గూడఁ జాలవఱకదే మాదిరియై యున్నది. క్షత్రియులలో రాక్షసవివాహము అనఁగా బలాత్కారముగాఁ గన్యకను హరించు మర్యాద మరియు క్షాత్త్రి వివాహము అనఁగా శూరత్వముచేతఁ బందెము గెలిచి కన్యను వరించు రీతి యధికముగా నుండెను. గ్రీసు ఇతిహాసకారుల ప్రమాణములఁబట్టి మహా భారత సమయమునఁగూడ నీ పరిపాటియే యుండెను. కాని ప్రస్తుత మీ మూఁడు రీతులును లోపించియున్నవి. వర్తమానమున బ్రాహ్మము, అసురము రెండే లేక రెండింటియొక్క మిశ్రమము ప్రచలితమై యున్నది. 11] మహా భారత సమయమువఱకు బ్రహ్మ క్షత్రియులు తమకంటె నీచ వర్ణములోని కన్యను దీనికొని పోవుచుండిరి. ఈ సమయమున నీ రీతి సర్వదా కట్టుబడి యున్నది. ఇది రెండవ మహత్త్వ పూర్ణమైన యంతరమై యున్నది. ఈ విధ ముగా మహాభారత కాలికమును వర్తమాన కాలికమనగా వివాహసంస్థ విష యమై భారతీయార్యుల యొక్క సమాజ పరిస్థితి విభిన్నమై యుండును.

## పతిపత్నీ సంబంధము

ఇపుడు భారతీయ సమయమందుఁ బతిపత్నుల సంబంధమెట్లుండెనో చూడవలయును. ఏ దినములయందు స్త్రీలు వివాహ సమయమునకుఁ దరుణ లగుచుండిరో, ఏ దినములయందు వారికిఁ బతిని వరించు నధికారముండెనో లేక యా స్త్రీలకై శుల్కములు బలువిధములీయవలసి యుండెనో, ఆ యుగ మందుఁ బత్ని యొక్క యధికారము పరివారమందు సాగియుండును. ప్రస్తుత మున మాత్రము కన్యాదానము చేయుట కాకుండఁ బైకంటె దక్షిణ కూడ విశేషముగా నీయవలసి యున్నది; అపుడు పత్నికి నధికమైన యాదరము, అధికారము తగ్గిపోవుటలో నాశ్చర్యమేమున్నది. మహాభారత సమయమునఁ గుటుంబమందు విశేష స్వాతంత్ర్యము ప్రాప్తమై యుండెను. గుటుంబమందు వారికాధారము కూడ విశేషమై యుండెను. ద్రౌపది యుధాహరణమునే గైకొనుడు వివాహ సమయమునకామె పెద్దదియైయుండెనుస్వయంవరసమయమున

నామె నిర్భయముగా నడచివచ్చెను. కర్ణుఁడు లక్ష్యవేధనమున కై ధనుస్సు నెత్తినపుడు ఆమె ధైర్యముతో నుత్తరమిచ్చెను—"నేను సూతుని వివాహ మాడను." బ్రాహ్మణ రూపియైన యర్జునునితో నామె, ప్రతిజ్ఞ గెలువఁ బడిన తరువాత, ఆనందముతో వెళ్ళిపోయెను. మఱల ద్యూతసమయ మున నామె తన ధైర్యమును తొలఁగి పోనీయలేదు. ఆమెకు ధర్మ శాస్త్ర పరిచయము గూడ చక్కఁగా నుండెను. భీష్ముఁడు కూడ నుత్తర మీయఁ జాలనటు ప్రశ్నము నాకు సభనడిగెను. వ్యాస మహర్షియను నైతే 'బ్రహ్మవాదిని, పండిత' యను విశేషములను ప్రయోగించి యున్నాడు. ఆమె తన పతులతో వనవాసమునకు నిశ్చింతతో వెళ్ళిపో యెను. రాజకీయ విషయములందు ఆమె తన పతులతోఁ బలుమాఱులు వాదవివాదములు చేసెను. తన తపస్సు చేతను దీజస్సు చేతను ఆమె విరటుని యింటఁగష్ట గార్యములను, తన పాతివ్రత్యమును జాతివ్రత్యమున రక్షించికొని, సహించెను. చివర యుద్ధములో గెలుపొందిన పిదప ఆమె తన పతులతో రాజ్యము చేయు విషయమున అగ్రహించెను. ఈ విధ ముగా నామెయొక్క ఘనత, స్వాతంత్ర్యము, పాతివ్రత్యము మున్నగు గుణములను గవి వర్ణించి యున్నాఁడు.

## పతివ్రతా ధర్మము

ద్రౌపది ముఖము నుండియే (వనప. 233 వ యధ్యాయము) కవి యుత్తమురాలైన పనికి ఏ యాచరణ కావలయునో వర్ణింపఁ జేసి యున్నాడు. ఇవట నయ్యదెత్తి చెప్పుట చక్కగా నుండును. ద్రౌపది సత్యభామతోఁ జెప్పు చున్నది— "నేను నా పతులను విధముగా ప్రసన్నుల జేసితినో యది వినుము. అహంకారమును గోపము విడిచి స్త్రీ పతికి ప్రియమైన పని నెన్నడును జేయరాదు. పతియొక్క మనసు నుంచు కొనుటకై స్త్రీ నిరభిమాన భావముతో నతని శుశ్రూష చేయవలయును చెడు మాటలనుట లేక చెడు రీతిగా నుండుట, చెడునడత జరుపబడు రీతిగా జూచుట లేక కూర్చుండుట లేక మనసు వచ్చినట్లుగా నెచ్చటికో కొనిపోవుట—ఈ విషయములనుండి నేను మిగుల మరలు చుందును. నేను

యావత్తు మనస్సున నేమి యున్నదో పరీక్షించుటకు నాలోచింపను. నేను పరపురుషుని నెవరినైనను పొరపాటునఁ గూడఁ జూడను, మఱివాఁడు దేవతలలో గంధర్వుఁడు తరుణుఁడు లేక భాగ్యవంతుఁడు, సుందరవేషుఁడు లేక సుందరుఁ డైనను సరియే. నేను పతికంటె ముందుగా భోజనము చెయ్యను. స్నానము చేయను పరుండను సేవకుల విషయమునఁ గూడ నేనిట్లే వ్యవహరింతును. పతి వెలుపలినుండి వచ్చిన యెడల స్త్రీ నిలబడి యతన్ని నభినందించి యతనికి జలమును నాసనమును నీయవలయును. స్త్రీ యింటిలోని పాత్రములను బాగుగా శుభ్రపరుప వలయును. చక్కఁగా వంట తయారు చేయువలయును. పతికి నుచిత సమయమున భోజనము వడ్డింపవలయును. సామగ్రిని జాగ్రత్తగా నుంచవలయును. ఇల్లు తుడిచి శుభ్రముగా నుంచవలయును. చెడుగులతో సావాసము చేయఁ గూడదు. సోమరి తనము విడిచి పతిని నిరంతరము సంతోష పరుషవలయును. ఎవరితోడను బరిహాసమాడరాదు. నవ్వరాదు, ఇంటిబైటి గుమ్మమునొద్ద నిలుచుండరాదు. తోటలో నెక్కువసేపు వఱకు నాగరాదు. పతి ప్రవాస మందున్న యెడల నియమ శీలయై పువ్వులను గంధమును ద్యజింపవబయును, పతి తినని త్రాగని వస్తువును దానిగూడ వర్జింప వలయును,పతికి హితవులైన పనులే చేయువలయును.అత్తగారు చెప్పిన దానిని నేను రేయి పగళ్ళు సంసిద్ధతతో నవలంబింతును. అన్ని విధముల ధర్మ నిష్ఠులైన పతుల సేవను నేనీ విధముగాఁ బగపట్టిన పాముఁనకు భయపడినట్లు భయుంపడి చేయుచున్నాను. వేదవాదులైన యనేక బ్రాహ్మణులను నేను సత్కరించుచున్నాను. సేవకులు చేయుచున్న పనిమీఁద నెల్లపుడును నా దృష్టి నుంచుచున్నాను. గోపాలురు మొదలు మేషపాలుర వఱకు సేవకులందఱజ్ఞానమును నాకున్నది. కుటుంబములో జరగు నా యవ్యయము జమాఖర్చులపై మిగుల ధ్యానముతో దృష్టినుంచుచున్నాను. ఇట్టి వశీకరణమంత్రముచేత నేను నాపతులను వశముచేసి యున్నాను. మఱి యే వశీకరణమును నాకుఁ దెలియదు." ఈ వర్ణనము కుటుంబమున పత్ని యెట్లు వ్యవహరింపవలయునో యిందులకుఁ జక్కని యుదాహరణ మగుచున్నది కాని గార్హస్థ్యమందుఁ బత్ని కేది యుదాత్తకార్యమైయున్నదో, దానికి అనగా పతియొక్క సుఖదుఃఖముల భాగస్థురాలగుటకుఁ జక్కని చిత్రమందుఁ జూపఁ

బడలేదు. ఇది నేమంటేని మహాభారతమును వ్యాసుఁడు వర్ణించిన, ద్రౌపది యొక్క ప్రత్యక్షాచరణము దీనికంటె నెంతయు మంచితరగతిదియైయున్నది. ఆమె యెల్లపుడును బాంధవుల సుఖదుఃఖములను బంచుకొన్నదిగాఁ జూపఁ బడి యున్నది. కొన్ని యుపసరములందు ఆమె పతులతోఁ వాద వివాదము, జగడము, పట్టుదలయుఁ జేయుచున్నదనిగూడఁ జూపియున్నాఁడు. ప్రాచీన కాలమునుండియే స్త్రీలు యీ చరణవిషయమున సత్యం తోదాత్తమైన కల్పన భారతీయార్యులయొక్క స్త్రీల హృదయమునఁ గలదు. దీనికి సాక్ష్యమును మహాభారతమందలి యనేకవర్ణనములు కథలు నిచ్చుచున్నవి. మహాభారత సమయమున నార్యస్త్రీల పతిప్రేమము అవర్ణనీయమై యుండె ననుటకును, సతీపత్నులసంబంధముయొక్క దర్జా మిక్కిలి యుచ్చమైయుండె ననుటకును సందేహము లేదు.

## పతి పత్నుల యభేద్య సంబంధము

భారతములోని యొకప్రసంగమునుబట్టి పతి పత్నుల బంధుత్వ విషయమున భారతీయార్యులయందు నెంత యుదాత్తకల్పన యుండెనో యీ సంగతి చక్కగాఁ దెలిసికొనబడఁగలదు. ఇచటి దానివివేచన చేయఁబడుచున్నది. ద్రౌపదియొక్క వస్త్రాపహరణము చేయఁబడిన ప్రసంగమున నాను పూర్వోక్తమైన మహత్వముగల ప్రశంసలనుజేసెను. ఆమె యడిగెను.—"ధర్మరాజు మొదట స్వయముగనే పందెము పెట్టెను. మఱియు నోడిపోయిన తరువాత నతఁడు నన్ను పందె ముంచెను. నేను దాసినైతినా లేదా?" దీని కుత్తరమునుఁ భీష్ముఁ డీయఁజాలకపోయెను. వస్త్రములను లాగి లాగి దుశ్శాసనుఁడు అలసిపోయిన తరువాతఁ గూడ ద్రౌపది యీ ప్రశ్ననునే వైచెను. అపుడు భీష్ముఁ డుత్తరమిచ్చెను.—"ప్రశ్నము కఠినమై యున్నది. ఉత్తరమీయఁజాలను"— ఇదికూడ నొకసమస్యవలె దోఁచుచున్నది. ఈ యుత్తరముయొక్క యాధారముమీఁదఁ గొందఱు వస్త్రాపహరణ సందర్భము చట గాకపోయియే యుండుననియు యుక్తి చెప్పుచున్నారు. వస్త్రాపహరణసమయమున స్వయముగా ధర్మరాజు చమత్కరించి ద్రౌపది దాసికాదని సాక్ష్యమిచ్చెను. అపుడు భీష్మునికి శంక లేకపోవలయును. అనఁగా ఆక్షేపవార్తకు ద్రౌపతీవస్త్రాపహర

ణము కాల్పనిక మనియుఁ బ్రక్షిప్తమనియు గథనమైపోవుచున్నది. ఇదియే గాకుండ, ఈకథాభాగ సందర్భమును బట్టి భీష్మునియొక్క యత్యున్నతమైన చరిత్రముమీఁద సాధారణలోకుల మనస్సునందుఁగూడ శంక పుట్టుచున్నది. మహాభారతములోని వ్యక్తు లన్నిటియందును భీష్ముని చరిత్రము శ్రేష్ఠమై యున్నది. వారి విషయమున నెల్లరకును నాదరభావ మున్నది. ఎవఁడు తండ్రికై యాజన్మబ్రహ్మచర్యము నంగీకరించెనో, ఎవఁడు జ్ఞానము, అనుభవమున తపస్సు వీనిబలముచేత నందఱకు నాయకుఁడై యుండెనో, ఎవండు శస్త్రశాస్త్రవేత్తలందఱియందు నగ్రగణ్యుఁడై యుండెనో, ఎవఁడు ధృతరాష్ట్రునికిఁగూడఁ బినతండ్రియై యుండెనో, అనఁగా సమస్త కౌరవులకును బితామహుఁడై యుండెనో అతఁడు యుక్తాసమయమందు ద్రౌపది యొక్క ప్రశ్నమునకు యోగ్యమయినరీతి నుత్తరమిచ్చినయెడల, ఆ భయంకర యుద్ధము జరుగుటకు యవకాశమే లేకుండును. చాలమంది కిట్లె నచ్చుచున్నది. ఏ భీష్ముఁడు తాను సాక్షాత్తు గురులయిన మహారాజుయొక్క ధర్మవిరుద్ధమైన యాజ్ఞను మన్నింపలేదో, యతఁ డాసమయమందు రాజుసత్తాయొక్క యుంగీకారమందు నంగీకారమును గలిపెను. కొందఱి కిదియే తోఁచ నారంభించుచున్నది. కాని యుప్పటి ప్రసంగముపైని సూక్ష్మదృష్టితో విచారము చేయుఁబడునెడల భీష్ముఁ డపుడిచ్చిన యుత్తరమునుబట్టి యతనిమీఁద వచ్చిన ఆక్షేపము తొలఁగిపోవుచున్నది. ఇంతమాత్రమే కాకుండ పతి పత్నుల సంబంధమున నీతఁడొక యత్యంతోదాత్తమైన నియమము నిచటఁ జెప్పెననియుఁ గనపడగలదు. ధర్మరాజు తనయాట నోడిపోయి, శకునియొక్క ప్రోత్సాహము చేత ద్యూత మదాంధుఁడయి పందెమున ద్రౌపదినుంచెను. సభయంతయు నీ పట్ల నేవగించుకొనెను, అపుడుకూడ ధర్మరాజు పందె మట్లె యుంచెను. మార్చుకొన లేదు. కనుకఁ బందె మోడిపోయిన తరువాత ద్రౌపది కౌరవులకు దాసియైపోయెను. దుర్యోధనుఁ డున్మత్త భావముతో నామెను సభకుఁ బిలువనంపెను. అపుడు ఆమె కౌరవుల యుచ్చులో నుండి తప్పించుకొనుట కయి- ఃవరుల యధికారములోండి తప్పించుకొనుటమాత్రముకాదు- పతివ్రతయైన కారణమున నిట్టి యుక్తిప్రశ్నమును వైచెను. ఆ సమయమందు భీష్ముఁ డుత్తరమిచ్చెను. "దేనిపైఁ దనకు సత్తు చెలాయింపదో ఇట్టి ద్రవ్యము పందెములోఁ బెట్టఁబడఁజాలదు. మరి యేస్థితియందు నయిన నుండని స్త్రీపై నతని సత్తా

బోనేరదు. ఈ రెండువిషయములను జూచుచున్న నీప్రశ్నమునకు నిర్ణయము చేయుట కఠినకార్యమైయున్నది.

న ధర్మ సౌక్ష్మ్యా త్సుభగే వివక్తుం
శక్నోమి తే ప్రశ్నమిమం వివక్తుమ్
అస్వామ్య శక్తః పణితుం పరస్వం
స్త్రియశ్చ భర్తు ర్వశతాం సమీక్ష్య॥ (స. అ. 67)

ఈ యుత్తరము చేతఁ గౌరవులకు బలము వచ్చెను. దుశ్శాసనుఁడు ద్రౌపది యొక్క వస్త్రములను లాగెను. కాని ద్రౌపదికి రక్షకుఁ డైన శ్రీ కృష్ణుఁడును " జగన్నియంతయును పరమేశ్వరుఁడు— వరి త్యక్త ధర్మము ఆమె లజ్జను గాపాడెను. ఆమెకు వందలకొలఁది వస్త్రములనిచ్చెను. అయినను ఇంత మాత్రము చేతనే ద్రౌపది యొక్క ప్రశ్నము దొలఁగలేదు. ఆమె దాసిగా నెంచఁబడి దుర్యోధనుని కప్పగింపఁ బడుటయో లేక దాసిగా నెంచఁబడి యామె మనసుకి వచ్చిన చోటికి బోనిచ్చుటయో కావలయును. భీష్ముఁడు మాత్రమాపుణ్యకమైన యుత్తరమునే యిచ్చెను. ఇట్టి దశయందు ధృతరాష్ట్రుఁడు ప్రసన్నుడై ద్రౌపదికి వరము నిచ్చెను. ఆ వరదానము చేతఁ దన్నుఁదన పతులను విడిపించుకొనెను. దీని యనంతరమున వనవాసరూపమైన పందెము మీఁద జూదము జరిగెను, ఈ విధముననిచ్చటి సమాచారమున్నది.

ఇపుడు, భీష్ముఁడు మొదట నిచ్చిన యుత్తరము యోగ్యమైనదో లేక యయోగ్యమా? యని వస్త్రాపహరణ చమత్కారము వలన నా ప్రశ్నము యొక్క నిర్ణయమయ్యెనో లేదో? యునియు నిచటఁ బ్రశ్నముకలుగుచున్నది మనయూహను బట్టి మాత్రము భీష్ముఁడు నహి, అని యిచ్చిన యుత్తరమందు భారతీయార్యుల పతిపత్నుల విషయమై యొక యత్యంతోదాత్తమగు తత్త్వము చెప్పఁబడియున్నది. ఎందుచేత? పతికిఁ బత్నిమీద నున్న యధికారము వివాదింపఁగా పతితా నోడిపోయి తరువాతఁ గూడ, పత్నిమీఁద

నున్న యతని యధికారము పోయెనని చెప్పఁబడఁ జాలదని ముందుగాఁజెప్పి యున్నాఁడు. పతి యే స్థితియందైనను నుండుఁగాక, అతని సుఖదుఃఖను లలో భాగస్థురాలు తప్పక కావలయును. భారతీయార్యులేయుదాత్తతత్త్వ మునను పతి దాసుడు అయిన తరువాతఁ గూడను బల్లమీఁద నున్న యతని సత్తను హరింపలేదు. వారికి భావనయే యుండెను. ఈ భావన చేతనే ప్రేరితులై నేఁడు వేలఁకొలఁది యేండ్లనుండి హిందు స్థానమందలి స్త్రీపురుషులు, వివాహితావస్థ యందు, తాదాత్మ్యానంద సుఖము ననుభవించుచున్నారు. అనఁగా భీష్ముఁడు మొదట నిచ్చిన యుత్తరమే యోగ్యమును నుదాత్తమును దత్త్వానుసారియునై యుండెను. వస్త్రహరణ సమయమందు జరిగిన చమత్కారమును బట్టియు తత్త్వము ఖండింపఁబడునా? ద్రౌపది దాసి కాకుండుటకే ధర్మము నిర్ణయించునని విశ్వసింపఁబడునని, ధర్మము చేసిన చమత్కారము తనకాలుసేతులను బోఁగొట్టుకొనుటకె చేసెను. ఆ సమయమున యుధిష్ఠిరుఁడు మితభాషిత్వమును గై కొనుటకు గూడ నిద్దియే కారణము. రాజధర్మమును, ఆపద్ధర్మమును, మోక్షధర్మమును గూడఁ జెప్పినట్టి భీష్ముఁడు, చమత్కారము జరుగక మునుపు, యోగ్యమైన నిర్ణయమును జేయఁ జాలకపోయెను. వస్త్రహరణ సమయమున జరగిన చమత్కారము ద్రౌపది యొక్క ప్రశ్నమును దొలగింపలేదు; కాని ద్యూత సమయమున దాసిని గూడ సభకుఁ బిలువరాదనియు, ఆమెకు మర్యాద చేయఁగూడదనియు సూచించుచున్నది. చమత్కారము యొక్క ప్రాదుర్భావము కూడ ఇంత మాత్రముననే యుపయోగపడుచున్నది. ఈ చమత్కారమున్నందులకు నీ యభిప్రాయము కాఁగలది కాకమానదని విశ్వసింపఁబడజాలదు. ఈ విధముగా విశ్వసింపఁబడునని ద్రౌపది తన పాతివ్రత్యము యొక్క పుణ్యమువలన దుశ్శాసనుఁడు దుర్యోధనుడు మొదలగు దుష్టులనందఱను భస్మము చేసి వైచి యుండును. భయంకరమైన యుద్ధము జరుగుట కవసరమే రాకుండెను. కాని చమత్కారముల యొక్క యుత్పత్తి సృష్టిక్రమమందుఁ గేవలమంత మాత్రమే యనివార్యమైన కష్టము నుండి రక్షించుటకై యగుచున్నది. పాఠకుల కీతత్త్వముపై ధ్యానముండవలయును. చమత్కారము వలన ద్రౌపది యొక్క మర్యాద సంరక్షింపబడెను. ఇందుచేతనే యామె విషయమై యందఱ మనస్సునందును బూజ్యభావము ఉత్పన్నమయ్యెను. అగుఁగాక ఈ చమత్కారపు మార్గమున ధర్మ

రూపుఁడైన యీశ్వరుఁడు ద్రౌపది దాసికానేకాదని యీయుధర్మరూపమైన యుత్తరము నెన్నఁడు నీయఁబోఁడు. పతిపత్నుల బాంధవ్యపు సంబంధమున మహాభారతము భారతీయ స్త్రీపురుషులు మనస్సులందుఁ బ్రతిబింబింపఁ జేసి యుదాత్త కల్పనలను దానికంటె విపరీత నిశ్చయమువలన నష్టము సంభవింపఁగలదు. ద్రౌపదిని విడిపించుట విషయమై భీష్ముఁడు నిశ్చయమును జేయఁజాలకుండెను. ఇదియే సముంజసముగా నుండెను. ఇటువంటి యాపత్సమయమందు తన రాజత్వముచేత అధికారములఁ బ్రయోగింపవలసియుండెను ధృతరాష్ట్రుఁడిట్లే చేసెనని మహాభారతమందు వర్ణింపబడియున్నది. భీష్మునకి యధికారము లేకుండెను, భీష్ముఁడు మాత్రము ప్రధానుఁడు లేక న్యాయాధీశుఁడై యుండెను. సారాంశము, ద్రౌపది యొక్క వస్త్రాపహరణము గల సందర్భము ప్రక్షిప్తమును కాదు మఱియు నసభ్యది, ఈ సంబంధమునఁ గొందఱు భీష్ముని యుదాత్త చారిత్ర్యమునందుఁ జేయుచున్న యాక్షేపము నకుఁ గూడ యోగ్యత కానేరదు. ద్యూతమదముచేత నంధుఁడై యుధిష్ఠిరుఁడు తనకుఁ దానే గోతిలోఁ బడిపోయెను. ఇతర పాండవులు గూడ దానిని యుక్తసమయమున నిషేధింపలేదు; ఇందుచేత నతనికి ద్రౌపదిపై నధికారము పోయెను. దానికి బదులు చెప్పఁజాలకుండెను. నలమహారాజు కూడఁ జేయని పనిని యుధిష్ఠిరుఁడు చేసెను ఇందులకు భీష్ముఁడేమి చేయును ? భీష్ముఁడా సమయమునఁ గూడఁ దన యాచరణమును ధర్మము, న్యాయములేని తారతమ్యమునుతో మిగుల సరిగా నుంచుకొనెను. వారి పత్నులసంబంధముయొక్క యుదాత్త కల్పన యెంతవఱకుఁ బోయియున్నదో భీష్ముఁ డిచ్చట భారతీయార్యులకుఁ జూపియున్నాఁడు. మఱియు మహాభారత కాలము నుండి నేటి వఱకు వేలకొలది సంవత్సరముల వఱకు పతిపత్నుల సౌంధర్యము సంబంధమున నీ యుదాత్త భావమే భారతీయ స్త్రీల హృదయమందు నాచరణమందును బూర్ణముగా సమకూడి స్థిరపడియున్నది, అది యుక్తముగా నున్నది.

ఇట్లుండఁగా, అలగ్జాండరుతోఁ గూడ వచ్చిన గ్రీసు చరిత్రకారులు భారతీయ స్త్రీల సద్గుణముల విషయమై కొంత ప్రతికూలము లైన లేఖనములను తమ గ్రంథములలో వ్రాసి వైచియున్నారు

ఒకచోట వ్రాసియున్నాడు— "హిందూదేశస్థులనేక స్త్రీలనుంచుకొనుచున్నారు కొందఱు నౌకరీ చేయుటకు. కొందఱు భోగవిలాసముకొఱకు మరికొందఱు పిల్లలతో నింటిని నిండించుకొఱకు. స్త్రీల సదాచారముయొక్క సంరక్షణము బలాత్కారముగాఁ జేయబడదేని వారు చెడిపోవుచున్నారు. ఈ పరిణామము కలుగుచున్నది." చిన్న యంతఃపురమునందుఁ జాలమంది స్త్రీలను బంధించెడి యాచారమున్న చోటులనెల్లను ఇటువంటి పరిణామము కొంచెమెచ్చుగానో తగ్గుగానో యగపడఁగలదనియే ప్రపంచమంతటియొక్క యనుభవమై యున్నది. కాని ప్రాచీన సమయమందు క్షత్రియ స్త్రీల నింటిలో బంధించి యుంచెడు నాచారము లేకుండెను; స్త్రీల కధిక స్వాతంత్ర్యముతో నిరాటంకముగా బయటికిఁ బోనిచ్చుటకును దిరుగుటకును నవసరము లభించుచుండెను పైని జెప్పఁబడిన గ్రీసు మతమునకుఁ గారణము మన యూహయందు, ప్రతి దేశమువారి యందును మరియొక దేశపు స్త్రీలయొక్క సద్గుణములవిషయమై ప్రతికూలమైన ప్రమాదమెల్లప్పుడును గలుగుచున్న యట్టి ప్రతివాదము తఱచు సత్యముగానుండదు. గ్రీసు చిత్రకారులు వ్రాసిన యీ ప్రవాదము కూడ నీ శ్రేణిలోనిదే కాఁగలదు. కర్ణశల్యుల నడుమ ప్రచుర భాషణము జరిగినట్లు మహాభారతకారుఁడు కర్ణపర్వమందుఁ జేసిన వర్ణనములోఁగూడఁ గర్ణుఁడు మద్రస్త్రీలను బంజాబులోని యితర బాహిక స్త్రీలను నీ విధముగనే నిందించియున్నాడు. ఈ నిందయందు అతిశయోక్తి యున్నదనుటలో సందేహము లేదు. అయినను మూలమందేదో కొంత సత్యముండుటచేత మహాభారత సమయమున నొకప్పుడు పంజాబులో నీ స్థితి యుండియుండును; ఈబలము మీఁదనే గ్రీకులయొక్క ప్రతికూలాభిప్రాయమునకుఁ గొంత మూలముగుపునాది యుండును; మన దృష్టిలో మునుపటి సిద్ధాంతమునకే యొక నమూనాయైయున్నది. అనఁగా కర్ణుని మనస్సునందుఁ బంజాబు స్త్రీల విషయమునను తుచ్ఛాభిప్రాయము, ప్రతి సమాజమునకును ఇతరసమాజ విషయమున నుండెడు నాలోచనముయొక్క పరిణామమై యున్నది. అనఁగా కర్ణపర్వములోని కర్ణుని భాషణమునుబట్టి లేక గ్రీసు చరిత్రకారుల వర్ణనములను బట్టి భారతీయార్య స్త్రీల పాతివ్రత్యముయొక్క యుచ్చ స్వరూపమందు ఏది మహాభారతమందగపడుచున్నదో, దానికిఏ విధమైన లోటును రానేరదు.

## సతి యొక్క యాచారము

ఈ యుపపత్తికి యూనానీయులు చెప్పిన మాటల సాక్షి యావశ్యకమగు నేని, అది సతియొక్క యాచారమై యున్నది. సతియొక్క యాచారము భారతీయార్యులయందుండినట్లు మరి యే జాతియందు ప్రచలితమై యగపడదు. దాని యుదాహరణము లితరులయందు మిక్కిలిగాఁ దక్కువ యున్నది. సతియొక్క పతిప్రేమ పాతివ్రత్యముయొక్క యుదాత్త కల్పనయే యాధారమై యున్నది. హిందూదేశమందు సతియొక్క యాధారము ప్రాచీన కాలమునుండి యిప్పటి భారత కాలమువఱకుఁ ప్రచలితమై యగపడు చున్నది. వేరేల గ్రీకు చరిత్రకారులు కూడ దీనికి సంబంధించు ప్రమాణము వ్రాసియుండిరి. పంజాబునందలి కొందరి విషయమున వారు వీరి స్త్రీలు పతియొక్క మరణమునందు సంతోషమై దేహమును త్యజించుచున్నారని వ్రాసి యున్నారు. ఈ విధముగా దేహమును త్యజించుటకై నున్న ధైర్యమీస్త్రీలకెట్లు పుట్టుచున్నదని గ్రీకు చరిత్రకారులకు మిగుల నాశ్చర్యము కలుగుచుండెను. కాని వారు యిట్టి దేహత్యాగము సంతోషపూర్వకముగనే చేయుచున్నారనియు వ్రాసియున్నారు, గ్రీకు సైన్యమందు కేటియస్ అను పేరుగలయొక భారతీయ క్షత్రియుఁడు నాయకుఁడుగానుండెను. అతఁడు మృతుడై నపిదప సతియగుటకై, యతని యిరువురి స్త్రీలయందును కలహమయ్యెను. తుదకు పెద్దభార్యను, గర్భవతియైన కారణముచేత సతిని గానీయలేదు, చిన్నభార్య యీ సన్మానమును పొందియానందముతో సతియై పోయెను. ఈ వర్ణనమును గ్రీకువారే చేసియున్నారు, దీనిఁబట్టి, అలెగ్జాండరుకుఁబూర్వము అనఁగా మహాభారత కాలమునకు మునుపటినుండియే హిందూదేశమందు సతియయ్యెడు నాచారముండెనని ప్రకటనమగుచున్నది; ఈ విషయమై యత్యంత పవిత్రత యొక్క కల్పన లేకుండిన దానియిచ్ఛచేత సతియై పోవుట సంభవము కానేరదు, మహాభారతమందుఁగూడఁ బాండురాజుతో మాద్రి సతియై పోయినవర్ణన మున్నది. ఆ మాద్రిగూడ మద్రదేశపు పంజాబుస్త్రీయే యైయుండెను. ఇంద్రప్రస్థమందు శ్రీకృష్ణుని స్త్రీలెందరో సతులై పోయిన వర్ణనము మహాభారతములోఁ గలదు. భారతీయ యుద్ధమైపోయిన తరువాత దుర్యోధనుని స్త్రీలు సతులైనట్లు గాని యితర రాజుల స్త్రీలు సతులైనట్లుగాని వర్ణనము మహాభారత

లేకున్నది. కాని మహాభారతమందు దుర్యోధన స్త్రీల పేరు కూడలేదు. ఇక వారు సతులైన సంగతి మాత్రమెట్లుండును. ఇతర రాజుల స్త్రీల పేరు కూడ లేదు. ఇందుచేత వారి విషయమై కొంచెమైనను వర్ణనయందు తాత్పర్యము, ఈ వర్ణనము లేనంత మాత్రమున, గొంచెమైనను ప్రతికూలమైన యను మానము లేదు,అనఁగా సతియయ్యెడి పద్ధతి బహు పురాతనమై యుం డెను. గ్రీసు చరిత్ర ప్రమాణమును బట్టి మహాభారత సమయమున నయ్యది ప్రచలితమైన మాట నిస్సందేహమై యున్నది. హిందూదేశమందు సతి యొక్క యనుమానము ఆంగ్ల రాజ్యము యొక్క యారంభము వఱకు నుండెను. కాని యిప్పుడది సర్కారు వారి శాసనము వలన నిషిద్ధమైపోయి యునది.

## ఘోషా యొక్క యాచారము

ఈ వరుసలో, మహాభారత కాలమున హిందూదేశమందు ఘోషాపద్ధతి యుండెనా లేదా యను ప్రశ్నము తఱచు చేయఁబడుచున్నది. మహాభారత మందలి యనేక వర్ణనములఁ బట్టి, క్షత్రియ రాజుల యందు మహాభారత సమ యమున ఘోషా యుండి యుండునని యనుమానము కలుగుచున్నది. శల్య పర్వమందు, యుద్ధము ముగిసిన తర్వాత దుర్యోధనుని యొక్క స్త్రీలు హస్తినాపురము వైపు పరుగెత్తినప్పటి వర్ణనముగలదు. ఎన్నడును సూర్యుఁడు సైతం చూడని స్త్రీలిపుడు బట్టబయలుగా నందఱ కళ్ళముందఱ ఘోషాలేకుండ బోవుచున్నారని యున్నది. దీనిఁబట్టి కూడఁ బూర్వోక్తమైన యనుమానము కలుగుచున్నది; కాని యిందుఁ గొంత యభిప్రాయమున్నది. స్త్రీపర్వము యొక్క 10వ యధ్యాయమందు ఈ వర్ణనమున్నది; "ప్రత్యక్షదేవతలు కూడ నెనఁడు నెవరి గోళ్ళను కూడఁ జూడలేదో యట్టి స్త్రీలు కూడ, అనాథలైన కారణమున, లోకులకుఁ గనఁబడుచున్నారు." ఈ వాక్యమును బట్టి. భర్త జీవించియున్న వారే ఘోషాలో నుండెడివారని యనుమానము కలుగుచు న్నది కాని యనాథలు అనఁగా విధవలయిన స్త్రీలు వెలుపలికి జనసామాన్య ములో వెడలుచుండిరి.మహాభారత సమయమున ఘోషా యొక్క యాచారము ప్రత్యక్షముగా నుండెననుటలో సందేహము లేదు; ఎందుచేత ? గ్రీసుచరిత్ర

కారులు కూడ దీనినివర్ణించియున్నారు. మెగస్థనీసు దీనిని వర్ణించియున్నాఁడు కథా సరిత్సాగర మందుఁగూడ నందుల యంతఃపురము యొక్క వర్ణన మున్నది. దానిబట్టియు, రాజస్త్రీలు, దేవతలు సైతము వారి కాలిగోళ్ళసైనఁ జూడఁజాలని విధముగా ఘోషాలో నుంచఁబడుచుండిరని ప్రకటమగుచున్నది. ఒక పాటలిపుత్ర యంతఃపురమునైపు కనుసెత్తి చూచినందుకుఁగాను అతనికిఁ బాటలీపుత్రమునందు ప్రాణదండము విధింపఁబడెనని కథా సరిత్సాగరములో వర్ణింపఁబడియున్నది. సారాంశము; మహాభారత సమయమున అనఁగా క్రీ॥ పూ॥ 300 ఏండ్లకు దాదాపు రాజుల యొక్క యీ ఘోషా పద్ధతి సంపూర్ణముగా ప్రచలితమై యుండెను. ఈ కారణము చేత సౌతి మహాభారత మందుఁ బైని జెప్పఁబడిన వర్ణనమునకు స్థానము నిచ్చియున్నాఁడు. కాని మొదటి నుండియు భారతీయార్య క్షత్రియుల యందు యీ రీతి లేకుండి యుండునని యనుమానమగుచునది. భారతీయ కథలోని భిన్నభిన్న ప్రసంగముల యొక్క చిత్రములు కనుల యెదుట నుంచుకొనఁబడునేని యతి ప్రాచీనకాలమందు ఈ ఘోషాలేకుండి యుండునని తెలియఁ గలము. సుభద్ర రైవతక పర్వతము మీఁద, యాదవస్త్రీలతో పాటు బహిరంగముగా యుత్సవ మందుఁ దిరుగుచుండెడిది. యిందుచేతనే యామె యర్జునుని కంటఁబడెను. ద్యూతసమయమున ద్రౌపది ధృతరాష్ట్రుని స్త్రీలలోఁ గూర్చుండి యుండెను. అచట దుశ్శాసనుఁడు లేక ప్రాతికామి దూతకు ఘోషా యున్నచో నామె యచటకిఁ బోఁజాలదు, మఱియుఁ యిదే విధముగా ద్రౌపది గూడ నిండుసభ లోనికిఁ దీసికొని రాఁబడఁజాలదు. వనవాస మందు ద్రౌపది ప్రకటముగాఁ బాండవులతోఁ గూడ నుండెను. మఱియు జయద్రథుఁడామెను దలుపువద్ద నిలఁబడిన వాఁడై చూచి హరించుటకుఁ బ్రయత్నించి యుండెను; ఇట్టి యనే కోదాహరణములఁ బట్టి, భారతీయ యుద్ధసమయమున క్షత్రియస్త్రీలకై తెఱకంటఁబడ కుండెనని మన యభిప్రాయమై యున్నది. సాధారణరీతిని వారు బొత్తిగా వెలుపలఁ దిరుగుచుండెడివారుకారు, కాని యిప్పటివలెఁ దెఱ యొక్క యాచారమప్పుడు లేకుండెను. సీత యొక్క శుద్ధి సమయమున రాముఁడు చెప్పియున్నాఁడు. "వివాహము, యజ్ఞము సంకటము వీనిని యొక్క సమయమున స్త్రీలు పరుల యెదుటికి వచ్చినప్పటికిని హాని యేమి యునులేదు." అనఁగా యిట్టి సమయముల యందైతే ప్రాచీనకాలమందు

స్త్రీలకుఁ దెలిసేనే లేకుండెను. యీ సంగతి యవశ్యము విశ్వసింపవలయును. కాని పైని ద్రౌపది విషయమున ఆ ప్రసంగసమయము ఏ వర్ణనము చేయఁబడి యున్నదో, వానిఁబట్టి, యితర సమయమందుఁ గూడ క్షత్రియ రాజులస్త్రీలు తెలిలేకుండానే నిర్భయముగా వెలుపలికి వచ్చుచుపోవుచుండిరి. మహాభారత వర్ణనముఁ బట్టి వారు లోకుల దృష్టి నుండి దాగుకొని యుండనుండలేదని కనఁ బడఁచునది. తలచు ఘోషా పద్ధతి పర్షియా ప్రజల నుండి, పర్షియన్ చక్ర వర్తుల యనుకారణముమీద నందుడు మొదలైన క్షత్రియ చక్రవర్తులు నేర్చుకొని యుందురు. అనఁగా క్రీ॥ పూ॥ 460-416 ఏండ్ల దాదాపున వీని యొక్క యనుకరణము చేయఁబడెను. మఱియు మహాభారత సమయమున నీరితి ప్రచలితమై యుండెను.

## మఱియొక బంధనము

స్మృతి కాలమునందు వివాహవిషయమున నగపడుచున్న బంధనములు మహాభారత సమయములో నుండెనా లేదా? యీ విషయమై యిచట విచా రింపవలసియున్నది. సగోత్ర వివాహమున శాస్త్రీయమని విశ్వసించు నియ మము మహాభారత సమయమునను నుపస్థితమై యుండెనని మైతేమునుపు చూడఁబడియున్నది. గోత్రమున కర్థము, ఒకానొక వివక్షితపురుషు నుండి యుత్పన్నమైన పురుషసంతతి యని చేయువలయును. భారతీయార్య సమాజ మందు, వివాహ మొకటే జాతియందుఁ గావలయును. కాని యొకటే గోత్ర మందుఁ గాఁగూడదను నిబంధనము విశేషరూపముతోఁ గనఁబడుచున్నది. మహాభారత సమయమున గోత్రముతోపాటు ప్రవరముఁ గూడ నిషేధముండెను మహాభారత సమయమందు, ఒకటే ప్రవరయందు వివాహము చేయఁబడఁ జాలదను నియమముండెను. ఈ నిబంధన మెపుడారంభ మయ్యెనో యీజాడ మహాభారతమువల్ల దొరకకున్నది. మహాభారతములో నింతమాత్రమే ప్రా యున్నాఁడు—"కాలక్రమమునఁ ప్రవరలుత్పన్నమైనట్టివి"కాని దీనిబట్టి యే బోధయుఁగాకున్నది. ప్రవరలు మూఁడు లేక అయిదు కలవు అనఁగామూఁడు గోత్రములయందు మఱికొంత యెక్కువగా అయిదు గోత్రముల యందు వివాహ సంబంధముల్లు కానేరదు. ప్రాచీనకాలమందట్టి గోత్రముల్లుకొన్ని కారణ

ములచేత, రాగము చేత లేక ద్వేషముచేత. యితర కారణములచేత నిశ్చిత ములై యుండును. వివిధ గోత్రముల యొక్క ప్రవరలు సూత్రమందుఁ బఠింపఁబడియున్నవి. కాని యున్ని చోట్లను, ఉదాహరణార్థము బ్రాహ్మణు లందఱియందును, వారే శాఖవారైనను సరియే, గోత్రముల యొక్క ప్రవర లొకటియై యున్నవి. దీన్నిఁ బట్టి యీ ప్రవరభేదము బహుప్రాచీన కాలమందు అనఁగా మహాభారతము కంటెను ప్రాచీన కాలమందు నుత్పన్నమై యుండును.

సగోత్రముగాక, మాతృసంబంధము వలన నైదు తరముల వఱకు వివాహ లార్జ్యమైయున్నది. ఇది వర్తమాన స్మృతి శాస్త్రము యొక్క నియమమై యున్నది. భారతీయార్యుల యందీ నియమ మెంతవఱకుఁ బ్రచలితమై యుండెనో యిపుడు చూడవలయుముఁ చంద్రవంశార్యుల యందీ నియమమునకు లోఁబడి యుండుట స్పష్టముగా నగపడుచున్నది: మేనమామ యొక్క కూతురు ప్రస్తుత సమయమున వివాహము పట్ల వర్జ్యమైయున్నది; కాని పాండవుల నాఁడు చంద్రవంశ క్షత్రియులలో దీనికి నిషేధములేకుండెను దీని కానేక యుదాహరణములున్నవి. శ్రీకృష్ణుని పుత్రుఁడైన ప్రద్యుమ్నుని వివాహము అతని మేనమామయగు రుక్మి యొక్క కూతురు జరగి యుండెను. ప్రద్యుమ్నునికిఁ బుత్రుఁడైన యనిరుద్ధని వివాహము గూడ అతని మేనమామ యొక్క సోదరితో జరిగెను. ఈ వివాహముల వర్ణనముఁ బట్టి, మేనమామకు వివాహమాడుటను జంద్రవంశార్యులు విశేషప్రశస్తముగా విశ్వసింపకుండిరని తెలియుచున్నది. సుభద్రతో నర్జునునికి జరగినవివాహము గూడ నిటువంటిదేయై యుండెను. సుభద్రయతని మేనమామకు తోఁబుట్టువై యుండెను. భీముని వివాహము శిశుపాలుని తోఁబుట్టువుతో జరిగియుండెను. ఈ సంబంధము గూడ నిటువంటిదేయై యుండెను. శిశుపాలుని తల్లియుఁ గుంతియు నిద్దఱును దోఁబుట్టువులై యుండిరి. ఇట్టి యనేకోదాహరణములఁ బట్టి, మేనమామ కూతురును వివాహమాడుట యాకాలమున సాధారణమైన సంగతిగా నుండెనని సిద్ధమైయున్నది. ఇట్టి వివాహము మొదట, దక్షిణపు వైపున మహారాష్ట్రులయందు ప్రశస్తముగావిశ్వసింపఁబడుచుండెనని యిచ్చట

జెప్పవలసియున్నది. బ్రాహ్మణుల యందును క్షత్రియుల యందును నిట్టి వివాహములు ఆ వైపున మొదట జరుగుచుండెను. దక్షిణమున శ్వసురుని మామయని చెప్పెడు వ్యవహారమిప్పటి వఱకు గలదు. జందెము వేయు నీవు యమునఁ బిల్లవాఁడు కాశీకిబోవు మర్యాదను నెఱవేర్పఁ దొడగినపుడు, మేన మామయే యతనికిఁ గన్య నిచ్చెదనని మాట యిచ్చి యాపుచున్నాడు. నిచ్చెనని మాట యిచ్చు నాచారము సంయుక్త ప్రాంతము వైపునలేదు. కేవలము మనిపించుటకేనై యున్నది. ధర్మశాస్త్ర నిబంధమున వ్రాసియున్నాడు. కూతురిక వ్యాపరిణయము మహారాష్ట్రులకు సనాచారమై యున్నది. కన్యా మహారాష్ట్రులు చంద్రవంశ క్షత్రియుల వంశములని విశ్వసించుటకు నాటంకములేదు. ఏమయిన నగుఁగాక; మహాభారత సమయములఁ జంద్ర వంశార్యుల యందు మామ కన్యావివాహము నిషిద్ధమని విశ్వసించువారు కాకుండిరని చెప్పబడఁగలను.

మహాభారత సమయమున వివాహము నిషయమై, జ్యేష్ఠసోదరునికి వివాహము కాకుండఁ గనిష్ఠునికి వివాహముకూడదని యింకొకనియమమున్నట్లు కనఁబడుచున్నది. ఇట్లు వివాహము చేసికొన్న వానికెక్కువ పాపము తగులు నని విశ్వసింపబడియుండెను. అవుకు జ్యేష్ఠసోదరుఁడు పతితుఁడు లేకసన్యాసి యగునెడల రికాదనుఁడుగు పాతకము నుండి కనిష్ఠుడు విముక్తుడై చేయఁ బడియున్నాడు. శాం. అ. 34 పరివేత్తకు అనగా వివాహము చేసికొన్న కనిష్ఠ సోదరునికిఁ బ్రాయశ్చిత్తము చేయవలయునని చెప్పబడియున్నది. జ్యేష్ఠసోదరునికి వివాహమగుతోడనే, కృచ్ఛ్రము చేయుటవలన, అతఁడు ముక్తుఁడగు నని వర్ణనయున్నది. కాని; ఆతనికి శూద్రదను వివాహము చేరువలయునని యొక నియమమున్నది. (శాం. అ. 35 ఇది గాకుండ స్త్రీలకివరివేదనదోషము తగులదు అనగా జ్యేష్ఠసోదరికి వివాహము గాకముందే కనిష్ఠసోదరికి వివాహము చేసెడల ఆమె దోషిణి లేక పాతకిని కాదను విషయముప్రాయుఁదగియున్నది. స్త్రీలకు నుత్తముడైన వరుఁడు దొరకిన వెంటనే వివాహముచేయవలయును. అవివాహితలఁ గానుంపఁ గూడదని మన యభిప్రాయముండియుండును. స్త్రీలకు వివాహము తప్పక కావలయును. పురుషులకుగాకున్నను నష్టములేదు. ఈ యభిప్రాయము కూడఁ గాఁగలదు.

—/—

ఎనిమిదవ ప్రకరణము

# సామాజిక పరిస్థితి

## అన్నము

భారతీయ కాల ప్రారంభమందు అనఁగా భారతీయ యుద్ధ సమయమందు, భారతీయ కాలముయొక్క యంతమందు అనఁగా మహాభారత సమయమందును, భారతీయార్యుల పరిస్థితిలో, వివిధ విషయములందు నధికమైన యంతరమగపడుచున్నది; వారియొక్క వివాహ వ్యవస్థయందు వలెనే వర్ణ వ్యవస్థయందుఁ గూడ నంతరము తటస్థమయ్యెను. ఈ విషయముల విచారమంత వఱకుఁ జేయఁబడి యున్నది. భోజన సంబంధమందు, ఈ సమయములందు వారి పరిస్థితిలో నింతకంటెఁగూడ విశేషించి భేదము తటస్థించి యుండెను. అనఁగా భారతీయ కాలమందు క్రీ. పూ. 3400 నుండి 100 ల వఱకు ఆర్యుల యందీ విషయమున నధిక భేదము తటస్థించెను. ఈ భేదము ఉపనిషత్తులు మొదలుకొని మహాభారత మనుస్మృతుల వఱకు వివిధ గ్రంథములలోను బూర్ణముగా నగపడుచున్నది. ఈ భేదము, ఒక దృష్టిచేత, ఆర్యుల యున్నతికి కారణీభూతమైన మొదల రెండవ విధముగా వారియొక్క యవనతికై దీనికిఁ గారణత్వము విశ్వసింపవలసి వచ్చుచున్నది. అధ్యాత్మికముయొక్క లేక నీతియొక్క దృష్టిచేతఁ జూచితిమేని కేవలము ధార్మిక విచారమునకుఁ గేవలాధ్యాత్మికోన్నతి యున్నది. మొత్తముగా మాంసభోజనమును త్యజించిన వారియొక్క ఆధ్యాత్మిక కల్యాణమును చూచుటకై కోరిక యెంత ప్రశంశ చేసినను తప్పునే. కాని వ్యావహారిక రాజకీయ దృష్టితో చూచినచో తమ రాజకీయ స్వాధీనత్వమును విడుచుటచే వారికి మాన్యము చేసికొని భారతీయులు శాకాహార భోజనముచే అంగికరించిరి పేక్షములు ఒకచోట ఈ సంగతి చేసినను కాని వేరు వేరు కారణములచేత భారతకాలములో భారతీయార్యుల భోజనము మార్పుచెందెను. ఈ భాగములో ఈ సంగతి విస్తారముగా చూపించుటకు యుత్నము చేయబడును.

ప్రాచీన వైదిక ఋషులు యజ్ఞమును పూర్తిగా చేయుచుండి రనుట ప్రసిద్ధము. వైదిక క్షత్రియులును యజ్ఞముల ననేకమద్ధతు లాచరించుచుండిరి. ఈ వైదిక యజ్ఞములన్నియు హింసతోఁ గూడినవి. ఈ యజ్ఞములలో వేరు వేరు పశువులు చంపబడి హోమము చేయుబడుచుండెను. అనగా మా మూలుగా ప్రాచీనకాలములో ఇతర దేశీయుల వలెనే వీరును మాంసము తిను చుండిరి. ఇందులో ఆశ్చర్యములేదు. మఱియు

యదన్నః పురుషో భవతి తదన్నాస్తస్య దేవతాః ॥

ఈ న్యాయముచేత వైదికకాలికులైన బ్రాహ్మణులును క్షత్రియులును యజ్ఞమునందుఁ బశువులను జంపి, భిన్న భిన్న దేవతలకు, వారు భక్షించు మాంసముయొక్క హవిర్భాగము నర్పించుచుండిరి. తాము కూడ మాంస హవిస్సును భక్షించుచుండిరి. ఈ యజ్ఞముల యొక్క మహత్త్వము గవాలంభము మఱియు నశ్వమేధము వఱకుఁ బోయియుండెను. మరియు సమస్త యజ్ఞముల యందును అశ్వమేధము శ్రేష్ఠముగా విశ్వసింపఁబడుచుండెను. అశ్వమేధము చేయుటలో నొక విధమైన రాజకీయైశ్వర్యము వ్యక్తమగు చుండెను. ఇందుచేత సామర్థ్య వంతులైన క్షత్రియులు అశ్వమేధమును జేయుచుండిరి. పాండవులివి రెండు యజ్ఞములు చేసియుండిరని మహాభారతమందు వర్ణింపఁ బడియున్నది. పాండవులు చేసిన అశ్వమేదము యొక్క వర్ణనము మహాభారత సమయమునందు వందల కొలది ప్రాణులు చంపఁ బడినట్లు వర్ణనమున్నది.

తంతం దేహం సముద్దిశ్య పశవః పక్షిణశ్చయే ।
ఋషభాః శాస్త్రపఠితాస్తథా జలచరాశ్చయే ॥
సర్వాంస్తానభ్య యుంజంస్తేతత్రాగ్ని చయ కర్మణి ।
(అశ్వ. అ. 88—34)

ఈ వర్ణనముఁబట్టి యుధిష్ఠురుని యజ్ఞమందు హోమము చేయుటకై యనేకమైన పశుపక్షులు చంపబడెనని స్పష్టమగుచున్నది. అశ్వమేధ విధి మంచిదే, శ్రౌత సూత్రమునమసరించ, అనేక పశువులనుజంపవలసియున్నది. యజ్ఞమందుఁ జంపబడిన పశువుల మాంసమును బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులును నిస్సంధేహముగాఁ దినుచుండిరి, యుధిష్ఠురుని యశ్వమేధోత్సవ ముయొక్క యవరమునఁగూడ ననేక పశువుల హింస యగుచుండెనని మహా భారతమందు వర్ణితమై యున్నది.

భక్ష్యఖాండవ రాగాణాం క్రియతాంభుజ్యతాంతథా।
పశునాంవధ్యతాంచైవ నాంతం దదృశిరే జనాః॥

[అశ్వా. అ. 41]

"అశ్వమేధ యజ్ఞమందు ఖాండపరాగ, పక్వాన్నమును సిద్ధము చేయుటలోనెంతమంది మనుష్యులు కావలసియుండిరో యెన్ని పశువులు చంపబడుచుండెనో వారికిఁ బరిమితిలేదు" అశ్వమేధ పర్వము 89వ యధ్యాయము ఇది కాకుండ ఇంకఅనేకవర్ణనములు ఈ విషయమై మహాభారతముచేత నీయఁబడగలుగుచున్నది. సభాపర్వముయొక్క 4వ యధ్యాయమందు మయ సభా గృహమునఁ బ్రవేశించుసమయమున పదివేలమంది బ్రాహ్మణులకు భోజనముచేయుంపఁబడెను. ఆ సమయమునధర్మరాజు—"ఉత్తమోత్తములైనకంద మూలములు మరియు ఫలములు వరాహములుమరియు హరిణములమాంసము నెయ్యిపేసెనువ్వులతోకలిపిన పదార్థములు ఇంకను వివిధములైన మాంసముల చేతవారిని సంతుష్టులనుచేసెను"ఈ వర్ణనముఁబట్టి పశ్చిమార్యులైన గ్రీకులు జర్మనులు మొదలైనవారుమాంసభక్షణమునుజేయుచున్నట్లే, భారతీయయుద్ధ సమయమందు భారతీ యార్యులెన బ్రహ్మ క్షత్రియ వైశ్యులును మాంస మును భక్షించుచుండిరి.

## మాంసము యొక్క పరిత్యాగము

కాని మహాభారత సమయమున అనఁగా సౌతి సమయమున భారతీయ యార్యుల పరిస్థితి యధికముగా వేరై యుండెను. మరియు భారతీయార్యులు

విశేషించి బ్రాహ్మణులు అందును ఆధ్యాత్మిక మార్గమందు సంలగ్నులైన యోగులు మున్నగువారు, మాంసాహారమును విడిచిపెట్టియుండిరి. ఇది గాకుండ బౌద్ధులుఁ జైనులును భాగవత మతముయొక్క వ్యవహారమెక్కుపై పోవుటచేత సర్వసాధారణములయందు నహింసయొక్క ఘనతయెక్కువయ్యెను మరియు వీరియందు మాంస నివృత్తికి నధికమైన ప్రచారమై యుండెను. ఇట్టిసమయమందు భారతములోని యశ్వమేధముల వర్ణనము వానియందు జేయఁబడు బ్రాహ్మణ భోజనముల వర్ణనమును లోకులకెట్లు (అప్రియము)తో చియుండును యెఱుంగుము ఇందుచేతనే ఇచటసౌతి విశేషరీతిని తల బంగా రపుదియైయున్న ముంగిసయొక్క కథను జక్కఁగాఁ జేర్చియున్నాఁడు. మరియుఁ బశువధతోఁ గూ డి న యజ్ఞము ఇట్లు మాంసాన్నభక్షణ మును నిందించి, అశ్వమే ధ ము వ ల న పు ణ్య ము. ఒ క సా ధా ర ణుఁడై న వానప్రస్థుఁడు ఆఁకలిగొనియున్న యతిథికిఁ బిడికెడునిండఁబిండిని బెట్టి సంపాదించిన పుణ్యముకంటెఁ గూడ నల్పమై యున్నదని చూపుటకు బ్రయత్నించియున్నాఁడు. ఈ నకులాఖ్యానముఁబట్టి భారతీయ యుద్ధ సమ యము మొదలుకొని మహాభారత కాలమువఱకు లోకులయొక్క మాంసాహార ప్రవృత్తిలో నెంత యంతరము తటస్థించి యుండెనో స్పష్టముగా నగపడు చున్నది.

కాని యీ జగడమింతటితో ముగియలేదు. క్షత్రియుల పురాతన పద్ధతు లను అట్టి కల్పనలను మార్చివేయుట మిగులఁ గఠినమైయుండెను. అశ్వమేధ ముపైని వారికున్న ప్రీతియు శ్రద్ధయు నున్నదినున్నట్లుగనేదృఢమైయుండెను మఱియు వారి మాంసాహార నియమము మాఱలేదు. ఉత్తములైన బ్రాహ్మ ణులు కూడ వైదిక కర్మానుష్ఠానమును విడుచుటకై సిద్ధపడకుండిరి; మరియు ఈ కృత్యములో క్షత్రియులకు సహాయులై, వేదోక్తమైన పశుహింస హింస కానేరదని ప్రతిపాదించుచుండిరి, ఇట్టి లో కు ల సమాధానమునకై నకు లాఖ్యానమునకుఁ బిమ్మట నింకొక యధ్యాయము పెంపఁబడెను. ఇందు జనమేజయుఁడు, మహర్షియైన వ్యాసుని మరియితర ఋషులయు సాహాయ్య మున సమ్రాట్టయనయుధిష్ఠిరుఁడు చేసియున్న యజ్ఞమును నిందించుటకు

ధైర్యము ఋంగిసకెట్లు వచ్చెను? అని ప్రశ్నించి యున్నాడు; నీపై ని వైశం పాయనుఁడీకథను వినిపించెను. ఒకమాఱు ఇంద్రుఁడు యజ్ఞమును చేయు చుండెను. యజ్ఞమందుఁ బ్రోక్షణము చేయుచుఁ బశువులను జంపు సమయము వచ్చినపుడు, ఆ పశువులు మిగుల దీనదృష్టితో ఋషులవైపు చూడనారంభిం చెను. ఆ సమయమున ఋషుల హృదయమునందు దయయుత్పన్నమయ్యెను. వారు ఇంద్రునితోఁ బలికిరి "ఈ యజ్ఞము ధార్మికము కానేరదు"

నాయం ధర్మకృతోయజ్ఞోన నాహింసా ధర్మఉచ్యతే।
యజ్ఞబీజైః సహస్రాక్ష త్రివర్ణ పరమోషితైః॥

మూడేండ్లదాఁక నిలువయున్న ధాన్యమునిత, ఓ యింద్రా! నీవు యజ్ఞము చేయుముఁ అనఁగా పశువులను జంపి యజ్ఞము చేయకుము" ఆ సమయముగ, అభిమానగ్రస్తుఁడైన యింద్రునికీమాట యిష్టం కాలేదు. అపుడు ఇంద్రునికి ఋషులకును మధ్య. నిర్జీవ పదార్థములచే యజ్ఞముచేయవలయునా లేక సజీవ పదార్థములచేతనా యను విషయమై జగడమయ్యెను. అపుడిరువు రును వసురాజు దగ్గఱకు దీని నిర్ణయించుటకై వెళ్ళిరి. [ఈ వసురాజు చంద్ర వంశార్యుల యొక్క వంశ జనకుఁడై చేదిపతియై యుండెను.] వారు వసు రాజునడిగిరి;- యజ్ఞము విషయమున వేద ప్రమాణమేమి? పశువుల చేత యజ్ఞము చేయవలయునా లేక బీజములు, పెరుగు, నేయి మొదలగు వాని చేతనా? వసురాజు ప్రమాణముల బలాబలములను విచారింపకుండనే, తక్షణమే చెప్పివైచెను. ఏది సిద్ధమై యుండునో దానిచేత యజ్ఞము చేయుట మంచిది ఇట్టి యుత్తరమిచ్చుటచేతను ఋషుల శాపము వలనచేదిరాజుఅధోలోకమునఁ బోయెను. ఇందుఁగూడ నిజమైన సంగతి స్పష్టముగా నిర్ణీతము కాదయ్యెనుఁ ఎందుచేత? క్షత్రియులైతే పశుహింసా యుక్తమగు యజ్ఞమును జేయ గలరు. మరియు దానిని శాస్త్రీయముగాఁ జెప్పగలరు. కాని రాజు అధోగతికిఁ బోవుటవలన నిట్టి యజ్ఞము నింద్యమని నిశ్చయింపఁబడుచున్నది; మరియు నయ్యది క్షత్రియులకు సమ్మతము కాకుండెను. క్షత్రియుల యొక్క హింసా యుక్తమైన యజ్ఞములు ప్రచలితములైయుండనే యుండునుయుధిష్ఠిరుఁడు జనమేజయుఁడును నడచిన దారినే నడచి బలవంతులైన క్షత్రియులు అశ్వ

మేద యజ్ఞమును విడిచిపెట్టుటకై సిద్ధపడకుండిరి. అపుడు అట్టి లోకుల సమాధానమునకై, యింకొక సంగతి యిట చెప్పఁబడి యున్నది. అగస్త్యఋషి ద్వాదశ వర్ష సత్రమును జేయుచుండెను. అందు బీజాహుతి నిచ్చుచుండెను. కాని యింద్రుఁడు సంతుష్టుఁడై వర్షము కురిపించుటను మానవైచెను. అపుడగస్త్యఋషి మనము రెండవ యింద్రుని బట్టింతుమని చెప్పెను. అపుడొక చోట నింద్రుఁడు సంతుష్టుడై వర్షము కురియుటకారంభించెను. అయినను ఇతర ఋషులు అగస్త్యునితో, యజ్ఞములోని హింస హింస కాదని మనము నిశ్చయింతుమని విన్నపము చేసిరి. ఈ ప్రకారము అగస్త్యముని సమ్మతించెను. కాని యీ కథచేతఁగూడ క్షత్రియులకు సమాధానము కాదయ్యెను; అన్నిటికిని జీవరఁ అనేకులకు సాక్షాత్తు ధర్మమై యుండెనని చెప్పఁబడెను; అది యొకమాటు క్రోధరూపమున జమదగ్నికి బోధించి యుండెను. ఈ కార్యముచేత అతని శాపమువల్ల అది ముంగిసయ్యెను; మరియు శాపమువలన విముక్తికై యది యుధిష్ఠిరు కల్పితమైన యజ్ఞమును నిందించెను.

చెప్పఁబడిన ముంగి కథను విస్తరించి వర్ణించుటకు, అహింసా ప్రయుక్తమైన యజ్ఞము చేయవలయునా హింసా ప్రయుక్తమా యను నీ ప్రశ్నము భారతీయ కాలమందు వివిధముగా నిర్ణయింపఁ బడుచుండెనని తాత్పర్యము. పై కథలచేత, లోకుల మతప్రవాహము ఒక మోటొకపైపునకు వచ్చుచుండునేని యింకొకమాటు రెండవ వైపునకుఁ గూడ బోవుచుండెననియే తెలియుచున్నది. హింసాప్రయుక్తా యజ్ఞమునకును మాంసాహారమునకును అపరిహార్యమైన సంబంధముండెను. లోకులు ధర్మశ్రద్ధాయుక్తులై యున్నంతవఱకే ధర్మశైలమునుండి దిగుటకై సిద్ధపడరు. మనము స్వేచ్ఛచేత మాంసమును భక్షించుచున్నాము యజ్ఞముతో దీనికి సంబంధమేమాత్రమును లేదుః ఇట్లు చెప్పుటకై భారతీ యార్యులొప్పుకొనకుండిరి. వేదముల యందు హింసాయుక్తమైన యజ్ఞము విధింపఁబడి యుండగా యాజ్ఞా శిష్టమైన మాంసమును దినుటలో హాని యేమున్నదని వారియొక్క వాదమై యున్నది. యజ్ఞమందు జేయఁబడు వేదవిహితాహింస హింస బొత్తిగాఁ గాదనియేకూడ వారు చెప్పుచుండిరి. ఈ మతము విషయమున భారతీయ కాలమందధికమైన విచారము లేక వివాదమయ్యెను. మరియు మహాభారత

సమయమునని నీ మతమే నిర్ణమయ్యెనని తెలియుచున్నది. మహాభారత సమయమున సనాతన ధర్మాభిప్రాయమునుబట్టి యజ్ఞమందుఁ జేయఁబడు హింస హింస కాకుండెను. మఱియు నేటి వఱకు నీ సిద్ధాంతమే మన్నింపబడి యున్నది. ఇప్పుడుకూడ హిందూదేశమందక్కడక్కడ పశుహింసాయుక్తమైన యజ్ఞములు జరుగుచున్నవి. ఈ సమయమున యజ్ఞములు చాల స్వల్పముగనే జరుగుచున్నవనుట సత్యము, పశుహింసయందలి పట్టుదల నేఁటివఱకు గట్టుపడిపోలేదు. మహాభారత సమయమున హింసాప్రయుక్త యజ్ఞములు అధికముగా జరగుచుండెను. సమస్త జన సమూహముయొక్క పరిపాలనమును జూచుచున్న క్షత్రియులు మాంసాహారులై యుండిరి; చాల మంది బ్రాహ్మణులుకూడ వైదికధర్మాభిమాను లగుచుండియును మాంసాహారులయియుండిరి; కాని యితర లోకులయందు మాంసాహారము యొక్క వ్యవహారము తగ్గియుండెను; విశేషించి భాగవతము జైనము మొదలగు సంప్రదాయములయందు మాంసభక్షణాచారము బొత్తిగా బంధైయుండెను; కర్ణపర్వమందున్న హంస కాకీయ కథానీకములోని యొక వర్ణనముఁబట్టి వైశ్యులలో అక్కడక్కడ మాంసభక్షణాచారముండెనని తెలియుచున్నది. ఆ వర్ణన మిట్లున్నది— ««సముద్రపుటొడ్డున నొకవైశ్యుఁడు నివసించుచుండెను. అతని యొద్ద ధనధాన్యములు విశేషముగా నుండెను. సమృద్ధుఁడైన కారణముచేత నతఁడు యజ్ఞ యాగములు చేయుచుండెను. అతఁడు దాతలకు క్షమాశీలుఁడు నయియుండెను. వర్ణాశ్రమ ధర్మములను జక్కగాఁ జూచుచుండెను. అతనికిఁ బుత్రులుకూడఁ జాలమంది యుండిరి. ఆ భాగ్యవంతులైన కుమారులయొక్క యుచ్ఛిష్టమును మెక్కి పెరిగిన యొకానొకకాకి యుండెను. దానికి ఆ వైశ్య పుత్రులు మాంసము, అన్నము, పెరుగు, పాలు మొదలయిన పదార్థముల నిచ్చుచుండిరి. (అ. 41)— ఈ వర్ణనముఁబట్టి శ్రద్ధాయుక్తులయిన వైశ్యులు కూడ మాంసాహారమును జేయుచుండిరని స్పష్టముగా నగపడుచున్నది. ఈవిధముగా మహాభారత సమయము వఱకు మాంసాహారముయొక్క ప్రచారము యజ్ఞయాగాదులు చేయునట్టి బ్రహ్మ క్షత్రియ వైశ్యులయందు నుండెను. కాని నివృత్తిమార్గమును సేవించువారిలో లేకుండెను.

## గోహత్య వలన మహాపాతకము

మహాభారత సమయమున గవాలంభము బొత్తిగాఁ గట్టు వీడిపోయి యుండె నను నొక మహత్త్వ విషయ మిచ్చటఁ జెప్పవలసి యున్నది, భారతీయ యుద్ధసమయమున అశ్వమేధ విధి వలెను, మఱి యితరమైన వైదిక యజ్ఞముల వలెను, వృషభ యజ్ఞములుకూడ జరగుచుండెను. ఈ విషయము నిర్వివాదమై యున్నది. కాని మహాభారత సమయమున ఆవులను లేక యెద్దులను హింసించుట మహాపాతకముగా విశ్వసింపఁబడుచుండెడిది. యజ్ఞమందు గోవును ప్రోక్షించుట బొత్తిగాఁ బోయెను. మఱియు కలియుగములో గవాలంభము అనఁగా గో వృషభముల యజ్ఞము వర్జ్యమను నియమ మేర్పడెను. ఇతర పశువుల యజ్ఞము గొఱ్ఱె, మేక, అడవిపంది మొదలయిన వానిది మన్నింపఁబడి యుండెను. ఈ లెక్కచేతనే మాంసభక్షణమునకుఁగూడ నల్లవాటుండెను. మఱియు నిప్పటి క్షత్రియులు లేక బ్రాహ్మణులు ఎవరైనను సరే మాంసమును దిందురుగాక, కాని గోమాంసమును భక్షించుట యత్యంత నింద్యముగను, సనాతన ధర్మమునుండి భ్రష్టుని జేయునదిగను నమ్మఁబడుచున్నది. సమస్తహిందూజనమునకును ఇట్టి దృఢనిశ్చయమే యున్నది; ఆమనుష్యుఁడు మరి క్షత్రియుఁడు లేక యత్యంత నీచుఁడగు శూద్రుఁడైన నగుఁగాక, ఈస్థితి మహాభారతసమయమునందియుగలదు. మహాభారతసమయమున గోవధము లేక గోమాంసము మిగుల నింద్యముగా నూహింపఁబడుచుండెను. ఉదాహరణార్థము ద్రోణపర్వమందర్జునుఁడు చేసిన యనేక శపథములలోఁ జెప్పియున్నాడు. (ద్రో. అ. 73)

బ్రహ్మఘ్నానాం చ యే లోకా యే చ గోఘాతినామపి ।

అనఁగా "బ్రహ్మహత్య చేసినవారును గోవధము చేసినవారును బోవుచున్న నింద్యలోకములు నాకుఁ బ్రాప్తించుఁగాక." ఇట్టి యుదాహరణములింకను నీయఁబడఁ గలవు. గోవును తృణీకరించుటయుఁ బాపముగా విశ్వసింపఁబడఁజొచ్చెను. కాని భారతీయ యుద్ధసమయమున దీనికి విపరీతమైన పరిస్థితి యుండెను. మహాభారతము యొక్క యనేకమైన భాషాంతరములను

బట్టి యీ సంగతి యగపడుచున్నది. రంతిదేవుఁడు చేసిన యనేక యజ్ఞముల యందుఁ జంపఁబడిన వృషభముల తోళ్ళరాశి నుండి ప్రవహించునదికిఁ బేరు చర్మణ్వతియని తటస్థించెను. కాని యింతదూరము దాఁకఁ బోనవసరమేమున్నది? భవభూతి కృతమైన యుత్తరరామచరిత్రమందువసిష్ఠవిశ్వామిత్రుల యాగమన సమయమునఁ జేయుబడిన మధుపర్క వర్ణనము యొక్క జ్ఞప్తి సంస్కృత నాటకముల నభ్యసించు విద్యార్థులకుఁ దప్పక రాఁగలదు. భారతీయ యుద్ధసమయమున లేక వైదికకాలమున గవాలంభము యొక్క వ్యవహార ముండెను, కాని మహాభారత సమయమున కది బొత్తిగా నెగిరిపోయెను. మఱియు గోవధము బ్రహ్మహత్యతో సమానమైన మహాపాతకముగా గణింపబడియుండెను. ఈ భేదమెందులకు నేకారణమున వచ్చెను. దీనియొక్క పరిశీలనము మిక్కిలి మహత్త్వముతో నిండియున్నది. మహాభారత సమయమున గవాలంభము బొత్తిగాఁ గట్టువడిపోయి యుండెను. అప్పటి యితర ప్రమాణములఁ బట్టియు నీసంగతి యగపడుచున్నది; హిందూదేశస్థులు విశేషించి శాకాహారులని గ్రీకులు వ్రాసియున్నారు. అరాయాన్ అను నితిహాసకారుఁడు వ్రాయుచున్నాఁడు "ఇచ్చటివారు నేల దున్నుచున్నారు. మఱియు ధాన్యము పైని జీవించుచున్నారు. పర్వత ప్రదేశమున వారు మాత్రము అరణ్యపు జంతువులను వేటాడి వాని మాంసము దినుచున్నారు." ఇందు వన్య, మృగయాపశు, శబ్దములు వ్యవహరింపఁబడియున్నవి. అందుచేత గోవుల లేక వృషభముల వధము పర్వతీయులయందుఁ గూడ నిషిద్ధమై యుండెనని మన్నింపవచ్చును. గ్రీకుల వర్ణనమునను, గోవధము పాతకముగా విశ్వసింపఁబడుచుండెనని స్పష్టమైన వర్ణనములేదు; అయినను పేర్కొనఁబడిన వాక్యముఁ బట్టి యిట్లూహించుటకు నాపత్తియేమియునులేదు. గ్రీకుల యాక్రమణము పంజాబుకు జరగి యుండెను. మఱియు, మహాభారత సమయమందు పంజాబులో నీయునాచారమురడి యుండెనని యనుమానించుట కవకాశమున్నది. కర్ణపర్వములో శల్యునికిని కర్ణునికిని నడుమ వర్ణితమైన నిందాప్రచురమౌ పరివాదమునందు కర్ణుఁడు బాహీకదేశములోని యనాచారమును వర్ణించియున్నాఁడు. అందు, రాజమందిరముల యెదుట గోమాంసపు దుకాణములున్నవి. మఱియు నచ్చటివారు గోమాంసము, వెల్లుల్లి, మాంసము కలిపిన మినుపపప్పు వడియములు, అన్నము గాని తినుచున్నారని చెప్పఁబడియున్నది. (క. అ, 44) ఈ

వర్ణనముఁ బట్టి, గ్రీకులు నివసించియున్న చోట, మహాభారత సమయమున, ఈ యనాచారము వ్యాపించియుండెనని విశ్వసింపఁబడ గలదు. మహాభారతము యొక్క గ్రీకులయొక్క ప్రమాణముఁ బట్టి, మహాభారత కాలమందు భారతవర్షమున గోవధ పాతకమెక్కువగనే నింద్యముగా నూహింపఁబడుచుండెనని నిశ్చితమగుచున్నది.

ఈ మహత్తర పూర్ణమైన నిషేధము యొక్క యుత్పత్తి యేకారణము చేతనయ్యెనో, యాకారణము యొక్క చాలపఱకు నిదర్శనము మహాభారతము వలన నగుచున్నది. సప్తర్షులయొక్క నహుషునియొక్కయు చోటున జగడమైనట్లు వర్ణనము మహాభారతమందున్నది. ఋషులడిగిరి.

యఇమే బ్రాహ్మణా ప్రోక్తా మంత్రా వై ప్రోక్షణేగవాం।
ఏతే ప్రమాణం భవత ఉతాహోనేతి వాసవ ॥
నహుషోనేతి తానాహ తమసామూఢ చేతసః (ఉ. అ. 17)

అనఁగా ఋషుల మతమున గవాలంభము, వేదమందు వర్ణితమైన కారణమున, ప్రమాణమై యున్నది. కాని నహుషుఁడు అదిప్రమాణము కాదని స్పష్టముగా నుత్తరమిచ్చెను. నహుషుఁడీ యుత్తరమునే యాధారముమీద నిచ్చెనో, దీని కిచ్చట నుల్లేఖములేదు. కాని టీకాకారుఁడు చెప్పియున్నాఁడు

బ్రాహ్మణాశ్చైవ గావశ్చ కులమేకం ద్విధా కృతం।
ఏకత్ర మంత్రాస్తిష్ఠంతి హవిరేకత్ర తిష్ఠతి ॥

హవనము యొక్క మంత్రములైతే బ్రాహ్మణుల యందున్నవి యిక యజ్ఞము యొక్క హవిస్సు అనఁగా పాలు, నేయి, పిడుకలును గోవులయందున్నవి; అందుచేతనే బ్రాహ్మణులు గోవులు రెండును సమానముగా బవిత్రములు నవధ్యములునై యున్నవి. దీనిఁబట్టి, గోవు యజ్ఞమునకు సాధనమగుట చేత అ యజ్ఞము వత్స్యమై యున్నదని యైతిహాసికానుమానము కలుగుచున్నది. ముఖ్యముగా నీవు వ్యవస్థను నహుషుఁడు చేసెను. కాని యాసమయమున నయ్యది మాన్యము కాఁజాలకుండెను. మనయభిప్రాయము

ఈ వ్యవస్థ తరువాత శ్రీకృష్ణ భక్తి చేత మాన్యమైయ్యెను. శ్రీకృష్ణుఁడు యాదవకులమువాఁడై యుండెను, మఱియు యాదవులు గోపాలురై యుండిరి. గోవులచేతనే వారి జీవిక జరుగుచుండెను; అనఁగా గోపాలనము వారి వృత్తియై యుండును. శ్రీకృష్ణునికి, బాల్యమందు, గోచారణము ప్రసిద్ధమై యున్నది. అతనికి గోవులెక్కువ ప్రియమై యుండును. ఎపుడు శ్రీకృష్ణుని మతము ప్రచలితమయ్యెనో మరియు హిందూదేశమందు శ్రీకృష్ణభక్తిరిగెనో యాసమయమున గోవుల విషయమున నత్యంతపూజ్యభావముత్పన్నమై హిందూదేశమందంతటను గవాలంభము కట్టువడిపోయెను. ఈరానియనులును గోవును బవిత్రముగా విశ్వసించియున్నారను సంగతియు ధ్యానింపఁదగి యున్నది. అపుడు గోవుల పవిత్రతా సంబంధమైన కల్పన హిందూ దేశమందు భారతీయార్యులతోపాటు, ప్రా రం భ ము ను ం డి యే వచ్చి యుండును: చెప్పఁబడిన యాఖ్యానమందు మొదట నహుష కలహము యొక్క వర్ణన మున్నది: ఇందుచేత చంద్రవంశ క్షత్రియులయందు ఈ నిషిధముయొక్క యుద్యమ మగుపడుచున్నది; ఈవంశమందే శ్రీకృష్ణునియొక్క యాదవులయొక్క జన్మమయ్యెను; మరియు శ్రీకృష్ణ భక్తిచేత సమస్త భారతీ యార్యులయందును గవాలంభముక్క ప్రవృత్తి బొత్తిగాఁ గట్టువడిపోయెనుగ జైనము లేక బౌద్ధమైన ధర్మముయొక్క యుపదేశపుపరిణామముగా నీ నిషిధముత్పన్న మయ్యెనని విశ్వసింపఁబడఁజాలదు; ఎందుచేత ? ఒకటి– బౌద్ధ జైనధర్మము లుదయింపకపూర్వమునుండియే యీనిషేధ ముపస్థితమై యుగ పడుచున్నది: ఈ ధర్మములు సమస్తప్రాణుల హింసను నింద్యముగా విశ్వసించుచున్న వను సంగతి రెండవది. మరి కేవలము గో వృషభముల హింస సనాతన ధర్మసమాజమందు ఎందులకు నింద్యముగా విశ్వసింపఁబడును ? దీనికిఁ గారణము చెప్పఁబడఁజాలదు. విశేషించి క్షత్రియులయితే యీ హింసను నింద్యముగా నమ్మరైరి, ఒక గో హింసనే ఘోరపాతకముగా విశ్వసించియున్నారు; వారు గొఱ్ఱె, మేక మరియు నడవిపంది మొదలయినవానిమాంసము నప్పుడుకూడఁ దినుచుండిరి; యిపుడుకూడఁ దినుచున్నారు: ఇంతవఱకు జరిగిన యజ్ఞములయందు మేషాదుల హోమము జరగుచున్నది; ఈ కారణములఁబట్టి ఈ వ్యవహారమునకు బౌద్ధము లేకజైన మతప్రచారముయొక్క పరిణామము; విశ్వసింపఁబడఁజాలదు; గోవు, వృషభము నన్నివిధముల సనాతనధర్మమునకు

పూజ్యమునై పోయి యుండెను; ఆవు పాలు లోకులను పోషించుచుండెను; వాని ద్వారమున నన్నము తెప్పింపఁబడెను. మరియుఁ జంపఁబడఁగలిగియు న్నను మరియు వాని సంబంధమై మొదటనుండియు పూజ్యభావ ముండెను. అట్లు శ్రీకృష్ణ భక్తి కారణమున వానికింతను మాహాత్మ్యము ప్రాప్తమయ్యెను; గోవుల పవిత్రత్వము విషయమున మహాభారతమం దనేక స్థలములలో వర్ణన మున్నది. ప్రాతఃకాలమున గోదర్శనము ఒక పుణ్యముగా విశ్వసింపఁబడుచుం డెను. ఈ యన్ని కారణములఁబట్టియు మహాభారత కాలముకంటెఁ బూర్వము నుండియే గోవృషభముల హింస కట్టుపడిపోయియుండెనని నిర్వివాదముగాఁ జెప్పఁగలుగుచున్నాము.

## యజ్ఞ హింస మరియు మృగయా హింస

ఇతర పశువులయజ్ఞము లెప్పటియట్లె జరగుచుండె నను విషయమునను మరియు మాంసమును బ్రాహ్మణులు క్షత్రియులునుదినుచుండి రనువిషయము నను సందేహములేదు. వనవాసములోఁ బాండవుల జీవితము చాలవఱకు వేఁట మృగములమీఁదనే యాధారపడియుండెను. పాండవులు ద్వైతవనమం దున్న పుడు అనేక మృగసంహారము జరగినకారణముచేత మృగములెక్కువగా వ్యాకు లపడెనని మహాభారతములోఁ గాథకలదు. ఇందుమీఁద యుధిష్ఠిరుఁడు ద్వైత వనమును విడిచిపెట్టుటకు నిశ్చయించెను. మఱునాఁడు పాండవుల తోడను బ్రాహ్మణులతోడను సమేతముగా వారు కామ్యకవనముపైపు వెళ్ళిరి. (వ. అ. ౨౫౮). "మనము వనమృగముల సమూహము మిక్కిలి కొలఁదిగా మిగిల్చి యున్నాము. బీజ రూపమున మిగిలిన మృగములకు నీ యనుగ్రహముచేత నభివృద్ధి యగుఁగాక. మృగములయొక్క యీ ప్రార్థన విని యుధిష్ఠిరుఁడు మరుభూమికిఁ గేవలము మస్తక తృణబిందు సరోవరములకు దగ్గఱగా నున్న కామ్యకవనమునకుఁ బోవుటకు నిశ్చయించెను. ఈ ప్రకారముగా పాండవులు వనవాసములో కేవలము వేట జంతువులచేతనే బ్రతుకుచుండి రని ప్రకటమగు చున్నది. ద్రౌపదిని జయద్రథుఁ డపహరించిన సమయమందు, పాండవులు వేటకోసము వెళ్ళియుండిరి; వారు మృగములను వరాహములను జంపి తీసి కొని వచ్చిరని వర్ణనకూడ నున్నది. అనఁగా ఇప్పటియట్లె అప్పుడుగూడ విశేష

ముగా క్షత్రియులకు మృగముల యొక్కయు వరాహముల యొక్కయు మాంసము ప్రియమై యుండెను. వీనిని మేధ్యపశువులని చెప్పుచున్నారు. మరియు వీని మాంసము పవిత్రమని విశ్వసింపఁబడుచుండెను. వేఁటాడఁబడిన పశువుయొక్క మాంసము విశేష ప్రశస్తమని విశ్వసింపఁబడుచుండెను.

కాని కొన్ని పశువుల మాంసము వర్జితముగాఁ గూడ నగపడుచున్నది. ఇందు పృష్ఠమాంసము తినుటకు నిషేధముండెను. ఈ పృష్ఠమాంస మేదియో నిశ్చయపూర్వకముగాఁ జెప్పఁజాలము. టీకాకారుఁడు దీని కర్థమును చేసియున్నాఁడు– వీపుమీఁద సామగ్రి మోయింపఁబడు మృగములమాంసము. అనగా ఏనుఁగు, గుఱ్ఱము, ఎద్దు, ఒంటె వీనిమాంసము వర్జ్యమైయున్నది. ఏనుఁగు గుఱ్ఱములు మాంసము మాత్రము ప్రస్తుతమునఁ గూడ నిషిద్ధముగాఁ విశ్వసింపఁబడుచున్నది. వర్తమానముననున్న యన్ని నియమముల యందు సను మాంసభక్షణ విషయమున గల నిషేధములు, తఱచు నిషిద్ధమాంసములు హానికారకము లను దృష్టితో నున్నవి. ఈ పట్టికలో ననేక ప్రాణు లున్నవి. ప్రాచీనకాలమందు వీని మాంసము వర్జ్యమై యుండెను. కుక్క, పిల్లి మొదలైన నేక ప్రాణు లీ వర్గమందుఁ గలవు. మాంసభక్షణ విషయమై మహాభారత సమయమున నిషేధ మున్న యనేకమాంసముల నన్నింటి నిచ్చట విస్తరించి వర్ణించుట యావశ్యకముకాదు. అంపలి ముఖ్యమైన విషయములను వినుఁడు.

పంచ పంచ నఖా భక్ష్యా బ్రహ్మ క్షత్రేణ రాఘవ ।
శల్యకః శ్వావిధో గోధా శశః కూర్మశ్చ పంచమః ॥

రామాయణములోని యీ శ్లోకము ప్రసిద్ధమైయున్నది. ఇదేవిధముగా మహాభారతమందును జెప్పియున్నాఁడు.

పంచ పంచ నఖా భక్ష్యా బ్రహ్మ క్షత్రస్యవై విశః (శాం. అ. 141-7) అయిదు గోళ్ళు గల జంతువు లన్నియు బ్రాహ్మణ క్షత్రియులకు వర్జ్యములై యున్నవి. ఇందు అయిదు జంతువులు మాత్రం, ఒక విధమైన జంతువులు

ఉడుము, కుందేలు, తాబేలు వీనిని తినుటకు నిషేధము లేదు; ఈ శ్లోకము, వాలి రాముని నిందించినప్పటిదై యున్నది. కోతులను కొండముచ్చులను జంపి తినుటకు క్షత్రియులకు అజ్ఞ లేదని యిందుఁ జూపఁబడి యున్నది. ఇవిగాక ఇంక ననేకములు వర్జావర్జ్యములున్నవి. శాంతిపర్వముయొక్క 36వ యధ్యాయమందు యుధిష్ఠిరుఁడు భీష్ముని, బ్రాహ్మణుఁడు ఏ మాంసమును దినవచ్చును ఏమాంసమును గూడదని యడిగెను. ఇందుపైని భీష్ముఁడు చెప్పెను—

అనడ్వాన్ మృత్తికాచైవ తథా క్షుద్ర పిపీలికా ।
శ్లేష్మాతక స్తథా విప్రై రభక్ష్యం విషమేవచ ॥

ఇందలి విష శబ్దమునకు మఱియొక యర్థము చేయవలయును; ఎందుచేత? విషమును దినుటకై నిషేధాత్మకమైన నియమమున కావశ్యకతయేలేదు: అనఁగా విష శబ్దముచేత విషము గల మాంసముతోడి జంతువు లని చెప్పవలయును, పలువిధములైన ప్రాణులలో వర్జ్యములైనవి క్రిందిశ్లోకములోఁ జెప్పబడి యున్నవి—

అభక్ష్యా బ్రాహ్మణై ర్మత్స్యా శల్కైర్యే వై వివర్జితాః ।
చతుష్పాత్కచ్ఛపాదన్యే మండూకా జలజాశ్చయే ॥

ఏ మత్స్యములకు శల్కములు అనఁగా రెక్కలు లేవో, అవియుఁ దాఁబేళ్ళను మాత్రము భక్ష్యములై యున్నవి; వీనికంటె నితరమైన చతుష్పాజ్జము లన్నియు వర్జ్యములు. పక్షులలో వీనిని వర్జ్యములుగాఁ జెప్పియున్నారు—

భాసా హంసాః సుపర్ణాశ్చ చక్రవాకాః ప్లవా బకాః ।
కాకో మద్గుశ్చ గృధ్రశ్చ శ్యేనోలూకా స్తథైవచ ॥

భాసము, హంసము. గరుడము, చక్రవాకము, కారండకము, బకము, కాకము, గృధ్రము, శ్యేనము. ఉలూకపక్షియు వర్జితములు. ఇదేవిధముగా—

క్రవ్యాధా దంష్ట్రిణః సర్వే చతుష్పాత్ పక్షిణశ్చయే ॥

దేనికి దంష్ట్రలున్నవో యిట్టి మాంసభక్షణములైన నాలుగుకాళ్ళ జంతువులన్నియును వేనికిఁ గ్రిందను మీఁదను గడ్డము లున్నవో అట్టి పక్షు లన్నియును, వేనికి నాలుగు కోఱలున్నవో ఇట్టి ప్రాణు లన్నియును వర్జ్యములై యున్నవి. దీనిఁబట్టి, మహాభారత సమయమున బ్రాహ్మణుల కే యే మాంసములు వర్జ్యములై యుండెనో ప్రకటమగుచున్నది.

చూడఁగా నిట్టి స్థితి యున్నది, అయినను మహాభారత సమయమందు మాంస విషయమున సమస్త లోకుల ప్రవృత్తియు- విశేషించి బ్రాహ్మణుల యొక్క మాంసాహారమును వర్జించుటకని యుండెను. వివిధరీతులవల్ల నీసంగతి సిద్ధమగుచున్నది. సాధారణ రీతిని, ఆధ్యాత్మిక తత్వమును విచారించు మనుజునికి మాంసాహారము వర్జ్యమనుతత్వము నిశ్చితమైయుండెను. వేదాంతికి, యోగికి, జ్ఞానికిగాక తపస్వికి మాంసాహారము వలన నష్టము సంభవించుచున్నది. తన కార్యములందతనికి సిద్ధి ప్రాప్తము కాదు. భారతీయార్యులీ సిద్ధాంతమును స్థిరపఱచి యుండిరి. సాధారణరీతిని మనువుచెప్పిన తత్త్వము లోకులందరియూహకును వచ్చియుండెను. ఆ తత్త్వ మిది-

న మాంసభక్షణే దోషో న మద్యే నచ మైథునే ।
ప్రవృత్తి రేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలా ॥

గృహస్థుఁడైన బ్రాహ్మణుఁడు వృథా గోమాంసభక్షణమును జేయరాదను నియమ ముండెను. అనఁగా ఏ కారణములేకుండ మాంస భక్షణమునకు నిషేధముండెను. గృహస్థాశ్రమములోని బ్రాహ్మణుఁడు కాచఁబడిన పాలు, పాయసము, పులగము, మాంసము, వడియము మొదలైన వానిని శాస్త్రోక్తమైన కారణములేకుండఁ దినఁగూడదు, త్రాగకూడదు. దీనిఁబట్టి ఏదో శాస్త్రోక్తావసరమందే- యజ్ఞము లేక యితర దేవతా సంబంధమైన యవసరము, లేక శ్రాద్ధసమయము ఇట్టియెడల శాస్త్రోక్తకారణముచేతనే మాంసాన్నమును దినుటకై బ్రాహ్మణుల కాజ్ఞయుండెను; ప్రతిసమయమునను లేదు. కాని శ్రాద్ధ సమయ

మున మాత్రము మాంసము తినుట కాజ్ఞ యుండెను. అనఁగా హింస జరుగక తప్పదు. అపుడు అహింసా తత్త్వమును విశ్వసించు మనుష్యుని యెదుర నీ ప్రశ్న ముత్పన్నమగాక మానదు. ఇది గాకుండ క్షత్రియులు కేవల యజ్ఞ మందు లేక శ్రాద్ధమందే మాంసమును దిని కొలఁదిగనే పాపాత్ము లగుదురు; వారు వేఁటాడియు మాంసమును తిందురు. అపుడు వారియొక్క యీ ప్రవృత్తికిని అహింసా ధర్మమునకును మైత్రి యెట్లు కుదురఁగలదు ? ఇది మహత్త్వముగల ప్రశ్నమై యున్నది. మహాభారతమునం దొకచోటఁ (అను. 115వ యధ్యాయమందు) ఇది విచారింపఁబడికూడనున్నది. 144వ యధ్యాయమందు అహింసను నాలుగు విధముల అనఁగా- మనస్సు, వాక్కు, కర్మము, భక్షణము వీనిమార్గమున వర్జింపవలయునని చెప్పియున్నాఁడు. "తపస్సు చేయువారు మాంసభక్షణము నుండి యలిప్తులగుచున్నారు, మాంసము తిను మనుష్యులు పాపులగుచున్నారు. వారికి స్వర్గప్రాప్తి యెన్నడుసుగాదు. ఉదారపురుషులు తన ప్రాణములనిచ్చి, ఇతరులమాంసమును రక్షింపవలయును", ఈవిధముగా అహింసా ధర్మమును వర్ణించిన తరువాత యుధిష్ఠిరుఁడు ప్రశ్నించెను– "ఈ వైపున మీరు అహింసాధర్మమును శ్రేష్ఠమని చెప్పుచున్నారు. అవైపున శ్రాద్ధమందుఁ బితరులు మాంసాశనము నిచ్ఛించుచున్నారు. అట్టిచో, హింసలేకుండ మాంసము లభించుట సంభవముకాదు. మరి మాంసవర్జనరూపమైన యీవిరోధ మెట్లు తొలగఁగలదు ? ఎవఁడు స్వయముగా హింసించి మాంసమును సేవించుచున్నాఁడో, వాని కెటువంటి పాపము తగులును ? ఎవఁడు మరియొకనిచేఁ జంపించి దానిని సేవించుచున్నాఁడో, వాఁ డెట్టి పాపమునకు భాగస్థుఁడగుచున్నాఁడు ? ఎవఁడు కొని మాంసమునుదినుచున్నాఁడో వాని కెట్టిపాపము తగులును ?" భీష్ముఁ డుత్తరమిచ్చెను– "ఎవఁడు ఆయువు, బుద్ధి, వివేకము, బలము, స్మృతి వీని నిచ్ఛించుచుండునో అతఁడు హింసను వర్జింపవలయును. ఏమనుష్యుఁడు పరమాంసముచేతఁ దనమాంసమును వృద్ధిచేసికొనుచున్నాఁడో వానియొక్క నాశము కాకతప్పదు. మాంసమును దినని మనుష్యుఁడు నిత్యమును దానముచేసినవాఁడగును. చావునకై భయము విద్వాంసుఁడైన మను

ష్యునకుఁగూడ నుండును. ఏ పాపాత్ములు మాంసమును దినుటకై ప్రాణి హత్య చేయుచున్నారో, వారికి ఈ హత్య విషయమున మరణించు ప్రాణికి నెట్లు తోఁచును? మాంసమునుదిను మనుష్యునికి ఏ జన్మములు ప్రాప్తించు చున్నవో వానిలోఁ బ్రతిదాని యందును వానికిఁ బూర్తిగా దుర్గతి యగు చున్నది. వానికి గష్టమనుభవింపవలసి వచ్చుచున్నది: బ్రతుకఁ గోరుచున్న ప్రాణిని ఏ మనుష్యుఁడు హింసించునో లేక హింసింపఁజేయునో వానికిఁ బ్రత్యక్షముగా హత్య చేయువాని పాతకము తగులుచున్నది. కాని మాంస మును బుచ్చుకొనువాఁడు ద్రవ్యద్వారమున హింసచేయుచున్నాఁడు. వీరంద అకు బ్రత్యక్షముగా వధించువారివలెనే పాపాత్ములగుచున్నారు. కాని లోక సామాన్యమునకై ఋషులు, యజ్ఞముతోఁ జంపఁబడు పశువును విడిచి యితర పశువు యొక్క మాంసమును దినఁగూడదని నియమము చేసియున్నారు. యజ్ఞమందుఁ దక్క నెన్నఁడును బశుహత్య చేయరాదు. ఎవఁడు చేయునో వానికి నిష్పందేహముగా నరకప్రాప్తి యగును. కాని మోక్షమార్గస్థులకై యీ నియమము కూడ నుపయుక్తము కాదు. యజ్ఞము లేక శ్రాద్ధము మొద లైన వానియందు బ్రాహ్మణుల తృప్తికోసము చంపఁబడు పశువు యొక్క మాంసమును దినుటలోఁ గొలఁదిదోషమగుచున్నది. మాంసము తినెడు నపేక్ష చేత, ఎవఁడైనను యజ్ఞము యొక్క కపటాడంబరమును జేసి యందు మాంసమును దినుటకై యుద్యుక్తుఁడగునేని అపని నింద్యమే యగును. ప్రకృతి ధర్మమును మన్నించువారు పితృకర్మమందును యజ్ఞయాగముల యందును, వైదిక మంత్రములచేత సంస్కరింపఁబడిన యన్నము తినవల యును. వారు వృథాగా మాంసభక్షణము చేయరాదు. ప్రాచీనకాలికులైన యజ్ఞకర్తలు పశువును జేసి యజ్ఞపురుషు నారాధించిరి. వసురాజు, భక్ష ణీయము కానప్పటికిని మాంసమును భక్షణీయముగాఁ జెప్పెను. ఈ కారణము చేతఁ బుడమిపై నతఁడు పడెను. అగస్త్యఋషి ప్రజాహితమునకై తన తపః ప్రభావము చేత వన్యమృగములను, సమస్త దేవతల యుద్దేశముగ ప్రోక్షించి పవిత్రము చేసియున్నాఁడు. కనుక దేవకార్యమందు లేక పితృకార్యమందు మృగమాంసము నర్పించునేని వాఁడు కర్మహీనుఁడు కాఁడు. ఓరాజా, మాంసము తినకుండుటలో సమస్త సుఖములును గలవు. కార్తిక మాసములు, శుక్ల పక్షములు మధుమాంసము విడుచునో అట్టి వానికిఁ జాల పుణ్యము కలుగుచున్నది. వర్షాకాలము నాలుగు మాసముల యందు నెవఁడు మాంసము

తినఁడో వానికిఁ గీర్తి ఆయువు, బలము ప్రాప్తించును. తుట్టతుదకు ఈ మాపములలో నెవఁడు పూర్తిగా ఒక మాసము తినుటకైనను మాంసమును విడిచిపెట్టియుండునో వానినెన్నఁడును రోగము రానేరదు. ప్రసిద్ధుడైన రాజు లనేకులు కార్తికసము పూర్తిగా లేక శుక్లపక్షమందు మాంసమును వర్జించుచున్నారు. ఎవరు జన్మము మొదలుకొని మధుమాంసములను లేక మద్యమును త్యాగము చేయుచున్నారు. వారిని మునులనియే చెప్పుచున్నారు. ఈ విధముగా ఋషులు మాంసభక్షణమునకుఁ బ్రవృత్తి నివృత్తుల నియమముల నేర్పఱచియున్నారు.

ఈ వర్ణనముఁ బట్టి, క్షత్రియులకును బ్రాహ్మణులకును బురాతన ప్రవత్తి, దయాయుక్తమైన యహింసాతత్త్వము. వీని గుఱించి జూడము భారతీయ కాలమున నేప్రకారముగా జరగియుండెనో, ఈ విషయమునకు దిగ్దర్శన మగుచున్నది క్షత్రియులకు నే యలవాటులు వందలకొలఁది యేండ్ల నుండి తాతముత్తాతల తరములనుండి తటస్థించియుండెనో అవి వదలిపోవుట అసంభవమై యుండెను; లేక బ్రాహ్మణులయొక్క లేదా జ్ఞానరూపముగాఁ బ్రచలితమైన యజ్ఞశ్రాద్ధాది విధుల యందు భేదము సంభవించుటయుఁ గష్టమైయుండెను. కనుక ఒకవిధమగు నీ పరస్పర కలహము, ఇరువుర మేళనము వలనఁ దొలఁగె నని జెప్పఁగలుగుచునాము. హింసాయుతమైన వేదోక్త యజ్ఞమును చేయుట యుచితము కాదను నిశ్చయము సబబుగనే యయ్యెను. ఈ విధముగనే సమాజము క్షత్రియులకు మృగయావినోదాధికారమును గూడ నంగీకరింపవలసి వచ్చెను. మృగయా వినోదమున కనుమతియున్న కారణమున క్షత్రియుల క్షాత్రవృత్తికిఁ జక్కని యవకాశము దొరకెను. అగస్త్యఋషి వేఁటయందుఁ జంపఁబడు పశువులు ప్రోక్షితములే యని నిశ్చయము చేసెను. ముందటి కథానీకమందు ....ంస ప్రయుక్త యజ్ఞమునకుఁ బ్రతివాది యగస్త్యుడేయైయున్నాఁడు. మరియు నాతఁ డింత యానుకూల్యమును జేసియైయున్నాఁడు. ఇది యాశ్చర్యమైయై యున్నది. ఇట్లె నకులముయొక్క కథానకమందును హింసాయుతమైన యజ్ఞమును జేయువిషయమునై యగస్త్య ఋషికి ఇతర మహర్షులకు వలెనే పట్టుదల యగుపడుచున్నది. భిన్న భిన్న విషయ

ములవల్ల కేవలము ఒక పూజ్యవ్యక్తియొక్క మతము నాధారము చేసికొను ప్రవృత్తి మనుష్యునికి స్వాభావికమై యున్నది. బ్రాహ్మణుల యొక్క యజ్ఞము క్షత్రియులయొక్క వేఁటయు నీవిధముగా శాస్త్రోక్తమైపోయెను; వీనియందు మాంసమును దిను స్వాతంత్ర్యము సంభవించెను. పిదప సమస్త సమాజము యొక్క మతమును గౌరవించి అందఱును నాలుగు మాసములు పూర్తిగా, లేక తుట్టతుదకు కార్తీకమాసము పూర్తిగానైనను, మాంసము తినఁ గూడదను నియమ మేర్పడెను. ఈ నియమ మిప్పుడును బ్రచలితమై యున్నది ప్రస్తుత కాలమునఁ దఱచు శ్రావణమాసమునందు క్షత్రియుఁడెవఁడును మాంసాహారము చేయుఁడు.

## మద్యపాన నిషేధము

ఏ విధముగా భారతీయ కాలమందాధ్యాత్మిక భావనచేత అహింసా ధర్మమునకుఁ గెలువయ్యెనో, మఱియు మాంసభక్షణము విషయమై భారతీయార్యుల యొక్క వ్యవహారమునందు భేదము తటస్థించెనో, మఱియు నివృత్తి మార్గమందు నయ్యది కేవలము యజ్ఞయాగములయందు శ్రాద్ధమందు మాత్రము మిగిలిపోయెనో; అదే విధముగా భారతీయ కాలమందు మద్యవిషయమునఁ గూడ బొత్తిగా మఱియొకస్థితియయ్యెను. భారతీయ యుద్ధసమయమందు అనగా మొట్టమొదట, భారతీయార్యులు మద్యము లేక సురను సేవించుట యశాస్త్రీయముగ విశ్వసింపకుండిరి. క్షత్రియులకైతేని మద్యపాన నిషేధము లేనేలేకుండెను. ఇంతేగాక యీ పనియందు వారు పాశ్చాత్యార్యుల-జర్మనుల-వలెఁ బ్రసిద్ధులై యుండిరని చెప్పఁబడఁ గలదు. ఈ పనియందు యాదవు లగ్రేసరులై యుండిరి. మఱియు ద్వారక యందు మద్యపానము యొక్క విశేషమైన జనసమర్దముండుచుండెను. కృష్ణులును యాదవులును మద్యపానము చేసియే పరస్పరము పోరాడి యుచటనే మరణించినట్లు పోరాడిరను వర్ణనము మహాభారతమందున్నది. బలరాముఁడు మిగుల నాసక్తుఁడై వ్యసనముతో తాగుచుండెనని ప్రసిద్ధమేయై యున్నది. శ్రీకృష్ణుఁడు యద్యపి మద్యపానమందు మర్యాద నియమము గలిగియుండెను. అయినను సమస్త క్షత్రియులరీతి ననుసరించి యతఁడు కూడ, మర్యాదగా, మద్యము త్రాగుచుండెంనని

శ్రీకృష్ణుఁడును అర్జునుఁడును మద్యపానము చేసినట్లు వర్ణనము మహాభారత మందు రెండుమూఁడు స్థలములందున్నది. రామాయణమందు,సముద్రములో నుండి సుర బయలుదేఱఁగనే దేవతలు దాని గ్రహించిరి. ఈ కారణమున దేవతలు సురలనంబఱఁగిరని వ్రాసియున్నాఁడు. మహాభారతమందుఁ గూడ నొక చోట నిటువంటి వర్ణనమున్నది. వరుణ లోకమందు సురాభవనము కనకమయమైయున్నది. మఱియు సుర చేతికి దొరకినందువలననే దేవతలను సురలని చెప్పఁదొడఁగిరి (ఉద్యో. అ. ౯౮) యుధిష్ఠిరుని యశ్వమేధోత్సవ వర్ణనమందు యజ్ఞమును "సురామైరేయసాగరః। అని చెప్పియున్నాఁడు. అనఁగా యజ్ఞోత్సవము యొక్క వైభవమందు సురకును మైరేయమునకును అధికముండెను. భారతీయ యుద్ధసమయమున క్షత్రియులు విశేషించి యాదవ వీరులు, యుద్ధముమీఁదికిఁ బోవునపుడు సురాపానమును జేయుచుండిరని తెలియుచున్నది. జయద్రథ వధపర్వమందు ధర్మరాజు నాజ్ఞచేత సాత్యకి యర్జునునికి సాహాయ్యము చేయుటకై కౌరవసేనలోనికిఁ బోవుటకై సన్నద్ధుడై నపుడు, అతఁడు సురాపానము చేసిన వర్ణనమున్నది. ఇచట విశేషమైన నామములను జెప్పియున్నాఁడు "పీత్వాకైలాతకంమధు (ద్రో. అ. 112) యదు వంశమందు మహారాష్ట్రులున్నారు. వారు కూడ యుద్ధసమయమునఁ దాము సురను త్రాగి యేనుగులను గూడ త్రాగించి యుద్ధమునకై పోవుచుండిరి. మఱి యెపుడును వెనుకఅడుగువేయకుండిరి. ఇట్టివర్ణనమును హుఏనుసాంగనెడి చీనా సంన్యాసి చేసియున్నాఁడు భారతమందలి యనేక వర్ణనములఁ బట్టి, భారతీయ యుద్ధసమయమున క్షత్రియులు సురత్రాగువారై యుండిరనియు అందులోఁ గొంతమంది మాత్రము బలాత్కారముగా మాత్రము మానివైచి యుండిరనియు స్పష్టముగా నగపడున్నది. ఆ సమయమున, బ్రాహ్మణులయందును సురను సేవించువారుండియుందురు. శుక్రుని కథమహాభారత మందు వచ్చియేయున్నది. శుక్రాచార్యుఁడు మద్యపాయియై యుండెను. దానివల్ల నత్యంతహాని తటస్థించిన కారణముచేత అతఁడు మద్యము త్రాగుట మానివైచి యుండెను, కచదేవయాన్యాఖ్యానమందుఁ గూడ నిట్టి కథయే యున్నది. కాని బ్రాహ్మణులలో నుండి యీ వ్యసనమునులేక యాచారమును శుక్రాచార్యుఁడు బహుప్రాచీన కాలమందుఁ దొలఁగించి యుండును. భారతీయ యుద్ధసమయమున క్షత్రియులవలెనే బ్రాహ్మణులుసైతము సురా

పానము చేయుచుండిరో లేదో - అది నిశ్చయ పూర్వకముగాఁ జెప్పఁబడఁజాలదు. పిమ్మట బ్రాహ్మణ కాలమందు మరియు నుపనిషత్కాలమందు శుక్రాచార్యుడుచేసిన నియమముయొక్క పాలనము సురాపానముయొక్కగణన పంచమహాపాతకములలో నుండెడు నంతకాఠిన్యముతోఁ జేయఁబడుచుండెను. ధర్మశాస్త్రమందు నిట్టినిబంధనము చేయఁబడియుండెను. ఈనిషేధము ఆర్యులందరికొరకు నయియుండెను. అనఁగా బ్రహ్మ క్షత్రియ వైశ్యులు ముగ్గురకు సమానముగానుండెను. కాని ఈ నియమము బ్రాహ్మణులకయి విశేషోపయుక్తముగా మన్నింపఁబడెను. ఈ పంచమహాపాతకములు ఉపనిషత్తుల యందుఁగూడఁ జెప్పఁబడియున్నవి. దీనిఁబట్టి సురాపానదోషము బహుప్రాచీనకాలమునుండి విశ్వసింపఁబడియున్నదని ప్రకటమగుచున్నది. భారతీయ యుద్ధసమయమందును దీనిని బ్రాహ్మణులు మన్నించి యుందురు: మరియు నిట్లు కాదన్నప్పటికిని భారతీయకాలమందు నీనిబంధనము దృఢమైనవిధముగా స్థిరపడి మహాభారత సమయమున బ్రాహ్మణులకయి సుర మద్యపానమువల్ల బ్రాహ్మణుని బ్రాహ్మణత్వమే నష్టమైపోవు ననెడి నియమము తటస్థించిన యంత వర్జనీయమై యుండెను. సురాపానమువలన బ్రాహ్మణులకు బ్రహ్మహత్యాసమానమైనపాతకత్వముకలుగునని నిశ్చయమయ్యెను. శాంతిపర్వముయొక్క 40వ యధ్యాయమందు విశ్వామిత్రునియొక్కయుఁ జాండాలునియొక్కయు నొక మనోరంజకమైన కథ గలదు. ఆ కథవలనఁ జెప్పఁబడిన సంగతి చక్కగా ప్రమాణిత మగుచున్నది.

ఒకప్పుడు పండ్రెండేండ్ల వఱకు వర్షము కురియనందువలన మిక్కిలి భయంకరమైన కఱవుసంభవించెను; అపుడు విశ్వామిత్రుఁడు ఆకలిచేత వ్యాకులుఁడయి యిటు నటు నాహారమును వెదకుటకు దారి తప్పి తిరుగఁజొచ్చెను. ఆసమయమున నతని కొక చండాలుని యిల్లు కనఁబడెను. మరియు నందుఁ జచ్చినకుక్క కాలు కనబడెను. రహస్యముగా విశ్వామిత్రుఁడు ఇంటిలో దూరి యాకాలిని దొంగిలించికొని పోఁదొడఁగెను. ఆసమయమునఁ జండాలుఁడు వాని

నడ్డగించెను. అపుడు చండాల విశ్వామిత్రుల నడుమ ఈ విషయముమీద ఈ చేయబడిన చోర కృత్యము, మంచిదా కాదా యని మిక్కిలి సంతోషకరమైన సంవాదము జరగెను. ఆ సంవాదమందుఁ జిట్టచివరచండాలునితో, ఓసోదరుఁడా నేను ధర్మము జక్కగా నెఱుఁగుదునని చెప్పి దాఁగుకొనెను. చౌర్యముచేయుట లేక కుక్కమాంసమునుదినుట పాతకమై యున్నది; కాని వీనికిఁ బ్రాయశ్చిత్తమున్నది. "పతిత" శబ్దము కేవలము సురాపానము విషయమున ధర్మశాస్త్రమందుఁ జెప్పఁబడియున్నది. "నైవాతిపాపంభక్ష్యమాణస్య దృష్టం సురాంతు పీత్వా పతతీతి శబ్దం" ఈ ప్రకారముగా సురాపానమునకుఁ బాతక మత్యంత భయంకర మని విశ్వసింపఁ బడుచుండెను. మరియు దీని వలన, మహాభారత సమయమందును ఆ పాతకమునకయి, పాతకి శుద్ధుఁడుగాఁగల ప్రాయశ్చిత్తమేమియు లేకుండెను; ఏ బ్రాహ్మణజాతి యొక్క బ్రాహ్మణ్యము ఒక మద్య బిందువుచేతఁగూడ నష్టమైపోవుటను లోకులు విశ్వసించుచుండిరో ఆ బ్రాహ్మణ జాతి విషయమై లోకులయందు బూజ్య భావము పర్థిల్లినచో నిం దాశ్చర్యము లేదు. "యస్య కాయ గతం బ్రహ్మ మద్యేనాప్లావ్యతే సకృత్"ఇది మొదలుగాఁ మనుస్మృతియందుఁగూడ జెప్పఁబడియున్నది. మహాభారతసమయమందును మద్యపానమునకయి యేస్థితియందును ప్రాయశ్చిత్తము లేదను సంగతి మాన్యమై యుండెను. ఇదియేమి కలియుగమందుఁగూడ సినోదియా వంశస్థు లయిన రాజపుత్రులు దీనికయి మాన్యులయిన సంగతి యితిహాస ప్రసిద్ధమై యున్నది. ఈ వంశములోని యొక రాజును వైద్యుఁడు ఔషధ రూపమున మద్యమును త్రాగించెను. అతని కీసంగతి తెలిసినపుడు అతఁడు పురోహితు నడిగెను– "మద్యము త్రాగినవానికిఁ బ్రాయశ్చిత్త మేమున్నది?" ఉత్తరము లభించెను– "కరిగిన సీసమును గొంతుకలోఁ బోసికొనవలయును" రాజు ఇట్లె చేసి ప్రాణములు విడిచిపై చెను. అప్పటినుండియే యీ వంశము పేరు సినోదియా యయ్యెను. మహాభారత సమయమున బ్రాహ్మణులు సురను బూర్ణముగా వర్జించిపై చిరి. శాంతి పర్వములో మోక్షధర్మము నందు 180వ యధ్యాయములోని యొక మంచి శ్లోకమునుబట్టి యీ సంగతి నిశ్చయపూర్వకముగా

నగపడుచున్నది. ఒక పేదబ్రాహ్మణుఁడు- ఒకధనికుఁడయిన మత్తుఁడౌవైశ్యుని రథము తగిలి పడిపోయెను. అపుడాతఁడు మిక్కిలి ఖిన్నుఁడయి తన హీనస్థితి విషయమై శోకింప నారంభించెను. ఈ దరిద్ర బ్రాహ్మణుని యొక్క జన్మము మిక్కిలి దుఃఖదాయకమును దౌర్భాగ్యపూరితము నైయున్నదని విలపించు చుండెను. అదేసమయమున నింద్రుఁడు ఒక నక్క రూపమునుదాల్చి యతని దగ్గఱకు వచ్చెను. మరియు నా బ్రాహ్మణుని ప్రశంసించి యతని సమాధాన పఱుచుచుఁ బలికెను.- నీవు బ్రాహ్మణుఁడవై తివి, ఇందే నీవు మిగుల నదృష్ట వంతుఁడవు, లభించిన యీలాభమునకే నీవు సంతుష్టుడవుకావలయును. నేను జంబుక యోనియందుఁ బుట్టియుంటిని. అట్టిచో నా నెత్తిమీఁద నెంత పాప మున్నది ?" ఇది మొదలుగా సంభాషించుచు నింద్రుఁడు చెప్పెను.- ‹‹నీకె న్నఁడును మద్యముయొక్క స్మరణము లేదు, లట్వాకపక్షియొక్క మాంసము స్మరణముకూడలేదు. మరియు సత్యముచెప్పినయెడల ఈప్రపంచమందు వాని కంటె నెక్కువ మోహకములును, నధిక మధురములగునయినపదార్థము లెచ్చ టను లేవు. ‹‹నత్వం స్మరసి వారుణ్యా లటాకానాంచ పక్షిణాం । తాభ్యాంచా భ్యధికో భక్ష్యో నకశ్చి ద్విద్యతే క్వచిత్" (శాం: అ, 31). తాత్పర్యము- బ్రాహ్మణులు నివృత్తి ధర్మమును బ్రధానముగా మన్నించి మద్యము వంటి మోహనములు లట్టకపక్షిమాంసము వంటి మధురములునయిన పదార్థములను సంతోషపూర్వకముగనే విడిచిపెట్టి యుండిరి. ఈ కారణముచేత సమాజమందు ఇట్టి బ్రాహ్మణులయొక్క ప్రభావము స్థిరపడెను. వారు భారతీయార్య సమాజ మునకు నగ్రగణ్యులును, ధర్మగురువులు నయిరేని యిందు నాశ్చర్య విషయ మును లేదు. మహాభారతకాలమునకు మునుపటి నుండియే బ్రాహ్మణులు సుర యొక్క యే త్యాగము సర్వథా చేసిరో, దాని మహిమ నేటివఱకు స్థిరమైయు న్నది. మరియు నెంతమందియో క్షత్రియులుకూడ దానిని తమ కాదర్శముగఁ జేసికొని యున్నారు. బ్రాహ్మణుల యీ వ్యవహారము యొక్క పరిణామము సమగ్రభారతీయ జనసమాజమందును గాకుండనుండదు, సమగ్రభారతీయుల యొక్క మద్యపానవ్యసనము మహాభారతకాలమందు మిక్కిలితక్కువయ్యెను.

ఈ సంగతికి సాక్ష్యమును గ్రీసు చరిత్రకారులుకూడ నిచ్చుచున్నారు, మెగస్థనీసుయొక్క గ్రంథము నాధారము చేసికొని స్ట్రేబో యనెడు చారిత్రకారుఁడు వ్రాసి యున్నాఁడు.— "హిందువులు, యజ్ఞమందుఁదక్క, మరి యే సమయమందును మద్యమును త్రాగరు"— మేక్ క్రిండలు ఈవర్ణనము బహుశః సోమరసపానమునకు సంబంధించినది కావచ్చునని దీనిమీఁద టీక చేసియున్నాఁడు, కాని కేవలము ఇట్లె చెప్పఁబడఁజాలదు. 'సౌత్రామణ్యాం సురాపానం' ఈధర్మశాస్త్ర వచనము ప్రసిద్ధమై యున్నది. సౌత్రామణి నామక మగు యజ్ఞమందు సురాపానముచేయువలసియే యుండెను. ఇంక నింక నితర యజ్ఞములయందు గూడ నత్యంత ప్రాచీనకాలమున నుత్సవ నిమిత్తముచేత సురా పానము చేయఁబడు చుండెను. యుధిష్ఠిరుని యశ్వమేధ వర్ణన మందు సురాపానము యొక్క వర్ణన మున్నది. ఇట్లే ద్రోణ పర్వములోని షోడశరాజీ యోపాఖ్యానమందు 64వ యధ్యాయమున సురాపానముచేసిన వర్ణన మున్నది. మరియు నీ యన్ని వర్ణనములును భారతీయకాలముకంటెఁ బ్రాచీనములయియున్నవి. మహాభారత సమయమున బ్రాహ్మణులు 'నిత్యం సురా బ్రాహ్మణానాం' యీ నియమము మన్నింపఁబడియుండెను. మరియు నితర లోకులయందుఁగూడ కేవలము ఉత్సవ సమయమందు మద్యపాన వ్యసనము కనఁబడుచుండెను. కాని యితర సమయములయందు లోకులు మదిర త్రాగెడివారు కారు.

ఈ ప్రకారముగా భారతీయ కాలమందు భారతీయార్యుల భోజన వ్యవహారమందు మిక్కిలి గొప్ప మహత్త్వము యొక్క యంతరము తటస్థించెను. భారతీయార్యులకై యీ సంగతి మిఁగుల భూషణాహమై యున్నది. భారతీయార్యులు విశేషించి బ్రాహ్మణులు మద్య మాంసములను దినుటను త్రాగుటను మానివైచిరి. పంజాబు దక్క హిందు దేశములో నితర ప్రాంతములయందలి లోకులందఱ యందును, చెప్పఁబడిన ప్రకారముగా, నానియమము యొక్క పాలనము చక్కగా జరుగుచుండెను— దేని నార్యావర్తమని చెప్పుచున్నారో యా దేశములోని యా

చారము లన్నిటికంటె శ్రేష్ఠమై యున్నవి-ఈ సంగతి ప్రాచీనకాలమందు ఇదే కారణముచేతఁ జెప్పఁబడుచుండెను. చెప్పఁబడిన విధముగా, ఆర్యావర్తము యొక్క విశేషించి బ్రహ్మర్షి దేశముయొక్క రీతిరివాజులు, వివాహ నియమము, వర్ణవ్యవస్థ మఱియు ఖానపాన వ్యవహారమునకు సంబంధించిన కఠిన నియమములు దేశమంతటను ప్రామాణికములుగా విశ్వసింపఁబడుచుండెను మఱియు నన్యాన్య ప్రాంతముల యందు వీని కంటెఁ గొంచెముగా భిన్నములైన యాచారములుండెను. పంజాబులోని బాహిక ప్రజలయందు పూర్వకథనము ననుసరించి, మాంసభక్షణము విషయమై యనాచారముండెను. మఱియు పంజాబులో బాహిక ప్రజల యందు సురాపాన సంబంధమునఁ గూడ ననాచారముండెను. ప్రతి చతుష్పథమందును రాజద్వారమందును గూడ కల్లుదుకాణములు తెరవబడుచుండెను. కలారీలకు గౌడులను పేరు ప్రసిద్ధమై యుండెను. కర్ణపర్వములోని శల్యకర్ణ భాషమువలన నీ సంగతులు ప్రకటమగుచున్నది. ఈ విధముగా జరిగిన తరువాతఁ గూడ పంజాబు పాంతము నా సంగతి విషయమై మహాభారత సమయమున బాగై యుండును. ఎందుచేత? శల్యుఁడు తన ప్రత్యుత్తరముతో పెద్దవారన్ని చోట్లను నున్నారను నభిప్రాయమును ప్రకటించియున్నాఁడు.

## సారస్వతుల మత్స్య భక్షణము

పంజాబు వారి వంటి మఱియు ఎవరి యాచారము సాధారణముగా ధర్మశీలులైన బ్రాహ్మణుల యాచారము కంటె భిన్నమై యుండెనో యటువంటి యింక నొకమాదిరి జనుల యుల్లేఖము మహాభారతమందుఁ గలదు. ఈ యుల్లేఖము సారస్వతులదియై యున్నది. బ్రాహ్మణులు మత్స్యములఁదిన రాదని మునుపు చెప్పబడియున్నదిఁ కాని దీని కపవాదముగా సారస్వతులపేరు మహాభారతమందుఁ చెప్పఁబడియున్నది. సారస్వతులనఁగా సరస్వతీతీరమున నున్న బ్రాహ్మణులు, వారిప్పటికిని మత్స్యభక్కులై యున్నారు. సారస్వతాఖ్యానముఁ బట్టి వీరు మహాభారత సమయము నుండియే మత్స్యములఁ దినుచున్నారని తెలియుచున్నది, పంద్రెండేండ్ల వఱకు

వర్షము కురియక పోఁగా సారస్వత ఋషి సరస్వతీ నదిలోని మత్స్యములను తిని పొట్టపోసికొని వేదముల సంరక్షించెను, దేశదేశములకుఁ బోయిన బ్రాహ్మణులు తిరుగ వచ్చి సారస్వతుని యొద్ద వేదములఁ బఠించిరి. ఈ ప్రజల పేరు సారస్వతులని తటస్థించెను. సరస్వతీ ప్రదేశములోని యొక భాగమునకుఁ బేరు ప్రాచీనకాలమందు గుడమని యుండెను. ఈ కారణము చేత నచ్చటి బ్రాహ్మణులు గౌడులని కూడఁ జెప్పఁబడఁదొడగిరి. ఈ గౌడ బ్రాహ్మణులు బంగాళమునకుఁబోయి నివసించిరి. మఱికొంత మంది సారస్వత బ్రాహ్మణులు కోంకణమందు స్థిరపడిరి. ఈ రెండు స్థానములందలి గౌడుల యందును. సారస్వతుల యందును నేఁటికిఁ గూడ మత్స్యాహారము ప్రచలితమై యున్నది.

## బియ్యము మొదలైన ధాన్యములు

సాధారణ రీతిని మహాభారత ప్రజలు ముఖ్యముఖ్యములైన ధాన్యములను దినుచుండిరిఁ ధాన్యము, బియ్యము, గోధుమలు, జొన్నలు, పేలపిండి మొదలైనవి. ముఖ్యములై యుండెను. ధనవంతుల యందును క్షత్రియుల యందును అన్నముతో మాంసమును గలిపి దానినిపుడు పులావు అని చెప్పుచున్నామో దానిని తినెడి యాచాలము విశేషముగా నున్నట్లుగపడుచున్నది. ధృతరాష్ట్రుఁడు సభాపర్వమందు దుర్యోధనునడిగి యున్నాఁడు "అచ్ఛాదయసి ప్రావారాన్ అశ్నాసి పిశితౌదనం" నీవు మంచిమంచి వస్త్రములను ధరించుచున్నావు. మఱియు మాంసౌదనమును అనఁగా పులావును దినుచున్నావు; మఱి దుర్బలుఁడవెందులకగుచున్నావు? ఇంతకంటెను విశేషించి చక్కని శ్లోకమొకటి యుద్యోగ పర్వములోని విదుర నీతియందుఁ గలదు.

> ఆఢ్యానాం మాంసం పరమం మధ్యానాం గోరసోత్తరమ్ ।
> తైలోత్తరం దరిద్రాణాం భోజనం భరతర్షభ ॥

ధనవంతులైన వారు తఱచు మాంసము విశేషముగా నున్న భోజనమును జేయుచున్నారు; మధ్యమ స్థితిలోని వారి భోజనమందుఁ పాలు, నేయి

మొదలైన గోరసము యొక్క సమృద్ధి యుండును; ఇంకఁ బేదవారు తైల మధికముగా నున్న భోజనమును జేయుచున్నారు, భిన్నభిన్న ప్రాంతము లందు భిన్నభిన్న విధములైన యన్నముల విశేషత యుండును. హిందూ దేశమందలి వర్తమాన కాలికమైన పరిస్థితి యందు ఈ సంగతి స్పష్టముగా నగపడుచున్నది, ఇట్టి భేదము ప్రాచీన కాలమందు అనఁగా మహాభారతసమ యమున నుండి యుండును. మొట్టమొదట ఆర్యుల నివాసము హిమాలయ పర్వతము యొక్క క్రింది భూమి యందుండెను. పిదప పంజాబు నుండి మొదలుకొని సరిగా మిథిల దేశము వఱకు నయ్యెను. ఈ దేశమందు ముఖ్యమైన పంట ధాన్యపుదియై యుండెను. మఱియు నీప్రదేశ మందప్పటికి ప్రశస్తమైన బియ్యమున్నవి. ప్రాచీనకాలమందు అనఁగా భార తీయ యుద్ధసమయమున నార్యుల భోజనమందు ముఖ్యముగా బియ్యము యొక్క సమృద్ధి యుండుట స్వాభావికమేయై యున్నది, ఈ ప్రదేశముల నుండి మెల్లమెల్లగా నార్యులు దక్షిణమువైపు వేఁడి ప్రదేశములకు వ్యాపిం చిరి. ఇచ్చటి ముఖ్యోత్పత్తి బియ్యపుదికాదు. యవధాన్యపుది మఱియు గోధుమలదియై యుండెను, అట్లే యిప్పుడును గలదు. వనపర్వమందు (అ. 190( కలియుగ వర్ణనములోఁ చెప్పియున్నాడు—

> యే యవాన్నా జనపదా గోధూమాన్నాస్తథైవచ ।
> తాన్దేశా న్సంశ్రయిష్యన్తి యుగాన్తే పర్యుపస్థితే ॥

ఏ దేశమందు ముఖ్యముగా యవలు గోధుమము పుట్టుచున్ననో మఱియు నేదేశమందు వీనిని లోకులు దినుచున్నారో, ఆ దేశములయొక్క యాశ్రయమును, కలియుగము వచ్చిన తరువాత లోకులు చేయుదురు. ఈ దేశములు గంగకు దక్షిణ తీరమధ్యమందున్న హిందుస్థానము, గుజరాతు మొదలైనవై యున్నవి. ఈ రెండిటి యందు నార్యుల నివాసముపిమ్మటనై యుండెను, వ్రాయఁబడిన వాక్యము వలన నీసంగతి చక్కగానగపడుచున్నది

ఈ దేశమందు ధాన్యముయొక్క యుత్పత్తి మిక్కిలి తక్కువగానగుచున్నది. దరిద్రులు, మధ్యమ శ్రేణిలోని వారునైన లోకులు విశేషించిబియ్యము తిను టయే లేదు; అట్టిచో, గంగకుత్తరప్రదేశమున నుప్ప యార్యులకు నన్నము దొరకకపోవుటచేత ఈ దేశమందుండుట యొకవిధమైన యభాగ్యమేయని తెలియుఁగలదు. దీనిఁబట్టి, కలియుగములో నీదేశముల యందు లోకులు నిందుదురని వర్ణితమై యున్నది. ప్రస్తుత కాలమున గోధుమ భోజనము బియ్యము కంటె శ్రేష్ఠముగా విశ్వసింపఁబడుచున్నది; కాని మహాభారత సమ యమున నింతకంటె విపరీత స్థితి కనఁబడుచున్నది; గోధుములు, బియ్యము రెండే శ్రేష్ఠమైన ధాన్యములై యున్నవి. పేలపిండి యొక్క ప్రశంస మహా భారతములో ననేక స్థలములయందున్నది. పేలపిండి యద్యపియుత్తమ ధాన్యముకాదు మఱి దానికింత ప్రశంసమహాభారతములో నెందులకు వచ్చెనో తెలియదు. వేచఁబడిన పేలపిండిని దినెడు నాచారము మహాభారత సమయ మందుండెను. పేలపిండిలోఁ జక్కెరను గలిపి కొన్ని పదార్థములు లడ్డు మొదలైనవి. చేయఁబడుచుండి యుండును. మహాభారతమునస్త్రీలకును; తమ కొఱకుఁ బేలపిండి చేసికోఁగూడదనియు, రాత్రియెంతరిగాఁదినఁగూడదని దనియు నుపదేశింపఁబడియున్నది. మంచిది పైని వర్ణింపఁ బడినట్లుగా, విశేషించి యీ పేలపిండి తియ్యగా నుండి యుండును. వరి అనఁగా నేఁటి పేలపిండియై యున్నది.

## గోరసముయొక్క మహిమ

జనసమూహములో గోరసము విశేషముగా భక్షించు వ్యవహారముండెను పాలు, నెయ్యి తఱచు గోవులదే వినఁబడుచుండియుండెను. గేదెపాలనుపయో గించినట్లు వర్ణనమెందును లభింపకున్నది, దీనిఁబట్టి, ఆ సమయమందుగేదెలు లేనే లేకుండెనని యూహింపరాదు. కాని దున్నలు గేదెలు నింద్యములుగా గణింపఁబడుచుండెను. ఇదిగాకొండ దేశమందు గోవంశమునకు విశేషవృద్ధి యుండుటచేత నావుపాలకు లోటు లేకుండెను. (వనప 190 అధ్యాయమందు కలియుగములో గోవులు నష్టమై పోవుటచేత గొఱ్ఱెలు, మేకలు పితుకఁబడు నని వర్ణనమున్నది. "దుహంతా శ్చాప్యజైడకం గోషునష్టాసు పురుషాః"

కొన్ని జంతువులపాలు శాస్త్రదృష్టిచేత నిషిద్ధముగా విశ్వసింపఁబడుచుండెను. బ్రాహ్మణులు (అజ) గొఱ్ఱె, గుఱ్ఱము, గాడిద, ఒంటె, మనుష్యుల [స్త్రీ] లేడి వీనియొక్క పాలు త్రాగఁగూడదని చెప్పఁబడియున్నది. ఇదే విధముగా ఆవు ఈనిన తరువాతఁ బది దినములవఱకు దానిపాలు త్రాగఁగూడదు. చల్లిది యన్నము, ప్రాఁతపిండి, చెఱకు, శాకము, పాలు, వేఁచఁబడిన పేలపిండితోఁ దయారుచేయఁబడిన పదార్థములు, చాల రోజులవఱకు నిలువయున్నచో, వానిని దినఁగూడదు. [శాంతిప. అ. 36] కూరలలో వెల్లుల్లి, ఉల్లిపాయకూడ వర్జ్యములని చెప్పియున్నాఁడు. పంజాబువారి విషయమై వర్ణింపఁబడిన యనాచారములలో, వారు వెల్లుల్లి, ఉల్లిపాయ లేనివట్లు వర్ణనమున్నది.

## భోజనము చేయునపుడు మౌనము

భారతీయార్యులంతఱు భోజనముసాధారణముగాఁ బరిమితముసాధ్యముసు [శుద్ధము]నై యుండును. గ్రీకువారు వారి భోజనము విషయమునఁ గొంత యాలోచనతోఁ గూడిన వర్ణనమును జేసియున్నారు. "హిందుస్థానవాసుల భోజనమునకు నియత సమయములేదు. మఱియు సమాజమందంతటను ప్రసిద్ధమైన భోజనముకూడ లేదు" మహాభారతములోని కొన్ని వచనములఁ బట్టి యెూ యాక్షేపము సత్యముగా నగపడుచున్నది. ప్రొద్దుటను సంజవేళను భోజనము చేయఁగూడదు. ఇదే నియమమువున్నది; మఱియు అహోరాత్రుల మధ్య కేవలము రెండు మాఱులే భోజనము చేయవలయును. చాల పర్యాయములు కూడదు. కాని భుజించుటకు నేదియు నిశ్చితకాలము అగపడదు. ఇది గాకుండ నీ నియమముకూడఁ జేయఁబడియున్నది—"ప్రాఙ్ముఖో నిత్యమశ్నీయాత్ వాగ్యతోన్నమకుత్సయన్." [అనుశాసన ప. 10] భుజించు సమయమున మాటాడఁగూడదు వంటను నిందింపఁగూడదు. ఈ కారణముచేత సామాజికమును బ్రసిద్ధములైన విందు, వీనివట్ల భుజించువారు చిన్నచిన్న వ్యాఖ్యానములుఁ జేయుచున్నారో లేక భాషించుచున్నారో, ఏవి ప్రాచీనకాలమందును అట్లే ఈ సమయమందుఁగూడఁ బాశ్చాత్యదేశములయందు జరుగుచున్నవో మహాభారత సమయమున, వీనియందు బ్రచలితమై యగపడదు. గృహస్థులు ఒక్క భోజన గృహమందే వేఱువేఱు ప్రాంతములయందుఁ బ్రస్తుత

మున భుజించుచున్నట్లే పూర్వకాలమందును చేయుచుండిరనుట సత్యమై యున్నది. కాని యుధిష్ఠిరుఁడు చేసిన యశ్వమేధ సమయమున వేలకొలది బ్రాహ్మణులను, క్షత్రియులను, వైశ్యులను భోజనము చేసినవర్ణనమున్నది. దీనింబట్టి సామాజిక భోజనములు లేనేలేకుండెననియుఁ జెప్పఁజాలము. కాని ఇట్టి భోజనములయొక్క, వంటకములయొక్క సమయమునఁగూడ భుజనము చేయువారు మౌనవ్రతముతోనే భుజించుచుండిరనుటలో సందేహము లేదు.

## భోజనములోని భిన్నభిన్న పదార్థములు

ఇట్టి సమయములందు భోజనములో ఆ మామూలు వస్తువులే యుండఁజాలవు. అప్పుడు వివిధములైన రుచికర పదార్థములు చేయుచుండియుందురు. ఇది గాకుండ శ్రీమంతుల భోజనములందుఁగూడ భిన్నభిన్నములైన స్వాదిష్ఠ పదార్థములు తయారగుచుండియుండును. ఆశ్రమవాసి పర్వమందీ వర్ణన మున్నది.

> ఆరాలికాః సూపకారో రాగఖాండాలికాస్తథా।
> ఉపాతిష్ఠన్త రాజానం ధృతరాష్ట్రం పురాయథా॥

ధృతరాష్ట్రునకు, మునుపటియట్లే యుధిష్ఠిరుని దగ్గఱఁగూడ ఆరాలికులు, సూపకారులు. రాగఖాండాలికులు పక్వాన్నములను దయారుచేసివడ్డించుచుండిరి, [ఆశ్రమవాసి ప. అ. 1] ఇందు మూఁడువిధముల వంటవాండ్రు చెప్పఁబడియున్నారు. ఆరాలికులును సూపకారులును తియ్యతియ్యని పదార్థములను చేయుచుండియుందురు. తీపిపదార్థములును లేక ఖాండవరాగములును లేక రాగఖాండవకులు అను పేరుతోనేమహాభారతమందువర్ణితములై యున్నవి టీకాకారుఁడు, చక్కెర, పెసలు, సొంటి వీనితో ఈ పదార్థములు చేయఁబడుచుండెనని వర్ణించియున్నాఁడు. గుజరాతీ భాషలో ఖాండవ=చక్కెర [హిందీయందును ఖాండవ]=చక్కెర శబ్దముప్రసిద్ధమైయున్నది, కానిరాగమునకర్థము చెప్పజాలము. తీపివస్తువులను దయారు చేయువారు రాగఖాండకులును, కూరలు. ఒకవిధమగు పులుసు, పెరుగుపచ్చడి (పచ్చళ్ళు) తయారుచేయు

వారు సూపకారులునై యుండిరి. సూపశబ్దముచేత పప్పు యొక్క బోధమగు చున్నది. అరావికులు మాంసమును వండుచుండి యుందురు. అగ్గ్ రాకభక్ష్య పదార్థములుకాకుండ వివిధములైన పేయములు అనఁగా త్రాగుటకష్టములైన పలుచని పక్వాన్నములు పాయసము, గడ్డకట్టిన పాలు మొదలైనవి చేయ బడుచుండి యుండును. కాని యీ పేయములు ఏవేవై యుండెనో, యీవర్ణన మెచ్చటను దొరకకున్నది. పేయములు తఱచుతీపివై యుండునను మాత్రము నిర్వివాదమై యున్నది. ధృతరాష్ట్రుని భోజనమందు వర్ణనము కలదు.

మైరేయ మత్స్య మాంసాని పాతకాని మధూని చ।
చిత్రాన్భక్ష్య వికారాంశ్చ చక్రుస్తస్యయథా పురా॥

(ఆశ్రమవాసప. అధ్యాయ 1)

దానము చేయఁబడు నాహారములో అప్పము లఉండ్రముల వర్ణనము కనఁబడుచున్నది. భోజనమందలి యున్నిపస్తువులలోను ఘృతము శ్రేష్ఠమై యుండెనని చెప్పనవసరములేదు. ఇప్పటి వాక్యము "అయురేవ మృతం" ప్రసిద్ధమేయై యున్నది. కాని భారతమందు "ఘృతశ్రేయ ఉదశ్వితః" అనువచనము వచ్చియున్నది. అనఁగా మజ్జిగకంటె నేయి శ్రేయస్కరమనుట కిది యుదాహరణమై యున్నది. ఈ ప్రకారముగా మహాభారతమందు కొంత యుల్లేఖము ప్రసంగము ననుసరించి వచ్చి యున్నదో దాని యాధారము మందు మహాభారత సమయమున భారతీయులేమి తిను చుండిరి విచారింపఁబడెను. ఇపుడు భోజనము యొక్క కొన్ని విశేష నియమములను జూడవలసియున్నది.

## భో జ న ని య మ ము లు

తినుట, త్రాగుట విషయమై యే కొన్ని విశేష నియమములు చెప్పఁబడియున్నవో వాని నిచ్చట జూపుట బాగుగా నుండును. "రాజు యొక్క

యన్నము తేజమును హరించుచున్నది. శూద్రుని యన్నము బ్రహ్మవర్చసము హరించుచున్నది. మఱియు కమసాలి యన్నము, అట్లు పతియు పుత్రుఁడు లేని స్త్రీ యొక్క యన్నము, ఆయువును హరించుచున్నది. మోసముచేత జీవించు వారి యన్నము మలము వేశ్యాన్నము శుక్రమునై యున్నవి. జారుని సహవాసమును సహించువారియొక్కయు స్త్రీలనుగెలిచిన లోభులయొక్కయు నన్నివిధములైన యన్నము శుక్రమేయై యున్నది. యజ్ఞదీక్షను గ్రహించిన బ్రాహ్మణుని, కృపణుని, యజ్ఞకర్మమును విక్రయించిన వాని, వడ్రంగము చేయువాని, చర్మమును గోయువాని, చాకలి పని చేయువాని అన్నమును దినఁగూడదు. వ్యభిచారిణుల, వైద్యుల ప్రజాపాలన నియుక్తులైన యధికారుల, జనసమూహముల యొక్క గ్రామము యొక్క, మీఁద లోకాపవాదమున్న లోకము యొక్క నన్నమును భక్షింపఁగూడదు. రంగులు వేయువాని, స్త్రీ సంపాదించిన ద్రవ్యమును దినువాని, అన్నగారి కంటె ముందు వివాహ మాడినవాని, స్తుతిపాఠకుని, ద్యూతజ్ఞుని అన్నము దినఁగూడదు. ఎడమచేతితో గ్రహింపఁబడినది, చలిది మద్యమునకుఁ దాకి ఎంగిలి ఎవనికిని బెట్టకుండ నొక వ్యక్తికై యుంచఁబడినది అన్నము తినఁగూడదు, చెఱుకు, కూర, పేలపిండి, పిండి, పెరుగుతోఁ గలుపఁబడిన పేలపిండితోఁజేయఁబడిన పదార్థము చాల దినములవఱకు నిలువయున్నచోఁ దినఁగూడదు. పాలు వరపాన్నము. పచ్చడి, మాంసము వడియము లేక అప్పము శాస్త్రోక్త కారణములు లేకుండనే తయారుచేయఁబడునేని. గృహస్థాశ్రమమైన బ్రాహ్మణుఁడు భక్షణము లేక ప్రాశనము కూడఁ జేయఁగూడదు. మనుష్యుని లేక గృహ దేవతను బూజించి గృహస్థు భోజనము చేయవలయును. ఎవనికి మృత్యాశౌచము లేక పురుడు వచ్చునో వారు పది దినములకంటెఁ బూర్వము పదార్థము తినఁగూడదు. (శాం. అ. ౩౬) ఈ వర్ణనముఁబట్టి మన భారతీయార్యుల యాహార సంబంధమైన కొన్ని విశేష నియమముల యనుమానము పుట్టింపఁబడఁ గలదు. మహాభారత సమయమున బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు

నింట భోజనము చేయుచుండిరి; కాని శూద్రులయింట భోజనము చేయఁబడ కుండెను. శూద్రునింట భుజించినయెడల బ్రహ్మవర్చసము లోపించునను సంగతి స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. ఇదిగాకుండఁ గమసాలియింటికి భోజనము చేయుటకై పోవుటకు నిషేధముండెను. కమసాలివద్ద నేమి దోషముండి యుండునో యిది చెప్పుట కఠినమై యున్నది. చాకలి, వైద్యుడు, మాదిగ వర్ధంగి వీరి విషయమున నిట్టి నియమమే యున్నది. కాని ఈ నిషేధమునకుఁ గారణము ఆ వృత్తులయం దేదైన విశేషమైన యవగుణముండి యుండును. ఈ వ్యాపారులయందు ఏ ప్రాణి హింసయగుచున్నదో లేక ఏ అమాంగళ్యమగుచున్నదో, ఒకప్పుడు అందుపై ధ్యానముండియుండును. రాజాధికారియొక్కయు, వడ్డీ వ్యాపారము చేయువాని యొక్కయు నన్నము తినఁ గూడదని చెప్పఁబడియున్నది. ఇది ధ్యానింపఁదగిన విషయమై యున్నది. ఇదిగాకుండ నితర నియమములపట్ల, అన్నము తినివేయుటవలన నెంగిలియై పోవునను విచారము, ప్రస్తుతకాలమునవలె, అపుడుకూడ నుండెనని మనకు నగపడుచున్నది. మడి, శుభ్రత, స్పర్శము లేక నిర్లేపముయొక్క భేదాభేదములు ఆ కాలమందు స్పషముగా నగపడవు. తుట్టతుద కీవిషయమమైన వర్ణన మెచ్చటను గనఁపడదు. అన్నఁగా ఉచ్ఛిష్టదోషము ఇరువురియందును సమానముగా మాన్యమై యగుపడుచున్నది.

భోజన సంబంధమున నేసంగతులు తెలియఁగలవో యవి ప్రోగుచేసి పాఠకుల యెదుర నుంచఁబడినవి. ఇపుడు భారతీయ ప్రాచీనార్యుల యొక్క వస్త్ర భూషణ సంబంధమైన రివాజు వర్ణింపవలసియున్నది.

## వస్త్రములు, భూషణములు

ప్రాచీనకాలమందలి ప్రజల భిన్నభిన్న రీతులు మొదలైనవానివిషయమున ఏ యత్యంత మహత్త్వములును మనోరంజకములునైన సంగతి దెలిసికోనుటకై యందఱకుసుత్కంఠయగుచున్నదో యిదివారివస్త్రములయొక్కయు భూషణములయొక్కయు సంబంధమునసున్నది. ప్రాచీనకాల ప్రజల శారీరక వర్ణనము లేక వారి రంగుయొక్కవర్ణనము ఇంత మహత్త్వముతో నిండినదికాదు

ఏందుచేత? తమ తమ పూర్వ్వజుల శారీరక పరిస్థితులను నడుమ విశేష మైన యంతరము తటస్థించుననెడి సంభావన యుండదు. కాని వస్త్రముల విషయమున మనుష్యుని పరిస్థితియందు భిన్న భిన్న కారణములచేతను మను ష్యుని కల్పనచేతను చాల భేదము తటస్థించుటకు విశేష సంభావన యున్నది. ఇది గాకుండ ప్రాచీన లోకుల సంగతులను జెప్పునట్టి వారియొక్క వస్త్ర ప్రావరణములయొక్క వర్ణనము పురాతన గ్రంథములయందు బొత్తిగా నసం పూర్ణమై యున్నది; ఎందుచేత? ఉపన్యాసాదులయందుఁ దక్క స్త్రీపురుషుల వర్ణనము ఇతర గ్రంథములయందు లేదు. భిన్న భిన్న పరిస్థితుల యందు మఱియు సంపన్నతయు భిన్నతా కారణమునింత, వివిధములైన దుస్తులయు పద్ధతులయు నుత్పత్తిని మనము చూచుచున్నాము ఇందుచేత ఒకపరిస్థితిగల లోకులు మఱియొక పరిస్థితిగల వారి దుస్తుల కల్పనను జేయఁజాలరు ఉదా హరణార్థము, ఫారిస్ నగర నాగరకతతో శిఖరమందుఁ గూర్చున్న పాశ్చాత్య స్త్రీలకు, హిందుస్థానమందేదో యడవి జాతిలోఁబుట్టిన స్త్రీల దుస్తులయొక్క కల్పన యగుట సంభవముకాదు. మనికట్టు మొదలుకొని మోచెయ్యివఱకు నిత్తడిగాజులు దొడుగుకొన్న, గళమందుఁ దెల్లని లాతిపూసలు మణులవలె గట్టు కొన్న చినిగిన పాత గుడ్డను మొలకు జుట్టుకొని తలపైఁ జిన్న నల్లగుడ్డను జుట్టుకున్న యొకతెను జూచి ఫారిస్ నగరవాసులకు సంగతికు నాశ్చర్యమగు ఇచ్చోటనున్న యిట్టి స్త్రీలకు, వివిధ చిత్రవిచిత్ర వస్త్రములచే నలంకృతులగు పూల లంగాలుగల యాంగ్లేయస్త్రీల దుస్తులయొక్క కల్పన చేయజాలదు ఎందు ఈ కల రచనయొక్క వీశృంగారముండునో ఆ టోపీని ఏమి యూహింపఁగలదు యది అట్లుండెను పాఠకుల యెదుర, ప్రాచీనకాలికులైన భాంతీయార్య స్త్రీలయుఁ బురుషులయొక్కఁ జిత్రపటములు, వీనిని ధరించువారు సమాజమునందు దిరుగు చున్నారో అట్టి దుస్తులతోడను నగలతోడను నలంకరించి యున్నది యున్న ట్లుగా నిలఁబట్టబడునేని మిక్కిలి మనోరంజకమగును కాని యీ పని సామా న్యము కాదు, ఇందుచేత? మహాభారతమందు వస్త్రములయు భూషణము లయు వర్ణనము బొత్తిగాఁ దక్కువయున్నది ఏవియేనియున్నను అవి ఒక చోట లేవు కొంత యొకచోట నున్నది, కొంతయొక చోట ఇందుచేత వానినొక చోటికిఁజేర్చి యీ పని చేయవలసియుండును ఇట్లు చేసినను గూడఁ దిరుగ నయ్యది యపూర్ణముగనే యుండును

## పురుషుల దుస్తులు రెండు

మహాభారత సమయమున భారతీయార్య పురుషులకు దుస్తులు బొత్తిగా సాదు తక్కువయుండెను రెండు దోవతులే వారి దుస్తులై యుండెను ఒక ధోవతి నడుము క్రిందుగాఁ గట్టుకొనఁబడుచుండెను. రెండవది శరీరముపైని మనసు నచ్చినవిధముగా వేసికొనఁబడుచుండెను భారతీయార్యుల యీ పురాతన దుస్తులు ఇప్పటికిని వెనుకబడిన భాగములయందును ప్రాచీనాచార పరాయణులయందును ప్రత్యక్షములై యున్నవి. ప్రాచీనకాలమునందుఁ బాశ్చాత్యులైన గ్రీక్కులయొక్క రోమనులయొక్క దుస్తులుకూడ నిదే విధముగా నుండెను, ఈ ధోవతులు లేక వస్త్రములు తయారుచేయుట మిక్కిలి సరళమై యుండెను, దీనిఁబట్టి వీనియొక్క వ్యాపారము ఆ సమయమున అయియుండును. ధనవంతులకేమి దరిద్రులకేమి యందఱకు నిదే మార్గమై యుండెను మఱియు మఱియు ధోవతులను దాల్చు పద్ధతి ఒక్క విధముఁదియే యై యుండెను. ఇంతియే భేదము, గొప్పవారి ధోవతులు నూలివి సన్నవి మఱియు సుందరములునై యుండును. సామాన్యుల దోవతులు సాధారణపు దళసరివి యై యఁుండును. లాగులు తొడుగుకొను పద్ధతి ప్రాచీనకాలమందు లేకుండెను. ఇప్పటి విధముగనే, తఱచు ధోవతి కట్టుకొను పద్ధతి యుండెను. ద్యూతసభావర్ణనముఁ బట్టి యీ సంగతి ప్రకటమగుచున్నది. ద్రౌపది రాజసభకుఁ బట్టుకొని తీసికొని రాఁబడెను మఱియు దాసియని పిలిచి యామె యవమానింపఁబడెను. ఆ సమయమున దుర్యోధనుఁడు తన తొడఁ దెరచి చూపెను. అతఁడు లాగు తొడుఁగుకొను చుండెనేని యిట్లే విధముగాఁ చేయఁగలిగి యుండెను. ఈ విధమైతే దోవతి కట్టుకొనిన యవస్థయందే కాఁగలదు. నడుమునను పైభాగము ఎల్లప్పుడు నుత్తరీయముచేత మూయఁబడియే యుండుట ఎంత మాత్రములేదు, అది తెరచియే యుండెడిది. ధనవంతుల దోవతులు మిక్కిలి సన్నవి యగుచుండెను మఱియు అవి ప్రావారములని చెప్పఁబడు చుండెడివి. శరీరముఁ గప్పునట్టి యుత్తరీయముయొక్క వర్ణనము బొత్తిగా దక్కువగనున్నట్లున్నది. పురుషుల

యొద్ద నుత్తరీయ వస్త్రముండెడిదనుట మాత్రము నిర్వివాదము. సాధారణపు పనులయందు నుత్తరీయము వలన నే మాత్రపు టిబ్బందియు లేకుండి యుండును, ఇందు నిమిత్తమై విద్యార్థులకు, కుడిచేయి ఉత్తరీయమునుండి బయటికి వెడలించి యెదుట మూపుపైని ఉత్తరీయమందు ముడివేయవలయునను నియమమగపడుచున్నది. మనుస్మృతియందీ నియమము ధృతపాణిఃస్యాత్" ఈ రూపమునఁగలదు. టీకాకారుఁడు దీని కర్థమును, ఉత్తరీయమునుండి వెలుపలికి వెడవిరచి యుండవలయునని చేసియున్నాఁడు. ఈనియమము కేవలము బ్రహ్మచారులకై యున్నది. దీనిఁబట్టి యితరులకై యుత్తరీయమును గప్పుకొను పద్ధతి మఱియొక విధముగనే యుండియుండునని తెలియుచున్నది. యుద్ధసమయమున యోధులు వుత్తరీయము నేవిధముగా ధరించుచుండెడివారో చెప్పఁజాలము. కాని వారు బ్రహ్మచారులవలెనే కుడిచేయిఁ బైకిఁ దీసికొని యెడమ మూఁపుపైని ముడివేయుచుండి యుందురు. రోమను ప్రజలయందు (పొగా) ధరించెడి రీతి యెట్లుండెనో యట్టి రీతియే యిచ్చట నగుటయు సంభవమై యున్నది. లేదేమి, ప్రాచీన చిత్రములయందు వుత్తరీయముయొక్క రెంకొనలు వెనుకవైపున నెగురుచు నగపడుచుండుట యేదైతేఁ గలదో, అదికూడ యథార్థము కాఁగలదు.

చెప్పఁబడిన రెండు వస్త్రములు గాకుండ భారతీయార్యుల దుస్తులలో నితర వస్త్రములు లేకుండెను. లాగు, లేక చొక్కా యాసమయమున లేనే లేకుండెను. వస్త్రము చేదించి, వివిధములైన వస్త్రములను కుట్టునట్టి కలయే భారతీయ కాలమందు లేకుండెనని మనకుఁ దెలియుచున్నది. ఆ కాలమున బట్టలు కుట్టెవని తెలియక యుండెను, ఇట్లే విశ్వసింపవలసియున్నది. ఇది పశ్చిమదేశపు వ్యాపారమైయున్నది, మఱియు అది యావైపునుండియే హిందూస్థానముకుఁ దీసికొని రాఁబడినట్లు అనుమానము చేయఁబడఁగలదు. సంభవమై యున్నది. అలెగ్జాండ్రకు సహచరులైన గ్రీక్కులే దానిని దీసికొనివచ్చి యుందురు. లేక యింతకంటె బ్రథమమున నొకప్పుడు చక్రవర్తియొక్క సమయమున వర్షియను లు సింధువుయొక్క పశ్చిమ వైపు భాగమును గెలిచినపుడు పాశ్చాత్యుల సహవాస

మున హిందుస్థానమునకు ఈ వని వచ్చియుండును. ఎందుచేత? మహా భారతములో కుట్టుపని వానియొక్క పేరు ఏ శిల్పముయొక్క సంబంధమునను రాలేదు. సంస్కృతమందు కుట్టుపని వానికై తున్నవాయ అను శబ్దమున్నది. కాని మహాభారతమందు ఈ శబ్దమే రాలేదు. కమసాలి కుమ్మరి, కంచరి, చెప్పులు కుట్టువాఁడు మొదలైన వారిపేరులైతే మహాభారతమందుఁ గలవు, కాని తున్నవాయునిది లేదు. రామాయణమందు తున్నవాయ శబ్దమున్నది. దీనిఁ బట్టి మహాభారతమున కనంతరము రామాయణమునకుఁ బూర్వమును ఈ పని భారతవర్షమునకు వచ్చియుండును. అలగ్జాండ్రకాలమున గ్రీక్కుల శాసనము పంజాబునందుఁ జాల కొలఁది దినములుండెను. కాని మహాభారత కాలమునకుఁ బిమ్మట బైక్ట్రి యని గ్రీక్కులు క్రీ. పూ 200 వర్షమునకు దాదాపునఁ బంజాబును జయించి యక్కడఁ జాలయేండ్లు పఱకు రాజ్యము చేసిరి. ఆ సమయమునఁ బ్రజలు ఈ పనిని నేర్చుకొని యుందురు, పూర్వము చెప్పినట్లుగా, ఇప్పటి రామాయణముయొక్క సమయము క్రీ పూ దా దా పు రెండువందల యేండ్లకు మునుపటిదియై యున్నది. తున్నవాయుఁడు లేక కుట్టుపనివాఁడు అను శబ్దము వచ్చుట సహజమే యై యున్నది అయినను ఇది ఏ మాత్రమును నిశ్చయాత్మక ప్రమాణము కానేరదు. ఎట్లైన నగుఁగాక, భారతీయ యుద్ధ సమయమునఁ గుట్టింపఁబడిన వస్త్రములు— లోపల దూదిపెట్టి కుట్టిన చొక్కాలు, అంగీలు మొదలైనవి, లేకుండెను. ఈ స్థితియే మహాభారత సమయమున నుండెను. భారతీయార్య పురుషుల దుస్తులలోఁ గేవలము రెండు వస్త్రములుండెను-ఒకటి కుట్టుకొనుటకు రెండవది కప్పుకొనుటకు ఇవి గాకుండఁ దలమీఁదికి దలగుడ్డ యుండెను. ఈ మూఁడింటి వర్ణనము ఒక్కచోట ముందు శ్లోకములోనున్నది:—

ఉష్ణీషాణి నియచ్ఛన్తాః పుండరీకనిభైః ॥ కరైః
అంతరీయోత్తరీయాణి భూషణానిచ సర్వశః ॥ (ఉ. అ. 153—20)

## స్త్రీలయొక్క దుస్తులు

స్త్రీలెట్టి వస్త్రములను ధరించుచుండిరో యిపుడు చూడవలయును. ప్రాచీన కాలమందు హిందుస్థానములో కుట్టువిద్య కళ లేనప్పుడు, ఇప్పుడు స్త్రీగా మొదలైన వస్త్రములను ధరించుచున్నట్లు అప్పుడు లేకుండెనని ప్రకటమగుచున్నది; పురుషులవలె, కాని వారి వస్త్రములకంటెఁ బొడవైనవి, స్త్రీలకు రెండు వస్త్రములుండెడివి. కట్టుకొను వస్త్రమును గట్టుకొని ఘూపుమీఁద వేసికొను పద్ధతి యుండి యుండును. ప్రస్తుత సమయమున దక్షిణ దేశపువారు, బంగాళా దేశపువారు, మదరాసువాసులైన స్త్రీలు ఏ ప్రకారముగాఁ జీరలు కట్టుకొనుచున్నారో, ఆ ప్రకారముగాఁ బ్రాచీనకాలమందు భారతీయార్య స్త్రీలు చీరలను గట్టుకొనుచుండి యుందురు. ఇదిగాకుండ ఉత్తరీయము స్త్రీలకు రెండవ వస్త్రముగా నుండెను. దీనిని శిరస్సునుండి కప్పుకొను రీతియుండెను. సంయుక్త ప్రాంతమందు నేఁటికిఁ గూడ స్త్రీల యుత్తరీయమున్నది, కాని దక్షిణపు వైపున నియ్యది నష్టప్రాయమై యున్నది. దీనికి బదులుగా, కట్టుకొను వస్త్రమే, దానిచేతనే యుత్తరీయముయొక్క పనికూడ జరిగిపోవునందు మఱియు స్త్రీలు దాని కొనచేతఁ దలనుగూడఁ గప్పుకొనఁ గలుగునంత పొడుగైనదిగాఁ జేయఁబడి యున్నది. ప్రాచీన కాలమందు స్త్రీలు వెలుపలికి బోవునపుడు—ఇప్పటివలె— ఉత్తరీయముయొక్క యావశ్యకత యుండెడిది.

ధృతరాష్ట్రుని యంతఃపురమునుండి ద్యూత సభకు ద్రౌపదిని లాగుకొని వచ్చిన వర్ణనముఁ బట్టి పైని వ్రాయఁబడిన యనుమానములు బలపడుచున్నవి. ఆమె మాటి మాటికిని అడకువతో జెప్పెను—'నేను ఏకవస్త్రనై యున్నాను. నన్ను సభకుఁ దీసికొని పోకుము." ఈ సమయమున నామె ముట్టుతకూడనై యుండెను. అట్లిచో, వెలుపలికిఁ బోవు సమయమునసే యుత్తరీయమును గైకొను నలవాటు నుండెననుట నిర్వివాదముగా నగపడుచున్నది. యద్యపి ఆమె ఏక వస్త్రయై యుండెను అయినను ఆమెను లాగుకొని సభకుఁ దీసికొని రాఁబడినను. మఱియు

నచ్చట కర్ణుఁడు ఆమెకు వస్త్రముకూడ లాగివేయుమని దుశ్శాసనుతోఁ జెప్పెను; దుశ్శాసనుఁడు కూడ నిట్లుచేయుటకు యత్నించెను. దీనిఁబట్టి కట్టుకొనెడి వస్త్రమును లాగి వెడలించుటకు వీలగునట్లు ధరించుచుండిరని తోఁచుచున్నది. ప్రస్తుతకాలమున ఉత్తర హిందుస్థానమందలి స్త్రీలకు లంగాలున్నట్లు లేకుండెను. భారతీయార్య స్త్రీలు మహాభారత సమయమున రవికె తొడుఁగుకొను చుండిరో లేదో యను ప్రశ్న మిప్పుడిచ్చట గలుగుచున్నది: ఎందుచేత? కుట్టకుండ రవికె కానేకానేరదు కనుక. మహాభారత సమయమున రవిక తొడుఁగుకొను పద్ధతి స్త్రీలయందు లేకుండెనని మన యూహయై యున్నది. ఈ రీతి, ఈ సమయమున, కేవలము మదరాసు స్త్రీలయందుఁ గలదు. కాని ఈ యూహకుఁ గూడ విరుద్ధముగా కంచుకి శబ్దము బహుప్రాచీనముగా విశ్వసింపఁ బడఁగలదు. అయినను కంచుకి రాజసభలోని యొక విశేషాధికారియై యున్నాడు. మఱియు అతడు గూడ ప్రాచీన కాలమందగ పడడు. అతఁడు ఒక కంచుకము అనఁగా కుట్టిన కోటు తొడుగుకొను చుండెడివాఁడు, ఇందుచేత వానికాపేరు కంచుకి యై పోయెను, మరియు నీ కంచుకిగూడ, పారసీక చక్రవర్తుల రివాజు ననుకరించుట వల్ల వచ్చినవాడుగా నగపడుచున్నాడు. ఈసమస్త విషయముల మీఁదను విచారింపగా, మహాభారత సమయమున భారతీయార్య స్త్రీలు రవిక తొడిగెడువారు కారని మనమతమై యున్నది.

హోమరు ప్రాచీన కాలమందలి గ్రీకు స్త్రీపురుషులకు వర్ణించిన దుస్తులు, అనేకాంశములయందు, చెప్పబడిన, భారతీయార్యుల దుస్తులకు సమానములుగనే యున్నవి. హోమరు చేత వర్ణింపఁబడిన స్త్రీల యొక్క దుస్తులు"శిరస్సునుండి కప్పుకొనఁబడిన ముసుగు మఱియు నడుమునకు నలుప్రక్కలఁ జుట్టఁబడిన యొక వస్త్రము. ఈ వస్త్రము హిందుస్థానపు చీరవలెఁ బొడవైనట్లుగా ఇంటనేసికోఁబడిన ఉన్ని బట్టయై యుండెను. మఱియు అది యెచ్చటను నేయఁబడినదియుఁ గుట్టఁబడినదియుఁగా కుండెను. ఈ వస్త్రము నడుమునకు నలుప్రక్కల, నడుమునకుఁబెట్టుకొనుపటకాచేత బిగింపఁబయుండెడిది.మఱియు ఈ వస్త్రము మూపుపై నొక ముడితో దృఢపఱుపఁబడుచుండెను. రెండుచేతు

లును భుజములును వెలుపలికిఁ గనఁబడు వెడలుచుండెడివి. పురుషుల దుస్తుల యందును రెండే వస్త్రములుండెను. అవును, వాని నడుమునకుఁ జుట్టను పటకా కాకుండెను, కాని రోమను ప్రజలకు వలె శరీరముపైని పడియున్న మంచి పొడుగుగౌనున్నది." ఈ వర్ణనముఁ బట్టి, ప్రాచీనార్య స్త్రీ పురుషుల దుస్తులు చాలవరకు కొకమాదిరిగానే యుండెనని తెలియుచున్నది. స్త్రీల యొక్క ముసుగు మన యిచ్చటి యుత్తరీయమునుపట్లున్నది. ఈ యుత్తరీయముచేత స్త్రీలు తమ శిరస్సును, వీపును, బుజములను లేక మడుమనొక సర్వ శరీరమును గప్పుకొనుచుండిరి. ఏడ్చునపుడు లేక పనిచేయునపుడు గ్రీసు స్త్రీలు హోమరు చేసిన వర్ణము ననుసరించి, తమ యుత్తరీయమును ప్రత్యేకముగా యొకచోట చేర్చుచుండిరి. ఇట్లే, సీత కూడఁ దన యుత్తరీయమును సుగ్రీవాదివానరులు నడుమను బడవైచి యుండెనని రామాయణము లోని వర్ణనమున్నది. తాత్పర్యమేమనఁగా, భారతీయార్యుల యందును గ్రీసు వారి యందును గూడ స్త్రీల యుత్తరీయము ఇచ్చ వచ్చినట్లుగా నెప్పుడు పడిన నప్పుడు ఇచ్చ వచ్చినప్పుడెల్లఁ దీసి పైచోటకును గప్పుకొనుటకును వీలుగా నుండెను. ఇదిగాకుండ, ఇరువుర వర్ణనమందును కంచుకముయొక్క లేక చొక్కా యొక్క ప్రసంగము లేదను సంగతియు రెండుదేశముల స్త్రీలకు సరిగా నున్నది. హోమరు చేసిన వర్ణనముఁ బట్టియు, శిల్పకారులు నిర్మించిన ప్రాచీన గ్రీసు స్త్రీల బొమ్మలను బట్టియు, నిట్లే తోచుచున్నది.

ప్రస్తుతకాలమున దక్షిణదేశపు స్త్రీలు ఏ విధముగా లాగుపేయుచున్నారో, ఆ విధముగాఁ బ్రాచీన కాలమందు చీర కట్టుకొనఁబడుచుండిరో లేదో యనునది ఒక మహత్త్వము గల ప్రశ్నమై యున్నది. ద్రౌపది యొక్క వస్త్రాపహరణ సమయమందు, ఇట్టి లాగు ఉన్నయెడల అయ్యదియేవిధముగను బాచిలాగబడునసెడి శంకను గలిగింపదు. యీ యనుమానముఁ బట్టి, గోచీ పెట్టు పద్ధతి లేకుండె యుండుననని తెలియుచున్నది. గోచీ యొక్క కల్పన "స్త్రీల యొక్క వివాహము మౌంజీబంధన స్థానమున నున్నది. ఇందువలన బయలుదేఱియున్నది. దక్షిణమున వివాహితలైన కాంతలే మొలనూలు కట్టుకొనుచున్నారు. అచ్చట వివాహితయలయందు గోచీపెట్టు పద్ధతియిపుడుఁ గూడ గనబడుచున్నది.

పేదలు మఱియుఁ బనివారునగు స్త్రీలయందు ఉత్తరీయమును దాల్చెడి పద్ధతి మహాభారత సమయమున లేకుండెను. ద్రౌపది యేసమయమును సైరంధ్రి వేషమందు విరాటనగరమునకు వెళ్ళి రాణియగు సుధేష్ణ యొక్క నౌకరిచేసెనో, ఆ సమయమున నామె రాణియెదుట నేక వస్త్రయై నిలఁబడెను. (వాసశ్చపరిధాయైకం కృష్ణా సుమలినం మహత్.) పనిచేయు వృత్తి యగుటచేత మురికిమాసిన యొకటి పొడుగుపాటి బట్టను పనిచేయు నాడువాండ్రు కట్టుకొనుచుండిరి. ఋతుమతివేళ యందులేకయింటిపనిపాటులు చేసికొనునపుడు ఇతర స్త్రీలు కూడ సాధారణముగా నుత్తరీయము వేసికొన కుండిరి. వెలుపలికిఁ బోవు సమయమున నుత్తరీయ వస్త్రము శిరసు నుండి కప్పుకొనఁబడుచుండెను. దాక్షిణాత్య స్త్రీలు ఇల్లు వెడలునపుడు శిరమును గొంచెముగా వస్త్రము పచ్చడముతో మూయుచుండుటయేదికలదో, అది కూడ నుత్తరము యొక్క యవశిష్టాచారముగనే తోచుచున్నది. సంయుక్త ప్రాంతము మొదలైన వానివైపుననైతే శిరస్సెల్లపుడు మూసియేయుండును. ఈ యుత్తరీయము తఱచుగా రంగువేసినదిగానే యుండుచుండెను. మఱియు దానిపైని వివిధములైన యాకారములు గలిగియుండుటచేతను వెలగలది యగుచుండెను. విధవలకై కేవలము తెల్లని యుత్తరీయమును ధరింపవలయునను నియమముండెను. ధృతరాష్ట్రునితో, నతని కోడండ్రు వనమందుఁ గలిసికొనుటకుఁ బోయినపుడు వారి వర్ణనము ఇతర స్త్రీలకంటె భిన్నముగా "శుక్లోత్తరీయా నరరాజపత్న్యః" ఈ శబ్దములచేతఁ జేయఁబడి యున్నది. దుర్యోధనుని విధవలైన భార్యలు తెల్లని యుత్తరీయములను గప్పుకొని యుండిరి; దీనిఁబట్టి యితర కాంతల యుత్తరీయములు రంగువేసినవై యుండియుండునని యనుమానము కలుగుచున్నది. యీ సంబంధము మునుపటి యిప్పటి పద్ధతులలో నధిక భేదము తటస్థింని యున్నది. మహాభారత కాలమునాఁడు విధవల వస్త్రములు తెల్లరంగువిగా నుండవలయుననియు సౌభాగ్యవతులు రంగు బట్టలను ధరింపవలయుననియు నియమము కనఁబడుచున్నది. ఈ సమయమునఁ గొన్ని ప్రాంతముల యందు విధవ కాంతలవస్త్రములకు విశేషముగా ఎఱుపురంగు కనఁబడుచున్నది. ఈ రంగు విశేషించి సంన్యాసినుల కాషాయవస్త్రముల యనుకరణమై యుండును. గుజ

రాత్రిలయందు విధవల వస్త్రముల రంగు నలుపగుచున్నది. ఈ వస్త్రము మిక్కిలి సాధారణమును మట్టి నలుపు రంగుచేత సద్దకము వేయబడిననదిగను నున్నది. మఱి వట్టి తెలుపుబట్ట (దక్షిణమందు) తఱచు వ్యవహరింపఁబడదు. ప్రస్తుత దినములలో, కాంతల వస్త్రములు సరిగ అంచుకలవి కావలయునను నియమమున్నదో, ఆ యీ సంగతియుఁ బ్రాచీన సమయమందుఁ గూడ నుండియుండును. చివరకు ఈ వస్త్రముల మీఁద వివిధములైన చిత్రములు కలిగి యుండుచుండెను. కాళిదాసోక్త "వధూ దుకూలం కలహంస లక్షణమ్" అనునది యిచ్చట జ్ఞప్తికి వచ్చుచున్నది.

## స్త్రీల కేశరచన

కాంతలమస్తకమునకై యింగ్లీషుకాంతలకువలెనేవిధమైనయాచ్ఛాదనమును లేకుండెను. అవును, కాంతలకేశములు విరియఁబోయఁబడి యిటునటు పడుచుండెడివి కాకుండెను. అవి చీర యొక్కకొనకు లేక యుత్తరీయమునకు లోపలనుండెను. పారశీకాంతలకువలెమస్తకమందలికేశములుఎల్లపుడువస్త్రంచేత బంధింపఁబడినవి గాకుండెను. అయినను సమస్తలోకులకువలె స్త్రీ శిరస్సునందు విరియఁ బోసి యున్న వెండ్రుకలమీఁద సమాజములోని యందఱ దృష్టులు పడఁ గూడదను నియమము భారతీయార్యులయందుఁ గూడ నుండెను. ఇందుచేత మస్తకమును వస్త్రముయొక్క యంచుచేత లేక యుత్తరీయముచేత మూసెడి పద్ధతి భారతీయార్యులయందుండెను. స్త్రీల కేశరచనకుఁ బేరు సీమంతమని యుండెను. సీమంతము లేక కేశముల పాపట, సౌభాగ్యవతులైన స్త్రీలే పాపట తీయుచుండిరి; విధవ స్త్రీలిట్లు చేయకుండిరి. అనేక స్థానముల యందిట్టి వర్ణనమున్నది. ఆశ్రమవాసి పర్వమందు దుర్యోధనుని విధవస్త్రీల యే "ఏతాస్తు సీమంత శిరోరుహా యాః" వర్ణనమున్నదో దానిని టీకాకారుఁడు సహితము అబద్ధమని చెప్పియున్నాఁడు. మరియు దీనికి బదులుగా ఏతా స్త్వసీమన్త శిరోరుహా యాః, అని పాఠముండవలయును. మహాభారత సమయమున విధవలకు పాపట నిలుపు నధికారములేకుండెను. అనేక యుద్ధ సమయముల యీవర్ణనము లభించుచున్నది.

సంహారే సర్వతో జాతే పృథివ్యాం శోకసంభవే ।
బహ్వీనా ముత్తమ స్త్రీణాం సీమంతోద్ధరణే తథా ॥
(శల్య పర్వం – 21)

ఎక్కడ భయంకరమైన సంహారము జరిగెనో యక్కడనే యనేకోత్తమ కాంతల సీమంతోద్ధరణము జరిగెను." ఈ వర్ణనముఁబట్టి విధవలకు ముఖ్యమైన లక్షణము సీమంతము లేక పాపట లేకుండుటగా నగపడుచున్నది. పానిపట్టు యుద్ధముయొక్క వర్ణనములో నొక లక్ష తలకట్టులు పోయె నని వ్రాసియున్నాఁడు. అనఁగా విధవ లైనందులకుఁగా నిప్పటి ముఖ్యలక్షణము తలకట్టు తీసివైచుట యని యూహింపఁబడుచున్నది. ఇదేవిధముగా మహాభారతసమయమున విధవలకు ముఖ్యమైన గుర్తు అయి యుండెను–సీమంతము లేకుండుట. ఈలక్షణముబట్టి ప్రాచీన కాలమందు శిరోముండనము చేయఁబడుచుండె నని యెంచఁబడఁ జాలదు. ఇక్కడఁ గేవలము సీమంతముయొక్క యుద్ధరణము విలక్షితమై యున్నది. శిరోముండన మనునర్థము ఇక్కడ వివక్షిత మని విశ్వసించుటకై యవకాశములేదు. ధృతరాష్ట్రుని విధవలగు కోడండ్ర వర్ణనమందు వారికిఁ గేశములున్నవి. దీనిఁబట్టి; ఆఖరునకు క్షత్రియవిధవలకుమాత్రమైనను శిరోముండనము చేయఁబడుచుండెడిది కాదు. శిరోముండన వ్యవహారము, సంన్యాసినుల యనుకరణముచేత – వారి కాషాయవస్త్రముల వలె – తటస్థించి యుండునని యనుమానము పొడముచున్నది. అగుఁగాక, విధవలకు సీమంతము లేకుండెను అనఁగా, వారి కేశములు దువ్వకుండ అట్లె కట్టివేసెడు పద్ధతి యుండియుండును. మహాభారతసమయమున సౌభాగ్యవతు లయిన కాంతలు వెండ్రుకలను, చక్కగా దువ్వెన్నతో దువ్వి, నడుమను పాపటచేత రెండుభాగములు చేసి జడ వేసికొనెడి పద్ధతి యుండెను. జడ యొకటిగానో లేక మూడు పాయలుగానో యుండెడిది. రామాయణమందు సీతయొక్క వర్ణనము "ఏక వేణీ ధర" యని చేసి యున్నాఁడు. అనఁగా ఎవర్తె మగఁడు దూరమున నుండునో యామె కేశములయొక్క యిట్టి ఏకవేణీ యొక్క వర్ణనము చేయఁబడుచుండెను. ఇతర కాంతలకు వీఁపుపైఁబడునట్లుగా మూఁడు వేణు లుండియుండియుండును. మార్వాడీలయందు ఈవ్యవహారము నేఁటివఱకు నగపడుచున్నది. కూలినాలి చేసికొను బీదకాంతల యందు వేణీబంధన పద్ధతి ప్రాచీన సమయ

మందు లేకయుండును. ద్రౌపది సైరంధ్రీ వేషమును ధరించు సమయమున కేశములను కేవలము ప్రోగుచేసి, యొకప్రైపున ముడివేసి కుడిప్రైపున దానిని దూర్చినట్లు వర్ణనమున్నది.

తతః కేశాన్ సముత్క్షిప్య వేల్లితాగ్రా ననిందితాన్
కృష్ణాన్సూక్ష్మాన్మృదూన్ దీర్ఘాన్ సముద్గ్రథ్య శుచిస్మితా
జుగూహే దక్షిణే పార్శ్వే మృదూ నసితలోచనా॥
(విరాటపర్వం, అ. 8)

ఇందులోనున్న "జుగూహే" శబ్దము వలన ఆ కేశములమీఁద నామె రుమాలు లేక వస్త్ర ఖండమును చుట్టి వెండ్రుకలను దాఁచె నని సందేహము కలుగుచున్నది. తన సుందరకేశములను దాఁచుటకై యామె యీయుక్తిని జేసియుండును. సాధారణముగా కాంతల కేశములు వీపుపైన వ్రేలాడుచుండి యుండును. సౌగ్యవతులయిన కాంతల కేశరచన విషయమై యిదీ తెలియు చున్నది. ఈ సీమంతము లేక పాపట నడుమను కుంకుమపువ్వు లేక కుంకుమ నిండించు నలవాటుండెను. ఇదిగాకుండ యద్యపి కాంతల నొసటను కుంకుమము పెట్టెడి యాచారము తప్పక యుండియుండును. ఉద్యోగ పర్వమందు పాండవ శ్రీకృష్ణులసంభాషణ సమయమున ద్రౌపది తన తుమ్మెద రెక్కలవలె నల్లగానున్న సువాసితము లయిన కేశములను చేతఁ బట్టుకొని శ్రీకృష్ణునికిఁ జూపెనని వర్ణనము కలదు. దీనిఁబట్టి యీ వెండ్రుకల వేణి బంధింపబడియుండెనా లేదో యని ప్రశ్నముకలుగుచున్నది; కాని విశేషించి యామె కేశములు విరియఁబోసినవై కాకయుండును. "కేశపక్ష" శబ్దము వలన బంధించియున్న కేశములు కై కొనఁబడఁగలవు.

## పురుషుల తలగుడ్డ

పురుషుల తలవెండ్రుకలు శిఖాబద్ధమైయుండెను. వెలుపలికి రాకపోకల సమయమునఁ దలగుడ్డను దాల్చెడు పద్ధతి చూడఁబడుచున్నది. భారతీయార్యుల తలగుడ్డ వారికిఁ బ్రత్యేకచిహ్నమయియుండెను. మరియు ఒక పొడుగయినదియుఁ, గొంచెము వెడల్పయినదియు నయిన వస్త్రము శిరస్సునుండి

కప్పఁబడి యుండును: ఇదియే తలగుడ్డయై యుండును. యుద్ధమునకై బయలుదేరిన భీష్మునియొక్కయు మరియు ద్రోణునియొక్కయు నేవర్ణనము చేయఁబడి యున్నదో, అందు శిరస్సు మీఁదఁ దెల్లని తలగుడ్డ తాల్చిన యుల్లేఖనమున్నది. తలగుడ్డకై ఉష్ణీష శబ్దము వాడఁబడి యున్నది. ఉదాహరణార్థమై యీ వర్ణనముఁ జూడుఁడు- "ద్రోణాచార్యుఁడు తెల్లని కవచము వస్త్రము మరియు శిరోవేష్టనము (ఉష్ణీషము) ధరించి ధనుష్టంకారమును చేయుచుండిరి.

"ఉష్ణీషే పరిగృహీతాం మాద్రీ పుత్రా పుభౌ తథా ॥"
(అను. అ. 168-14)

ఇందు భీష్ముని రెండు తలగుడ్డల వర్ణన మున్నది. దీనిఁబట్టి తెల్లని తలగుడ్డ ముదుసలి మానిసులు ముఖ్యముగా ధరించుచుండిరని ప్రకటమగుచున్నది. ఇంతియేకాదు, ఇఁక నేమంటేని కవచముకూడఁ దెల్లది యైనట్లు వర్ణనమున్నది. అనఁగా పడుచువారు తెలుపుకంటే మరియొక రంగుగల దుస్తులను ధరించుచుండిరి. గ్రీకుల ధ్యానము భారతీయార్యులకు విశేషముగా శిరోభూషణమైనతలగుడ్డ మీఁదికిఁ బోయియుండెను. ఈ తలగుడ్డ యితర దేశీయుల కంటె విలక్షణముగా నుండుచుండును. గ్రీకు గ్రంథకారుఁ డయిన అరాయాను వ్రాసియున్నాఁడు- "హిందుస్థానపువారు ఒక వస్త్రము నడుమునకు నలుప్రక్కల మోకాలు క్రిందికి మడమ వఱకు ధరించుచున్నారు. ఇంకొక వస్త్రమును గూడఁ గైకొనుచున్నారు. దీనిని శిరస్సుపైఁ గప్పుకొనుచున్నారు"- ఈ వర్ణనమందు తలగుడ్డయు నుత్తరీయము నొకటిగానే తెలియుచున్నది. కాని యీ కల్పన విశేషించి యసత్యమైయున్నది. ఒకప్పుడు పౌరజనులు ఈ విధముగా శిరస్సును గప్పుకొని యుందురు. దోవతి లేక యుత్తరీయమే శిరసు మీఁదఁ గప్పుకొనుచుండుట మాత్రము ప్రస్తుత దినములలోఁగూడఁ జూడబడుచున్నది. కాని సాధారణముగాఁ నిందు శరీరము బాగుగాఁ గప్పట్టుచునేయుం

డును. సంపన్నులయిన వారియందు తలగుడ్డయు నుత్తరీయమును వేరు వేరుగా నుండియుండును. ఇంకొక గ్రీకుచరిత్ర లేఖకుఁడు హిందుస్థాన వాసులను వర్ణించుచు వ్రాయుచున్నాఁడు- «హిందుస్థానపువారు ఒక సన్న బట్టను దమ కాళ్ళవఱకు ధరించుచున్నారు. మరియుఁ దమ తలమీఁద నూలు బట్టను గప్పుకొనుచుండిరి. అట్లు కాళ్ళకుఁ జెప్పులు తొడుగుకొనుచుండిరి”. శిరస్సునఁ జుట్టుకొన్న తలగుడ్డ విశేషించి సాదాయైన ఆకృతి కలిగి వుండును. మరియు దానిని ప్రతి మనుష్యుఁడును దన చేతితో నీ విధముగానే చుట్టుకొనుచుండి వుండును. ప్రస్తుత కాలమునఁ దలగుడ్డ చుట్టుకొనుట ఏ విధముగాఁ గష్టకార్యమై యుండెనో అట్లుగా ఆ కాలమందుఁ దాకబోయి యుండును. మామూలు పద్ధతి యిప్పుడుకూడ నిదియే యై యున్నది— బీదజనులు తమ చేతితోఁ గలగుడ్డఁ జుట్టుకొను చున్నారు. లేక తలగుడ్డను గట్టుకొనుచున్నారు. అవును, రాజుల మస్తకముమీఁద పగడీలేక తలపాగ లేకుండెను. వారి మస్తకములమీఁద నెల్లప్పుడును ముకుటముంచుట సహజమై యున్నది. భీమునికిని దుర్యోధనునికిని గదాయుద్ధము జరిగినపుడు, వారిద్దఱ మస్తకములమీఁదను ముకుటములున్న వర్ణనము కలదు. మఱియు యుద్ధములో నీ ముకుటములమీఁదఁ గూడ దెబ్బలు తగులుచుండి యుండునని తెలియుచున్నది. దుర్యోధనుఁడు క్రింద పడినపుడు అతని ముకుటము కదలికూడ నుండలేదు. ఇది వింతగా నున్నది, విశేషించి ముకుటమును బాగుగా ఘటితము చేసికొని స్థాపించెడివి యొక నొక (వ్యవస్థ) యేర్పాటుండి యుండును. శిరస్సు క్రింది దవడ పట్కాతోఁ గట్టబడి యుండును లేక మరియేదైన నొక బందోబస్తు ఏర్పాటుండియుండును. క్రిందఁ బడియున్న దుర్యోధనుని తలమీఁది ముకుటమందు భీముడు తన్నియుండెను, ఈ వర్ణనముఁబట్టి ముకుటమును బంధించి యుంచినట్లభిప్రాయము కలుగుచున్నది. ఇదే విధముగా కర్ణార్జునుల యుద్ధవర్ణనమందును, అర్జునుని తలమీఁది ముకుటము క్రిందఁ బడిపోయినపుడు. అతడు తన తెల్లని వస్త్రమును జుట్టుకొని కేశము

లను దాచెనని వ్రాసియున్నాఁడు. [కర్ణ. అ. 90] దీనిఁ బట్టి మహాభారత సమయమందు, ప్రతి మనుష్యుని శిరమందును చుట్టుకొన్న వస్త్రము— పగడీ లేక సాఫా—తప్పక యుండి యుండెడు నాచారము కనఁబడు చున్నది.

నూలితో నేసిన, పట్టుతో నేసినమరియు, ఉన్నితో నేసిన వస్త్రములు. సాధారణ రీతిగా కప్పుకొనుటకును, ధరించుకొనుటకును, శిరస్సునఁ జుట్టుకొనుటకును ఈ వస్త్రములు నేయఁ బడుచుండి యుండును. ఆ సమయమందు హిందుస్థానమున ప్రత్తి పంట యగుచుండెను. మరియు మిశ్రము లేక పర్షియా దేశమందు ఆ పంట లేకుండెను. ఈ సంగతి మరియొకచోట వ్రాయబడును. అనఁగా గ్రీసువారికి ఈ ద్రెస్సుచూచి చాల నాశ్చర్యము కలిగెను. ఈ వస్త్రములుగూడ మిగుల సన్నవిగా నుండెను. కాని ధనికులు మరియు విశేషించి స్త్రీ పట్టువగు బట్టలను ధరించుచుండిరి. మహాభారతమందు స్త్రీల వర్ణనము పీతకౌశేయ వాసిని అని మాటిమాటికిని వచ్చుచున్నది. శ్రీకృష్ణుని వర్ణనమందుఁ గూడ పీతాంబరము అనఁగా పట్టువస్త్రము ధరించియున్న వర్ణనము అక్కడక్కడ లభించుచున్నది. అర్జునుఁడు తొలుదొల్త సుభద్రను ఇంద్రప్రస్థమునకుఁ దీసికొని వచ్చినపుడు, ఆమె ఎఱ్ఱపట్టుబట్టను గట్టుకొని యుండెను. మఱియు ఈ డ్రస్సులో నామె గోపకన్యవలె నచ్చుచుండెను.

సుభద్రాం త్వరయామాస రక్తకౌశేయవాసినీం।
పార్థః ప్రస్థాపయామాస కృత్వా గోపాలికావపుః ॥ (ఆ. అ. 221-10)

దీనిఁబట్టి గోపుల వస్త్రములు ఇతరుల కంటెఁ గొంతభిన్నములై యుండి యుండుననియు వారి కాంతలు చీరలను గట్టుకొను పద్ధతి కూడఁ గొంచెము వేఱు విధపుదియై యుండుననియుఁ గనఁబడుచున్నది. మహాభారతముఁ బట్టి ప్రజలు ఉన్ని బట్టలఁ గూడ ధరించుచుండిరని తెలియుచున్నది. ఉత్తర మందు పంజాబు, కాశ్మీరము ఈ శీతలపు దేశములలో కప్పుకొనుటకు, ధరించు

ఉకు లేక శిరస్సును జుట్టుకొనుటకు ఉన్ని వస్త్రములు వాడుకలోనికిఁ దీసికొని రాఁబడి యుండుట ఆశ్చర్యమేలేదు. అ సమయమునఁ గూడ సూక్ష్మము లైన కంబళములకై పంజాబు, కాశ్మీరము ప్రసిద్ధములై యుండెను. నూలితోనేయ బడిన వస్త్రము లింతకంటెనుసన్నవి యగుచుండెననుటనిర్వివాదమైయున్నది. "సామానం బృహతీ గౌరీ సూక్ష్మ కంబలవాసినీ" (క. అ. 44 శ్లో. 16) ఈ వాక్యముఁ బట్టి పంజాబునందు సన్నని ఉన్ని బట్ట ధరింపఁబడుచుండెనని స్పష్టముగా నగపడుచున్నది. ఈ విధముగా భిన్న భిన్న ప్రాంతముల నీటిని గాలిని శీతోష్ణస్థితి ననుసరించి హిందుస్థానమందు నూలితోను ఉన్నితోనునేసిన బట్టలు ధరింపఁబడుచుండెను. పట్టుబట్టల వాడుక మాత్రమన్ని స్థానముల యందు నుండి యుండును.

## నా ర చీ ర లు

ఇది గాకుండ వస్త్రములలో నింకను గొన్ని భేదములుండెను. ఈ వస్త్రములు నారచీరలు చర్మములునై యుండెను. వీనిని వై ఖానసులు, యోగులు లేక అడవిలో నివసించు మునులును వారి పత్నులును ధరించుచుండిరి. రాముఁడును సీతయు వనవాసమునకై తయారైనపుడు, వారికి ధరించుట కై కుశనామకతృణములచేత నిర్మింపఁబడిన వల్కలము లీయఁబడియున్నవి. ఈ వర్ణనము రామాయణములో నున్నది. సీత కుశచీరములను ధరించుట నెఱుఁగ కుండెను. ఆమె ఆ పని యొక్క చిక్కులోఁ బడియున్నపుడు, రామచంద్రుడు ఆమె కౌశేయ వస్త్రమునకు పైనుండియే గళమందుకుశచీరమును గట్టెను. ఈ మనోవేధకమైన వర్ణనము రామాయణమందున్నది. మహాభారతమందు పాండవులు వనవాసమునకై బయలుదేఱినపుడు వారు అజినములనెడియుత్త రీయములను ధరించిన వర్ణనమున్నది.

తతః పరంజితాః పార్థా వనవాసాయ దీక్షితాః ।
అజినాన్యుత్తరీయాణి జగృహుశ్చయథాక్రమమ్ ॥

ఇచట ధరించిన వస్త్రములు మార్చిన వర్ణనములేదు. అజినము విశేషించి మృగచర్మము చేతనే నిర్మింపఁబడుచుండియుండును. ద్రౌపదియొక్క

వస్త్రము నుత్తమమైనదిగనే యుండెను. ఆమె మఱి యేభిన్నవస్త్రమునైనను ధరింపలేదు మునుల స్త్రీలును ఋషులును గూడ కుశచీరము:అను లేక వల్కలములను ధరించుచుండిరి. దీని వర్ణనము వందల కొలదిచోటుల నున్నది. వల్కలము లేవస్తువు చేతఁ జేయఁబడుచుండెనో యిది చెప్పుట కఠినమై యున్నది. రామాయణమువల్లనైతే అవి కుశతృణములచేత దర్భగడ్డిచేత నిర్మింపఁబడుచుండెననియే తెలియుచున్నది. కాని యిపుడు బాలతృణముల వస్త్రము లెట్లుండుననెడి ప్రశ్నము స్వాభావికమేమై యున్నది. కాని కుశతృణముల వస్త్రము నిర్మింపఁబడుచుండెననుటలో సందేహములేదు. ధృతరాష్ట్రుఁడు వానప్రస్థుఁడై వనవాసమునకు వెడలినపుడు అతఁడు అజినములను వల్కలములను ధరించి వెళ్లి యుండెను.

అగ్నిహోత్రం పురస్కృత్య వల్కలాజిన సంవృతః ।
వధూజన వృతో రాజా నిర్యయౌ భవనాత్తతః ॥ (ఆశ్ర. అ. 25)

ఈ వర్ణనములో అజినము వల్కలములురెండిటియొక్క యుల్లేఖమున్నది. వల్కలము ధరించుటకును అజినమును కప్పుకొనుటకును నుపయోగపడుచుండెనని తెలియుచున్నది. పూర్వకాలమందు కేవలము కొందఱు ఋషులు, వానప్రస్థులు వైఖానసులు మాత్రము అజినములను గప్పుకొనుచుండిరి. ఇంతియే గాకుండ బ్రహ్మచారులు గూడ వానినే కప్పుకొనుచుండియుందురు. ఎందుచేత ఇప్పటికిఁ గూడ యజ్ఞోపవీతసంస్కారమందు వటువునకు అజినమునకుమాఱుగా మృగచర్మము యొక్కయొకచిన్నముక్కను జందెముతోపాటుగా ధరింపవలసి వచ్చుచున్నది! అజినములు మృగచర్మపువి యగుచున్నవి యితరములును గలుగుచున్నవి. కాని వల్కలములు ఏ వస్తువు చేతఁ దయారు చేయఁబడుచుండెనో యది చెప్పఁజాలము. రామాయణమందు కుశచర్మముల వర్ణనమున్నది. కాని కశశతృణముల యొక్క దోవతివంటివస్త్రమెందులకుఁదయారు చేయఁబడగలదో? ఈ యిబ్బందిచేత కొందఱు లోకులు, హిమాలయమందు భిన్నమగు నొక విధమైన వృక్షము యొక్క తాట బెరడు చేత వల్కఁ

ములు చేయబడుచున్నవని చెప్పియున్నారు. ఈ తాట యొక్క వెడల్పు పాటిపట్టా తీయఁబడుచుండెను. మఱియు అందు అతుకు కూడఁ గలిసికొన్న గలుగుచుండెను కాని ఔరడు బట్ట యొక్క వర్ణనము రామాయణమందునులేదు. మహాభారతమందునులేదు. ఇంకను గూడ మహాభారతమందును సంస్కృతము లోని పదంతకాలందీ ప్రాచీన గ్రంథముల యందును వల్కలముల యుల్లే ఖము మాటిమాటికిని లభించుచున్నది. మఱియు నిట్టి వస్త్రముల యొక్క యుపయోగము ప్రాచీన కాలమందు నిస్సందేహముగా నగుచుండెను. వర్త మానమున మాత్రము ఎచ్చటను వల్కలముల నుపయోగించుచున్నట్లగ పడదు. మఱియు ఇట్టి వస్త్రముల నెవ్వఁడును జూచియే యుండలేదు. ఇంత జరిగిన తరువాతఁ గూడ అన్యతమాణములఁ బట్టి, ప్రాచీన కాలమందు వల్కలముల యుపయోగము అగుచుండెనని నిశ్చితమగుచున్నది. మఱియు అవి కుశతృణముల చేతనే చేయఁబడుచుండెనని కూడ నిశ్చిత మగుచున్నది. మొదటి గ్రీకు చరిత్రలేఖకుఁడైన హిరోడోటస్సు వ్రాసియు న్నాడు—" వనములో నివసించు హిందుస్థానపువారు ఒక విధమైన బాల తృణముల (ముంజతృణముల వంటివి) తోఁ దయారు చేయఁబడియున్న వస్త్రములను ధరించుచున్నారు. ఈ ఘాసము నదినుండి కోసి తీసికొని వచ్చిన తరువాతఁ గొట్టఁబడు చున్నది. మఱియు అపుడు జంబుఖానా వలె నయ్యది నేయఁబడు చున్నది. ఈ విధముగా మోటు జంబుఖానా వలెఁ జేయఁబడిన వస్త్రమును వారు లోపల దూది పెట్టిన చొక్కావలె ధరించుచున్నారు." ఈ వర్ణనముఁబట్టి యీ వస్త్రములు కేవలము దోవ తులు వలె లేకుండెననియు; అయినను ఆయా జనులు శరీరమునకు నలుప్రక్కలను చుట్టుకొనఁగలిగి యుండిరనియు ప్రకటమగుచున్నది. ఇదే కారణముచేత వనవాసులైన మునులును వారి పత్నులును ఈ వస్త్ర ముల నుపయోగించుచుండిరి. వానియొక్క యుపయోగము సమాజము నకుఁ బోవుటకై తగినది గాని శోభకుఁ గాని కాకుండెను,

శాంతి పర్వముయొక్క ౧౯౪ వ అధ్యాయమందు భిన్న భిన్న వస్త్రముల నామములు ఒక శ్లోకముతో వచ్చియున్నది. ఆ శ్లోకమిది—

క్షౌమంచ కుశచీరంచ కౌశేయుం వల్కలానిచ ।
అవికం చర్మ చ సమం యస్యస్యాన్మక్త ఏవసః ॥

ఇందు క్షౌమము, కౌశేయము, అవికము గృహస్థుల వస్త్రములై యున్నవి. మఱియు కుశచీరము, వల్కలము, చర్మము వానప్రస్థులవి తపస్సులవి యై యున్నవి. టీకాకారుఁడు క్షౌమమున కర్థము అతసీ సూత్రమయమని చేసి యున్నాఁడు. కాని క్షౌమము వృక్షము యొక్క నన్నని వస్త్రముగా నగపడుచున్నది. కౌశేయము – పట్టు, అవికము – ఉన్ని ప్రసిద్ధములై యున్నవి. కుశచీరము కుశతృణములదియగుచున్నది. కాని వల్కలము దేనిది చర్మము కేవలము లేడి మొదలైన వాని చర్మమై యున్నది. పై శ్లోకముఁ బట్టి కుశచీరము యొక్క యుల్లేఖము రామాయణమందు వలె మహాభారతమందుఁ గూడ నున్నది. మఱియు వల్కలములు ఒకప్పుడు భూర్జత్వక్కు చేతఁ గూడఁ జేయఁ బడి యుండును.

## పాదత్రాణము

హిందుస్థానవాసులు విశేషించి గ్రీకులవలె, దక్షిణము పైపున మద్రాసు మొదలైన చోట్లను ఇప్పుడుగూడఁ దొడగఁబడుచున్నట్లే చెప్పులను దొడుగుకొనుచుండిరి. ఇందుఁ గేవలము అడుగుభాగమే యడుగు భాగముగా నున్నది. పైని బొటనవ్రేలు మొదలైనవి దూర్చుటకై యుచ్చులున్నవి. మఱియు నచట దీనిపేరు వహాణ, అయియున్నది. అవి గట్టివిగూడ నగుచుండెను. రాముఁడు భరతుని కేపాదుకలను ఇచ్చి యుండెనో యవి కుశతృణములవియై యుండెను. దీనిఁబట్టి వనవాసులైన మునులకుఁ దఱచుగా నన్ని వస్తువులును విశేషించి కుశతృణములవి యగుచుండెనని తెలియుచున్నది. ఆసనము, వస్త్రములు, పాదుకలు మొదలైనవి కుశతృణములవిగాఁ జేయఁగలుగుచున్నవి. యీ యన్ని

వస్తువులను సులభముగనే ఖర్చుతేకుండ దయారగుచుండివి. అరాయన్ అను గ్రీకు చరిత్రకారుఁడు వహాణ, (చెప్పుల) యొక్క వర్ణనమును బాగుగాఁ జేసియుండెను. "హిందుస్థానవాసులు తెల్లని చర్మముతోఁ జేయఁబడిన వలుపాదరక్ష ధరించుచుండిరి.

వానిమీఁద వివిధములైన పనులు చేయఁబడుచుండెను. మరియు వాని యడుగుభాగములు మిక్కిలి దళసరివియై యుండుచుండెను." ఈ చెప్పుల యాకారము లేక సృష్టి యెట్లగుచుండెనో యిది తెలిసికొనుటకై యిపుడు ఉపాయమేమియును లేకుండెను. విశేషించి పాదములు పైనుండి బయలుగా నుండి యుండును. మరియు ప్రాచీనులైన గ్రీకులు. రోమనులు ఏ విధమైన చెప్పులు తొడుగుకొను చుండిరో ఇది బొమ్మలలో చూడఁబడుచుండెను. ఆ విధముగానే యిచటఁ గూడనుండియుండును.

## పురుషుని శిఖ

జనసమూహమందు తలపై వెండ్రుకలు, గడ్డము, మీసములు నుంచుకొను పరిపాటి మఱి యెట్లుండెనో యిది యిపుడు చూడవలయును. బ్రాహ్మణులు విశేషించి గడ్డము మీసములు నుంచుకొని ముండనము చేయించుకొనుచుండియుందురు. మఱియు శిరస్సుపైఁ గూడ వెండ్రుకలు సాపుగా ఛేదించి కేవలము కొంచెము శిఖ నుంచుకొనుచుండియుందురు. ఈ విషయమై స్పష్టమైన వర్ణనములు ధ్యానమునకు రాకున్నవి. ఋషుల విషయముననెల్లపుడును వారి మస్తకముమీఁద జటలున్నట్లు వర్ణనము కనఁబడుచున్నది. కాని గడ్డము విషయమున జాడ కొంచెమైనను దొరకుటలేదు. కాని ఈ ఋషులు, లేక తపశ్చర్య చేయువారు శిరోజములను క్షౌరము చేయించుకొనని యపుడు, వారు గడ్డము మీసములు కూడ నుంచుకొనుచుండియే యుందురు. గడ్డము మీసములు నేర్పఱుచుటకై మంగలివానికి వానితో స్పర్ధము గూడ నేవిధముగను గాకుండియుండును. మహాభారత మందు క్షురకర్తల యుల్లేఖమున్నది. నఖనికృంతనము లేక గోరుగల్లు యొక్క యుల్లేఖము ఉపనిషత్తులందు దొరకుచున్నది. అట్టిచో కేశములను నిర్మించు వృత్తిని జేయు మంగళ్ళు ప్రాచీన

కాలమందుఁ గూడ నుండిరనుట నిర్వివాదము. అబష్ఠుని యుల్లేఖము కర్ణ శల్యుల భాషణములో నున్నది. రాజులు శిరోజములను క్షౌరము చేయించు కొనుచుండిరని యనుమానముఁ బట్టి తెలియుచున్నది. శిరోజములనుజేయించు కొనకుండెడి రీతి క్షత్రియులలో నిపుడు గూడఁ జూడఁబడుచున్నది. శిరోజము లను జేయించుకొనునపుడు రాజుల యొక్క శిఖమంగలి వాని చేతిలోనికివచ్చు చున్నదని కారణముగాఁ జెప్పఁబడుచున్నది. ఇది కారణము కావచ్చును. కాక పోవచ్చును; కాని రాజులలో శిరోజములను జేయించుకొనని పద్ధతి యిపుడు లేదు తుదకు ఇపుడు గూడ నుండెను. మఱియు అది ప్రాచీన కాలమందుఁ గూడ నుండియుండును; ఎందుచేత ? రామచంద్రుఁడు వనవాసమునకుఁబోవు నపుడు గంగాతీరమునతనయొక్క లక్ష్మణునియొక్క కేశములజటలనుద్వారగా, కేవలము మేడిపాలనంటించి, చేసెను గనుక తలమీఁది వెండ్రుకలు బాగుగాఁ బొడుగుగా నెదిగినవై యుండనిచో వెంటనే యా సమయమున జటలుగా నెట్లు చేయఁగలిగి యుండరు. కాని రాజులు గడ్డముంచుకొను విషయమున సందేహమే యగుచున్నది. శివాజీకి గడ్డమైతే ప్రసిద్ధమేయై యున్నది. శిరోజములవలె విశేషించి భారతీయార్య క్షత్రియులు గడ్డముగూడ నట్లుంచుకొని యుందురని తెలియుచున్నది. ముండనము చేయించుకొను పద్ధతి మాత్రము సంన్యాసులకుండెను, బుఱ్ఱయంతయు గడ్డము మీసములు క్షౌరము చేయించుకొను వ్రతమైతే సంన్యాసులకుండెను. కాని వారీవిధముగా నెందులకుఁ జేసికొనుచుండిరో తెలియదు. సంన్యాసుల ఈ లక్షణమునే బౌద్ధ సంన్యాసులు లేక భిక్షువులు కూడ నంగీకరించిరి. మఱియు జైన సంన్యాసులు శిరస్సంతయు క్షౌరము చేయించుకొనుచుండిరి; మఱియు ప్రాచీనకాలపు ఋషులను బ్రాహ్మణులను కపాలముమీది గడ్డము మీసములవియున్ని వెండ్రుక లుంచుకొని యుండిరి. గృహస్థులైనవారు గడ్డము క్షౌరము చేయించుకొనిశిఖ యుంచుకొనుచుండిరి. క్షత్రియులు శిరణముల, గడము మీసము వెండ్రుక లుంచుకొనుచు డిరి. వైశ్యులయందును శూద్రులయందును నెట్టి యాచార ముండెనో నిశ్చయపూర్వకముగాఁ జెప్పఁబడజాలదు. సుందోపసుందులనెడి రాక్షసుల విషయమై యీ వర్ణనమున్నది, "తతస్తుతౌజటాభిత్వా మౌలినౌ సంబభూవతుః" (అ. 309. 9) దీనిఁబట్టి తపస్సు చేయునపుడు ఒడలు పెంచు కొనఁబడుచుండెననియు తపము పూర్తియైపోయిన తరువాత గృహస్థాశ్రమ

మందు శిరస్సుమీద పిలక యుంచుకొను రివాజు అన్ని వర్ణసముల.నుందును నుండెనని తోఁచుచున్నది. ఈ పూర్ణమైన వర్ణనమునకుఁ గొంత సహాయము గ్రీసు గ్రంథకారుల వర్ణనములఁబట్టియు లభించుచున్నది. మహాభారత వర్ణనము ఉపన్యాసములవలె విస్తృతములుగను మిక్కిలి సూక్ష్మములుగను వ్రాయఁబడ లేదు. కనుకనే యీ విషయమై నిశ్చయాత్మకమైన సంపూర్ణ యథార్థము చెప్పుట కఠినమైయున్నది సరియే; మరల సమకాలికులైన గ్రీసు గ్రంథకారుల లేఖములఁబట్టి యధికముగా సంక్షేపమయి పోవుచున్నది. గ్రీసుచరిత్రకారుఁడు అరాయను, హిందుస్థానపువారికి గడ్డమున్నదనియు దానికి వారు రంగు వేయుచున్నారనియు స్పష్టముగాఁ జెప్పుచున్నాఁడు. అతఁడుచెప్పుచున్నదేమనఁగా "కొందరు గడ్డమునకుఁ దెలుపురంగు వేయుచున్నారు. దీనిఁబట్టి వారు తెల్లనివే తెల్లనివిగాఁ జూపుచున్నారు. అనఁగాపాదములుమొదలు మొదలుకొని తలవఱకు మిక్కిలి తెలుపు; తెల్లని దోవతులను గట్టుకొనుటయు గప్పుకొనుటయు ననెడి పద్ధతుల వర్ణనములదియే యున్నది. మఱియు తెల్లని తలగుడ్డయొక్క యుల్లేఖము కూడ అయియే యున్నది. కొందరునీలవర్ణము గల గడ్డమునకు రంగు వేయుచున్నారు. కొందరు ఎఱుపు గడమునకు రంగు వేయుచున్నారు. మరికొందరు ఆకుపచ్చదై గడ్డమునకు వివిధమైన రంగులచేత రంగులు వేసెడి పద్ధతి యిపుడుకూడ నగపడుచున్నది. సంయుక్త ప్రదేశములవైపున పంజాబువైపునఁ గొందఱు లోకుల విశేషించి ముసల్మానులు. గడ్డపు రంగు వేయఁబడినదై యగుచున్నది. సమస్త వర్ణములఁబట్టి క్షత్రియులకు, బ్రాహ్మణులకును, గృహస్థాశ్రమములో నున్నంతవరకు మహాభారత సమయమున గడ్డములుండి యుండునని యనుమానింపఁబడఁగలదు. శిరోజముల విషయమున యరాయనై లేయుల్లేకము చేయలేదు. కాని కర్టిఅఫ్ రూఫను అను పేరుగల యితిహాసకారుఁడు చేసియున్నాఁడు. అతఁడు వ్రాయు చున్నాఁడు. "హిందుస్థానపువారు తమ శిరోజములను దువ్వెనతో దువ్వు చున్నారు కాని కొందఱు తక్కువమంది వానిని క్షౌరముకూడఁ జేయించుకొను చున్నారు గడ్డపు వెంట్రుకను వారెన్నఁడును జేయించికొనరు కాని మొగము మీది వెంట్రుకలను ముఖము నున్నగా నుంచునట్లు చేయించుకొనుచున్నారు [మేక్కిండలుచేసి యలక్జాండరు ఆక్రమణము యొక్క వర్ణనము] ఈ వర్ణనముఁబట్టి తఱచుగా శిరోజములను జేయించుకొను రివాజు లేకుండెనుమఱియు

నీ యితిహాసకారుఁడు యద్యపి గడ్డము విషయమై యీ రివాజును జెప్పలేదు అయినను అదికూడ నుండియుండును ఏ లోకులు శిరోజములను జేయించుకొనుచుండిరో వారు గడ్డములుకూడ నుంచుకొనకుండియుందురు మీసములైతేని యుండఁబు నుంచుకొనియుందురు.

ప్రస్తుతకాలమున అగ్నిహోత్రులైనవారు గడ్డములు మీసములు పూర్తిగా క్షౌరము చేయించుకొనుచుండిరి, ఇదే విధముగా ప్రాచీనకాలమందు గృహస్థులు గడ్డమును మీసములను జేయించుకొనవలయునను నియమముండియుండును. శిరస్సుపైని శిఖ చతుర్థాశ్రమమును విడిచి యితరాశ్రమములవారు అందరును నుంచుకొనియుందురు, శిఖయొక్క యుల్లేఖము మహాభారతమందనేకస్థలములలో నున్నది ముసల్మాను మతములో గడ్డము నుంచుకొనుట యావశ్యకమైనదిగా కల్పించియున్నది మరియు వారు శిరస్సుమీఁద శిఖయొక్క గుర్తుకూడ నుంచుకొనకుండిరి. అట్టి విధానమును పరిశీలింపఁగా నేఁటి హిందూమత కల్పనకు పూర్తిగా విరుద్ధమై యున్నదనుట యేదికలదో అది మహాశయుఁడైన మహమ్మదుయొక్కయే విధియని తోఁచదు. ద్రోణ పర్వము [అ. 120] మందు ఈ శ్లోకమున్నది.

దస్యూనాం శిరస్త్రాణైః శిరోభిర్లూన మూర్ధజైః।
దీర్ఘకూర్చైర్మహీ కీర్ణా విబర్హై రండజైరివ॥

దీనిఁబట్టి కాంభోజులు మొదలైన యుత్తరదేశపు మ్లేచ్ఛులు శిఖాముండనము చేయించుకొని గడ్డములనుంచుకొనుచుండిరి. అనఁగా అది మ్లేచ్ఛులబహుపురాతనమైన యాచారమై యున్నది మహాభారత సమయమున క్షత్రియులు తఱచుగా శిరోజములను శ్మశ్రువులనుంచుచుండిరి మరియు ఇతర లోకులుసాధారణముగా శిఖనుంచుకొని మిగిలిన శిరోజములను శ్మశ్రులను క్షౌరము చేయిం

చుకొనుచుండిరి సనాతనధర్ములై బౌద్ధ సంన్యాసులందరును శిరోజములను క్షౌరము చేయించుకొని శుభ్రముగా నుండుచుండిరి. మరియు తాపసపుంగవులు మొదలైన వనవాసులందరును కేశములనన్నిటిని పెంచుకొనుచుండిరి దీనిఁ బట్టి గ్రీకువారు వ్రాసిన వివరణము క్షత్త్రియులకొఱకును తపస్వుల కొఱకును విశేషోపయుక్తమైనదిగా మన్నింపవలసియున్నది.

## డ్ర స్సు యొ క్క ని రా డం బ ర త

పైని జెప్పఁబడిన వర్ణనముఁబట్టి మహాభారత సమయమున హిందుస్థానవాసులైన యార్యులు డ్రస్సు విషయమున బొత్తిగా నిరాడంబరతతో నుండిరనియు వారియొక్క వర్తమాన కాలపు వంశస్థులు ఏ విధముగా నింట లోపలలేక పల్లెలలో వస్త్రములు ధరించి ప్రస్తుత దినములలోఁగనఁబడుచున్నారో, ఆ స్థితి అ కాలము డ్రస్సుదియై యుండెననియు సిద్ధమగుచున్నది. ప్రస్తుత కాలమున హిందుస్థానములోని హెచ్చు తరగతివారు ధరించుచున్న డ్రస్సు హిందుస్థానమునకు వెలుపటిదియైయున్నది. ఇది గ్రీకులు పర్షియనులు, ముసల్మానులు మఱియు నిచ్చటి ఇంగ్లీషువారు వీరినుండి గైకొనఁబడి యున్నది. విశేషించి ముసల్మానులకు నంతకంటెఁగూడ నధికముగా ఇంగ్లీషువారికినకలై యున్నది. ఏడవ శతాబ్దమందు చీనా యాత్రికుఁడైన హుఏనుసాంగు హిందుస్థానమునకు వచ్చియుండెను. అ సమయము వలన ఇది ఇచ్చటివారి యాచారములును రీతి రివాజులు ఏవి యుండెనో, వానిని అతఁడు మిగులఁ బూర్ణముగా వ్రాసియున్నాఁడు. -"ఇచ్చటి లోకులు ఇంట ధరించుటకును సమాజములో ధరించుటకును వస్త్రములయందు కుట్టు పని కొంచమైనను లేదు. రంగుల విషయమునఁ జూడఁగా మిగులఁ బూర్ణమైన తెలుపురంగునకై విశేషాదరము గలదు; మఱియు అత్యధికమైన వేళు రంగులయందు నద్దకము వేయుటలో లోకులకు బొత్తిగా నిష్టములేదు. పురుషులు నడుమునకు చుట్టుప్రక్కలనొక పొడుగు వస్త్రమునుచుట్టుకొనుచున్నారు.

మఱియు మూఁపుమీఁద మఱియొక వస్త్రమును వేసికొని కుడి మూఁపును గనఁబడునట్లుంచుకొనుచున్నారు. స్త్రీలు ఒక నిడుగుపాటి చీరను, మూపుల నుండి తీసుకొని పాదములవఱకు శరీరమంతయు దాగియుండునట్లును అది విస్తారముగాఁ జుట్టుకొని యుండునట్లును ధరించుచున్నారు. తలవెండ్రుకలు శిఖవేసికొని మిగిలిన కేశముల వేలాడవేసుకొనుచున్నారు. కొందఱు లోకులు మీసాలు క్షౌరము చేయించుకొనుచున్నారు. లేక వేఱువేఱు రీతులనుంచుచున్నారు" ఈ వర్ణనములఁబట్టి ముంగీలు, కురితీలు, సలూకాలు, పైజామాలు మొదలైన వస్త్రములు ముసల్మానుల కాలమున నీదేశమునకు వచ్చియుండును. ధనికులు లైన రాజులును దరిద్రులందఱును దోవతులనుపయోగించుచుండిరి. కానివారిలో భేదమువిలువగలవఱుచని నూలివియుమోటువియుయనగువస్త్రము లదియై యుండెను. లేక ధనవంతుల వస్త్రములు పట్టువి లేక ఉన్నివి యగుచుండెను.మరియు దరిద్రులకు సాధారణపు నూలివి. వేఱువేఱుజాతులయొక్క వృత్తులయొక్క మనుష్యులు వివిధములగు నయ్యవిమేమస్తులుగా ధరించుచుండిరి. లేక వారికిఁగొంత విశేషమైన గుర్తు ద్రష్ను లేక యలంకారమందు నుండుచుండెను. విరాటుని యింటికిఁ బాండవులు వివిధములైన దుస్తులను ధరించి వేర్వేరు రూపనులకుగాను సేవకులైనప్పుడు ప్రతివాని వర్ణనము ఇట్లున్నది. యుధిష్ఠిరుఁడు బ్రాహ్మణ వేషమును అనఁగా బూర్తిగా సాపుతెల్లని దోపతులను గప్పుకొని చంకలో గోళీలు, పాచికలు పెట్టుకొని ద్రుపదునిఇంటికి వచ్చెను. భీముఁడు వంటవాడై, నలుపురంగుగల దోవతి ధరించి మిల్లిగరిటె, గరిటె, కత్తి పట్టుకొని వెళ్లెను; ద్రౌపది యొకతియే మురికిబట్టలను గట్టుకొని తన కేశములయందు ముడి వేసికొని యొకబట్టక్రిందఁగుడి చేయి దాచుకొని సైరంధ్రియొక్క దుస్తులతో సుధేష్ణ యెదుటికి వచ్చెను. అర్జునుఁడు బృహన్నల వేషమును ధరించియుండెను. అనఁగా స్త్రీల యాభరణములను దాల్చియతఁడు చెవులయందు గుండలములను ధరించియుండెను.మణికట్టులయందు బుజములయందును శంఖ భూషణములను ధరించియుండెను. తలవెండ్రుకలను భుజముమీఁదను విరయఁబోసి యుండెను.సహదేవుఁడుగొల్లవాని వేషము ధరించియుండెను కాని వానిని విశేషము వర్ణింపలేదు, అశ్వశిక్షకుఁడై యున్న నకులుని విశేషమునుగూడ వర్ణింపలేదు. అతనిచేతిలోఁ గేవలము కొరడా యున్నట్లు వర్ణనమున్నది. వివాహ సమయమున సుభద్ర గోపకన్యకయొక్క

వేషమును ధరించియుండెను. ఇది మునుపు వ్రాయఁబడియున్నది. ఈవేరు వర్ణనములఁబట్టి వస్త్రముల రంగు ధరించుటలో భిన్నభిన్నములైన పద్ధతులు మాత్రము వృత్తులకు లేక జాతులకు సూచకములై యుండును. ఇవిగాకుండ వారి యలంకారములును చేతిలోనియుపకరణములును వృత్తుల సూచకములై యుండును.

## అలంకారములు

భారతీయార్యుల వేషము ఎంత సామాన్యమైనదిగా నుండెనో, వారి అలంకారములునంతరయే భిన్నభిన్న రూపములవియు విలువగలవియునై యుండెను, వారి వేషముయొక్క వినయమును గ్రీకులు వర్ణించినట్లే వారి అలంకార ప్రేమయొక్క వర్ణనమునుగూడ గ్రీకు చరిత్రకారులుచేసియున్నారు మహాభారతసమయమునఁ బురుషులకును స్త్రీలకునునలంకారముల ధరించుటలో పెద్ద కోరిక యుండెను. మరియు నాకాలమున హిందుస్థానమందుబంగారము నకు, ముత్యములకు, రత్నములకును నెట్టి సమృద్ధి యుండెనో, దానిని వివరింపఁగా హిందుస్థానపు వారికి భూషణములు ధరించుటవల్ల నున్న యపేక్ష గురించి యాశ్చర్యమెంతమాత్రమును గలుగనేరదు. సామాన్యమైన తరగతి లోని జనులు బంగారుతోను వెండితోను జేసిన నగలను ధరించుచుండిరి. అంతియేకాదు ఏకనేమంటేని సువర్ణ వికారమైన నగలతో గోవులను, ఏనుగులను, గుఱ్ఱములను గూడ సింగారించుచుండిరి. కాని ధనవంతులు విశేషించి రాజులును రిస్తేదారులను యంగనలును ముత్యములు, రత్నములు, వజ్రములు మొదలైన వానిచేత సంఘటితములై యున్న భూషణములను ధరించు చుండి హిందుస్థానమందు విపులముగాఁ బుట్టెడి ముత్తెములను మిల్టను అది మాత్రముగాఁ జెప్పియున్నాఁడు; మరియు గ్రీకు చరిత్రకారులు. హిందుస్థాన వాసులు సర్వ ప్రపంచముయొక్క యుబిరుచినిఁమార్పుచేసియున్నాడు. లోకులకు ముత్తెములకై మేరలేని వెలనిచ్చుట నేర్పియున్నారు అని చెప్పి

యున్నారు. అగుఁగాత; మహాభారత సమయమున నెట్టియెట్టిభూషణములను ఉపయోగము స్త్రీ పురుషులు చేయుచుండిరో యిపుడు చూడవలయును.

రాజలోకము, రత్నములతో ఖచ్చితమైయున్న బంగారు ముకుటములను మస్తకములపై ధరించుచుండిరి. ఈ కిరీటములే తరహావియగుచుండెనో నిశ్చయపూర్వకముగాఁ జెప్పఁజాలము. మరియయ్యవి పాశ్చాత్యుల ముకుటముల వంటివి కాక, ఈ సమయమందుఁగూడ ముకుటముల చిత్రములు చేయబడుచున్నట్లీ యుండియుండునని యంచనా యగుచున్నది. ముకుటము మస్తకమంతటిదియై యుండును. మరియుఁబైని రానురాను సన్నగిల్లినదియై యుండును. కర్ణపర్వములో అర్జునుని కిరీటముయొక్క వర్ణనమున్నది. దానిఁబట్టి అది బంగారపుదియు, ముత్యములు, వజ్రములు నాటినదియు నుపయుక్తమును మిక్కిలి ప్రశస్తమైన నిర్మాణముగలదియునై యుండెను. ధరించువానికది సుఖదాయకమైయుండెను. దీనిఁబట్టి దానిలోపల మెత్తని పొర యుండెనని తెలియుచున్నది. ఇదిగాకుండ రాజులు చెవులయందు వజ్రకుండలముల ధరించుచుండిరి. ఈ కుండలముల యాకారము గుండ్రనిదియై యుండును. కంఠమునందు ధరించుటకై ముత్యములయొక్క రత్నములయొక్కయు హారములుండెను. భుజములయందు ధరించుటకై కేయూరములు లేక యంగదములుండెను. ఈ బాహుపురులు బాహువునంతను గప్పివేయుచుండెనని తెలియుచున్నది. ధనవంతులైనవారు మణికట్టునందుఁ గంకణములు పోఁచీలును ధరించుచుండిరి. స్త్రీల భూషణములు కూడ నిట్టివే యగుచుండెను. కాని మిగుల వెలగలవి యగుచుండెను, స్త్రీలకు ముకుటములు లేక కిరీటములు లేకుండెను. రాజుల స్త్రీలకు మాత్రము ముకుటములు లేవు కాని నొసలిపైఁ గట్టుటకై యొక పట్టము లేక బంగారపుది బిగువుగా రత్నములు తాపడము చేసిన, ఫలకమగుచుండెను మరియు నిదే కారణముచేత రాజుయొక్క ప్రధాన స్త్రీని పట్టపురాణి యని చెప్పెడి వాడుక యుండెను. ఇది గాకుండ స్త్రీల ముఖ్య భూష

ణములు నడుమున ధరించుటకై కాంచి లేక రశన మఱియు పాదము లకై నూపురములు నుండెను. చెవులకై కుండలములును బాహువులకై కేయూరము లుండనేయుండెను: కాని స్త్రీల యీ భూషణములకు నామము కేయూరములు కుండలములే యై యుండును. రామాయణ ములోని యీ శ్లోకము ప్రసిద్ధమై యున్నది—

కేయూరే నాభిజానామి నాభిజానామి కుండలే ।

నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్ ॥

"సీతయొక్క కర్ణకుండలములను బాహు కేయూరములను నేను గుర్తు పట్టలేను; అవును పాద నూపురములను బక్కగా గుర్తింతును. ఎందుచేత? నేను నిత్యము చరణములకే వందనము చేయుచుంటిని. గనుక." ఈ శ్లోకము లోనిది లక్ష్మణవాక్యమై యున్నది. ఈ యుదాహరణముంబట్టి చెవులయందును బాహువులయందునుగల స్త్రీ భూషణములకుం బేరులు కేయూరములు కుండలములనియే యుండెను, స్త్రీల కంఠములందు వివిధములైన హారములు పడియుండెడివి, మఱియు ఈ హారములు నాభివఱకు వ్రేలాడుచుండెను. నడుమునకు ధరించెడి పటికా (వడ్డాణము) కఠినమైనదికాదు, త్రాడువలె వంగునదియై యుండును. ఎందుచేత? ఈ రశనకై 'దామ, సూత్ర', శబ్దములు, ప్రయుక్తమై యుగపడుచున్నవి. ఏ విధముగా గ్రీకు స్త్రీల నడుము పటకాయొక్క వర్ణనమున్నదో అట్లే లేక నేటి మహారాష్ట్ర స్త్రీలయొక్క నడుమునకుం బెట్టుకొను పటకావలె, ఈ రశన లేకుండెను. ప్రాచీన రశనయైతేని మార్వాడీ స్త్రీలు ఏ విధమైన మొలనూలు ధరించుచున్నారో యట్టిదియై యుండును; లేక వేర్వేరు పురాతనపుబొమ్మలం గనంబడుచున్న స్త్రీ మూర్తుల నడుమునందు నేవిధమైనది కనంబడుచున్నదో, యట్టిదియై యుండును" రశనా దామముయొక్క యుపయోగము వస్త్రమునుజక్కపెట్టుటకై కాక

కేవలము శోభకొఱకుగా నగుచుండి యుండును. ఇపుడు, పాద నూపురము లెట్లుండెడివో చెప్పఁజాలము. వానియొక్క నిర్మాణము దాక్షిణాత్య స్త్రీల మొలనూలి వలెనని మాత్రము విశ్వసింపఁ బడఁ జాలదు, ఎందు చేత నూపురముల ఝుమ్ఝుమ్ అను ధ్వనియొక్క వర్ణన మనేక కావ్యము లందుఁ గలదు. అట్టిచో అవి బంతులవలె నుండి యుండును. ఇది గాకుండఁ బాదముల పై భాగముఁ (మీగాళ్ళు) చాలవఱకు పానిచేత కప్పఁబడి యుండును.

మఱి లక్షణనిశ్చై యవి గుర్తింపఁబడుట సంభవముకాదు. పైని వ్రాయఁబడిన వర్ణనముతోపాటు, ప్రాచీన కాలమందలి గ్రీసు కాంతల విషయమై హోమరు వ్రాసిన వర్ణనమందుఁ గూడ నధికమైన సామ్య మగపడుచున్నది. ఎందుచేతః ఒడ్డాణము, గళమందలిహారము, చెవులు కుట్టించి యుందుంచఁబడు భూషణములు, చాలవఱకు నొక విధముగనే యున్నవి గనుక, అవును, పాదములయందు నూపురములను ధరించినట్టి వర్ణనమును హోమరు చేయలేదు. పశ్చిమ దేశములందుఁ జలి యెక్కువగా నున్న కారణముచేతఁ బాదములంతయుఁ గప్పిపైచి యుంచెడి పద్ధతి యుండి యుండును. మరియు దీనిఁబట్టి పాదభూషణములయొక్క యుల్లేఖము కాకుండియుండును.

ప్రస్తుత కాలమున హిందుస్థానమందు సౌభాగ్యవతులైన స్త్రీలందఱును నాసికయందు దేభూషణములు ముక్కుపోగులు ధరించుచున్నారో, వాని యుల్లేఖము భారతమందుఁగాని రామాయణమందుగాని యున్నట్లు జ్ఞప్తి లేదనియు నిచటఁ జెప్పవలసియున్నది. ఒకవేళ నెచ్చటనైన యుల్లేఖము కలదేమో చెప్పఁజాలము. కాని యుల్లేఖము లేనంత మాత్రముననే మహాభారత సమయమున ముక్కుపోగులు లేనేలేకుండెనని చెప్పఁజాలము; ఎందుచేతః వేని విషయమై తప్పక యుల్లేఖముండి తీరవలయు ననియమమున్నదో

దాని విషయమై యుల్లేఖము లేకుంటలో మహత్త్వమున్నది. ఈ సంగతిని మనము చాలచోటుల వ్రాసియున్నాము. మఱియొకటి, మహాభారతమందు, కాంతల యొక్క సమస్త భూషణముల వర్ణనము ఎచ్చటనులేదు. ఉపన్యాసముల యందువలె కాంతాపురుషుల కేశవేశముల వర్ణనము మహాభారతమందుఁ గనఁబడదు. కనుకనే, ప్రాచీన సమయమందు ముక్కుప్రోగు లనేనగలు లేనే లేకుండెనని విశ్వసింపఁజాలము. ముక్కు ప్రోగులను బెట్టుకొనెడు నలవాటు తఱచుగా హిందువులయందే యున్నది. మఱియు ఈశబ్దము కూడ నవమౌక్తికము, వలన బయలుదేఱినదిగా నగపడుచున్నది. అనఁగా ఈ శబ్దము ఇచ్చటిదేయైయున్నది. అట్టిచో ఈ భూషణము కూడ భారతీయార్యులదే కావలయును. ఇదే సంగతి యిప్పటి యితర భూషణము పట్లఁ గూడఁ జెప్పవలసియున్నది.

మహాభారతములో భూషణములపట్ల నేవర్ణనమున్నదో, దానినిబోషించుటకై గ్రీకు లేఖనములు విశేషాధారములైనవే దొరకుచున్నది. ఇతిహాసకారుఁడైన కర్టిఅన్‌రూఫసు "కర్ణములయందు రత్నములు వ్రేలాడుచుండిన భూషణములను ధరించు పద్ధతి హిందువుల యందుఁ గలదు మరియు పెద్ద తరగతి వారు లేక ధనవంతులు తమ బాహువుల యందును మణికట్టుల యందును బంగారు కడియములను ధరించుచున్నారు." అని వ్రాసియున్నాఁడు. ఇతిహాసకారుఁడైనన స్ట్రాబో "హిందువుల వస్త్రప్రావరణాదుల విషయమై చూడఁగా నెక్కుసారళ్యమున్నది, అయినను వారికి భూషణముల ధరించుటలో చెడ్డకోరిక యున్నదని వ్రాయుచున్నాఁడు. వారు బంగారపు కలాబత్తుకనగిషీ పని గల బట్టలను రత్న భూషణములను ధరించుచున్నారు. ఇటువంటి సన్న బట్టల రంగులద్దిన వానిని పూవులల్లిన వానిని ధరించుచున్నారు." అని వ్రాయుచున్నాడు.

## ఆసనములు

మహాభారత సమయమున నానాప్రకరములైన యాసనముల యుపయోగమెట్లుగుచుండేనో చివర నిపుడు చూడవలసియున్నది. ఆ సమయమున

నిప్పటికుర్చీలు లేకుండెననుట మాత్రము స్పష్టమైన సంగతియై యున్నది. కాని ప్రాచీన కాలమందు జనులు ఎన్నఁడును నేలపైని గూరుచుండెడి వారు కాకుండిరి. మహాభారతమందు నాసనముల వర్ణన మెక్కువగా నున్నది. ఈ యాసనములు చతుష్కోణములైన కుర్చీలవలె నుండుచుండెను. రాజులు వారి రాణులును ఉన్నతాసనములమీఁద లేక పరికరములమీఁదఁ గూర్చుండుచుండిరి. మఱియు నీ పర్యంకములు కుర్చీల కంటెఁ బొడవుగా నుండుచుండెను. శ్రీ కృష్ణుఁడు కౌరవ సభకు పోయి నపుడు "తత్ర జాంబూనదమయం పర్యంకం సుపరిష్కృతం। వివిధాస్తరణాస్తీర్ణ మభ్యుపావిశదచ్యుతః॥ అని యీ వర్ణనమున్నది. (ఉద్యో. అ, 106). ఈ పర్యంకములమీఁద, సింహాసనములు పడియుండెడివి. మఱియు అందుపైని తెల్లని దుప్పటులు పఱచఁబడి యుండెను. ఆనుకొనుటకై దిండులు కూడ నుండెను. ద్రౌపది స్వయంవర సమయమున వేలు వేలు మంచములమీఁద రాజులు కూర్చున్న వర్ణనమున్నది. ఈ మంచముల మీఁదఁ గూడ నెక్కువ విలువగల, పెద్ద పెద్ద పరుపులు పరవఁబడి యుండెను. ప్రస్తుత దినములలో నిట్టి పర్యంకములు కూర్చుండుటకై యుపయోగించుటలేదు; ఇందుచేత వానికి సరియైన కల్పన కూడఁ జేయఁబడఁజాలదు. అయినను బంగాళము, యుక్త ప్రదేశము నీవైపు పెద్ద పెద్ద (బల్లలమీఁద) నాసనములను వైచి కూర్చుండు పద్ధతి యిపుడు కూడఁ గలదు. ఇదిగాకుండ ఇష్టిటుల యందు నేవిధముగా ప్రభుత్వాసన మున్నదో అచ్చటనే ప్రచురమైన పర్యంకములును వాడుచున్నవి. రాజులు కూర్చుండుటకై సింహాసనము నున్నట్లు కూడ వర్ణనము కలదు. ఈ సింహాసనమొక కుర్చీయేయై యున్నది. కాని యిది బంగారముచేతను రత్నములచేతను భూషితమై యుండెడిది. నాలుగు కోళ్ళయందును సింహముఖముల వంటి ముఖములుండెచుండెను; మఱియు దానిమీఁద నాసనములుండుచుండెను. చీనా యాత్రికుఁడైన హుఏసాంగు వర్ణించియున్నాఁడు, "రాజుల సింహాసనములు మిక్కిలి యెత్తైనవి కాని డాబుగా లేకున్నది. మఱియు వానియందుఁ జిన్న ముత్యముల జాలరులు కూర్చఁబడియున్నవి. సింహాసనము నొద్ద, రత్నభూషితమైన పాదపీఠమగుచున్నది. అసఁగా కాళ్ళుంచుకొనుటకై చిన్న కుర్చీ యగుచున్నది." రాజులు బంగారపు పల్లకియందుఁ గూర్చుండి యిటు

నటు సంచరించుచున్నారు. మఱియు ఈ పాలకీలను మనుష్యులు మూపులమీఁద నుంచుకొని తీసికొని పోవుచుండిరి; దీనిఁబట్టి దినిని నర వాహనములని చెప్పఁబడి యున్నవి. సప్తర్షుల యొక్క నహుషునియొక్క కథ యందు నిట్టిదే నరవాహనము కలదు. దీనిఁబట్టి తఱచుగా రాజులే యీ వాహనముల నుపయోగించుచుండిరని తెలియుచున్నది. ఈ కారణముచేత ఈ పాలకీలు బంగారపు తొడుగుల చేతను రత్నముల చేతను సుశోభితములుగాఁ జేయఁబడు చుండెను. శేషించిన వాహనముల విచారమన్య స్థానములయందుఁ జేయఁ బడును.

ఈ ప్రకారముగా మహాభారతము వలనను అప్పటి గ్రీకు లేఖములలో లిఖితములైన వర్ణనముల వలనను మనకు భారతీయార్యుల వస్త్రములయు భూషణములయు విషయమునఁ గొన్ని గొన్ని సంగతులు తెలియుచున్నవి.

## రీతి — రివాజులు

భారతీయార్యుల విషయమున నిప్పటివఱకు వ్రాయఁబడియున్న సంగతులఁబట్టి, భారతీయ యుద్ధసమయమున హిందూస్థానమునకు వెలుపలనుండి వచ్చిన యార్యులతో నిచ్చటనున్న నాగులు మొదలయిన యనార్యులకు సంపూర్ణమైత్రి కాకుండెనని తెలియఁగలదు. భారతీయసమయమున నీ మైత్రి యయ్యెను. మఱియు మహాభారత సమయమునభారతీయార్యులయొక్క అనార్యులయొక్క ఒక సమాజ మేర్పడియుండెను; అట్లె భిన్న భిన్న జాతులు క్షేమముతో నొక్కచోటనుండ నారంభించి యుండెను. వారి (వివాహము) పెండ్లి పెడాకులయందు ఆర్యానార్యులు రెండురీతులకు మిశ్రణము అయియుండెను. ఇదే ప్రమాణముచేత వారి శీలము నందును రీతులయందును రెండు జాతుల వారికి మిశ్రణముకలిగి మహాభారతసమయమున రెండుజాతులకు నొకజీవము అయిపోయి యుండెను; పాశ్చాత్యార్యులు గ్రీకువారితో హిందుస్థానమునకు వచ్చినపుడు వారికి నిచ్చటి యే రీతితోడను భిన్న భిన్న భావము కనఁబడలేదు. మరియు వారు భారతీయార్యులలో జేసిన వర్ణనమందు ఆర్యానార్యుల భేదభా

వము కొంచెమైనను జూపలేదు. మహాభారతమందుఁగూడ ఆర్యానార్య భేదము విశేషించి జాతిదికాదు, మంచిచెడ్డలదియై యున్నది. ఆ శబ్దము నేటికిఁ గూడ జాతివాచకముగా నుండుట మరల ధ్యాసమీయఁ దగిన సంగతియై యున్నది. అయినను లోకుల శీలమును రీతులను విచారించునపుడు ఇట్టి భేదము చేయుటకై మనకు నావశ్యకత లేదు.

## వే శ స్త్రీ లు

భారతీయ సమాజమందు స్త్రీ పురుషుల యాచరణ మొకటి మరియొక దానిమీఁద బంధమున మిగుల నధికమై యుండె నన్నది మొదటి సంగతియై యున్నది. స్త్రీలు పాతివ్రత్యధర్మము నుత్తమరీతిని బాలించుట కలవాటు పడి యుండిరి; మరియు పురుషులుకూడ స్త్రీలవిషయమై తమవ్రతమును బూర్తిగా బాలించుటకై తత్పరులు నుద్యుక్తులునై యుండిరి; స్త్రీలు లేక పురుషులు ఈ వ్రతము నుల్లంఘించునెడలనిద్దఱకును సమానమైనపాతకము విశ్వసింప బడుచుండెను. ఇది సమస్త భారతీయసమాజమునకును బద్ధతియై యుండెను; రాజులకును, ధనవంతులకును ననేకస్త్రీలు మాత్ర మగుచునే యుండిరను సంగతి యొకటియే దీని కపవాదమై యుండెను; కాని, ఇది గాకుండ నీ లోకులయందు వేశస్త్రీల నుంచుకొనుటయుఁ బద్ధతియై యుండెను; ఈ విషయమున వేశస్త్రీ లెవరో వేశ్యలు కాకుండి రని చెప్పఁబడవలయును; వారు ఒక పురుషునివా రయ్యేయుండున ట్లుంచుకొనుచుండిరి; మరియు ఇట్టి కారణముచేత, పరివారములో వారికి గౌరవము వివాహిత లయిన స్త్రీల కంటెఁ గొంచెముమాత్రమే తగ్గియుండెడిది. అజ్ఞాతవాసమునుండి బయటఁబడిన తరువాత యుధిష్ఠిరుఁడు హస్తినాపురములోని స్వజనమునకు సంధిని చర్చించుటకై వచ్చిన సంజయునిచేత వేర్వేఱు లోకుల విషయమై కుశల ప్రశ్న సందేశములఁ బంపించెను. అందు తమ కర్తవ్యము ననుసరించి తమ మిక్కిలి పెద్దలైన బంధువులకును వేశస్త్రీలకును గూడఁ గుశలమంగళముల సందేశమును బంపి, వారి విషయమై యుధిష్ఠిరుఁడు తన యాదరమును వ్యక్తపఱచియున్నాఁడు. యుధిష్ఠిరుఁడు వారి యొక్క మొక్కుపైన మార్మిక పర్ణనమును ఈ శబ్దములలోఁ జేసియున్నాడు.

అలంకృతా వస్త్రవత్యః సుగంధా అభీభత్సాః
సుఖితా భోగవత్యః। లఘు యాసాం దర్శనం
వాక్ చ లక్ష్మ్యా వేశస్త్రియః కుశలం తాత పృచ్ఛేః

(ఉద్యో. అ. 30

"అలంకారముల ధరించెడు మంచిమంచి వస్త్రములదాల్చెడునానాప్రకారములైన సువాసనల ద్రవ్యములను రాచుకొనెడుసుఖసమృద్ధిగలకాని మర్యాదా శాలురైన, అన్ని విధముల యుపభోగములను భోగించెడిరూపవతులనుసుందర భూషణలునైన వేశ స్త్రీలను నా తరఫున కుశలము నడుగుము" ఈ వర్ణనముఁబట్టి ఆ స్త్రీలు మర్యాదశాలురై యుండిరనియు యుధిష్ఠిరుని కాదరపాత్రములు గూడనై యుండిరనియుఁ బ్రకటమగుచున్నది. ప్రాచీనసమయమందు రాజుల సభలలో, ప్రతి శుభ సమయములందును, వేశస్త్రీల గానాదికమగుచుండెను. ఇందుకై రాజ సభలలో నిటువంటి స్త్రీల యావశ్యకత యుండెను. హిందు దేశపు రాజుల యీ యాచరణము, జన సమూహముయొక్క సరళ వ్యవహార పరీక్షణములో, గ్రీకుల కాశ్చర్యకరమై కనఁబడెను. వారు వ్రాసి యున్నారు. -"రాజుల భోగ విలాసము లేక వైభవము (వారు చెప్పినదానిననుసరించి) పృథివి యంతటను దానికి పోటీలేనంత పెరిగిపోయెను. ఈభోగ విలాసము పొత్తిగా స్పందళుకు వెల్లడిగా జరుగుచున్నది. ఎందుచేతః రాజు వెళ్ళిన చోటికెల్ల వారితో బంగారు పళ్ల కిలలోఁ గూర్చున్న వేశ స్త్రీల గుంపులకు గుంపులుగా నివసించుచున్నారు. నగర సంకీర్తనములో వీరి ప్రతి,రాణీల సంఘముకంటె కొంచెము వెనుకఁబడి వెళ్ళుచున్నది. ఇంత మాత్రమే యంతరమగుచున్నది. రాజసభలలోనున్న వేశస్త్రీలు గల రాజులయొక్క నడవడికయందుఁ గొలఁదియో గొప్పయో చెడ్డ పరిణామము తప్పదనుటలో సందేహము లేదు. ఎందుచేతః రాజసభలలో ననేక శుభసమయములయందు వారి దర్శనము తటస్థించుట ప్రకటమైయున్నది గనుక అయినను కుటుంబములోని స్త్రీలకుఁ బ్రభుత్వమెల్లప్పుడు నుండియుండు ననియు ఈ వేశస్త్రీలు కేవలము దర్బారుల యాడంబరమునకే యుపయోగించుచుండియుండు రనియు నిశ్చయపూర్వకముగాఁ జెప్పఁబడఁగలదు.

## ద్యూతము

హిందుస్థాన క్షత్రియుల రెండవ దోషము వారికున్న ద్యూతప్రేమయై యుండెను. ప్రాచీనకాలమందలి జర్మనులు ఏ విధముగా మద్యము త్రాగుట యందును ద్యూతమాడుటయందును నాసక్తులై యుండెడివారో, అట్లే భారతీయార్య క్షత్రియులును ద్యూతమాడుటయందుఁ బెద్ద కోరికగలవారై యుండిరి. వారియొక్క యీ కోరిక, ఎవరైనను జూదమాడుటకై పిలిచినపుడు దాని కంగీకరింపకుండుటయనెడు పని క్షత్రియుల కవమానకరముగా నుండునంతగా హెచ్చిపోయి యుండెను. ఈ కల్పనచేతనే యుధిష్ఠిరుఁడు జూదమాటకై వివశుఁడు కావలసివచ్చెను; మఱియు నింతకంటెను ముందునకుఁ బోయి వారు అందుఁ బ్రవీణతను సంపాదించుటకుఁగూడ యత్నించిరి. మద్యము, ద్యూతము రెండు వ్యసములనుండియు రక్షింపఁబడుటకై నారదుఁడు యుధిష్ఠిరుని జాగ్రత్తగలవానిగాఁ జేసియున్నాడు. శ్రీకృష్ణుఁడు సహితము యుధిష్ఠిరునికి, ద్యూతమువలన రెండనర్థములు కలుగుచున్నవి- అందొకటి కలహము, రెండవది వ్యర్థముగా ద్రవ్యము స్వాహా అగుటయు అని తెలిపియున్నాఁడు. భారతీయ యుద్ధ సమయమున నీ దోషమెక్కువగా నుండెను. మఱియు యుధిష్ఠిరునివలె బలరాముఁడు కూడఁ ద్రాగుటచే జూదరియై యుండెను. మహాభారత కాలమందు ఈ వ్యసనము క్షత్రియులయందు దొలఁగియుండును, మఱియు దానియొక్క చిహ్నము మాత్రము నేఁటివఱకు నగపడుచున్నది. ఇంతకంటె నెక్కువగా ప్రాచీనకాలమందు క్షత్రియుల సాంగత్యమువలన ద్యూతమాడునట్టి బ్రాహ్మణులు కూడ నుండిరి. ఎందుచేత? వేదములోఁగూడ నొక ద్యూతకారుని సూక్తమున్నది. మఱియు యుధిష్ఠిరుఁడు బ్రాహ్మణుఁడై విరాటరాజుయొక్క ద్యూతకారుఁడై యుండెను.

## శుద్ధాచరణము

ఈ రెండపవాదములను విడిచిపెట్టి, భారతీయార్య సమాజమంతటియొక్క యాచరణము శుద్ధమును సరళమునై యుండెను. గ్రీకువారుకూడ

ఈ సంగతిని వ్రాసియుంచియున్నారు. వారు హిందుస్థానమువారు సమస్త వ్యవహారములందును మిక్కిలి సత్యమైనవారుగను సత్య వ్యక్తులుగను నున్నారని వ్రాసియున్నారు. హుఏనుసాంగు హిందుస్థానమువారి యాచారము సహజముగనే శుద్ధమును సరళమునై యునడెనని వ్రాసియున్నాఁడు. ఈ విషయమై వారిపైని ఏమియు ఎక్కువ యన్యాయమును జేయలేదు. హిందుస్థానమంతటి యొక్క సత్య ప్రియత్వ విషయమున గ్రీకులుకూడ సాక్ష్యమును వ్రాసియుంచియున్నారు. అనఁగా మహాభారత సమయమునఁ గూడ హిందుస్థానము వారియందుఁ బ్రాచీన భారతీయార్యులయందు లేదా సత్యప్రియతస్థిరమై యుండెను. భారతీయార్యులాచారము చేతఁగూడ సరళముగా నుండిరి. మఱియు వారియొక్క ప్రాతఃకాల స్నానము మొదలైన యాచారములు కూడ శుద్ధములై యుండెను. ప్రతిదినము కాలు సేతులు కడిగికొని భోజనము చేయుటకుఁ బోవుటకై వారియందుఁబద్ధతియుండెను, భోజనములో మిగిలిన యన్నమును దిరుగ లెవరికిని వడ్డించుట కుపయోగపఱుపకుండిరి, వంటపాత్రము లెల్లప్పుడును తోమి కడిగి సాపుగా నుంచఁబడుచుండెను, మఱియు మట్టిపాత్రలైనచోఁ బారవేయఁబడుచుండెను; స్నానమైన తరువాతను వాటిని ముట్టుకొనకుండిరి; మఱియు మలవిసర్జన స్థానమునకుఁ బోయినతరువాత స్నానముచేయు పద్ధతి యుండెను. ప్రతిదినము నను ఉతుకఁబడిన వస్త్రములు ధరింపఁబడుచుండెను." ఇవి మొదలుగాసంగతులను హుఏనుసాంగు వ్రాసియున్నాఁడు, సారాంశము స్వచ్ఛముగా నుండెడి, భారతీయార్యుల పద్ధతి బహు ప్రాచీనకాలమునాటిదియై యున్నది.

## స్పష్టోక్తి

భారతీయార్యులయందు సత్యవాదిత్వముతో పాటు మరియొక ప్రశంసనీయమైనగుణము సాపుగావిషయమును జెప్పివేయుట కూడనై యున్నది. మహాభారతము నందలి స్త్రీపురుషులందఱు నేవిధముగా సత్యవాదులై

వున్నారో, అట్లే హృదయమును విస్పష్టముగాఁ జెప్పుట యందును వారు ముందు వెనుకాడకుండిరి: భిన్నభిన్న భాషణముల యవసరములందు ఈ స్పష్టవాదిత్వ మగపడుచున్నది; మతిమాలి వ్యర్థముగా నసత్యమైన స్తుతి గావించి, చేతులు నలిపెడి దైన్యము భారతీయార్యులయందు లేకుండెను.

## పెద్దల యాదరము

భారతీయార్యులయందు, సమస్త జనసమాజమందు, పెద్దల నాదరించుట మహత్త్వ లక్షణమై యుండెను, ప్రాచీనకాలమందు ప్రతిదినముప్రొద్దున లేచి చిన్నలు, పెద్దలకు సాష్టాంగ వందనములఁ జేయుచుండిరి. పెద్దలఆజ్ఞను శిరసావహించుట చిన్నవారికి కర్తవ్యమై యుండెను. యుధిష్ఠిరుఁడు పెద్దన్నగారై యుండెను. ఇందుచేత వారి యాజ్ఞను సోదరు లేవిధముగాఁ భావించుచుండిరో, దాని వర్ణనము ద్యూతసమయమందు మిక్కిలి స్పష్టముగా నున్నది. ద్రౌపది యొక్క దురవస్థఁ జూచి భీమసేనుఁడు తనను లేక సోదరులను బందెముగాఁ బెట్టి జూదములో నోడిపోయినపుడు నిలవలేని యంతక్రోధము గలవాడయ్యెను. భీమసేనుఁడు, యుధిష్ఠురుని హస్తమును గాల్చివైచినను దఱుగ నియంతక్రుద్ధుఁడయ్యెను. అపుడర్జునుఁడు అతనికి, ఇతఁడు సాక్షాత్తుగాఁ బెద్దన్నగారును ధర్మాత్ములతో శ్రేష్ఠుఁడునై యున్నాడని చెప్పి శాంతి పఱచెను. (స. అ. 18) భీష్ముఁడు కూడఁదనతండ్రి మీఁది భక్తిని, జన్మమంతయు నవివాహితుఁడనుగా నుందునని ప్రతిజ్ఞ చేసి, వ్యక్తము చేసెను. భీష్ముని పితృభక్తి విషయమై యిచటఁగొంత యింకను వివేచించుటసమంజసముగా నుండును.

## భీష్ముని పితృభక్తి

భీష్ముని చరిత్రములో ఆ మహాప్రతిజ్ఞయే మిగుల నుదాత్త విషయమై యున్నది. ఈ ప్రతిజ్ఞను వారు తండ్రి విషయమునఁ జేసి

యుండిరి. ఈ ప్రతిజ్ఞబట్టి మన యెదుటకి, మహాభారత సమయమున తండ్రికోసము పుత్రులెట్లు చేయుటకు మిక్కిలి సంసిద్ధులై యుండు చుండిరో యీ స్థితి యొక్క చిత్రము వచ్చుచున్నది. రాముఁడుకూడఁ దండ్రికోసము వారి వ్రతము యొక్కయు పూర్వదత్తమైన వచనము యొక్కయు సత్యత్వములను రక్షించుటకై రాజ్యమును త్యజించి వనవాస మును స్వీకరించెను. కాని యది పదునాల్గు సంవత్సరముల మట్టునకే మల్లెరాజు దగ్గఱ, నేను జన్మ మంతయు వివాహమును జేసికొనను రాజ్యమును జేయనని ప్రతిజ్ఞ చేసెను. 'ఇట్టి ప్రతిజ్ఞను పూర్వమెప్పు డును ఎవరును జేయలేదు ఇపుడును జేయుటలేదు. ముందుకూడ నెవ రును జేయరు." (ఆ. అ. 100) సారాంశమేమనఁగా సత్యవతికిఁ దన సంతతికి రాజ్యముల విషయమై యున్న యాశంకను మొదలంటఁ జెరికివైచెను. ఇంతియేగాక, తన భావిసంతతి వారివల్లఁ గూడ నామె సంతానము నిర్భయముగా నుండుటకై ఆయన వివాహమును జేసికొనక ఆమరణాంతము బ్రహ్మచర్యమును పాలించుటకై భీష్మప్రతిజ్ఞను గావిం చెను; మఱియు దానినతఁడు అంతమువఱకు నిర్వహించెను. భీష్ముని యీ యాచరణముఁ బట్టి ప్రాచీన సమయమున సాధారణముగా పుత్రు నికిఁ దండ్రియెడల నేదికర్తవ్యముగా నూహింపఁబడుచుండెడిదో కొంత కల్పన కాగలదు. భీష్ముని యాచరణ మంత్యతోదాత్తమై యుండెను. దాని ఛాయ సమస్త మహాభారతమందేకాక, హిందుస్థానములో భవిష్య మూమిమందుఁ కూడఁ బడినదై యగపడుచుండెను. భీష్ముఁడు, రాముఁడు మొదలైన, వారి యాచారము నేఁటికిని వేలకొలఁది సంవత్సరముల నుండి హిందూ సమాజముయొక్క హృదయ పటలమందు నంకితమై యున్నది. మఱియు హిందుస్థానమందలి పితాపుత్ర సంబంధము, హిందు స్థానములోని పతిపత్నీ సంబంధమువలెనే, అత్యంతము ఉదాత్తమును పవిత్రమును నై యున్నది. కాని యిటీవల కొందరి కుల్సిత కల్పనల చేత భీష్ముని యీ త్యాగమునకు గౌణత రావలసిన యావశ్యకత కలిగి యున్నది. వాస్తవమున నిది మిగుల హానికరమైన సంగతియై యున్నది. భీష్ముని చరిత్రమును తుచ్ఛముగాఁ జూపెడి యీ ప్రయత్నము

పిచ్చివారిది వలె నున్నదని గూడఁ జెప్పఁ జాలుదుము. భీష్ముఁడు స్వయముగా సంతానము నుత్పాదించి తేజశ్శాలియైనసంతతి నుత్పాదింపవలసియుండెను. అతఁడు ముసలివాఁడైన శంతనుని వివాహముచేసికొననిచ్చెను, అందువలన హీనమైన సంతానము కలిగెను. మఱియు నిందుచేత భారతీయుద్ధము జరిగి హిందుస్థానమున కత్యధికమైన హాని తటస్థించెను. అని కొందరాక్షేపకారుల వాదమై యున్నది. కాని స్వదేశప్రేమవల్ల బుట్టినయీవాదము, మరియొక విధముగా స్వదేశమునకు హాని కలిగించి, పితాపుత్రుల నడుమను మన యుదాత్త కల్పనకు వినాశము తెచ్చుచున్నది; ఈ సంగతి వారి ధ్యానమునకు రాకున్నది, ఈ వాదము అసత్యము కూడనై యున్నది, సరియైనదికాదు భీష్మునికి తేజస్వియైన సంతానము తప్పక కలుగుననెడి సంగతి సత్యమా? ఇవుడు మాత్రమీ ప్రశ్నము మీఁద నెక్కువ విచారింపవలసిన యావశ్యకత లేదు. మహాభారతమందే చెప్పబడియున్నది; "రణశూరుఁడును రణప్రియుఁడునైన భీష్మునికి, సంతానము కలుగకముందే, రణమందే మృత్యువు ప్రాప్తిందనుటకు సమ్మతమేమిటి?" ఇంతేగాకుండ భీష్మునికి సంతానము కలిగియుల్పావస్థయందే అల్పకాలములలోనే చావదనుటకుఁ గూడ నేమి ప్రమాణము? కాఁగల సంగతుల విషయమున నేమియు నిశ్చయపూర్వకముగాఁ గొంచమైననుజెప్పజాలము! ఇదిగాకుండ ఇంకను మరియొక జవాబున్నది. శంతనుఁడుయద్యపి వృద్ధుడై యుండెను. అయినప్పటికి అతఁడేమాత్రమును నిటువంటి పనికిరాని వృద్ధుఁడు కాకుండెను. అతని సంతానము బలహీనమగునని యెట్లు చెప్పఁబడఁగలదు; ఇదిగాకుండ ధృతరాష్ట్రుఁడును, పాండురాజును ఏమాత్రము విచిత్రవీర్యుని కొడుకులు కారు, వారు తపోబల సపన్నుఁడైన వేదవ్యాస మహర్షికి సంతానములై యుండిరి. మరియు వారేమాత్రమును నిర్బలులు కారు. పాండవులును కౌరవులుగూడ వీర్యవంతులై యుండిరి. వారి నాశమైతే కేవలము మూర్ఖపు పట్టువలన జరిగెను.

దుర్యోధనుఁడు కేసరివలె, తేజస్వియు రాజనీతియందు మిగుల నిపుణుఁడునై యుండెను. కాని మితిమీరిన మహత్త్వాకాంక్షయేయిరువుర వినాశమునకుఁ గారణభూతమై యున్నది. మనుష్యుని యందిట్టి దుర్గుణోత్పత్తి యీశ్వరేచ్ఛయొక్క విలాసమై యున్నది. ఇందుఁదల్లిదండ్రుల కపరాధములలోగాని ఘోర

పొటులలోఁగాని యేదియుఁ గారణము కాదు. భీష్ముని ప్రతిజ్ఞవంటి యొక సంగతి భారతీయ క్షత్రియుల భవిష్య దితిహాసమందు జరిగి యున్నది. ఉదయపురమందలి గొప్ప క్షత్రియ కుటుంబమందు లక్షమరాణాయను పేరు గల యొక రాణా యుండెను. ఇతనికి భీష్మునియంతటి తేజస్వియుఁ బితృభక్తుఁడునగు నొక పుత్రుఁడుండెను. అతనిపేరు చండుఁడు ఒకమారు ఇతనికై ఒక రాజకుమారియొక్క ఫలదానము వచ్చెను. ఆ సమయమున చండుఁడు వేటకొఱకై వెళ్ళియుండెను. క్షత్రియాచారమునను సరించి కన్యాపక్షమందలి పురోహితుఁడు తీసుకొనివచ్చిన కొబ్బరిముక్కను యింరపొటువలన నతఁడు రాజునెదుట నుంచెను. అపుడు రాజు పలికెను. "ముసలివానియెదుట ఈ నారికేళము నెందుకుంచుచున్నావు?" ఇందుచేత రాజపుత్రుఁడైన చండునికి ఆ కుమారియొక్క నారికేళమును బుచ్చుకొనుట యుక్తమైనదిగా నచ్చలేదు. అతఁడు చెప్పెను- ఏ బాలిక తండ్రికిఁ ప్రేమాస్పదమగునో, ఆమెను నేను గ్రహింపజాలను. అపుడు పురోధసుఁడు ఈమె గర్భమునుండి జన్మించిన సంతానమునకు రాజ్యాధికారమీయఁబడునేని ఈ షరతుమీఁద రాజున కీబాలిక వివాహము చేయఁబడఁగలదని చెప్పెను. ఇందుమీఁదచండుఁడుతనయొక్కతన సంతానముయొక్క రాజ్యపు స్వాతంత్ర్యమునువిడుచుకొనితనతండ్రికాకన్యతో వివాహము చేసెను. ఆ రాజకుమారికిఁ బుట్టినవాఁడే పిదప నుదయపురపురాజ సింహాసనముపై నెక్కెను. ఇంతియేగాక వాడత్యంత పరాక్రమవంతుఁడు గాఁదయారయ్యెను అతని వంశము కూడ నేఁటివరకు నున్నది. సారాంశము. లఖమరాణాకు ముసలితనమందు వివాహము చేయుటవలనఁ గొంచమైనను నష్టము కలుగలేదు. చండునియొక్క వంశమునకుఁ బేరు వర్తమానమువలన చందావతమనియై యున్నది. మరియు ఉదయపురముయొక్క దర్బారునందు ఈ కుటుంబమునకు మొదటితరగతి సన్మానము ప్రాప్తమై యున్నది. మొదటనెపుడు వీరికిఁ బట్టాభిషేకము ప్రారంభింపఁబడెనో అపుడు వెంటనే మహారాణాకు అగుఁగాక; చండుని యీ కార్యముపై నిధ్యానముంచినచో లోకులయాచరణమునందు భీష్ముని యత్యంతోదాత్తమైన చరిత్రముయొక్క విలక్షణమునుత్తమమునైన ప్రభావమెంతగాఁ బడుచున్నదో విదితము కాఁగలదు. కేవలము మహాభారత సమయమందేగాక మహాభారతమునకుఁ బిమ్మటనుగూడ హిందూ సమాజమందు పితాపుత్ర సంబంధ మత్యంతము ఉదారపూర్ణమై

యున్నది, తండ్రియొక్క యాజ్ఞను పాలించుటయు నతని నెక్కువగా సన్మా నించుటయు భారతీయులు ఉత్తమ పుత్రుని లక్షణముగా నెంచుచుండిరి; మరియు నిట్టి యాచారమును పెద్ద సోదరునితోపాటు చిన్న సోదరులుకూడఁ జేయుచుండిరి. మరియు పెద్ద సోదరుని పితృతుల్యునిగా నెంచుకొని యతని యాజ్ఞానుసారము నడచుచుండిరి. కేవలమువయోవృద్ధుఁడునుజ్ఞానవృద్ధుఁడునగు మనుష్యునికి లేచి నమస్కరించుట పిన్నవారల కర్తవ్యమని పూర్ణముగా విశ్వ సింపఁబడుచుండెను. విద్వాంసుఁడైన బ్రాహ్మణుని రాజులుకూడ మన్నించు చుండిరి. దారిలో బ్రహ్మ క్షత్రియులకు సమ్మేళనమగునెడల బ్రాహ్మణునికై క్షత్రియుఁడు దారినీయవలయుననియు నియమముండెను. మహాభారత ములో ననేక స్థలములందు ఎవరికెవరు దారి యీయవలెనో అనఁగా దారి నుండి తొలఁగవలయునో యీ విషయమై మార్మికమైన యుల్లేఖమున్నది. ఈ ప్రకారముగా మహాభారత సమయమున వృద్ధుల నాచరించుట విషయ మున సమాజమునకు మిక్కిలి ధ్యానముండెను.

భారతీయార్యులు తమ మనోగత భావములను వ్యక్తము చేయుటలోఁ గొంచెమైనను ముందువెనుక లాడకుండిరి. మనస్సుననొకటియు మాటయందు మరియొకటియుఁ గలిగియుండుట యనునది వారి స్థితి కాకుండెను. మనో భావమును వ్యక్తము చేయు పద్ధతి యనేక ప్రకారములై యుండెను; మరియు తదనుసారముగా భారతీయులు తమ యభిప్రాయములను ప్రక టించుచుండిరి. క్రోధముయొక్క యావేశమందు దంతములు పటపటలాడిం చుట, పెదవి కొఱుకుట లేక చేతులు నలుపుట మొదలైనవాని వర్ణనము మహా భారతమందు నున్నది. ఇదే విధముగా ఆనందముచేత ఒకరు రెండవవారి యరచేతిమీఁద నరచేయి వాయించుట, సింహనాదము చేయుట లేక వస్త్ర మెగురవేయుట మొదలగు సంగతులు మహాభారతమందు వర్ణింపఁబడి యున్నవి.

తతః ప్రహసితాః సర్వే తేఽన్యోన్యాంశ్చ తలాన్దదుః।
సింహనాదరవం చక్రుః వాసాం స్యాదుధువుశ్చహ॥

(క.ప. అ. 23)

దుఃఖమునందేడ్చుట లేక క్రోధమునందొట్టు పెట్టుకొనుట మొదలైన వాని వర్ణనము మహాభారతములో నెడతెగకుండనున్నది. సారాంశమేమనఁగా ప్రస్తుత పరిస్థితియందు ఏ పనులు తక్కువ తరగతి వారివిగా నెంచబడు చున్నవో అవి స్వాభావికముగాఁ జిన్నపెద్దలందఱకునువర్జితములై యున్నవి. అనఁగా స్వతంత్రులును దృఢులునైన ప్రజల యభిప్రాయములును రాగ ద్వేషములును ఏ విధముగాఁ దీవ్రములై యున్నవో మరియు సయ్యవివారి యొక్క స్వభావము నిర్భయమునైన భావమును వ్యక్తము చేయుచున్నవో ఆ విధముగనే మహాభారత సమయమున భారతీయులుకూడఁ జేయుచుండిరి.

## ఉద్యోగ శీలము

మహాభారత సమయమున సమస్త జనసముదాయమునకును ఏ విధముగను, జగత్తును నిరాశాపూర్ణమైన దృష్టితోఁ జూచెడి స్వభావము లేకుండెను ప్రస్తుత కాలపు హిందుస్థానమువారియందు ఏ విధముగా నిరాశావాదిత్వము యొక్క తత్త్వము వ్యాపించియున్నదో అట్టిది ప్రాచీనలోకుల స్థితికాకుండెను. మహాభారతములో ననేక స్థానములయందు మనుష్యునియొక్క దైవము బల వత్తరమో లేక కర్తృత్వమో యను వాదమున్నది; మఱియు నీ దేహము యొక్క నిర్ణయము ఎల్లప్పుడును కర్తృత్వము లేక ఉద్యోగముయొక్క యే పక్షమందుఁ జేయఁబడినదై దొరకనున్నది. దైవము కుంటిది మనుష్యునికి తన యుద్యోగముమీఁద నెల్లపుడును నమ్మిక యుండవలయును. మహాభారతములో మొదటి పర్వముయొక్క మొదటి యధ్యాయమునకుఁ జివర మహాభారత సారస్వరూపమున మనుష్యునికి ధర్మమునందు మరియు దానితోపాటుగనే యుద్యోగమునందు ఎల్లపుడును దృష్టి యుండవలయుననియే యుపదేశము చేయఁబడియున్నది. 'ధర్మే మతిర్భవతువః సతతోత్థితానాం.' నేను ఎల్లపుడు ఉద్యోగము చేయుచునే ధర్మముపైని శ్రద్ధ యుంచుటకై చెప్పఁబడియున్నాను. ఈ విధముగనే ధ్యానముంచఁదగిన యొక వాక్యము మహత్త్వాకాంక్షయే సంపత్తికి మూలమని కూడ నున్నది. అనిర్వేదః శ్రియో మూలం లాభస్య చ శుభస్య చ. (ఉద్యో. అ. 39) అనుశాసనపర్వముయొక్క

యాఱవ యధ్యాయమందు భీష్మునితో నిదే సరళమైన ప్రశ్నము చేయబడి యున్నది. "ఉద్యోగము ప్రధానమా లేక దైవమా?" ఇందుపైని భీష్ముఁడు ఉద్యోగము పక్షమునఁ దీర్పు చెప్పుచుఁ గొన్ని మహత్త్వయుక్తములైనవిష యములను చెప్పియున్నాఁడు. "దేవతలు సైతము కర్మములచేత నుచ్చ స్థితికిఁ బోయియున్నారు. ఏ పురుషుఁడు ఎచ్చట నెట్లుండవలయునో, లేక యనుభవించుట యెట్లుండవలయునో, లేక యుద్యోగ మెట్లుచేయవలయునో యెఱుఁగఁడో, మఱియు ఏ సమయమందుఁ బరాక్రమము చూపవలయునో లేక తపశ్చర్యను జేయురీతి నెఱుఁగఁడో, వానికి సంపద యెన్నఁడును లభిం పదు. ఏ మనుష్యుఁడు ఉద్యోగము చేయకుండనే దైవముపై భారము వైచి కూర్చుండునో, వాఁడు నపుంసకుఁడు లేక స్త్రీ వలె దుఃఖి యగుచున్నాఁడు." 11వ యధ్యాయమందు నొక మిక్కిలి చక్కని సంవాదమున్నది. ఈ సంవా దము ద్రవ్యదేవత యగు లక్ష్మికిని రుక్మిణికినినడుమచేయింపఁబడి యున్నది. రుక్మిణి భాగ్యదేవత నడిగియున్నది. "నీవెక్కడ నివసించుచున్నావు?" దేవి యుత్తరమిచ్చెను.

వసామి నిత్యం సుభగే ప్రగల్భే దక్షే నరే కర్మణి వర్తమానే ।
అక్రోధనే దేవపరే కృతజ్ఞే జితేంద్రియే నిత్యము దీర్ణసత్త్వే ।
నా కర్మశీలే పురుషే వసామి న నాస్తికే సాంకరికే కృతఘ్నే ॥

నేను కర్తవ్య దక్షుఁడును, నిత్యము నుద్యోగియు,క్రోధములేనివాడును దేవతారాధన తత్పరుఁడును, ఉపకారమును మఱువనివాఁడును, ఇంద్రియ నిగ్రహము కలవాఁడు మఱియు నెల్లపుడు నేమియుఁ జేయనివాఁడు నగు పురుషుని యందు నివసించుచున్నాను. ఎవరు నిరుద్యోగియో, దేవతలపై నెవరికి శ్రద్ధలేదో, ఎవరు వర్ణ సంకరమును జేయుదురో మఱియుఁ గృత ఘ్నుఁడో నేను వారియందు నుండను.

ఈ వర్ణనముఁ బట్టి భారతీయ కాలమందునుద్యోగవంతుఁడైన మనుష్య ప్రశంస నికిఁ యగుచుండెనని ప్రకటమగుచున్నది. కాని మెల్లమెల్లగాలోకుల

యొక్క యీ స్వభావమునందు భేదము తటస్థించుచు వచ్చెను. మఱియు మహాభారత సమయమున భారతీయుల స్వభావము బొత్తిగా మారిపోయెను. సాధారణముగా లోకులు సోమరులును నిరుద్యోగులునై పోయిరి. దేశమంతటి యొక్క వాతావరణము వేఁడిదగుట చేతను భూమి సారవంతమగుటచేతను అన్నము చౌకయయ్యెను. ఈ కారణము చేత స్వభావము మాఱిపోయి యుండును.

ఇదిగాకుండ దేశమంతటను జనసంఖ్య మిగులఁ పెరిగియుండెను; ఇందుచేత సమాజములలో ననేకములు ఒక భాగమున మిక్కిలి దరిద్రములై పోయినవి. ఈ కారణముచేతఁగూడ నిటువంటి స్వభావము కాగలిగెను. మఱియు మనుష్యులు దైవముమీఁదవిశ్వాసముంచి నిరుద్యోగులై పోయిరి. మహాభారతమున సౌతి సమయమందు సౌతి కలిపిన యక్ష ప్రశ్నాఖ్యానముయొక్క యారంభమందు ఈ స్థితియొక్క ప్రియుల్లేఖమగవడుచున్నది. ఆనందము కలవాఁడు ఎవడు? ఇందుపైని యుధిష్ఠిరుని యుత్తరమిదియై యున్నది.

పంచమేహని షష్ఠేవా శాకం పచతిస్వేగృహే।
అన్నృణీ చాప్రవాసీ చ సవారిచర మోదతే॥

ఓ యక్షా! ఏ మనుష్యుఁడు అయిదారు రోజులకైనను వట్టి శాకమును స్వయముగాఁ దనయింట పండుకొనుచున్నాఁడో మఱియు ఎవనికిఁ ఋణము లేదో ఎవనికి అన్య దేశమునకుఁ బోనవసరములేదో ఆ మనుష్యుఁడు ఎల్ల పుడును ఆనందించుచున్నాడు." (వ. అ. 313) ఆలోచించిచూడఁగా ఇందు వర్ణితమైన తత్త్వము సత్యమై యున్నది. అయినప్పటికిని దారిద్ర్యమును నను భవించి కూడ నిరుద్యోగముగానే దినములను గడిపెడి మహాభారతమునాఁటి ప్రవృత్తి ఈ సంవాదము వలన పూర్తిగా స్పష్టమగుచున్నది.

కాని మహాభారతమునాఁటి తొలుతటి భారతీయార్యులు మిక్కిలియాశా వాదులు ఉత్సాహవంతులు, ఉద్యోగులునై యుండిరి. వారు సత్యముగా

స్పష్టముగను మాటాడుచుండిరి. ముఖప్రీతి మాటలు వారికి బొత్తిగా రుచింప కుండెను. వారియొక్క వృత్తి కేవలము స్వాధీనమైనదే కాకుండ, మఱియెవని కంటెను వారు తమ శుద్ధము, సరళమునైన తక్కువ ఖర్చుతో నుండు పద్ధతిలోఁ దీసికొనిపోవువారు కాకుండిరి. క్షత్రియులయందు లేక రాజులయందు మద్యద్యూతముల వ్యసనము దక్క నితరులయందు వ్యసనములేక దుర్గుణము తఱచు లేకుండెను. ఈ సంగతి నిర్వివాదముగా నగపడుచున్నది.

## చౌర్యము లేకుండుట

దొంగతనమనెడి ప్రవృత్తి భారతీయార్యులయందు మిక్కిలిఁ దక్కువగా నుండెను. మెగస్థనీసు ఆశ్చర్యముతో వ్రాసియున్నాడు- "చంద్రగుప్తుని యొక్క ప్రచండమైన సేనాశిబిరమందు సుమారు నాలుగు లక్షల మనుష్యులుండియుండురు; కాని ప్రతిదినము బొత్తిగాఁ దక్కువ చౌర్యములు జరిగినట్లు వార్త వచ్చుచుండెను. మరియు దొంగిలింపఁబడిన యాస్తి రెండువందల రూపాయలకంటె నెక్కువ వెలగలది కాకుండెను." దొంగతనము బొత్తిగా తక్కువ యుండెననియు నదికూడఁ జిన్నచిన్నదనియు నభిప్రాయము. సమస్త లోకులయందును నియములును శాసనములును మిక్కిలి తక్కువగనే యున్నవి. లోకులు వానిని సంపూర్ణముగా మన్నించుచున్నారు. గ్రీకులలో నేవిధముగా దస్తావేజునందు సాక్ష్యము మరియు మొహరు వేయఁబడుచున్నదో యిట్లుగా నీలోకులయందు లేకున్నది. న్యాయాసనమునకు నెదుటికిని లోకులు మిక్కిలి తక్కువ యభియోగములను దీసికొని పోవుచున్నారు. దీనికిఁగారణము హిందుస్థానపు ప్రజలు ఏ సమయమున తాకట్టుంచుచున్నారో లేక ఋణమిచ్చుచున్నారో ఆ సమయమునఁ గార్యభారమును నమ్మకము మీఁదనే యుంచుచున్నారు." సమకాలికులైన గ్రీసువారు హిందుస్థానమునకును వచ్చి కండ్లారఁజూచియే యీ సాక్ష్యమును వ్రాసిపైచియున్నారు. దానివలన మహాభారత కాలికులైన హిందుస్థానమువారి మర్యాద విషయమై

మఱియు వారి నీతివిషయుమై మన మనస్సునందు మిక్కిలి మంచిప్రభావము పడుచున్నది. హిందుస్థానమువారి వర్తమాన పరిస్థితిని జూచుచున్న మనము వారియొక్క యుల్లిఖితమైన స్వభావమునందు నధికమైన యంతరము తట స్థించియున్నదని విశ్వసింపవలయును. ఇచటనిపుడు ఈ యంతరమెపుడు ఎట్లు తటస్థించెననునది చారిత్రికము, కాని మహత్త్వపూర్ణమైప్రశ్నముఁ కలుగు చున్నది. అయినను ఇచట నీ ప్రశ్నముపైని విచారించుట మన కర్తవ్య సీమకు మీఱియున్నది.

కొన్ని దేశములవారియొక్క భిన్నభిన్న గుణ దోషముల విషయమున మహాభారత సమయమందుఁగూడ విశేష ప్రసిద్ధి యుండెనని యిచటఁ జెప్ప వలసియున్నది. మరియు నిట్టి భేదములు లోకుల స్వభావమునందు భిన్న భిన్న ప్రాంతములలోఁ బ్రస్తుతమునఁ గూడఁ జూడఁబడుచున్నవి. కర్ణపర్వ (అధ్యా.45) మందు కర్ణుఁడు శల్యుని నిందించియున్నాఁడు. ఆ భాషణములో శ్లోకము వచ్చియున్నది.

బ్రహ్మం పాంచాలాః కౌరవేయాశ్చ ధర్మ్యమ్ ।
సత్యం మత్స్యాః శౌరసేనాశ్చ యజ్ఞమ్ ॥
ప్రాచ్యా దాసా వృషలా దాక్షిణాత్యాః ।
స్తేనా బాహ్లీకాః సంకరా వై సురాష్ట్రాః ॥

"పాంచాలదేశపు వారు వేదాధ్యయనమునకై ప్రసిద్ధులై యున్నారు. కురుదేశమున వారు ధర్మాచరణము కొఱకుఁ బసిద్ధులైయున్నారు. మత్స్య దేశస్థులు సత్యమునకును శూరసేన దేశీయులు యజ్ఞమునకును బ్రసిద్ధులై యున్నారు. కాని ప్రాచ్యులు అనఁగా, మగధదేశ వాసులు దాసస్వభావము వారుగా నగుచున్నారు. మఱియు దాక్షిణాత్యులు అధార్మికులగుచున్నారు. పంజాబులోనిలేక బాహ్లీకదేశములోని లోకులు చోరులు, మఱియుసురాష్ట్రము వారి యందు వర్ణ సాంకర్య మెక్కువ యున్నది." ఈ వాక్యముఁబట్టి ఆ దేశీయుల గుణదోషముల యెడల, మహాభారతమునాఁటి పరిచయము లభించుచున్నది; పాంచాల దేశీయుల వేదాధ్యయనము వైదిక కాలము

నుండియుఁ బ్రసిద్ధమై యున్నది. మఱియు మహాభారతమునకుఁ బిమ్మటఁ గూడ అహిచ్ఛత్రము పాంచాల రాజధానిలోని బ్రాహ్మణులను భిన్నభిన్న దేశములకు కేవలము వేదమునే చెప్పుటకై, తీసికొని పోయినట్లు ప్రమాణము ఇతిహాసమందు దొరకుచున్నది. అధార్మికత్వ విషయమున దాక్షిణాత్యులు ప్రసిద్ధులై యుండుట యాశ్చర్యపు సంగతియై యున్నది. ఒకప్పుడు మాతుల కన్యా పరిణయము మరియు పలాండు భక్షణము ననెడి దోషములు వారి యందు ప్రాచీనకాలము నుండియుఁ బ్రసిద్ధమై యుండెను.

## శీలముయొక్క మహత్త్వము

ఆలోచింపఁగా నీ సంగతియున్నది అయినప్పటికిని మహాభారతమందు భారతీయులకుఁ బూర్ణముగా మన శీలముత్తమమైనదిగా నుండవలయు ననెడి విషయముమీఁదను ధ్యానముండుచుండెను. బ్రాహ్మణునియందు సచ్ఛీలము లేకున్నయెడల మరివాఁడు బ్రాహ్మణుడే కాడు; అనఁగా వానితో బ్రాహ్మణతుల్యముగా వ్యవహరింపక శూద్రతుల్యముగావ్యవహరింపవలయును అని యిప్పటి మతమై యుండెను. యక్షప్రశ్నములోని, క్రింద వ్రాయఁబడిన శ్లోకములు మహత్త్వము కలవై యున్నవి.

శృణు యక్ష కులం తాత నస్వాధ్యాయో న చ శ్రుతం।
కారణం హి ద్విజత్వే చ వృత్తమేవ న సంశయః॥
వృత్తం యత్నేన సంరక్ష్యం బ్రాహ్మణేన విశేషతః।
అక్షీణవృత్తో న క్షీణోవృత్తతస్తు హతోహతః॥
చతుర్వేదోపి దుర్వృత్తః నశ్శూద్రాదతిచ్యతే।
అగ్నిహోత్రపరోదాంతః సబ్రాహ్మణ ఇతిస్మృతః

(వనప. అ. 313)

ఈ వర్ణనముఁబట్టి మహాభారత సమయమున శుద్ధమైన వ్యవహార

మునకెంత మూల్యముండెనో కనఁబడును. బ్రాహ్మణత్వమునకై కులము, వేదాధ్యయనము లేక విద్వత్తయుఁ గారణము కానేవుర; వృత్తముఅనఁగా ఆచరణము లేక శీలమే కారణముగా విశ్వసింపఁబడుచుండెను. చతుర్వేదము లను బఠించిన బ్రాహ్మణుఁడు కూడ దుర్వృత్తుఁడగునేని యతఁడుశూద్రునికంటె గూడనెక్కువనింద్యుఁడై యున్నాడు. సంపత్తికినైశ్వర్యమునకును మూలము వృత్తము లేక శీలమేయైయున్నదనియే భారతీయార్యుల దృఢనిశ్చయమై యుండెను. శాంతిపర్వములోని 124వ యధ్యాయమందు యుధిష్ఠిరుఁడు లక్ష్మి యేవిధముగాఁ బ్రాప్తించునని యడిగియున్నాడు. ఆ సమయమున భీష్ముఁడు ప్రహ్లాదునియొక్కనింద్రునియొక్కసంవాదమునువర్ణించియున్నాడు ఆ సంవాదములో నీతత్త్వమే ప్రతిపాదితమై యున్నది. ఈ సుందరమైన యాఖ్యానమందు అసురులను బరాభవించుటకై యింద్రుఁడు బ్రాహ్మణరూప మునఁ బ్రహ్లాదునియొద్దకు వెళ్ళి యతని శీలమును గోరెను. ప్రహ్లాదుఁడెప్పుడు ఇంద్రునికి శీలమునిచ్చెనో, అపుడు అతని దేహమునుండి శీలము వెలుపలికి వెడలెను. మఱియు దానితోపాటుగనే శ్రీలేక లక్ష్మియు వెడలిపోయెను. ప్రహ్లాదుఁడాశ్చర్యముతో నీవెవరవు, మరియెచటికిఁబోవుచున్నావు అని యడి గెను. అపుడు లక్ష్మి "నేను లక్ష్మిని; ఎచట శీలమున్నదో యచటనే నేనుగూడ నివసించుచున్నాను. మరియు నచటనే ధర్మము, సత్యము అట్లు బలమునుసహి తము వాసము చేయుచున్నవి. ఎపుడునీవు నీ శీలము నింద్రునికిచ్చివైతివో అపుడు ఇవన్నియు నాతోపాటు, నిన్ను విడిచిపెట్టి, ఇంద్రునివైపు పోవు చున్నవి." అని యుత్తరమిచ్చెను. మంచి యాచరణమునకును మరియు దానితోపాటు నిశ్చయపూర్వకముగాఁ బ్రాప్తించునట్టి ధర్మము, సత్యము బలము మున్నగు నైశ్వర్యములకును బ్రశంస యింతకంటె నధిక సుందర మగు రీతిని అగుట సంభవము కాదు.

## రణమందు లేక వనమందు దేహత్యాగము

భారతీయార్యుల సమస్త ప్రయత్నము ఏ విధముగా నెల్ల యాయు ర్దాయమునను ఉదాహరణముతో నుండుటకు నగుచుండెనో, ఆ విధముగా

వారికి, మనకు నుదాత్తమగు పద్ధతివలన మృత్యువుకూడఁ బ్రాప్తించుగాక యని కూడ మహత్త్వాకాంక్ష యుండెను. ఇంటిలో రోగియై యుండి యేదో యొక రోగముచేతఁ బ్రక్కమీఁదఁ జనిపోవుటను బ్రహ్మ క్షత్రియులు మిక్కిలి యభాగ్యముగ విశ్వసించుచుండిరి.

అధర్మః సుమహానేష యద్భృచ్ఛయామరణం గృహే।
అరణ్యేవా విముచ్యేత సంగ్రామే వా తనుంనరః॥

క్షత్రియునికై మరణించుటకును చివరిస్థానము అరణ్యము లేకసంగ్రామమై యున్నది. గదాయుద్ధ సమయమందు ఈ యుత్తరమునే దుర్యోధనుఁడు పాండవులకు, వారు అతనిని శరణుజొచ్చుమని చెప్పినపుడు ఇచ్చి యుండెను. యుద్ధములో మరణించుట క్షత్రియులకొక యధికానందముగ మరియు పుణ్యఫలముగను నచ్చుచుండెను. భగవద్గీతమందుసుఖినః క్షత్రియాః పార్థలభంతే యుద్ధమీదృశం, అని చెప్పఁబడియున్నది. యుద్ధములో మరణించుట యేనారికి సంభవింపదో. వారువృద్ధత్వమందునింటిలో ముక్కుచు మూల్గుచుఁ గూర్చుండకుండిరి. వారు తపస్సు చేయుటకై యరణ్యమునకుఁ బోవుచుండిరి. మరియు తపోమార్గమున నచటనే శరీరమును ద్యజించుచుండిరి. ఈ విధముగా నరణ్యమునకుఁబోయి ధృతరాష్ట్రుఁడు దేహమును ద్యజించెను. మరియు అంతమునఁ బాండవులు సైతము ఈ యభిప్రాయముతో మహాప్రస్థానమును గావించిరి. క్షత్రియులవలెనే ఇంటిలోఁ జనిపోవుటను బ్రాహ్మణులుగూడ నభాగ్యముగా నెంచుచుండిరి; మరియు నెవరు ధనవంతు లగుచునుండిరో వారు మహాప్రస్థానముఁగూడ లేక చితియందు శరీరమును దగ్ధము చేసికొని లేక పవిత్రమైన నదియందు జలసమాధిని గైకొని ప్రాణత్యాగను చేయుచుండిరి. మరియు లోకులు వనమునకుఁబోయి సంన్యాసు లగుచుండిరి మరియు సంన్యాస వృత్తితో మరణములను బ్రతీక్షించుచుండిరి ఈ సంగతులు మనకు నసంభవములని తోఁచవచ్చును కాని గ్రీకులు చరిత్రకారులు ఇట్టి ప్రత్యక్ష వర్ణనములను వ్రాసియుంచినారు. ఇరువురు బ్రాహ్మణులు రోగులై యున్నపుడు చితిను రగిలించుకొని దానఁబెట్టి యందు నానందముతోఁ గూర్చుండిరిఁ సికింద

రునితో పాటు వెళ్ళిన కలనస్ నామకుఁడైన యోగి యొక్కమరణవర్ణనమును స్ట్రేబో యనెడు గ్రంథకారుఁడు చేసియున్నాడు. పసరగాదె యనెడు పట్టణమందు అతఁడు రోగియై యున్నపుడు అతని జీవితములో సన్యాసి మొట్టమొదటి రోగముగా నుండెను. తన యాయువు యొక్క 73వ యేట నతఁడు రాజుయొక్క ప్రార్థన నంగీకరించక, దేహాంతమును జేసికొనెను. ఒక చితి తయారు చేసి దానిపైని బంగారపు మంచమును వైచెను. మఱియు నంద మీఁద సుఖముగాఁ బరుండి, ఉత్తరీయమును గప్పుకొని యతఁడు కాటియందు నిప్పంటించుకొనెను. అతఁడు ఒక చిన్నగదిని కట్టించుకొని అందు ఆకులు అలములు నుంచి పిదప అందు నిప్పంటించుకొనెను. అని కూడఁ కొందఱు చెప్పుచున్నారు. అతఁడు అత్యుత్సాహముగ, పెద్ద హడావిడితో, ఆ చోటికి వచ్చి చితియందు దుమికెను. పిదప నతఁడు కొయ్యవలె మండ నారంభించెను," హిరోడోటస్సు ఇట్లు వర్ణించియున్నాఁడు. "హిందూదేశపు యోగులు ఏ విధమైన హింసను జేయరు మఱియు ఏ విధమైన బీజములను నాటరు. వారు వట్టి వనస్పతుల పూయకుండఁగాచెడిచెట్ల యాధారమునఁ దమ జీవితమును గడపుకొనుచున్నారు, మఱియు నింటిలో నుండరు, వనమందు నివసించుచున్నారు. వారిలో నెవరినైనను ఒక రోగముచేత గ్రస్తుఁడైనపుడు వాఁడరణ్యమునకు నేకాంతముగా బోయి మొదలకుండఁ బడియుండును. మరి వాఁడు మరణించెనో లేక బ్రతికియున్నాడో యెవరును సమాచారము తెలిసికొనరు." మహాభారతములో నీ ప్రకారముగా, అనేకమైన దేహత్యాగ పద్ధతుల యొక్క వర్ణనమున్నది. ఇంతియేకాదు, వానియొక్క విధి ధర్మశాస్త్రమందుఁ గూడ నున్నది. మహాప్రస్థానవిధి ధర్మగ్రంథములయందును వైదిక సాహిత్యమందును వర్ణితమై యున్నది. ఈ విధముగాఁ జితారోహణము చేయు విధియు నదియందు జలసమాధిని గైకొను విధియు వర్ణితములై యున్నవి హిరోడోటస్సు చేసిన మరణ ప్రకార వర్ణనము ప్రాయోపవేశన పద్ధతియై యున్నది. శ్వాసము నరికట్టి ప్రాణములను విడిచివైచుట ప్రాయోపవేశనమై యున్నది. ఈ విధి చేతఁ బ్రాణత్యాగము ఆ సమయమున ఆత్మహత్యగా నూహింపఁబడుచుండెను.

## శవసంస్కారము

మహాభారతమందు యుద్ధములోఁ బ్రతిదినముఁ యుద్ధమందు మరణించిన వీరుల శరీరముల యొక్క వ్యవస్థ ఏర్పాటు ఆ దినముననే జరిగిన వర్ణనము ఒకేదినముఁ గూడఁ జేయఁబడినట్లు కనఁబడదు. యూరపులో మహాభయంకరమైనయుద్ధమందుఁగూడ ఈ విషయమై చేయగలిగినంత ప్రయత్నము చేయఁబడి యున్నది. కాని భారతీయ యుద్ధమందుఁ ఇట్టి ప్రయత్నము చేయఁబడినట్లు కనఁబడదు. ఇంక పైగా, శవములనుదీనుటకై నక్కలకు అరణ్యమందలి ఘాతుక జంతువులకును పూర్తిపూర్తిగా అదను ఈయఁబడుచున్నట్లు కనఁబడుచున్నది. దుర్యోధనుఁడు, కర్ణుఁడు, ద్రోణుఁడు మొదలైన మహారాజులును మహాయుద్ధాలలోను మరణించిన పిమ్మట వారి శవములను శీఘ్రముగాఁ బాతిపెట్టెదరు లేక కాల్చివేసెడిప్రయత్నము బొత్తిగా జేయఁబడలేదు. ఇందు కొఱకుఁ పూర్తిపూర్తియైన యవసరముండెను. మఱియు రెండు వైపుల నుండి ఈ పనికై యనుమతి లభించుటలో హాని యేమియు లేకుండెను. మఱియు ఇట్టి వ్యవస్థ యేదియుఁ జేయఁబడకుండుట యాశ్చర్య విషయమై యున్నది. యుద్ధము ముగిసిపోయిన పిదపగాంధారి చేసిన రణభూమి వర్ణనమందు పెద్దపెద్ద రాజుల శవములను ఎముకలను గద్దలును నక్కలును ఈడ్చుకొనిపోవుచున్నట్లు చెప్పియున్నది. చిత్రముగా నగపడుచున్న యీ స్థితికి సముచితమైన కారణము శాంతిపర్వముయొక్క 28వ యధ్యాయములోని యొక మహత్తరమగు శ్లోకమందుఁ గనఁబడును.

> అశోచ్యోహి హతః శూరః స్వర్గలోకే మహీయతే ।
> నహ్యన్నం నోదకం తస్య న స్నానం నాప్యశౌచకమ్ ॥

రణములో మరణించిన శూరులకై విలపింపఁ గూడదు, మఱియు వారి కన్నముగాని నీరుగాని యీయఁగూడదు. వానికై స్నానముచేయగూడదు,

సూతకమును పట్టగూడదు." ఈవిచిత్ర శ్లోకము బట్టి ఇతర విధమైన మృత్యువు కంటె యుద్ధమువలని మృత్యువు పుణ్యకారకముగా విశ్వసింపఁబడుచుండెనన్న సంగతి యొక్క కల్పన కాఁగలదు. మఱియు మృతక సంబంధమైన సమస్త విధియు నెందులకు విడిచిపెట్టబడుచుండెనో యీ సంగతికిఁ గూడ గారణ మగ పడఁగలదు. పదునెనిమిదవ నాఁటి యుద్ధము ముగిసిపోయిన తరువాత యుధిష్ఠిరుఁడు ఇతర లోకులును గంగకు వెళ్లి యిచ్చిన తిలాంజలికినాశ్చర్య మగుచున్నది. రణాంగణమందును మరణించిన ప్రసిద్ధప్రసిద్ధులైన యోధుల యొక్క శవములు వెదకి కాల్చఁబడెను, ఇట్లు తరువాతి వర్ణనము న్నది; ఇది కూడ నాశ్చర్య విషయమై యున్నది. ద్రోణుఁడు, కర్ణుఁడు మొదలైన వారి శవములు అనేక దినముల తరువాతఁ గూడఁ బూర్తిగా దొరకి యుం డును. మంచిది; మహాభారత సమయమందుఁ గూడ యుద్ధములో మర ణించిన వీరుల యొక్క శవము హింస్రములైన పశుపక్షుల గుండ శవము లను భక్షింపఁజేయుటయై యుండెను. ఎందుచేత? గ్రీకు లు పంజాబులోని తక్షశిలా నగరముయొక్క చుట్టుప్రక్కల పద్ధతి శవములను గ్రద్దలు తినెడుచోట నరణ్యములో నుంచుచుండిరని వర్ణించియున్నాడు. దీనిఁబట్టి పై వీరుల యొక్క శవముల యేర్పాటు చక్కఁగా నగపడుచున్నది. మఱియు పంజా బులోని కొందఱియందు ఈదానుల యాచరణము నేఁడుకూడ జరుగుచుండెను సింధునది కవతలి యార్యులును ఇవతలి యార్యులునుపూర్వ మెప్పుడునసమా నముగనే యుండిరి. పంజాబులోని యార్యులయందు సంస్కారణము కాలేదు మరియు గంగా యమునా సరస్వతీ తీరస్థులైన యార్యులయొక్క సభ్యత మిక్కలి చాల ముందు చూడఁబడియున్నది. వీరి యందు శవములను తగులబెట్టెడి పద్ధతి పూర్ణముగాఁ బ్రచలితమై యుండెను. దీనిఁబట్టి ఇంతను కొంచెము వెనుకబడియున్న రీతులఁబట్టి భారతీయార్యులు పంజాబు వారిని నిందించి వారిని ధర్మబాహ్యులఁగా నెంచుచుండిరి. కొందఱు విశేష వ్యక్తు లు జలసమాధిని గైకొనుచుండిరి, ఇది మరియొకచోట వ్రాయఁబడును,

గ్రీకులు హిందుస్థానములోని మృతుల విషయమున నింతను గొన్ని రీతుల యుల్లేఖమును జేసియున్నారు. "హిందుస్థానమువారు మృతులనుదీ

శించి యేవిధమైన స్మారక చిహ్నమును నేర్పఱుపరు. వారి మతమున మృత వ్యక్తులయొక్క సద్గుణముల చెప్పుటయే వారికి గొప్ప స్మారకమై యున్నది. మరియు మృతవ్యక్తులయొక్క స్మృతి యట్టి సద్గుణములచేతనే స్థిరమగు చున్నది." ప్రాచీనకాలమునందలి స్మారక భవనములు హిందూస్థానమందుఁగనఁ బడకుండుటకిదే కారణమై యుండును. మిసరు దేశమందుఁ బెద్దపెద్ద పరాక్రమ శాలురైన రాజులయొక్క మరి వారు సద్గుణులైనను సరియే దుర్గుణులైనను సరే స్మరణార్థమై కట్టఁబడినవి (పిరమిడ్లు) నేఁటివరకుఁ బ్రత్యక్షమై యున్నవి కాని హిందూస్థానమునందు ఈ కల్పనయే లేకుండెను; ఇందువలన నిట్టి మందిర ములు కట్టఁబడలేదు. మెగాస్తనీసు వర్ణించియున్నాడు. —"మృతవ్యక్తుల యంత్య సంస్కార ప్రసంగమున వారి బంధువులు మిక్కిలి యెక్కువగా నేడ్చు చున్నారు. తలలను బాదుకొనుచున్నారు. మరియు వెంట్రుకలను బీకుకొను చున్నారు." ఈ రీతియొక్క యవశిష్టాంశము కొన్ని జాతులయందు విశే షించి గుజరాతీలయందుఁ గనఁబడుచున్నది. మహాభారత సమయమునందుఁగూడ నీవిధమైన పద్ధతి యుండియుండునని తెలియుచున్నది. "అశోచ్యోహి హతః శూరః" శోకమునుఁబట్టి శూరులుగాక యితర మృతుల విషయమై శోకించెడు పద్ధతి మహాభారత సమయమందును నుండియుండునని తెలియుచున్నది.

## వాహనములు

ముఖ్యముఖ్యమైన రీతుల విషయమై యింతవఱకు నుల్లేఖము జరిగెను ఇపుడు మరికొన్ని విషయముల మీఁదఁగూడ ధ్యానమీయవలసి యున్నది. ధనవంతులకు నన్నిటికంటె నెక్కు ప్రియమైన వాహనములు ఏనుఁగులై యుండెను. కావున, రాజులు విశేషముగా ఆఁడేనుఁగులమీద స్వారిచేయు చుండిరని వర్ణించియున్నాడు. గ్రీకు చరిత్రకారుఁడైన అరాయను వ్రాయు చున్నాఁడు— "సాధారణ జన సమాజమందు ఒంటెలు, గుఱ్ఱములు, గాడిదలు స్వారికి నుపయోగపడుచున్నవి. కాని ధనవంతులు ఏనుగులనుంచు(కొను)

చున్నారు; ఎందుచేతః ఏనుఁగులు రాజుల వాహనములై యున్నవి గనుక. ఏనుఁగు తరువాత పెద్దవారియందు, నాలుగు గుఱ్ఱములతోఁ గూడిన బండికి గౌరవమున్నదిః ఒంటెయొక్క దర్జా మూఁడవ తరగతిదియై యున్నది. మరియు ఒక గుఱ్ఱమును మాత్రము కట్టి బండియందు (గూర్చుండుటయైతేని యొక లెక్కయేలేదు.) (గూర్చుండుట యీవాహదములోనిదే కాదు) లెక్క లోనిదే కాదు. ఈ చివరి వాక్యముఁబట్టి సంయుక్త ప్రాంతములోనివియు పంజాబువైపువియునైన నేఁటి ఒకే విధమగు గుఱపుబండ్లు మిక్కిలి ప్రాచీన ములై యుండునని తెలియుచున్నది. అర్జునుఁడు, భీష్ముఁడు మొదలైన వారును మఱియితర యోధులును గూర్చుండెడి నాలుగు గుఱ్ఱముల బండ్లు ప్రస్తుతమున దృగ్గోచములగుటలేదు. ఈ నాలుగు గుఱ్ఱములునేవిధముగాఁ బరువెత్తుచుండెడివో నాలుగు నొక వరుసయందే లేక ఏవి ముందర రెండు వెనుకను బోవుచుండెడివో యీ సంగతియొక్క కల్పన చేయుబడలేదు. ప్రాచీన కాలమందు బండి లాగెడిపని గాడిదలచేతఁ జేయింపఁబడుచుండెను. మఱియు వానిమీఁద స్వారికూడ నగుచుండెను. అవును, ప్రస్తుత దినములలో వాని యుపయోగము నిషిద్ధముగా నెంచబడుచున్నది. అదిపర్వమందు పురోచనుని వారాణావతమునకుఁ బోవుటకై గాడిదల వండిపై గూర్చుండి వెళ్లుమని చెప్ప బడియున్నది.

సత్వం రా సభయు క్తేన స్యందనేనాశుగామినా।
వారణావత మద్యైవ యథాయాసి తథాకురు॥

(ఆదిప. 248)

ఇచ్చట టీకాకారుఁడు రాసభములు అనఁగా కంచరగాడిదలు అయి వుండునని చెప్పియున్నాఁడు. కాని యిది వాని బొరపాటై యున్నది. కంచర గాడిరలకు అశ్వతరియను స్వతంత్ర శబ్దమున్నది. మఱియు ఈ అర్థములో అది మహాభారతమందుఁగూడఁ బ్రయుక్తమై యున్నది. నమ్పృత్యముప

గృహ్ణాతి గర్భమశ్వతరీ యథా॥ (శాం. అ. 141-7) ప్రాచీనకాలమందుపంజాబు నందును మంచి గాడిదలుండెను. టీకాకారునికీసంగతి తెలియకుండెను. మఱియు మహాభారతమందును రామాయణమందును యుధిష్ఠిరునికి భరతునికి ఉత్తరపుపైపు రాజులచేత గాడిదలు కానుకలుగా నీయఁబడివని వర్ణనమున్నది. భారతీయ యుద్ధ సమయమున నొకప్పుడు గాడిదను ముట్టుకొనఁగూడదను నియమముండియుండును; మఱియు పంజాబులో మాత్ర మీ నియమమిపుడు కూడ లేకున్నది. దక్షిణపుపైపు వంశమున గాడిదలు మంచివి కావు. ఇందుచేత నీ నియమము ప్రబలిపోయెను, ఎందుచేత? ఒకచోట మహాభారతమందు గాడిదలను అస్పృశ్యములనుగాఁ జెప్పియున్నాఁడుకనుకమహాభారత సమయమున సామానుబండ్లు లాగుటయందు ఎద్దులయొక్క యుపయోగమగుచుండెననుటలో సందేహము లేదు. అశ్వత్థామయొక్క రథమును వెంబడించి బాణములతో నిండియున్న, ఎనిమిదెనిమిదెద్దులబండ్లు పోవుచుండెనని వర్ణనమున్నది. చారణులును ధాన్యపు వర్తకులును ఎద్దులను బరువు మోయు పనికి నుపయోగపఱచుచుండిరని మఱియొకచోఁ జెప్పఁబడియే యున్నది. "గౌర్వోఢారం ధావితారం తురంగీ"- ఈ ప్రసిద్ధమైన శ్లోకము ఈ విషయమునకు ద్యోతకమై యున్నది బరువు వేయుటకెద్దులుపయోగపడుచుండెను మఱియు ఆవులు పాలిచ్చుచుండెను ఈ కారణముచేత రాజులు గోబృందమును బాలించుచుండిరి వనపర్వములో దుర్యోధనుఁడు తన గోసముదాయమును జూచుటకై వెళ్ళియుండెను. దానియొక్క వర్ణనము మిక్కిలి మనోహరముగా నున్నది, "అతఁడు ఆవులకు నెద్దులకును గుర్తులు వేయించెను మరియుఁ బెద్దపెద్ద అప్పెయ్యలకును చిన్న యావుదూడలకును గూడ గుర్తులు వేయించెను మూఁడేండ్ల వయసుగల కోడుదూడలను వేఱుచేయించెను" ఎక్కువ బరువువేయు పనియందు ఈ యెద్దులు తఱచుగా నుపయోగపఱుపఁబడుచుండెను ఇచట గొల్లవారు పాడియునాడియుఁదమ కూతుండ్రను అలంకరించి వేషవం వేయించియు దుర్యోధనుని యెదుట నాటలాడించిరి

ఈ వర్ణనముఁబట్టి యప్పటి శూద్రుల చిత్రములు, ప్రస్తుత కాలమునవలె, కండ్లయెదుట నిలబడుచున్నవి పిమ్మట ఈ గోపాలురు దుర్యోధనుని వేటాడించిరి.

## వేట

వేటాఁడు పద్ధతి ప్రస్తుత దినములలో హిందుస్థానమందుఁ బ్రచలితమైనట్లే వర్ణితమై యున్నది. నలుపక్కలనుండి తోలుకొనివచ్చి జంతువులను బహిరంగము వైపునకు వచ్చుటకై యుగతికములఁగాఁ దెచ్చెడి పద్ధతి యాసమయమందుఁగూడ నిప్పటివలెనే యుండెను కాని మెగస్థనీజు రాజులయొక్క వేటగొంత భిన్నముగా వర్ణించియున్నాఁడు అది యిచ్చట నుద్ధరించుటకుఁదగియున్నది "వందలకొలఁది స్త్రీలు రాజునకుఁ జుట్టుప్రక్కల నిలబడియున్నారు మరియు ఈ చక్రమునకు బయటను జేతులతో బల్లెములు పట్టుకొని సైనికులు నియుక్తులగుచున్నారు. దారిలో రెండువైపులను త్రాడుకట్టి రాజునకు మార్గము వేఱుచేయఁబడుచున్నది పిదప నీ త్రాడుల నడుమను నెవరైనను స్త్రీ పురుషులు వత్తురేని వారికిఁ బ్రాణదండము విధింపఁబడుచున్నది రాజునెదుట నగర సంకీర్తనమందు నగరాలును గంటలును వాయించుచున్న సైనికులు నడచుచున్నారు. ఈ విధముగా నాడంబరముగాఁ రాజులు వేటకై బయలుదేరుచున్నారు నాలుగువైపులను నావరించి యున్న ప్రదేశమందు వారు వేటాడుచున్నారు మరియు నెత్తుగా నిర్మింపఁబడియున్న యొక మండపము (బహుశా పరంజా) మీఁదనుండి బాణములను విడుచుచున్నారు వారితోఁగూడ నాయుధధారిణులైన యిద్దఱు ముగ్గురు స్త్రీలు ప్రహరుదిరువారై యున్నారు. బహిరంగమైన మైదానమునకు వేటకై రాజు వెళ్ళినట్లైతేని యేనుఁగుమీఁద స్వారి వెడలి వేటాడుచున్నాఁడు." సమస్త క్షత్రియులకును వేటయందు మేరలేని యుల్లాసముం

డెను; మఱియు భోగవిలాసములో మునింగియున్న రాజులు సహితము, మిక్కిలి బందోబస్తుతో, ఆవరింపఁబడియున్న ప్రదేశమందు వేఁడుచుండిరి.

## పాట.

మహాభారత సమయమున హిందుస్థాన నివాసులు గానమందుఁ బ్రేమ గలవారై యుండిరనుటలో సందేహమేమియునులేదు. మఱియు, గానము యొక్క ముఖ్యవాద్యము వీణయై యుండెను. మహాభారత ప్రణేతకు గానమందు మంచి జ్ఞానముండెను. క్రింది శ్లోకముఁ బట్టి యీ సంగతి సిద్ధమగుచున్నది.

వీణేవ మధురాలాపా గాంధారం సాధు మూర్ఛతీ।
అభ్యభాషత పాంచాలీ భీమసేన మనిందితా ॥ (విరా. అ 17)

వీణవలె మధురముగా గానము నాలపించుచున్న ద్రౌపది, గాంధార స్వరమూర్ఛనను జేయుచుఁ మాటాడఁ దొడఁగెను. ఇందులో, వీణ యొక్క షడ్జ స్వరమందు లగ్నమైయున్న తీగనుండి గాంధార స్వరము, వెనుకనుండి మూర్ఛ నాదారమున బయలుదేఱుచున్నదను సంగతి చూపఁబడియున్నది. క్షత్రియ బాలికలకు, గానము నృత్యము రెండు కళలును నేర్పఁబడుచుండెను ఈ సంగతి మరియొక చోటున వ్రాయఁబడియున్నది. ఇప్పుడిట్టి పద్ధతి ప్రచలితము కాకున్నది.

## ఘోషా.

మహాభారత సమయమున భారతీయుల యందు ఘోషా పద్ధతి యుండెనా లేదా ? ఈ ప్రశ్నముపైఁ మరియొక స్థానమందు విచారము చేయఁబడియున్నది. భారతీయ యుద్ధ సమయమున క్షత్రియుల లేక బ్రాహ్మణుల యొక్క స్త్రీల నడుమను ఘోషా పద్ధతి లేక యుండును. కాని మహాభారత

సమయమున నిట్టి స్థితి తప్పక యుండెను. మహాభారతమందు లేక రామాయణమందు ఏ యవసరమునను ద్రౌపది లేక సీత ఘోషాలో నున్నట్లు వర్ణనములేదు. ఘోషా యున్న యెడల ద్రౌపదిమీఁద జయద్రథునియొక్కయు సీతమీఁద రావణుని యొక్కయు దృష్టియే పడకయుండును. అయినను, మహాభారత కాలికమైన వర్ణనమందు ఈ శ్లోకమున్నది.

అదృష్ట పూర్వా యానార్యాః పురాదేవగణై రపి।
పృథక్ జనేన దృశ్యం తే తాస్తదా నిహతేశ్వరాః (స్త్రీ పర్వ. అ. 10)

ఈ శ్లోకమును బట్టి విధవలైన స్త్రీలు వెలుపలికి వెడలఁ గలుగుచుండిరని తెలియుచున్నది. మరియు స్త్రీలకు అనఁగా సౌభాగ్యవతులైన స్త్రీలకు నుత్తరీయ ధారణము చేయవలసివచ్చుచుండెను. అందు వారు తమ ముఖమును దాచుకొనుచుండిరి. కాని కాళిదాసుని సమయమున నింతకంటెఁ గూడ విశేషించి ఘోషా రివాజు కలదు. అతఁడు తన శకుంతలకు ఉత్తరీయము గాకుండ మూఁడవదియైన యొక మేలిముసుగు వస్త్రమును అనఁగా ముసల్మాను స్త్రీలవలె నొక పొడవు వెడల్పును గల యుత్తరీయమును గప్పియున్నాడు. కాని మహాభారతము నాఁటి వర్ణన మా విధముగాఁ జేయబడలేదు. మహాభారతమునాఁటి శకుంతల, బ్రాహ్మణ స్త్రీ వలె మేలిముసుగు లేనిదై యుండెను, దాని ముఖముమీఁద ఆ సమయమున నుత్తరీయము కూడలేకుండెను. ఈ వర్ణనమును జూడలేదా—

సంరంభామర్ష తామ్రాక్షీ స్ఫురమాణౌష్ఠ సంపుటా।
కటాక్షై ర్నిర్దహంతీవ తిర్యగ్రాజానమై క్షత ॥ (ఆది. అ 74)

సంతాపము వల్లఁ బెదవినదల్చుచు నామె రాజు వైపుకునులెఱ్ఱ చేసి, క్రేగన్నులతో దహించుచున్నదివలె జూచెను." దాని ముఖము మీద ముసుఁగున్న యెడల నీ వర్ణనము కొంచెమైనను నుపయోగింపక యుండును. క్షత్రియ కాంతలకుఁ దక్క బ్రహ్మ, వైశ్య శూద్ర కాంతలకు ఘోషా లేకయుండును. ఎందుచేత? సాధారణముగాఁ యొక్క పని యుత్తరీయమునితనేర్పై పోవుచుండెను.

ఇంకొక మహత్త్వము గల యంతరము ఇటీవలి సమయమందు కాళిదాసు సమయమునను మహాభారత సమయమునను మహాభారతము నాఁటి కాంతలు తన పతిని, పేరుపెట్టి, పిలుచుచుండిరి; మరియు కాళిదాసు నాఁడు పతిని ఆర్యపుత్రుఁడని అనఁగా "మామగారి కొడుకు" అని పిలిచెడి యాచార ముండెనని యగపడుచున్నది. ప్రస్తుత దినములలో ఆ శబ్దము కూడ వ్యవహరింపఁబడుటలేదు. మరియొకటి యేల, ప్రస్తుతమున నందఱియందును పతిపత్నులు పరస్పరము ఏ నామముతోడను మరియొక విశేషణముతోడను గూడ సంబోధించుటలేదు. కాని మహాభారతములో ద్రౌపది, సీత, దమయంతి, సావిత్రి మొదలైన పెద్దపెద్ద పతివ్రతలైన కాంతలు కూడఁ బతియొక్క పేరునుమరియు నది కూడ నేక వచనాంతము పెట్టి పిలిచియుండిరి. దృశ్యసే దృశ్యసేరాజన్ ఏష దృష్టోసి నైషధ. (వనపర్వ. అ. 63) వరం వృణేజీవతు సత్యవానయం యథామృతాహ్యేవ అహం పతిం వినా, (వనప. 290) "ఉత్తిష్ఠోత్తిష్ఠ కింశేషే భీమసేన మృతో యథా." (విరాటప. 17) ఇత్యాద్యనేకోదాహరణముల నీయఁగలము. కాని మహాభారతము నాఁడు కూడ ప్రస్తుతపు రీతి యొక్క సూచన కొంతయై యుండెను, ఈ యనుమానమునకై యవకాశమున్నది. ఎందుచేత క్రింది శోకములో నున్న వర్ణనము అప్రశస్త వ్యవహారపుదిగా నూహించి చేయబడినది.

శ్వశ్రూ శ్వశురయో రగ్రే వధూః ప్రేష్యానశాసత ।
అన్వశాసచ్చ భర్తారం సమాహూయాభిజల్పతి ॥ (శాం. 228)

"అత్తమామలయొక్క ఎదుట కోడలు సేవకుల మీఁదనధికారము చేయుచున్నది. మరియు భర్తను బిలిచి యతనితో భాషించుచున్నది." ఈ వర్ణింపఁబడిన యుద్దండత యొక్క యాచరణము మహాభారత సమయమందుఁ గూడ నింద్యముగా నెంచఁబడఁదొడఁగి యుండెను. పూర్వకాలమందు పురుషులయొక్క కాంతలయొక్క అనఁగాపతిపత్నుల సంబంధము, వివాహము నాఁటి కిద్దఱును ప్రౌఢులై యుండి కారణముచే, విశేషమిత్రత కలవారుగను ఆదరయుక్తమైన స్వాతంత్ర్యము కలవారుగను నుండియుందురు. కాని పిమ్మట మెల్ల

మెల్లగాఁ అస్వతంత్రత మిక్కిలి యుత్పన్నమయ్యెను. మఱియు పతి యొక్క లేక పత్ని యొక్క నామమును నుచ్చరించుట నాగరకత నతిక్రమించుటగా నెంచఁబడెను. అయినను ఇటీవలి యాచారమందుఁ గూడఁ గొంత యాదరము కలిగెను.

## తోటలు, చిన్నతోటలు

భారతీయార్యులకు మహాభారత కాలమునఁ దోటలను చిన్నతోటలను వేయుటకై విశేషమైన కోరిక యుండెను. హిందుస్థానమందలి యుత్కృష్టమైన వాతావరణమందును వృక్షహీనమైన మైదానమందును దోటలనువేయుట నిజముగాఁ బుణ్యకార్యమై యుండినది, మఱియు నీ తోటలలోనికి విహారమునకై పల్లెటూరి కాంతాపురుషులు కూడ నేగుచుండిరి. భారతీయ కాలమునఁ గొన్ని దేశములలోని తోటలు ప్రసిద్ధములై యుండెను. అంగదేశములోని చంపారణ్యము యొక్కయు ఉజ్జయిని యందలి ప్రియకారణ్యము యొక్కయు నుల్లేఖము అన్యస్థానమునందుఁ జేయఁబడియుండినది, మృచ్ఛకటిక నాటకమందే తోటలలో కాంతాపురుషులు దిరుగుటకై యేగుచుండిరను సంగతి కొంత వ్రాయఁబడియుండినది. ఇంతేకాక రామాయణములోని యయోధ్యాకాండమునందుఁ గూడ ఈ వర్ణన ముండినది 'నారాజకే జనపదే వుద్యానాని సమాగతాః సాయాహ్నే క్రీడితుం యాంతి కుమార్యో హేమభూషితాః ॥' సువర్ణాలంకారములచేత భూషింపఁబడిన బాలికలు సంధ్యాసమయమున వారు కలిసి యాడుకొనుటకై రాజులేని చోటునందు వెళ్ళకుండినారు. ఈ వర్ణనముఁ బట్టి పూర్వకాలమందు కాంతలు తోటలలోఁ దిరుగుటకై, ఇప్పటి విధముగనే వెళ్ళుచుండిరనిస్పష్టమగుచుండినది. ప్రతిపట్టనమునకును జుట్టుపక్కల నుండు పెద్దపెద్ద తోటలుండుచుండెను మరియు వానిలో నుత్సవములు చేయుటకై కాంతాపురుషులు పోవుచుండిరి. ద్వారకకు సమీపమున, రైవతాకపర్వతమీఁద

యాదవులైన స్త్రీ పురుషులు ఉత్సవము చేయుటకై వెళ్ళుచుండిరి. దీని వర్ణనముమహాభారతమందున్నది,

## విశేషాచారములు

మహాభారత సమయమునఁ గొందఱు లోకులయందు విశేషాచారము లుండెను. మహాభారతములోని కొన్ని వర్ణనములఁబట్టి యీ సంగతి యొక్క జాడ లభించుచున్నది. "ఆపీడినోరక్తదంతా మత్తమాతంగ విక్రమాః। నానా విరాగవసనా గంధ చూరావచూర్ణితాః॥ (కర్ణప. అ, 12) ఇది దక్షిణముపైపున నున్న కేరళము, పాండ్యము, ఆంధ్రము మొదలైన దేశములలోని వారి వర్ణనమై యున్నది. శిరస్సునందుఁ బూలదండలను జుట్టుకొనియున్నారు. దంతములకు నెఱుపురంగు వేసికొనియున్నారు. ఇదే విధముగా వివిధములైన రంగులు వేసిన దోవతులను ధరించికొని శరీరమునందు సుగంధ చూర్ణము లను రాఁచుకొనియుండిరి. ఈ వర్ణనము ప్రస్తుతకాలపు మద్రాసువారికిఁ గూడఁ బూర్ణముగా నుపయుక్తమగుచుండెను. వీరు శిరస్సును ఒట్టిదిగా నుంచుకొనుచుండిరి; పూలమాలలను మాత్రము శిరస్సుయందుంచుకొను చుండిరి. శరీరముపైని గూడ నేమియు నుంచుకొనరు. చందనము మాత్రము రాఁచుకొనుచుండిరి. రంగు వేసిన దోవతులను దాల్చెడి పద్ధతి మఱియే భాగమందును లేకుండెను; మఱియు వీరు ఏనుఁగువలెబలిసినవారును ధృఢకాయులును గూడ నై యుండిరి. ప్రాచీనపద్ధతులేవిధముగా వెంటఁబడి సాఁగి వచ్చుచుండెనో యీ సంగతికిది యొక యుదాహరణమై యుండెను పంజాబువారిదికూడ నొక పద్ధతి వర్ణింపఁబడినది. ఆరీతి ఈ లోకులు దోసిలితో నీరు త్రాగెడి రీతియై యుండెను. దోసిలితో నీరు త్రాగుట యితర ప్రాంతములయందు, ఈ సమయమున నిషిద్ధముగా నెంచఁబడుచున్నది; మఱియు ప్రస్తుత కాలమునఁ గేవలము దరిద్రులు దోసిలితో నీటిని ద్రాగు చుండిరి.

## నమస్కారము, కరస్పర్శము

పెద్దలకుఁ జిన్నవారు నమస్కరింపవలయుననునది యార్యుల వద్ద తిరైె యుండెను. కాని సామాన్యముగాఁ గేవలము హస్త స్పర్శము చేసెడి యాచారమగపడుచుండెను. ఉద్యోగపర్వమందు బలరాముఁడు పాండవులతోఁ గలిసికొనుటకై వచ్చినప్పటి వర్ణనమిదియై యున్నది.

తతస్తం పాండవోరాజాకరే పస్పర్శ పాణినా

[ఓ2 ఉద్యో. అ. 157

యుధిష్ఠిరుఁడు బలరాముని కరస్పర్శమును జేసినపుడు శ్రీకృష్ణాదులు అతనికి నమస్కరించిరి. మరియు వారు విరటునికిని ద్రుపదునికి నిరువుర రాజులకు నమస్కరించిరి. దీనిఁబట్టి పై యనుమానము జనించుచుండెను బలరామునిచ్చట "నీలకౌశేయవాసనః" అని చెప్పియుండెను. బలరాముఁడు నల్ల పట్టు వస్త్రమును శ్రీకృష్ణుఁడు పచ్చ పట్టువస్త్రమును ధరించుచుండిరి. సాధారణ రీతిని నమస్కారము కొంచెము వంగి రెండుచేతులను జోడించి చేయఁబడుచుండెను; కాని ద్రోణపర్వములోని వర్ణనముఁబట్టిసూతులు మొదలైనవారు రాజునకు నమస్కారమును జేయునపుడు మోకాలినానుకొని నేలపైని శిరస్సునుంచి చేయవలయునని ప్రకటనమగుచున్నది. [ద్రోణ. అ 82] గురువుయొక్క చరణములను చేతులతో ముట్టుకొని బ్రహ్మచారి నమస్కరింపవలయును ఈ విధియొక్క వర్ణనము మరియొక చోటున జరిగియే యుండెను సాష్టాంగ నమస్కారము తఱచుగా దేవతలకునులేకఋషులకును లేక గురువు మొదలైన వారికిని జేయఁబడుచుండెను

## ఉత్తమమైన యాచరణము

శాంతిపర్వములోని ఓ28వ యధ్యాయమందు మంచి పద్ధతులేవి యున్నవో; మరి నమస్కారము చేసినతరువాత చెట్టి చెడుపద్ధతులుల్పన్నము లగుచున్నవో వర్ణింపఁబడి యున్నవి ఇచ్చట వానియొక్కసంక్షిప్తమైన అను

వాదమీయఁబడుచున్నది. "మునుపు దానవులుకూడ దానము, అధ్యయనము హోమము చేసి దేవతలయొక్క, అతిథులయొక్క, పితరులయొక్కయుఁ బూజను జేయుచుండిరి, ఇండ్ల నుమిక్కిలి శుభ్రముగా నుంచుచుండిరి. ఇంద్రియములను వశమందుంచుకొనుచుండిరి. సత్యమును భాషించుచుండిరి. ఎవనిమీఁదను మాత్సర్యమును లేక యీర్ష్యను జేయకుండిరి. తమ స్త్రీలను, పుత్రులను, పరివారమును బోషించుచుండిరి. క్రోధమునకు వశులు గాకుండిరి. పరులదుఃఖము చేత దుఃఖితులగుచుండిరి. సేవకులను మంత్రులను సంతోషపఱచుచుండిరి. ప్రియములను భాషించుచుండిరి యోగ్యతకుఁదగునట్లుగా నందఱనుగౌరవించుచుండిరి. ఉపవాసమునందును తపస్సునందును స్వాభావముగనే వారికి ప్రవృత్తి యుండెను. ప్రాతఃకాలమున నెవరును నిద్రపోయియుండువారు కాకుండిరి. తెల్లవారగనే మంగళకరములైన వస్తువులఁజూచి, బ్రాహ్మణులను బూజించుచుండిరి. అర్ధరాత్రిని నిద్రలోఁ గడపుచుండిరి పగలెవరును నిద్రించువారు కాకుండిరి. దీనులు, వృద్ధులు, దుర్బలులు, రోగులు, స్త్రీలు వీరియందు ఎల్లడను దయయుంపఁబడుచుండెను. మఱియు వారికి నాదాయములో భాగమీయఁబడుచుండెను. అతి వృద్ధులైన వారి సేవ చేయఁబడుచుండెను"ఇది మొదలుగా మంచి వర్ణములఁజేసిన తరువాత దైత్యులయందు విపరీతకాలమయ్యెననియు; ఈ గుణములు మునుపటికంటె విపరీతములయ్యెననియుఁ జెప్పఁబడియున్నది. అపుడు, వారిలో నుండి ధర్మము వెడలిపోయెను. "ఆ సమయమున సభ్యులైన పురుషులును వృద్ధులైన లోకులు ప్రాచీనసంగతులను జెప్పఁదొడగిరి; అనఁగా అపుడు ఇతరుల వారి నుపహసించుచుండిరి. మఱియు వారి శ్రేష్ఠ గుణములపైని మత్సరము చేయుచుండిరి. మిక్కిలి వృద్ధులైనవారు వచ్చినపుడు, ఎప్పటియట్లె ప్రత్యుత్థానము చేసి నమస్కరించి వారికి నాదరసత్కారములఁ జేయకుండిరి. ఎవరు సేవకులు కాఁగూడదో వారు కూడ సేవకత్వమును బొంది నిర్లజ్జతతో, దానిఁబొందుటలో నానందము ననుభవించుచుండిరి. నీచ కృత్యములను జేసి యెవరు అధికధనము సంగ్ర

అత్త మామలు చూచుచుండగనే కోడండ్రు లోకులమీఁద నాజ్ఞ చెల్లింపఁదొడగిరి. మఱియు పతిని కేకలు వైచి వానితో భాషించుకొనుటకును వాతికాజ్ఞయిచ్చుకొన నారంభించిరి తండ్రి కొడుకును బ్రసన్నునిజేయుటకై యత్నించ నారంభించెను మఱియు భయముచేతఁ బుత్రులకుఁ దమ సంపత్తునుబంచిపెట్టి కషముతోఁ గాలమును గడపఁజొచ్చెను మిత్రులు పరస్పరము ఒకరింకొకరిని గెలిచేయఁదొడఁగిరి మరియు అందరులు శత్రువులుకాఁదొడఁగిరిసారాంశమేమనఁగా దైత్యులీ ప్రకారము నాస్తికులు, కృతఘ్నులు, దురాచారులు, అమర్యాదశీలురు, నిస్తేజస్కులై పోయిరి" ఉల్లిఖితమైన వర్ణనముఁబట్టి మన యెదుట, మహాభార సమయమున నేయే యాచరణములు చెడ్డవిగా నెంచఁబడుచుండెడివో వీనికి సంబంధించిన కల్పన నిలఁబడుచున్నది.

—/—